శ్రీ

# కక్ష్యాకౌముదీ

శాంకరమీమాంసాసూత్రభాష్యమునకు

## ఆంధ్రానువాదము

సభాష్యము

ద్వితీయ సంపుటము

## ద్వితీయాధ్యాయము

1, 2 పాదములు

రచయిత:

[illegible] పాలు[illegible] లింగ[illegible] సోమయాజి

ఎం. ఏ., బి. యల్.

ఉపనిషచ్చంద్రిక రచయిత

## ద్వితీయాధ్యాయే — ద్వితీయః పాదః

# అకారాది సూత్రపట్టికా

## ద్వితీయాధ్యాయే – ప్రథమః పాదః

## ద్వితీయాధ్యాయే — ద్వితీయః పాదః

# ప్రస్తావము

నాచే రచింపబడిన సూత్రభాష్యాంధ్రానువాదము ద్వితీయ సంపుటమును ముద్రణము గావించి నాకొసంగిన శ్రీయుత జస్కరణ్ భువాల్కా గారు నా కెంతయు కృతజ్ఞతా పాత్రులు. వీరు రాజస్థానములోని రత్నగిరి గ్రామమున సత్కుల ప్రసూతులగు శ్రీ గిర్ధారీలాల్ భువాల్కా దంపతుల సచ్ఛుక్తిముక్తాఫలము. వీరల కుటుంబఖ్యాతి భూవలయము నంతయు నావరించుటం జేసి భువాల్కా యను నామము వీరి కన్వర్థమగుచున్నది. శ్రీ జస్కరన్ భువాల్కా గారు పిన్నవయస్సుననే కళావిద్యయం దారితేరి గుంటూరునందలి శ్రీ బజరంగ్ జూట్ మిల్సు కొరకై డైరెక్టరుగ వ్యవహరించుచు తన వాణిజ్యకౌశలమును లోకోపకారమునకు వినియోగించుచున్నారు. పరోపకార మీయన కొక క్రీడాస్థానము. ప్రతిదినము వీరిచే పోషింపబడు షుమారు నాలుగువేల కార్మిక కుటుంబము లీయన క్రియావిధానమునందలి సౌష్ఠవసౌజన్యముల జెప్పక జెప్పుచున్నవి. వణిక్సంఘమున కీయన యొక తిలమానికము. ఈయన సంస్కృత సాహిత్య వేదవిద్యాభిమాని. సకల కళాపోషకుడు. వేలకొలది ధనము లోకకల్యాణమును గోరి తృణప్రాయముగ దానముజేసిన మహోదార పురుషుడు. దత్తమండలములోని కాటకమును దొలగించుట కరువదివేలును, గుంటూరు వైద్యకళాశాల కిరువది అయిదువేలు నిచ్చిన మహాదాత. శ్రీ బండ్లమూడి హనుమాయమ్మ గరల్స్ హైస్కూలునకు నిర్మించిన యొక దివ్య భవనమునకు పదునెండువేలు వెచ్చించిన వదాన్యుడు. కుడిచేయి జేయుదాని నెడమచేతి కెఱుంగక చేసిన పేరేచెర్ల హైస్కూలు మొదలగు గుప్తదానము లింక నెన్నియో గలవు. నిత్యార్చనా దైవతమగు శ్రీ ఆంజనేయస్వామికి నిర్మించిన సుందరతరనికేతన మీయన అనన్య దైవభక్తికి కేతనమగుచున్నది. సంపదలన్నియు వీరి సుగుణానీకమునకు లుబ్ధలై స్వయముగ నాయనను వరియించుట ఆశ్చర్యము కాదు. ప్రసన్నాంజనేయస్వామి ఈయన యెడ ప్రసన్నుడై ఇతోఽప్యధికములగు శ్రేయః ప్రేయస్సుల ప్రసాదించుగాక యని ప్రార్థించు—

గుంటూరు,
20—9—56.

రా. లిం. సోమయాజి.

# प्रस्तावना

सुध - विचार सौभाग्य शील !
यशश्री - किरण भू - वालका !
जय जय भव - भर भरे सतत
अहो जसकरण भूवालका ! !
जन - गन सुषमा - पूर्ण सुखद
यश - करण विभा - किरण अमर हो ।
सच ही है रत्नगिरि जन्य
प्रभा - मणि क्यों उज्वल न हो ?
जी भर भर अपार धन - रासि
परहितार्थ संचय करके अहा !
प्रातः प्रभा - पूर्ण - सा पंथ
दिखाया अध जन - जन को अहा ॥
उदयाचल के ऊर्ध्व - भाग से
कल - विभव का अरुण - रंग बहे,
श्रीललित तव प्रांगन में सदा
भुवाल्का यश - कर ऊँचा रहे ॥



బ్రహ్మసూత్ర

# శాంకరమీమాంసాభాష్యమ్

కల్యాణకౌముదీ సమేతమ్.

ద్వితీయాధ్యాయే — ప్రథమః పాదః

## (1) స్మృత్యధికరణమ్ (సూ. 1–2)

### స్మృత్యధికరణము

అః బ్రహ్మము అశేష వేదాంతములకు అఖండార్థమని ప్రథమాధ్యాయమున సమన్వయము చేయబడినది. మతాంతరులచే స్వపక్షమున జూపబడిన దోషముల వారించి వారల దోషములు ద్వితీయాధ్యాయమున బ్రదర్శింపబడుచున్నవి. అందువలన ఈ అధ్యాయము విరోధాధ్యాయమని బిలువబడు చున్నది. ఇచట నాలుగు పాదములు గలవు. మొదటి పాదమున సాంఖ్యయోగకాణాది దర్శనములచే నద్వైతమునం

ప్రథమే<ధ్యాయే సర్వజ్ఞః సర్వేశ్వరో జగత ఉత్పత్తి కారణం, మృత్సువర్ణాదయ ఇవ ఘటరుచకాదీనామ్। ఉత్పన్నస్య జగతో నియంతృత్వేన స్థితికారణం మాయావీవ మాయాయాః, ప్రసారితస్య జగతః పునస్స్వాత్మన్యేవోపసంహారకారణమవనిరివ

---

దారోపింపబడిన దోషములు నివారింపబడినవి. ఈ పాదము నందు పదమూడు అధికరణములు గలవు. మొదటిది స్మృత్యధికరణము. ఈ అధికరణమునకు

విషయము : ప్రధానము వేదోక్తము కాకున్నను సాంఖ్యస్మృత్యుక్తముగనుక విరుద్ధముకాదు

సందేహము : పూర్వాధ్యాయమునందు చేయబడిన సమన్వయము సాంఖ్యస్మృతికి విరుద్ధమగునా! కాదా ?

పూర్వపక్షము : సాంఖ్యవిరుద్ధము.

సిద్ధాంతము : విరుద్ధము కాదు.

అవలోకనీయములగు ప్రమాణములు : శ్వేత 5-2; గీ 7-6; జై. సూ. 1-3-3; తై. సం. 2-2-10-2; ఈశ.7; బ్ర. సూ. 1-4-2, 2-1-4.

అ॥ మృత్సువర్ణాదులు ఘటము ఆభరణములకువలెనే సర్వజ్ఞుడు సర్వేశ్వరుడు నగు పరబ్రహ్మము జగత్తున కుత్పత్తి కారణమని ప్రథమాధ్యాయమున జన్మాదిసూత్రములయం దుపపాదింపబడినది. ఇంద్రజాలమునకు, ఐంద్రజాలికుడువలెనే

చతుర్విధస్య భూతగ్రామస్య, 'స ఏవ చ సర్వేషాం న ఆత్మే' త్యేతద్వేదాంతవాక్యసమన్వయ ప్రతిపాదనేన ప్రతిపాదితం. ప్రధానాదికారణవాదాశ్చాశబ్దత్వేన నిరాకృతాః, ఇదానీం స్వపక్షే స్మృతిన్యాయవిరోధపరిహారః ప్రధానాదివాదానాం చ న్యాయాభాసోపబృంహితత్వం ప్రతివేదాంతం చ సృష్ట్యాదిప్రక్రియాయా అవిగీతత్వమిత్యస్యార్థజాతస్య ప్రతిపాదనాయ ద్వితీయోఽధ్యాయ ఆరభ్యతే, తత్ర ప్రథమం తావత్ స్మృతివిరోధముపన్యస్యపరిహరతి.

---

పూర్వోత్తర సంబంధము

సృష్టింపబడిన జగత్తునకు బ్రహ్మము నియంతయగుటచే స్థితికారణ మగుచున్నదియనియు ప్రదర్శింపబడినది. ఉద్భిజ్జాది చతుర్విధ భూతజాతమునకు పృథివివలె బ్రహ్మవలన నుత్పన్నమయిన జగత్తునకు తిరిగి తానే యుపసంహారకారణ మగుచున్నది యనిగూడ నచటనే నిరూపింపబడినది. ఆ బ్రహ్మమే ఆత్మ యని సమన్వయాధికరణమునందును, 'శాస్త్రదృష్ట్యా' (1-1-30) మొదలగు సూత్రములయందు వేదాంతవాక్య సమన్వయము నిర్ధారణ చేయబడినది. ప్రధానాదులు అవైదికములగుటచే జగత్కారణముకాదని "ఆనుమానికం" (1-4-1) అను సూత్రాదులయందు నిరాకరింపబడినది. ఇక, స్మృతిన్యాయములు వేదాంతములకు విరుద్ధములు కావనియు, ప్రధానాది వాదములు పైకి సహేతుకములుగ కాన్పించుచున్నను నిజముగ సహేతుకములు కావనియు, సృష్ట్యాదివిధానమునుగూర్చి వేదాంతములయందు విరోధము లేదనియు, స్వపక్ష ముపపాదించుటకు ద్వితీయాధ్యాయము మారంభింపబడుచున్నది.

## స్మృత్యనవకాశదోష ప్రసంగ ఇతిచేన్నా న్యస్మృత్యనవకాశదోష ప్రసంగాత్ (సూ. 1)

పూ.పక్షీ : యదుక్తం బ్రహ్మైవ సర్వజ్ఞం జగతః కారణమితి తదయుక్తం, కుతః?, స్మృత్యనవకాశదోషప్రసంగాత్. స్మృతిశ్చ తంత్రాఖ్యా పరమర్షిప్రణీతా శిష్టపరిగృహీతా, అన్యాశ్చ తదనుసారిణ్యః స్మృతయః, తా ఏవం సత్యనవకాశాః ప్రసజ్యేరన్,

---

మున్ముందు స్మృతి విరోధము విచారించి పరిహరింపబడు చున్నది.

ప్రధానము జగత్కారణమని అంగీకరింపనిచో స్మృతి అనవకాశదోష ప్రసంగః=సాంఖ్యాదిస్మృతులు నిరుపయోగమగు నను దోషముగల్గును. ఇతిచేత్=అని అంటివేని, న= అది సరికాదు. బ్రహ్మము జగత్కారణమని అంగీకరింపనిచో అన్యస్మృతి అనవకాశదోష ప్రసంగాత్=మన్వాదీతర స్మృతులకు అప్రామాణ్యదోషము సంభవించుటవలన–

పూ. పక్షి : సర్వజ్ఞమగు బ్రహ్మము జగత్కారణమని సిద్ధాంతులు చేయువాదము యుక్తముగాదు. ఏలన! సాంఖ్యాదిస్మృతుల కవకాశము లేదనుదోషము సంభవించు చున్నది. స్మృతియన తత్త్వమును వ్యుత్పాదము చేయు సాంఖ్యాదితంత్రములు. అవి పరమర్షి ప్రణీతములై శిష్టులచే నంగీకరింపబడిన శాస్త్రము.[సాంఖ్యస్మృతి యిట్టిది.] దీనిననుసరించి [పంచశిఖాసురిత్యాదులచే ప్రణీతములగు] నితర స్మృతులు కూడ గలవు. వీనికి అప్రామాణ్యము సిద్ధించును

తాసు హ్యచేతనం స్వతంత్రం ప్రధానం జగతః కారణముప నిబధ్యతే. మన్వాదిస్మృతయ స్తావచ్చోదనాలక్షణేనాగ్నిహోత్రా దినా ధర్మజాతేనాపేక్షితమర్థం సమర్పయంత్యః సావకాశాః భవంతి, అస్య వర్ణస్యాస్మిన్ కాలేఽనేన విధానేనోపనయనమి త్థమాచారః ఇత్థం వేదాధ్యయనమిత్థం సహధర్మచారిణీ సంయోగ, ఇతి, తథా పురుషార్థాంశ్చతుర్వర్ణాశ్రమధర్మాన్ నానావిధాన్ విదధతి, నైవం కాపిలాదిస్మృతీనామనుష్ఠేయవిష

(1) స్వతంత్రము అచేతనము నగు ప్రధానము జగత్కారణ మని వానియందు నిశ్చయము చేయబడినది.(2)మన్వాదిస్మృతు లన్నసో విధిచోదితములగు నగ్నిహో

సాంఖ్యాదిస్మృతులచే వేదార్థనిర్ణయము చేయతగును

త్రాద్యాచరణీయములగు ధర్మజాతము నుపపాదించుటవలన ప్రయోజనకారు లగుచున్నవి. ఈ వర్ణము వారికి ఈ కాలమునం దీ విధానముచే నుపనయనము చేయవలయును; ఇట్టిది ఆచరణీయము; వేదాధ్యయనము నిట్లుచేయవలెను; సమావర్తనవ్రతము నిట్లాచరింపవలయును; సహధర్మచారిణీ సమాగమ మిట్లుచేయవలయును అను మొదలగు ధర్మాచర ణము నా స్మృతి నియమించుచున్నది. ఆ విధముగనే యనేక విధములగు పురుషార్థములను, వర్ణాశ్రమ ధర్మములనుగూడ విధించుచున్నది. [ఇవి యన్నియు ననుష్ఠానవిషయములు]. కాని కపిలాది స్మృతుల యందనుష్ఠేయముల కవకాశము లేదు. [పురుషార్థములన్నియు కర్తవ్యములు] కపిలాది స్మృతులు సంపూర్ణ పరమార్థ దర్శనమగుచు మోక్షసాధనమునుగూర్చి

యేఽవకాశోఽస్తి, మోక్షసాధనమేవ హి సమ్యగ్దర్శనమధికృత్య తాః ప్రణీతాః. యది తత్రాప్యనవకాశాస్స్యుః ఆనర్థక్యమేవాసాం ప్రసజ్యేత, తస్మాత్తదవిరోధేన వేదాంతా వ్యాఖ్యాతవ్యాః.

మాధ్యమికః : కథం పునరీక్షత్యాదిభ్యో హేతుభ్యో బ్రహ్మైవ సర్వజ్ఞం జగతః కారణమిత్యవధారితః శ్రుత్యర్థః స్మృత్యనవకాశదోషప్రసంగేన పునరాక్షిప్యతే.

పూ.పక్షీ : భవేదయమనాక్షేపః స్వతంత్రప్రజ్ఞానామ్. పరతంత్ర ప్రజ్ఞాస్తు ప్రాయేణ జనాః స్వాతంత్ర్యేణ శ్రుత్యర్థమవధార

---

రచియింపబడినవి (3) ఆచరణీయవిషయములనుగూర్చి వికల్పముండుగాక. తత్త్వమునుగూర్చి వికల్పముం డనవకాశము లేదుగాన] కపిలతంత్రాదులకు మోక్షతత్త్వమునుగూర్చి అవకాశము లేనిచో, నవి నిరర్థకములు కావలసివచ్చును. అందువలన కపిలతంత్రాదులకు విరోధము లేకుండునట్లు వేదాంతములకు వ్యాఖ్యానము చేయదగును.

మాధ్యమికుడు : ఈక్షత్యధికరణాదులయం దుదాహరింపబడిన కారణములచేత సర్వజ్ఞమగు బ్రహ్మము జగత్కారణమనుట శ్రుతిసమ్మతమని నిర్ధారణచేయబడినది. స్మృతులకవకాశము లేకపోవునను కారణముచేతనే ఈ విషయమును తిరిగి ఆక్షేపించుట కెటులసాధ్యము? [శ్రుతి స్మృతులకు విరోధమున్నప్పుడు శ్రుతి ప్రామాణ్యము నంగీకరించవలెనని శాస్త్ర నియమము].

పూ. పక్షి : (4) స్వతంత్రబుద్ధులగు వారలకిది యొకయాక్షేపణ కాకపోవచ్చునుగాక. పరతంత్రబుద్ధులగు జనులు

యితుమశక్నువంతః ప్రఖ్యాతప్రణేతృకాసు స్మృతిష్వవలంబేరన్, తద్బలేన చ శ్రుత్యర్థం ప్రతిపిపిత్సేరన్. అస్మత్కృతే చ వ్యాఖ్యానే న విశ్వస్యుర్బహుమానాత్ స్మృతీనాం ప్రణేతృషు. కపిలప్రభృతీనాం చార్షం జ్ఞానమప్రతిహతం స్మర్యతే, శ్రుతిశ్చ భవతి 'ఋషిం ప్రసూతం కపిలం యస్తమగ్రే జ్ఞానైర్బిభర్తి జాయమానం చ పశ్యే'దితి (శ్వేత 5-2) తస్మాన్నైషాం మతమయథార్థం శక్యం సంభావయితుం, తర్కావష్టంభేన చ తేఽర్థం

---

ప్రాయికముగ స్వతంత్రముగ శ్రుత్యర్థమును నిశ్చయించుటకు సమర్థులుగాక సుప్రసిద్ధులగు ఋష్యాదులచే ప్రణీతములైన స్మృతుల నూతగాగైకొని ఆ బలముచే శ్రుత్యర్థమును తెలియగోరుదురు. స్మృతికర్తలయందు గల గౌరవముచే నస్మదాదులు చేయు వ్యాఖ్యానమునందు వారలకు విశ్వాసముండకపోవచ్చును. (5) కపిలాది మహర్షులజ్ఞానము, ఆర్షము, ఎదురుచెప్ప శక్యముకానిది. "ఋషిం ప్రసూతం కపిలం యస్తమగ్రే జ్ఞానైర్బిభర్తి జాయమానం చ పశ్యేత్" (శ్వేత 5–2). అనగా ఎవడు సృష్టికిపూర్వము ముందుగాజన్మించబోవు కపిలుడను మహర్షిని యోచించి సృజియించెనో, ఎవ్వడు జన్మించిన యా కపిలుని భూతభవిష్యద్వర్తమాన విషయములగు వాని జ్ఞానములచే పోషించెనో అట్టి యీశ్వరుని దర్శింప తగును" అని కపిలమహర్షిని గూర్చి స్మృతి పలుకుచున్నది. ఈ శ్రుతివాక్యబలముచేతగూడ వీరి స్మృతిమతము యుక్తము గాదని భావింపశక్యముగాదు. (6) మఱియు వీరలు యుక్తిని ఊతగాగైకొని విషయమును స్థాపించిరి. ఆ కారణమువలన

ప్రతిష్ఠాపయంతి, తస్మాదపి స్మృతిబలేన వేదాంతా వ్యాఖ్యేయా ఇతి పునరాక్షేపః.

సిద్ధాంతీ : తస్య సమాధిర్నాన్యస్మృత్యనవకాశదోష ప్రసంగాదితి. యది స్మృత్యనవకాశదోషప్రసంగేనేశ్వరకారణ వాద ఆక్షిప్యేత ఏవమప్యన్యా ఈశ్వరకారణవాదిన్యః స్మృత యోఽనవకాశాః ప్రసజ్యేరన్. తా ఉదాహరిష్యామః. 'యత్త త్సూక్ష్మ మవిజ్ఞేయ' మితి పరంబ్రహ్మ ప్రకృత్య 'సహ్యంతరాత్మా భూతానాం క్షేత్రజ్ఞశ్చేతి కథ్యత' ఇతి చోక్త్వా 'తస్మాదవ్యక్త

---

గూడ స్మృతి బలానుసారముగ వేదాంతములకు వ్యాఖ్యా నము సేయతగియున్నది యని పూర్వపక్షులు తిరిగి యాక్షే పించుచున్నారు.

సిద్ధాంతి : ఇందుకు సమాధానమేమన ఈ వాదము నంగీకరించినచో (1) ఇతర స్మృతుల కవకాశము లేకుండు నను దోషము సంభవించుచున్నది సాంఖ్యాది స్మృతులకు బాధ కలుగునను దోషమును వారించుటకై ఈశ్వరుడు జగత్కారణ మగుచున్నాడను వాదము నాక్షేపించినచో, ఈశ్వర కారణ త్వమును బోధించు నితరస్మృతులు బాధి తములగుచున్నవి. అట్టి స్మృతుల నుదాహరించుచున్నాము.

సాంఖ్యస్మృతి నంగీకరించుట యితర స్మృతులకు బాధకము.

"ఇంద్రియముల కగోచరము, ప్రమాణాంతరములచే తెలియ నిది యయిన పరబ్రహ్మమును ప్రకృతముగా జేసికొని సర్వ భూతముల కత డంతరాత్మయనియు క్షేత్రజ్ఞుడనియు చెప్ప బడుచున్నాడని చూపిన తరువాత చేతనాత్మకమగు నా పర

ముత్పన్నం త్రిగుణం ద్విజసత్తమే' త్యాహ. తథాఽన్యత్రాపి 'అవ్యక్తం పురుషే బ్రహ్మన్నిష్క్రియే సంప్రలీయతే' ఇత్యాహ 'అతశ్చ సంక్షేపమిమం శృణుధ్వం నారాయణస్సర్వమిదం పురాణః. స సర్గకాలే చ కరోతి సర్గం సంహారకాలే చ తదత్తి భూయః' ఇతి చ పురాణే, భగవద్గీతాసు చ 'అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయస్తథే'తి, (7-6) పరమాత్మానమేవ చ

---

బ్రహ్మమునుండి అనభివ్యక్తస్వరూపమగు గుణత్రయ ముత్పన్నమయినది యనియు, నిర్గుణమగు నా బ్రహ్మమునం దవ్యక్తమగునది లయమగుచున్నది యని స్మృతి చెప్పుచున్నది. [ఇది సేశ్వరసాంఖ్యవాదము, కేవలమచేతనమగు ప్రధాన స్వరూపమగు గుణత్రయమువలన జగదుత్పత్తి యగుచున్నదియనియు సృష్టిక్రియయం దీశ్వరసంబంధము లేదనియు తలంచువారు నిరీశ్వరసాంఖ్యులు. సృష్టిక్రియ చేతనసాధ్యమగు కర్మయగుటచే చేతనాత్మకమగు నీశ్వరుని నిమిత్తకారణముగ నంగీకరించువారు సేశ్వరవాదులు. ప్రధాన ముపాదానకారణమని ఉభయు లంగీకరించెదరు. జగత్తు ఈశ్వరునియందే లయమగునని గూడ సేశ్వరసాంఖ్యులు తలంచుదురు]. "ఈ సంక్షేపార్థమును వినుడు, పురాతనుడగు నారాయణుడే యిదియంతయు నగుచున్నాడు. అతడే సృష్టికాలమునందు సర్వమును నుత్పత్తి చేయుచున్నాడు. లయకాలమునం దుపసంహరించుకొనుచున్నాడు." అని విష్ణుపురాణము పల్కుచున్నది. "నేనే సమస్త జగత్తున కుత్పత్తిలయస్థానము" అని భగవద్గీత(7-6) చెప్పుచున్నది. పరబ్రహ్మమునుండియె సర్వశరీరము లుత్ప

ప్రకృత్యాపస్తంబః పఠతి– 'తస్మాత్కాయాః ప్రభవంతి సర్వే సమూలం శాశ్వతికస్సనిత్య' ఇతి. ఏవమనేకశః స్మృతిష్వపీశ్వరః కారణత్వేనోపాదానత్వేన చ ప్రకాశ్యతే. స్మృతిబలేన ప్రత్యవతిష్ఠమానస్య స్మృతిబలేనైవోత్తరం ప్రవక్ష్యామీత్యతోఽయమన్యస్మృత్యనవకాశోపన్యాసః, దర్శితం తు శ్రుతీనామీశ్వరకారణవాదం ప్రతి తాత్పర్యం, విప్రతిపత్తౌ చ స్మృతీనామవశ్యకర్తవ్యే

---

న్నము లగుచున్నవి. అతడే మూలకారణము; అతడు శాశ్వతము, నిర్వికారము అని యాపస్తంబుడు (1–8–23–2) పరమాత్మను గూర్చి వచియించినాడు. ఇట్లనేకవిధములుగ స్మృతులు పరమేశ్వరుడే జగత్తునకు నిమిత్తకారణమనియు, ఉపాదానకారణమనియు ప్రకటించుచున్నవి. స్మృతిబలము చేత నెదిరించువానిని స్మృతిబలముచేతనే ప్రతిఘటించుట యుక్తమని తలంచి యితరస్మృతులకు గలుగు బాధ యిచట నుపన్యసింపబడినది. ఈశ్వరకారణత్వము నుపపాదించుట యందే శ్రుతులకన్నిటికిని తాత్పర్యమని యిదివరకే చూపబడినది. [కనుక శ్రుతి సహాయముచేతనే తత్త్వనిర్ణయము చేయతగును.] (2) స్మృతుల కన్యోన్యము వైరుధ్యము సంప్రాప్తమై వానిలో కొన్నిటిని గ్రహించి తదితరములను పరిత్యజించవలసివచ్చినపుడు, శ్రుత్యనుసారిణులగు స్మృతులను ప్రమాణముగ గ్రహింపదగును. తదితరములను పరిత్యజింపతగును. శ్రుతిస్మృతులకు విరోధము గలుగుచుండగా, స్మృతి అనపేక్షితమగును. విరోధములేనపుడు, స్మృతి శ్రుత్యనుసా

శ్రుతిసమ్మతమగు స్మృతియంగీకార్యము

ఉన్మాతర పరిగ్రహేఽన్యతరపరిత్యాగే చ శ్రుత్యనుసారిణ్యః స్మృతయః ప్రమాణమనపేక్ష్యా ఇతరాః, తదుక్తం ప్రమాణ లక్షణే 'విరోధే త్వనపేక్షం స్యాదసతి హ్యనుమాన (జై.సూ.1-3-3) మితి. నచాతీంద్రియానర్థాన్ శ్రుతిమంతరేణ కశ్చిదుపలభత ఇతి శక్యం సంభావయితుం, నిమిత్తాభావాత్, శక్యం కపిలాదీనాం సిద్ధానామప్రతిహతజ్ఞానత్వాదితి చేత్, న, సిద్ధేరపి సాపేక్షత్వాత్. ధర్మానుష్ఠానాపేక్షా హి సిద్ధిః, స చ ధర్మశ్చోదనాలక్షణః, తతశ్చ పూర్వసిద్ధాయాశ్చోదనాయా అర్థో న పశ్చిమసిద్ధపురుషవచనవశే నాతిశంకితుం శక్యతే, సిద్ధవ్యపాశ్రయకల్పనాయామపి బహు

---

రిణి యని యూహింపబడుటచే పరిగ్రాహ్యమగు నని ప్రమాణ లక్షణప్రకరణమున (జైమిని 1-3-3) నిరూపింపబడినది. (3) ఇంద్రియగోచరములుకాని విషయములను శ్రుతి ప్రమాణములేక గ్రహించ శక్యమని తలంప నెవనికిని శక్యముగాదు. అట్లు తలంచుటకు తగు కారణము కానరాదు. (4) అప్రతిహతజ్ఞానము గలవారగుటచే సిద్ధపురుషులగు కపిలుడు మొదలగువారి కది శక్యమనుట సరికాదు. వారలకు గల జ్ఞానసిద్ధికూడ అన్యాయత్త మగుచున్నది. వారల జ్ఞానసిద్ధి విధిచోదితము క్రియారూపమునగు ధర్మానుష్ఠానముచే గలుగును. ధర్మానుష్ఠానమున కంతకు వేదచోదితములగు విధివాక్యములు కదా యాధారము. చోదనారూపమగు కార్యసిద్ధియంతయు మున్ముందు వేదముచే బోధింపబడినది. అట్టిదానిని తరువాత నెప్పుడో సిద్ధపురుషులు రచి

సిద్ధపురుషుల జ్ఞానము పరాపేక్షము.

త్వాత్, సిద్ధానాం ప్రదర్శితేన ప్రకారేణ స్మృతివిప్రతిపత్తౌ సత్యాం న శ్రుతివ్యపాశ్రయాదన్యన్నిర్ణయకారణమస్తి. పరతంత్ర ప్రజ్ఞస్యాపి నాకస్మాత్ స్మృతివిశేషవిషయః పక్షపాతో యుక్తః, కస్యచిత్క్వచిత్ పక్షపాతే సతి పురుషమతివైరూప్యేణ తత్త్వావ్యవస్థాన ప్రసంగాత్, తస్మాత్తస్యాపి స్మృతివిప్రతిపత్త్యుపన్యాసేన శ్రుత్యనుసారానసారవివేచనేన చ సన్మార్గే ప్రజ్ఞా సంగ్రహణీయా. యా తు శ్రుతిః కపిలస్య జ్ఞానాతిశయం ప్రదర్శయంతీ

---

యించిన స్మృతివాక్యబలముచే శంకించుట యుక్తముగాదు. (5) ఒకవేళ వేదార్థనిర్ణయమునకు సిద్ధపురుషులకల్పన మంగీకరింపవలసినను, వారనేకులు, వారు ప్రదర్శించిన ప్రకారములనేకములు; స్మృతులకన్యోన్యమువిరోధము; కనుక శ్రుతి నాశ్రయించియే విషయనిర్ణయము చేయవలయును. శ్రుతి వినా మరియొక విషయనిర్ణయసాధనము లేదు. (6) వేదార్థమునుగూర్చి స్వతంత్రుడుగాక పరతంత్రుడైనను, సరియగుకారణములేక యేదోయొక స్మృతియందు పక్షపాతమును వహించుట యుక్తముకాదు. ఎవరిచేతనో యొకరిచేత రచియింపబడిన యేదోయొక స్మృతియందు పక్షపాతమును వహించినచో, పురుషబుద్ధి యనేకవిధములుగ నుండుటవలన తత్త్వనిర్ణయమునకు వ్యవస్థ చిక్కకుండును. కనుక స్మృతులకుగల పరస్పరవిరోధమును ప్రదర్శించి శ్రుతిననుసరించు స్మృతులను తదితరములనుండి వివేచనచేసి బుద్ధిని సరియయిన మార్గమున ప్రవేశపెట్టవలయును. (7) కపిలుని జ్ఞానాతిశయమును ప్రద

స్మృతులు పరస్పర విరుద్ధములు

ప్రదర్శితా న తయా శ్రుతివిరుద్ధమపి కాపిలం మతం శ్రద్ధాతుం శక్యం, కపిలమితి శ్రుతిసామాన్యమాత్రత్వాత్. అన్యస్య చ కపిలస్య సగరపుత్రాణాం ప్రతప్తుర్వాసుదేవనామ్నః స్మరణాత్, అన్యార్థదర్శనస్య చ ప్రాప్తిరహితస్యాసాధకత్వాత్. భవతి చాన్యా మనోర్మాహాత్మ్యం ప్రఖ్యాపయంతీ శ్రుతిః 'యద్వై కించ మనురవదత్తద్భేషజ' (తై.సం. 2-2-10-2) మితి, మనునా చ 'సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని. సంపశ్యన్నాత్మయాజీ

---

ర్శించు పై శ్రుతినిబట్టి శ్రుతి విరుద్ధమయినను ఆయన మతము శ్రద్ధార్హమని చెప్పశక్యముకాదు. శ్రుతియందు కపిల శబ్దము సామాన్యముగ నుదాహరింపబడినదిగాని స్మృతికర్త విశేషించి నిరూపింపబడలేదు. [సాంఖ్యస్మృతికర్త యగు కపిలుని శ్రుతి ఉదాహరించినదనుటకు శక్యముగాదు]సగరపుత్రులను దహింపజేసిన వాసుదేవుడను అపరనామముగల కపిలుడు మఱియొకడు గలడు. (8) ఇంతియకాదు. కపిలశబ్దము నుదాహరించు శ్రుతి వాక్యము పరమాత్మను బొందుమార్గమును శోధించుచున్నది. జ్ఞానసంపత్తిగలిగి యెవడు కపిలుని బోషింనో ఆతని దర్శనము చేయవలెనని ఆ శ్రుతి వాక్యార్థము. ౹లుడనువాని జ్ఞానాతిశయను ప్రస్థావించుటలేదు. (9)మనువు ౹యించునది ఔషధమువంటిది' యని మనువుయొక్క ౹హాత్మ్యమును చెప్పుశ్రుతి మఱియొకటి గలదు. (తై.సం. ౹-10-2) సమస్తభూతములయందు ఆత్మను, ఆత్మయందు ౹స్త భూతములను చూచుచు ఆత్మయాజి యగువాడు

వై స్వారాజ్యమధిగచ్ఛతీ'తి (12-91) సర్వాత్మత్వదర్శనం ప్రశం సతా కాపిలం మతం నింద్యత ఇతి గమ్యతే. కపిలో హి న సర్వాత్మత్వదర్శనమనుమన్యతే, ఆత్మభేదాభ్యుపగమాత్. మహాభారతేఽపి 'బహవః పురుషా బ్రహ్మన్నుతాహో ఏక ఏవత్వి'తి విచార్య 'బహవః పురుషా రాజన్ సాంఖ్యయోగవిచారిణా' మితి పరపక్షముపన్యస్య తద్వ్యుదాసేన 'బహూనాం పురుషాణాం హి యథైకా యోనిరుచ్యతే. తథా తం పురుషం విశ్వమాఖ్యాస్యామి గుణాధిక' మిత్యుపక్రమ్య 'మమాంతరాత్మా తవ చ యే చాన్యే దేహిసంజ్ఞితాః. సర్వేషాం సాక్షిభూతోఽసౌ న గ్రాహ్యః కేనచి

---

స్వారాజ్యమును బొందును. (మ, స్మృ. 12-51) అని సర్వాత్మత్వదర్శనమును కొనియాడు మనువు కాపిలమతమును నిందించినట్లు కాన్పించుచున్నది. (10) కపిలుడు ఆత్మలనేకములని యంగీకరించుచున్నాడు. కనుక సర్వాత్మత్వదర్శన మతనికి సమ్మతముగాదు. ఆత్మలనేకులా, ఒకరా యని విచారించి సాంఖ్యయోగమతములయందు ఆత్మలనేకములని పరమతమును ప్రదర్శించి బహుపురుషులకు యేయొకటి వ్యుత్పత్తిస్థానముగా చెప్పబడుచున్నదో అట్టి సర్వజ్ఞాత్వాది గుణాధికుడు పరిపూర్ణుడు నగు పురుషుని నీకు చెప్పెదను అని ఉపక్రమించి అతడు నీకును నాకును దేహాధారులగు మరి అందరికి అంతరాత్మ యగుచున్నాడు, అతడందరికిని సాక్షిభూతుడు,ఎవరికిని గ్రహణయోగ్యుడుగాడు, సమస్తమస్తకము

సాంఖ్యుల ద్వితీయబ్రహ్మము నంగీకరింపరు

త్స్వచిత్. విశ్వమూర్ధా విశ్వభుజో విశ్వపాదాక్షినాసికః. ఏకశ్చరతి భూతేషు స్వైరచారీ యథాసుఖ' మితి సర్వాత్మత్వైవ నిర్ధారితా. శ్రుతిశ్చ సర్వాత్మతాయాం భవతి 'యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవాభూద్విజానతః. తత్ర కో మోహః కశ్శోక ఏకత్వమనుపశ్యతః' (ఈ. 7) ఇతి ఏవంవిధా. అతశ్చాత్మభేద కల్పనయాపి కాపిలస్య తంత్రస్య వేదవిరుద్ధత్వం వేదానుసారి మనువచనవిరుద్ధత్వం చ న కేవలం స్వతంత్రప్రకృతికల్పనయైవేతి వేదస్య హి నిరపేక్షం స్వార్థే ప్రామాణ్యం రవేరివ రూప

---

లెవని మస్తకమో, సమస్తభుజము లెవని భుజములో, సమస్త పాదము లెవనిపాదములో, సమస్త నేత్రము లెవని నేత్రములో, సమస్తనాసిక లెవనినాసికయో అతఁడొకఁడే అని భూతములయందు సుఖముగాను స్వేచ్ఛగ సంచరించుచున్నాడు. "అని మహాభారతమునందతని సర్వాత్మభావము నిర్ధారణచేయబడినది. (ఈశ7)ఆత్మసాక్షాత్కారము పొందినవానికెప్పుడు సమస్తభూతములు స్వస్వరూపములే యగుచున్నవో యెప్పుడు తనకును ఇతరభూతములకును ఐక్యమును గుర్తెరింగిన వాఁడగుటవలన నతనికి శోకమోహము లుండవు (ఈ 7) ఈ మొదలగు శ్రుతులు సర్వాత్మత్వ భావమును బోధించుచున్నవి కనుక స్వతంత్రమగు ప్రకృతికల్పనముచేతనే గాక ఆత్మల యనేకత్వము నుదహరించుటచేతను గూడ కపిలతంత్రము వేదమునకును వేదమునను సరించు మనువచనమునకును విరుద్ధమని సిద్ధమగుచున్నది. (9) సూర్యకాంతి రూపమునకువలె వేదము స్వార్థమునుగూర్చి స్వతః

విషయే. పురుషవచసాం తు మూలాంతరాపేక్షం వ_క్తృస్మృతి వ్యవహితంచేతి విప్రకర్షః, తస్మాద్వేదవిరుద్ధే విషయే స్మృత్య నవకాశదోషప్రసంగో న దోషః.

కుతశ్చ స్మృత్యనవకాశదోషప్రసంగో న దోషః.

## ఇతరేషాం చానుపలబ్ధేః (సూ. 2)

ప్రధానాదితరాణి యాని ప్రధానపరిణామత్వేన స్మృతౌ కల్పితాని మహదాదీని న తాని వేదే లోకే చోపలభ్యంతే,

---

ప్రమాణ మగుచున్నది. ఇతర ప్రమాణము నది కోరదు. పురుషవాక్యము లన్ననో, మఱియొక మూలమును [వేదము చదివిన మూలముయొక్క] జ్ఞాపకమును ఆధారముచేసికొను టచే దూరములగుచున్నది. అందువలన విషయము వేదవిరుద్ధ మగుచుండగా నట్టి స్మృతుల కవకాశములేదనుట దోషము కాదు."

స్మృతికి ప్రామాణ్యము వేదమనుట దోషము కాదను టకు మఱియొక కారణమేమన!

ఇతరేషాం = సాంఖ్యస్మృతియందు ప్రసిద్ధములగు మహదాదితత్త్వములు, అనుపలబ్ధేః = వేదమునందు గాని లోకమునందు గాని యుపబ్ధములు గాకుండుటవలన సాంఖ్య స్మృతిప్రమాణము కాదు. కనుక సాంఖ్యస్మృతికి అవకాశము లేకుండుట దోషము కాదు.

అ॥ ప్రధానపరిణామములుగ స్మృతియం దుపపాదింప బడిన మహదాదులు వేదమునందుగాని లోకమునందుగాని

భూతేంద్రియాణి తావత్ లోకవేదప్రసిద్ధత్వాత్ శక్యంతే స్మర్తుం. అలోకవేద ప్రసిద్ధత్వాత్తు మహదాదీనాం షష్ఠస్యేవేంద్రియార్థస్య న స్మృతిరవకల్పతే యదపి క్వచిత్తత్పరమివ శ్రవణమవభాసతే తదప్యతత్పరం వ్యాఖ్యాతం 'ఆనుమానికమప్యేకేషా' (బ్ర.సూ. 1-4-1) మిత్యత్ర. కార్యస్మృతేరప్రామాణ్యాత్ కారణస్మృతేరప్యప్రామాణ్యం యుక్తమిత్యభిప్రాయః, తస్మాదపి న స్మృత్యనవ

---

మహాదాదులు శ్రుతిసిద్ధములుగావు

తెలియరాకున్నవి. పంచభూతములు ఇంద్రియములుగూడ లోకమునందు వేదమునందుగూడ ప్రసిద్ధములు గనుక వానిని స్మృతియం దుదాహరింప వచ్చును. మహదాదులు లోకప్రసిద్ధములుకావు, వేదప్రసిద్ధములుగావు. [అవి స్మృతివిషయములుగావు. వానికి ఆధారమగు] స్మృతి యనునది చక్షురాదిప్రమాణములుకంటె భిన్నమగు] ఆరవ ప్రమాణము కాదు. కనుక మహదాదులు ఉన్నవియని కల్పింపవీలులేదు. కనుక వానిని స్మృతియం దుదాహరింపతగదు. వానిని ప్రస్తావించునట్లు ఆపాతముగ కాన్పించుశ్రుతులు నిజముగా వానిని గూర్చి చెప్పుటలేదని "అనుమానికమప్యేకేషామ్" (సూ 1-4-1)అను సూత్రమునందు వ్యాఖ్యానింపబడినది. (10)మహదాదివాక్యములకు సంబంధించిన స్మృతికి ప్రమాణములేదు. కనుక కారణమగు ప్రధానము నుదాహరించు స్మృతికి గూడ ప్రమాణములేదనుట యుక్తమేయని తాత్పర్యము. అందువలన శ్రుతివిరుద్ధములగు సాంఖ్యాదిస్మృతుల కవకాశము

కాళదోషప్రసంగో దోషః. తర్కావష్టంభం తు 'న విలక్షణత్వా' (బ్ర.సూ. 2-1-6) దిత్యారభ్యోన్మథిష్యతి.

---

లేదనుట దోషముకాదు. సాంఖ్యస్మృతి యుక్తిసంపాదితమను వారివిమర్శన 'విలక్షణత్వాత్'(సూ2–1–6) అను సూత్రమునం దారంభింపబడుచున్నది.

అధికరణ సంక్షిప్తార్థము : మహర్షి ప్రణీతమగు సాంఖ్య స్మృతి అంగీకార్యము కానిచో దానికి అప్రామాణ్యము సంభ వించును. అదిమోక్షవిషయము. ఇదిపూర్వపక్షము. ఇందుకు సిద్ధాంతి సమాధానము. వేదములు స్వతః ప్రమాణ ములు, పరతః ప్రమాణము స్మృతి, వ్యవహితము, యుక్తి ప్రధానము కనుక ప్రమాణముకాదు. సాంఖ్యస్మృతి ప్రమా ణమైనచో ఈశ్వరకారణత్వమును బోధించునితర స్మృతులు అప్రమాణము లగును. శ్రుతి సమ్మతములగు స్మృతులు పరిగ్రాహ్యములు ఇంద్రియాతీతములగు విషయములగూర్చి శ్రుతియే ప్రమాణము. కపిలమతము వేదవిరుద్ధము. మహదాది సాంఖ్యతత్త్వములు వేదమునందుగాని లోకమునందుగాని గానరావు. కనుక వానిని స్మరించుట సంభవముగాదు. స్మృతికి ప్రామాణములేదు.

# (2) యోగప్రత్యుక్త్యధికరణమ్ (సూ. 3)

## ఏతేన యోగః ప్రత్యుక్తః (సూ. 3)

---

### (2) యోగప్రత్యుక్త్యధికరణము

అ॥ సాంఖ్యస్మృతి మన్వాదిస్మృతి విరుద్ధమగుటవలన నంగీకారము కాకపోవచ్చును. మన్వాదిస్మృతులయందు యోగము నామోదించుటచేతను, యోగస్మృతి ప్రధానమును గూర్చి ప్రమాణమగుటవలన ఆ స్మృతి ఇతరస్మృతి విరుద్ధమన వీలులేదని యాశంకరాగా నీయధికరణ మారంభింపబడుచున్నది.

విషయము : యోగదర్శనమునకు విరోధము

విశయము : యోగమతవిరుద్ధమగునా కాదా ?

పూర్వపక్షము : విరుద్ధము అగును

సిద్ధాంతము : విరుద్ధము కాదు.

అవలోకనీయ ప్రమాణములు. బృ 2-4-5, శ్వే 2-8 కఠ 2-6-11-18 శ్వే 6-13. 38. బృ 4-16. జాబాల 5, బృ 3-9-26.

ఏతేన = ఈ సాంఖ్యస్మృతి నిరాకరణముచే, యోగః= యోగస్మృతికూడ, ప్రత్యుక్తః = సమాధానము చెప్పబడుచున్నది.

ఏతేన సాంఖ్య స్మృతి ప్రత్యాఖ్యానేన యోగ స్మృతి రపి ప్రత్యాఖ్యాతా ద్రష్టవ్యేత్యతిదిశతి, తత్రాపి శ్రుతివిరోధేన ప్రధానం స్వతంత్రమేవకారణం మహదాదీని చ కార్యాణ్యలోక వేదప్రసిద్ధాని కల్ప్యంతే.

మాధ్యమికః : నన్వేవం సతి సమానన్యాయత్వాత్ పూర్వేణైవై తద్గతం. కిమర్థం పునరతిదిశ్యతే.

సిద్ధాంతీ : అస్తి హ్యత్రాభ్యధికాశంకా. సమ్యగ్దర్శనాభ్యుపాయో హి యోగో వేదే విహితః 'శ్రోతవ్యో మంతవ్యో నిది

---

ఈ సాంఖ్యస్మృతి నిరాకరణమువలన యోగస్మృతి గూడ ప్రతివచనము చెప్పినట్లు గమనింపవలసినదిగా సూత్రకారులు అదేన్యాయమును అవలంబించుచున్నారు. [సత్వరజస్తమోగుణాత్మకమగు ప్రధానము అచేతనము గనుక జగత్కారణము కానేరకుండుటచే ఈశ్వరునిగూడ యోగమత మంగీకరించున్నది.] ఆ స్మృతియందుగూడ శ్రుతికి విరుద్ధముగా ప్రధానము జగత్తునకు స్వతంత్రకారణమని యంగీకరింపబడినది. లోకవేద ప్రసిద్ధములుగాని మహదాదులు ప్రధాన కార్యములుగ నుపపాదింపబడినవి.

మాధ్యమిక : అట్లయినచో, ప్రధానమునుగూర్చిన న్యాయమే యోగమునకుగూడ వర్తించుచుండగ యోగస్మృతి గూడ పూర్వగ్రంథముచేతనే పరిహరింపబడుచున్నది గదా, తిరిగి ఈ సూత్రము నేలచెప్పవలె నంటిరేని సమాధానము చెప్పబడుచున్నది.

సిద్ధాంతీ: యోగస్మృతినిగూర్చి సాంఖ్యస్మృతికంటె నొకవిశేష శంక గలదు. యోగము లెస్సయగు జ్ఞానమున కుపాయముగ

ధ్యాసితవ్య' (బృ. 2-4-5) ఇతి 'త్రిరున్నతం స్థాప్యసమం శరీర' (శ్వే. 2-4) మిత్యాదినా చాసనాదికల్పనాపురస్సరం బహుప్రపంచం యోగవిధానం శ్వేతాశ్వతరోపనిషది దృశ్యతే, లింగాని చ వైదికాని యోగవిషయాణి సహస్రశః ఉపలభ్యంతే, 'తా యోగమితి మన్యంతే స్థిరామింద్రియధారణా' (కా. 2-6-11) మితి 'విద్యామేతాం యోగవిధిం చ కృత్స్నమ్' (2-6-18) మితి చైవమాదీని. యోగశాస్త్రేఽపి 'అథ తద్దర్శనాభ్యుపాయో యోగ' ఇతి సమ్యగ్దర్శనాభ్యుపాయత్వేనైవ యోగోఽఙ్గీక్రియతే, అతస్సంప్రతి

---

శ్రుతివిహితమగు యోగస్మృతిని ప్రత్యేకముగ చెప్పుటకు కారణము.

వేదమునందు విధింపబడినది. (బృ 2-4-5) ఆత్మ శ్రవణము చేయతగినది, మననము చేయతగినది, లెస్సగా ధ్యానము చేయతగినది, (శ్వేత. 2-8) 'వక్షస్థలము, గ్రీవము శిరస్సు-యీమూడింటిని సమానముగ ఎత్తుకొని' ఈ మొదలగు శ్వేతాశ్వతర వాక్యములయందు ఆసనాదులను కల్పించుట మూలకముగ యోగవిధానము విస్తారముగ వివరింపబడినట్లు కాన్పించుచున్నది. యోగవిషయములగు సూచనలు వేదములయందు వేలకొలది కనబడుచున్నవి. ఇంద్రియములను స్థిరముగ ధరించుటయె యోగమని తలంచుచున్నారు. (కా 2-6-11) 'ఈజ్ఞానమును అశేషముగ యోగముగ గ్రహించి' (కా 2-6-18) యను మొదలగు వేదవాక్యములు యోగము జ్ఞానసాధనమని సూచించుచున్నవి. యోగము తత్త్వదర్శనమున కుపాయము. యోగము యథార్థజ్ఞానమునకు సాధనమని యోగశాస్త్రమునం దంగీక

పన్నార్థైకదేశత్వాదష్టకాది స్మృతివద్యోగస్మృతిరప్యనపవదనీయా భవిష్యతీతి. ఇయ మభ్యధికాశంకాఽతిదేశేన నివర్త్యతే. అర్థైకదేశసంప్రతిపత్తావప్యర్థైకదేశవిప్రతిపత్తేః పూర్వోక్తాయా దర్శనాత్. సతీష్వప్యధ్యాత్మవిషయాసు బహ్వీషు స్మృతిషు సాంఖ్యయోగస్మృత్యోరేవ నిరాకరణాయ యత్నః కృతః, సాంఖ్యయోగౌ

---

రింపబడినది ఇట్లు యోగస్మృతియందలి యోగవిషయకమగు నొకభాగము వేదముచే నంగీకరింపడుచున్నది. కనుక అష్టకాదిస్మృతివలెనే యోగస్మృతిగూడ అనపద్యమగుచున్నది. [అష్టకాః కర్తవ్యాః అష్టకలు చేయదగినవియను స్మృతివాక్యము వేదవిరుద్ధము గాదు గనుక యంగీకార్య మగుచున్నది. అటులనే వేదసమ్మతమగు యోగమునుగూర్చి బోధించు యోగస్మృతిగూడ నంగీకార్యము కావచ్చునని తాత్పర్యము ఈవాదముచే గలుగు ప్రయోజన మేమన యోగస్మృతి యంగీకార్యమయినచో, స్మృతిపాదితమగు ప్రధానముగూడ నంగీకార్యము కావచ్చునని భావము.] ప్రధానమునకంటె నధికమగు నీశంకగూడ ప్రధానవాద న్యాయావలంబనము చేతనే సామాన్యముగ నివర్తింపబడుచున్నది. యోగస్మృతియందొకభాగము వేదసమ్మతమయినను మఱియొకభాగ మద్దానికి విరుద్ధముగానున్నది. ఆత్మనుగూర్చి బోధించు స్మృతులనేకములున్నను, సాంఖ్యయోగస్మృతులను మాత్రమునిరాక

వేదవిరుద్ధముగాని యోగ మంగీకార్యము

హి పరమపురుషార్థసాధనత్వేన లోకే ప్రఖ్యాతౌ, శిష్టైశ్చ పరిగృహీతౌ, లింగేన శ్రౌతేన చోపబృంహితౌ, 'తత్కారణం సాంఖ్యయోగాభిపన్నం జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశై' రితి (శ్వే. 6-13) నిరాకరణం తు న సాంఖ్యస్మృతిజ్ఞానేన వేదనిరపేక్షణ యోగమార్గేణ వా నిశ్శ్రేయసమధిగమ్యత ఇతి. శ్రుతిర్హి వైదికాదాత్మైకత్వవిజ్ఞానాదన్యన్నిశ్శ్రేయససాధనం వారయతి 'తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి, నాన్యః పంథా విద్యతేఽయనాయే' తి (శ్వే. 3-8) ద్వైతినో హి తే. సాంఖ్యా యోగాశ్చ నాత్మైకత్వ

రించుటకిచట ప్రయత్నము చేయబడుచున్నది. ఆ రెండు స్మృతులు పరమపురుషార్థ సాధకములని లోక ప్రఖ్యాతి గాంచినవి. శిష్టులు వానిని పరిగ్రహించుచున్నారు. కామాదికారణములను సాంఖ్యయోగములచే వివేకించుటచే లభించిన దేవుని దెలిసికొని అవిద్యానిమిత్తములగు సమస్తబంధములనుండి ముక్తుడగును (శ్వేత 6–13) అను శ్రుతిసూచనలచే నీరెండుస్మృతులు కొంతదార్ఢ్యము నొందుచున్నవి. కాని వేదమునపేక్షింపక కేవలసాంఖ్యయోగ జ్ఞానముచేతగాని కేవలయోగమార్గము చేతగాని నిశ్శ్రేయస ప్రాప్తిలభింపదు. కనుక నీరెండుస్మృతులు నిరాకరింపబడుచున్నవి. ఆత్మ అద్వితీయమని యుపనిషత్తులచే నుపదేశింపబడు నేకత్వజ్ఞానముకంటె మఱియొకటి నిశ్శ్రేయః సాధనము గాదని శ్రుతి నిషేధించుచున్నది. 'పరమాత్మను దెలిసికొనుటచేతనే మృత్యువునుదాటగలము. ఆశ్రయింపదగ్గ మఱియొకమార్గ మెద్దియు లేదు' అని శ్రుతి పల్కుచున్నది. సాంఖ్యులు యోగులుగూడ ద్వైతవాదులు. ఆత్మయొక్క

దర్శినః. యత్తు దర్శనము క్తం 'తత్కారణం సాంఖ్యయోగాభిపన్న' మితి వైదికమేవ తత్ర జ్ఞానం ధ్యానం చ సాంఖ్యయోగశబ్దాభ్యామభిలప్యేతే ప్రత్యాసత్తేరిత్యవగంతవ్యం, యేన త్వంశేన న విరుధ్యేతే తేనేష్టమేవ సాంఖ్య యోగస్మృత్యోస్సావకాశత్వం, తద్యథా 'అసంగో హ్యయం పురుష' (బృ. 4-3-16) ఇత్యేవమాది శ్రుతిప్రసిద్ధమేవ పురుషస్య విశుద్ధత్వం నిర్గుణపురుషనిరూపణేన సాంఖ్యైరనుగమ్యతే. తథా చ యోగైరపి 'అథ పరివ్రాడ్వివర్ణవాసా ముండోఽపరిగ్రహ' ఇత్యేవమాదిశ్రుతిప్రసిద్ధమేవ నివృత్తినిష్ఠత్వం ప్రవ్రజ్యాద్యుపదేశేనానుగమ్యతే.

---

యద్వితీయత్వమును వారంగీకరింపరు. కామాదికారణము సాంఖ్యయోగములచే తెలియబడుచున్నది యనువాక్యమునం దుదాహరింపబడిన సాంఖ్యయోగపదములు వేదసమ్మతములగు జ్ఞానధ్యానములను చెప్పుచున్నవి. వేదాంతోపదిష్టములగు వాక్యములకు సన్నిహితముగా నారెండుపదములు కాన్పించుచున్నవి. వేదమునకు విరుద్ధములుగాని సాంఖ్యయోగస్మృతి భాగముల కవకాశము కలుగుట మాకును ఇష్టమే. అదియెట్లన 'ఈపురుషు డసంగుడు' (బృ4-3-16) మొదలగు శ్రుతులయందు సుప్రసిద్ధమైన పురుషునియొక్క విశుద్ధత్వమును నిర్గుణపురుషుని నిరూపించుచు సాంఖ్యులు గూడ నంగీకరించిరి. (జా బా 5) పరివ్రాజకుడు కషాయవస్త్రధారి క్షౌరముచేయబడిన శిరస్సుగలవాడు, ప్రతిగ్రహము చేయనివాడు' (జా బా 5) అను మొదలగు స్థలములయందు సన్యాసాశ్రమము నుపదేశించుచు శ్రుతిసిద్ధమగు నివృత్తినిష్ఠనే అంగీకరించుచున్నారు. ఇట్టి

ఏతేన సర్వాణి తర్కస్మరణాని ప్రతివక్తవ్యాని, తాన్యపి తర్కోపపత్తిభ్యాం తత్త్వజ్ఞానాయోపకుర్వంతీతి చేత్, ఉపకుర్వంతు నామ, తత్త్వజ్ఞానం తు వేదాంతవాక్యేభ్య ఏవ భవతి 'నావేదవిన్మనుతే తం బృహంతం, తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి' (బృ. 3-9-26) త్యేవమాదిశ్రుతిభః.

---

వేదావిరుద్ధములను బోధించు సాంఖ్య యోగ స్మృతులు మాకును అంగీకారములే యగును.

కేవలతర్కము నాధారము చేసికొనిన స్మృతులన్నిటికిని గూడ ఇందువలన సమాధానము చెప్పబడుచున్నది. అవిగూడ యుక్తులచేతను ఆనుకూల్యముచేతను తత్త్వజ్ఞానమున కుపకారకములగుచున్న వంటిరేని అగును గాక! తత్త్వజ్ఞానము వేదాంత వాక్యములచేతను మాత్రమే కలుగగలదు. "వేదము తెలియనివాడు మహత్తగు నాబ్రహ్మమును దెలియలేడు" "ఉపనిషత్తులచే బోధింపబడు నాపురుషుని నేను అడుగుచున్నాను" (బృ 3-9-26) మొదలగు శ్రుతులు వినబడుచున్నవి.॥

అధికరణ సంక్షేపార్థము : సాంఖ్యస్మృతి నిరాకరణచేతనే యోగస్మృతి నిరాకరింపబడుచున్నది. సాంఖ్యస్మృతియందు లేని జ్ఞానవిషయము యోగస్మృతి యందు విచారింపబడుచున్నది. ఈ స్మృతులు వేదావిరుద్ధము లయినంతవరకు అంగీకార్యములు కాని సాంఖ్యయోగములు రెండును ద్వైతపరములు. తత్త్వజ్ఞానము వేదాంతములవలననే గలుగును. 3

# (3) విలక్షణత్వాధికరణమ్ (సూ. 4–11)

## (3) విలక్షణత్వాధికరణము

అ॥ శ్రుతివిరుద్ధములగు స్మృతులు ప్రమాణములుగాక యాభాసమాత్రము లగుచున్నవి గనుక నవి సమన్వయము చేయదగవని పూర్వాధికరణములయందు వివరింపబడినది. వేద విరుద్ధమగు తర్కము సమన్వయార్థము గాదని పూర్వసూత్రాంతమున సూచింపబడిన విషయము రాబోవు అధికరణమున విచారింప బడుచున్నది. తర్కము సమన్వయార్థమను పూర్వపక్షివాదము మున్ముందు 4–5 సూత్రములయందుపపాదింపబడుటచే నారెండును పూర్వపక్ష సూత్రము లగుచున్నవి.

విషయము : ఆకాశాది జగత్కారణత్వము

విశయము : చేతనము జగత్కారణమగునా? కాదా?

పూర్వపక్షము : జగత్తునకు చేతనము కారణము కాదు

సిద్ధాంతము : చేతనము కారణము.

అవలోకనీయములగు ప్రమాణములు.

తై. 2–6. ఛాం 6–2–3–4; బృ 6–1–7, 1–3–2; ఐత. ఆ 2–4–2–6, బృ 6–1–13; కఠ 1–2–9. భ. గీ. 2–25 10–2 బ్ర. సూ. 2–1–11; బృ. 2–4–6 బ్ర. సూ. 2–1–14; ఛాం 7–24–2; ముం 2–2; ఛాం 3–14–1 గా కా 1–16. ఛాం 6–7–2,3;

## న విలక్షణత్వాదస్య తథాత్వం చ శబ్దాత్ (సూ 4)

బ్రహ్మాస్య జగతః కారణం ప్రకృతిశ్చేత్యస్య పక్షస్యాక్షేపః స్మృతినిమిత్తః పరిహృతః, తర్కనిమిత్త ఇదానీమాక్షేపః పరిహ్రియతే.

మాధ్యమికః : కుతః పునరస్మిన్నవధారితే ఆగమార్థే తర్కనిమిత్తస్యాక్షేపస్యావకాశః. నను ధర్మ ఇవ బ్రహ్మణ్యప్యనపేక్ష ఆగమో భవితుమర్హతి.

---

విలక్షణత్వాత్ = బ్రహ్మము జ్ఞానాత్మకము; ప్రపంచము జడము బ్రహ్మముకంటె విలక్షణముగ గనుక న = బ్రహ్మము జగత్కారణము కానేరదు. తథాత్వం చ = బ్రహ్మము జగత్తుకంటె విలక్షణమగుట శబ్దాత్ = శ్రుతివలన తెలియుచున్నది.

అ॥ బ్రహ్మము జగత్తునకు [మృత్తుఘటమునకువలె] ఉపాదాన కారణముగాని, కులాలునివలె నిమిత్తకారణముగాని, కాదని స్మృతిని ఆధారము చేసికొని చేయబడిన యాక్షేపణ పూర్వాధికరణమున పరిహరింపబడినది. ఆ ఆక్షేపణమే తర్కమునాధారము చేసికొని తిరిగి చేయబడుచున్నందున దానిని యీ అధికరణమున పరిహరించుచున్నారు.

మధ్యవర్తి : శాస్త్రముయొక్క తాత్పర్యము నిశ్చయింపబడినది గదా! తర్కము నాధారము చేసికొనిన యీ యాక్షేపణమున కవకాశమెట్లు గలుగును. ధర్మ విషయమునవలెనే బ్రహ్మవిషయమున గూడ శాస్త్రమన్యానపేక్షితమగు ప్రమాణము కాకూడదా ?

పూ. పక్షీ : భవేదయమవష్టంభో యది ప్రమాణాంత రానవగాహ్యాగమమాత్రప్రమేయోఽ యమర్థస్స్యాదనుష్ఠేయరూప ఏవ ధర్మః, పరినిష్పన్నరూపం తు బ్రహ్మావగమ్యతే పరినిష్పన్నే చ వస్తుని ప్రమాణాంతరాణా మస్త్యవకాశో యథా పృథివ్యాదిషు, యథా చ శ్రుతీనాం పరస్పర విరోధే సత్యేకవశేనేతరా నీయంతే, ఏవం ప్రమాణాంతరవిరోధేఽపి తద్వశేనైవ శ్రుతిర్నీయేత దృష్టసా ధర్మ్యేణ చాదృష్టమర్థం సమర్పయంతీ యుక్తి రనుభవస్య సన్ని

---

పూర్వపక్షి : (1) ధర్మ బ్రహ్మము లాగమము చేతను మాత్రమే దెలిసికొనదగినవై వానిని దెలిసికొను ప్రమాణము మఱియొకటి లేకుండినచో వానికి చెప్పబడిన

ఈసూత్ర మేల అవసరము

సామ్యము యుక్తముకావచ్చును. ఆగమము చేతనే ధర్మమును దెలిసికొనగలము. బ్రహ్మము సిద్ధవస్తువు. సిద్ధవస్తు వాగమము వలననేగాక నితరప్రమాణ ములవలనగూడ తెలియ శక్యము. పరినిష్ఠితములగు పృథివ్యాది భూతములు ప్రత్యక్షప్రమాణముల వలనగూడ తెలియు చున్నవి. శ్రుతులకు పరస్పరవిరోధము కాన్పించినపు డొక శ్రుతి నాధారముచేసికొని మిగిలినవానికి తదనుకూలముగ సమన్వయముచేయు చున్నాము. ఆతీరుననే ఇతరప్రమాణ ములు శ్రుతివిరుద్ధము లయినపుడు, యెదో యొక ప్రమాణ మును గ్రహించి తదనుకూలముగ శ్రుత్యర్థసమన్వయము చేయుట సమంజసము. (2) ప్రత్యక్షముగ దెలియుచున్న సామ్యసహాయముచే నదృష్టవిషయమగు బ్రహ్మసాక్షాత్కా

కృష్యతే తు శ్రుతిరైతిహ్యమాత్రేణ స్వార్థాభిధానాత్. అనుభవావసానం చ బ్రహ్మవిజ్ఞానమవిద్యాయా నివర్తకం మోక్షసాధనం చ దృష్టఫలతయేష్యతే. శ్రుతిరపి 'శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్య' ఇతి శ్రవణవ్యతిరేకేణ మననం విదధతీ తర్కమప్యత్రాదర్తవ్యం దర్శయతి, అతస్తర్కనిమిత్తః పునరాక్షేపః క్రియతే, 'న విలక్షణత్వాదస్యే' తి.

యదుక్తం చేతనం బ్రహ్మ జగతః కారణం ప్రకృతిశ్చేతి తన్నోపపద్యతే కస్మాత్? విలక్షణత్వాదస్య వికారస్య

---

రమును సమర్థించుటచే యుక్తి బలవత్తరము సన్నిహితము నగుచున్నది. కాని శ్రుతి స్వవిషయమగు బ్రహ్మమును పరోక్షముగ మాత్రము బోధించుటవలన బ్రహ్మజ్ఞానమునకు దూరమగుచున్నది. (3) బ్రహ్మవిద్య అవిద్యను తొలగించి మోక్షమునకు సాధనమగుట ప్రత్యక్షవిషయము. బ్రహ్మము సాక్షాత్కారవిషయ మగుటవలన బ్రహ్మజ్ఞాన మనుభవము నందే పర్యవసానము నొందుచున్నది. (4) 'శ్రోతవ్యో మంతవ్యః' శ్రవణము చేయతగినది మననము చేయతగినది యని చెప్పు శ్రుతియందుగూడ శ్రవణమునకు భిన్నమగు మననము గూడ బ్రహ్మసాక్షాత్కారోపాయముగ విధింపబడుచున్నది. సాక్షాత్కారము విషయముగా గలిగినందున తర్కముగూడ ఆదరణీయమని యీ శ్రుతివాక్యము చూపుచున్నది. కనుక "న విలక్షణత్వాదస్య" అని యీ సూత్రమున తర్కసంబంధమైన యాక్షేపణ తిరిగి చేయబడుచున్నది.

చేతనమగు బ్రహ్మము జగత్తునకు నిమిత్తోపాదానకారణ మగుచున్నదను వాదము సరికాదు.

ప్రకృత్యాః. ఇదం హి బ్రహ్మకార్యత్వేనాభిప్రేయమాణం జగద్బ్రహ్మణో విలక్షణమచేతనమశుద్ధం చ దృశ్యతే, బ్రహ్మ చ జగద్విలక్షణం చేతనం శుద్ధం చ శ్రూయతే. న చ విలక్షణత్వే ప్రకృతివికారభావో దృష్టః, న హి రుచకాదయో వికారా మృత్ప్రకృతికా భవంతి, శరావాదయో వా సువర్ణప్రకృతికాః, మృదైవ తు మృదన్వితా వికారాః ప్రక్రియంతే, సువర్ణేన చ సువర్ణాన్వితాః, తథేదమపి జగదచేతనం సుఖదుఃఖమోహాన్వితం సదచేతనస్యైవ సుఖదుఃఖమోహాత్మకస్య కారణస్య కార్యం భవితుమర్హతీతి న

---

జగత్తు బ్రహ్మము కంటె విలక్షణము

ఏలన (1) వికారస్వరూపమగు జగత్తు ఉపాదానకారణమగు బ్రహ్మముకంటె విలక్షణముగ నున్నది. బ్రహ్మకార్యమని తలంపబడుచున్న యీ జగత్తు అచేతనము, అశుద్ధము. బ్రహ్మము కంటె విలక్షణముగ కాన్పించుచున్నది. 'బ్రహ్మము జగత్తు కంటె విలక్షణము, చేతనము, శుద్ధము' అని శ్రుతి పలుకుచున్నది. విలక్షణములగు రెండుపదార్థములకు కార్యకారణ భావము కాన్పించుట లేదు. మృత్తునుండి సువర్ణాభరణరూప కార్యము పుట్టనేరదు. మృద్వికారములగు శరావాదులు సువర్ణమునుండి కలుగనేరవు. మృత్తునకు సంబంధించిన వికారములు మృత్తువలననే కలుగును. సువర్ణవికారములు సువర్ణమువలననే కలుగును. ఆవిధముగనే యీజగత్తు అచేతనము, సుఖము దుఃఖము అజ్ఞానములనువాని స్వరూపము గనుక అచేతనము సుఖదుఃఖమోహాత్మకమగు కారణమువలననే కలుగ

విలక్షణస్య బ్రహ్మణః, బ్రహ్మ విలక్షణత్వం చాస్య జగతోఽ శుద్ధ్య చేతనత్వదర్శనాదవగంతవ్యం. అశుద్ధం హీదం జగత్ సుఖదుఃఖమోహాత్మకతయా ప్రతీయతే ప్రీతి పరితాపవిషాదాది హేతుత్వాత్ స్వర్గనరకాద్యుచ్చావచప్రపంచత్వాచ్చ. అచేతనం చేదం జగచ్చేతనం ప్రతి కార్యకరణభావేనోపకరణభావోపగమాత్ న హి సామ్యే సత్యుపకార్యోపకారకభావో భవతి, న హి ప్రదీపౌ పరస్పరముపకురుతః.

సిద్ధాంతీ : నను చేతనమపి కార్యకరణం స్వామి భృత్యన్యాయేన భోక్తురుపకరిష్యతి.

---

వలెనుగాని తద్విరుద్ధలక్షణములు గల బ్రహ్మమువలన గలుగ నేరదు. అశుద్ధి అచేతనత్వాదులు కాన్పించుటచే నీజగత్తు బ్రహ్మముకంటె విలక్షణమని గ్రహించవలయును. ఈజగత్తు సుఖదుఃఖమోహస్వరూపము; సంతోషము, ఆవేదన సంభ్రమము మొదలగువానికి కారణము;నరకము స్వర్గము మొదలగు నుత్తమాధమనివాసస్థానము లను పుష్కలఫలముతో నలరారు చున్నది. కనుక నది యశుద్ధమగుచున్నది. అచేతనమగు జగత్తు చేతనమగు జీవునకు కార్యకారణ భావముచేత ఉపకరణమగు చున్నది. (2) సమానములగు రెండువస్తువుల కుప కార్యోపకారక సంబంధము గలుగ నేరదు గదా! [సహాయ భూతమగునది ఉపకారకము సహాయము పొందునది ఉప కార్యము] ఒకదీపము మఱియొకదీపమున కుపకారకము కానేరదు.

సిద్ధాంతి : (3) యజమానికి భృత్యు డుపకారక

పూ. పక్షీ : న, స్వామిభృత్యయోరప్య చేతనాంశస్యైవ చేతనం ప్రిత్యుపకారకత్వాత్. యో హ్యేకస్య చేతనస్య పరిగ్రిహో బుద్ధ్యాదిర చేతనభాగః స ఏవాన్యస్య చేతనస్యోప కరోతి న తు స్వయమేవ చేతనశ్చేతనాంతరస్య ఉపకరోత్యపకరోతివా, నిరతిశయాహ్యకర్తారశ్చేతనా ఇతి సాంఖ్యా మన్యంతే, తస్మాదచేతనం కార్యకరణం. న చ కాష్ఠలోష్టాదీనాం చేతనత్వే కించిత్ప్రిమాణమస్తి, ప్రసిద్ధశ్చాయం చేతనాచేతనవిభాగో లోకే, తస్మాద్బ్రిహ్మ విలక్షణత్వాన్నేదం జగత్తత్ప్రికృతికం.

---

మయినట్లు భోక్తయగు జీవునకు చేతనము లుపకారము లగుచున్నారు గదా ?

పూ. పక్షి : అదిసరికాదు. స్వామి భృత్యవిషయమునందుగూడ భృత్యుని బుద్ధి కరచరణాదులు మొదలగు నచేతన భాగము అనగా నతని దేహము స్వామికి ఉపకారకము లగుచున్నవి. భృత్యునియొక్క చేతనాంశములగు బుద్ధ్యాదులో, యజమానికి ఉపకారముగాని అపకారముగాని చేయుటలేదు. (4) చేతనమునకు వృద్ధిక్షయములు కర్తృత్వము లేవని సాంఖ్యులు తలంచుచున్నారు. కనుక కార్యము నుత్పాదనము చేయు కారణ మచేతనమగుచున్నది. [కార్యమే చేతన మన వీలులేదు, ఏలయన] (5) కాష్టము లోష్టము మొదలగు కార్యములు చేతనములనుటకు ప్రిమాణము కానరాదు. లోకములోని వస్తువులు చేతనములు అచేతనములు అను విభాగము సుప్రసిద్ధము. అందువలన జగత్తు బ్రిహ్మముకంటె విలక్షమగుటచే బ్రిహ్మ మద్దానికి ఉపాదానకారణము కానేరదు.

యోఽపి కశ్చిదపేక్షిత శ్రుత్యా జగతశ్చేతన ప్రకృతికతాం తచ్ఛ్రుతేనైవ సమస్తం జగచ్చేతనముపగమిష్యామి ప్రకృతిరూపస్య వికారేఽన్వయదర్శనాత్, అవిభావనం తు చైతన్యస్య పరిణామవిశేషాద్భవిష్యతి, యథా స్పష్టచైతన్యానామప్యాత్మనాం స్వాపమూర్ఛాద్యవస్థాసు చైతన్యం న విభావ్యతే, ఏవం కాష్ఠలోష్టాదీనామపి చైతన్యం న విభావయిష్యతే. ఏతస్మాదేవ చ విభావితత్వావిభావితత్వకృతాద్విశేషాద్రూపాదిభావాభావాభ్యాం చ

---

మఱియొకరెవరైన నీవిధముగ పలుకవచ్చును. చేతనమగు నుపాదానకారణమువలన నీ జగత్తు ప్రవృత్తమగుచున్నదని శ్రుతి పలుకుచున్నది అట్టి శ్రుతిబలముచే సమస్త జగత్తుకూడ చేతనమని యెవరైన చెప్పవచ్చును. ఉపాదానకారణ గుణములు కార్యమునందు సంక్రమించుచున్నవి. వికారస్వరూపముయొక్క విశేషస్వభావమువలన కారణముయొక్క చైతన్యము కార్యమునందు కనుబడకపోవచ్చును. చైతన్యము ప్రత్యక్షముగ నభివ్యక్తమగుచున్న జీవులయందుగూడ నిద్ర మూర్ఛ మొదలగు నవస్థలయందు చైతన్యము స్పష్టముగ తెలియబడుటలేదు. అదేవిధముగ కాష్ఠలోష్టాదుల యందుకూడ చైతన్యము కాన్పించుటలేదు. ప్రాణులయందు చైతన్యము కనబడుచున్నది, కాష్టలోష్టములయందు కనబడుటలేదు. అదేవిధముగ చేతనత్వము అన్నిటియందును సమానమే అయినను కొన్నిటియందు గోచరమగుచున్నది. మఱికొన్నిటియందు గోచరమగుటలేదు. అందువలన రూపాదిభేదము కలుగు

చేతనాచేతనత్వము అభివ్యక్తిభేదముచే కల్గుచున్నది.

కార్యకారణానామాత్మనాం చ చేతనత్వావిశేషేఽపి గుణప్రధాన భావో న విరోత్స్యతే. యథాచ పార్థివత్వావిశేషేఽపి మాంససూపౌదనాదీనాం ప్రత్యాత్మవర్తినోవిశేషాత్ పరస్పరోపకారిత్వం భవత్యేవమిహాపి భవిష్యతి, ప్రవిభాగప్రసిద్ధిరప్యతఏవ న విరోత్స్యత ఇతి.

పూ. పక్షి: తేనాపి కథం చిచ్చేతనత్వాచేతనత్వలక్షణం విలక్షణత్వం పరిహ్రియతే. శుద్ధ్యశుద్ధిలక్షణం తు విలక్షణత్వం నైవ పరిహ్రియతే, న చేతరదపి విలక్షణత్వం పరిహర్తుం శక్యత ఇత్యాహ—తథాత్వం చ శబ్దాదితి అనవగమ్యమానమేవ హీదం

---

చున్నది. కాని కార్యకారణ రూపములగు వానికి గుణప్రధానభావము విరోధములేదు. మాంసము, సూపము, ఓదనము మొదలగునవి విభిన్నపదార్థములైనను అవియన్నియును పృథివీవికారములేయగుటచే వానిలో వానికి ఉపకార్యోపకారకభావము కనుపించుచున్నది ప్రకృతమునందుగూడ నటులనే యోచింపతగును. ఈకారణముచేతనే లోకమునందు కాన్పించు చేతనాచేతనవిభాగము నకుగూడ వైరుధ్యములేదు.

పూర్వపక్షి: (6) మీావాదమునుబట్టి కారణమగు బ్రహ్మమునకును కార్యమగు జగత్తునకును, చేతనాచేతనత్వభేదకల్పితమగు వైలక్షణ్యము పరిహారమగునుగాక. బ్రహ్మము శుద్ధము జగత్తు అశుద్ధమని చెప్పబడుచున్న వైలక్షణ్యము పరిహరింపబడుటలేదు. కాని నిజముగా చేతనాచేతనవిషయమగు వైలక్షణ్యముగూడ పరిహరింప శక్యముకాదు, [సూత్రమునందు చెప్పినట్లు] జగద్బ్రహ్మముల వైలక్షణ్యము శ్రుతి

లోకే సమస్తస్య వస్తునశ్చేతనత్వం చేతనప్రకృతికత్వ శ్రవణాచ్ఛబ్దకరణతయా కేవలయోత్ప్రేక్ష్యేత, తచ్చ శబ్దేనైవ విరుధ్యతే, యతశ్శబ్దాదపి తథాత్వమవగమ్యతే. తథాత్వమితి ప్రకృతం విలక్షణత్వం కథయతి. శబ్ద ఏవ 'విజ్ఞానం చావిజ్ఞానం చే'(తై. 2-6) తి కస్య చిద్భాగస్యాచేతనతాం శ్రావయన్ చేతనాద్బ్రహ్మణో విలక్షణమచేతనం జగత్ప్రాపయతి.

మధ్య : నను చేతనత్వమపి క్వచిదచేతనత్వాభిమతానాం భూతేం

---

శ్రుతిజగత్తుయొక్క అచేతనత్వమును తెలుపుచున్నది.

వలననే తెలియుచున్నది. జగత్తు చేతనమని ప్రత్యక్షప్రమాణముచేతగాని అనుమానప్రమాణముచేత గాని తెలియుటలేదు. జగత్తు బ్రహ్మము వలన నుత్పన్నమగుచున్నదను శ్రుతి నాధారము చేసికొని యద్దానికి చేతనత్వము నూహించుచున్నారు కాని యీవిషయమునకు శ్రుతియే సమాధానము చెప్పుచున్నది. జగద్బ్రహ్మలు విలక్షణములని శ్రుతియే పలుకుచున్నది, సూత్రమునందలి తథాత్వమునకు ఉపాదానకారణము భిన్నములని యర్థము "విజ్ఞానం చావిజ్ఞానంచ (తైత్తి 2-6) బ్రహ్మము విజ్ఞానము అవిజ్ఞానముగూడ నయ్యెను" అని అచేతనమగు నొకభాగము నుదాహరించుచు చేతనమగు బ్రహ్మముకంటె నచేతనమగు జగత్తు విలక్షణమని శ్రుతి పేర్కొనుచున్నది. 4

మధ్యవర్తి : అయితే అచేతనముగ నంగీకరింపబడిన పంచభూతములు యిందిరియములు మొదలగువానికి చైతన్య

క్రియాణాం శ్రూయతే, యథా 'మృదబ్రవీదాపోఽబ్రువ'న్నితి (శ.ప.బ్రా. 6-1-3-2-4) 'తత్తేజ ఐక్షత, తా ఆప ఐక్షంతే (ఛాం. 6-2-3-4)తి చైవమాద్యా భూతవిషయా చేతనత్వశ్రుతిః, ఇంద్రియ విషయాపి 'తేహేమే ప్రాణా అహం శ్రేయసే వివదమానా బ్రహ్మ జగ్ముః' (బృ. 6-1-7) రితి 'తేహ వాచమూచుస్త్వం న ఉద్గాయే' (బృ. 1-3-2) తి చైవమాద్యేంద్రియవిషయేతి. అతః ఉత్తరం పఠతి.

---

మున్నటుల శ్రుతి యందు వినబడుచున్నది గదా! మృత్తు పలికెను, జలములు పలికెను: (శ. ప. బ్రా. 6-1-3-2-4). (ఛాం. 6-2-3-4) ఆ జలములు చూచినవి. ఈ మొదలగు శ్రుతులు భూతముల యొక్క చేతనత్వమును తెలియచేయుచున్నవి. (బృ. 6-1-7) 'ప్రాణములు శ్రేష్ఠత్వమును గూర్చి తమలోతాము కలహించుకొని బ్రహ్మ దగ్గఱకు వెళ్ళెను' అను శ్రుతి యింద్రియములు చేతనములని సూచించుచున్నది. (బృ. 1-3-2) 'నీవు మాకొఱకు గానము చేయవలయును' అని వాక్కునుగూర్చి వారు పలికిరి. అను మఱియొక శ్రుతి యింద్రియములను గూర్చి పలుకుచున్నది. [ఇట్లు జగత్తు చేతనముగనుక నద్దానికి బ్రహ్మ విలక్షణత్వము చెప్పశక్యముకాదని తిరిగి ఉద్ధారము చేయబడిన శంకకు] సాంఖ్యుడు ప్రత్యుత్తరమును చెప్పుచున్నాడు.

శ్రుతి అచేతనములుగ భావించినవానిని చేతనములుగ చెప్పుచున్నవి

## అభిమానివ్యపదేశస్తు విశేషానుగతిభ్యామ్ (సూ. 5)

పూ.పక్షీ : తుశబ్ద ఆశంకామపనుదతి. న ఖలు మృదబ్రవీదిత్యేవం జాతీయకయా శ్రుత్యా భూతేంద్రియాణాం చేతనత్వమాశంక నీయం, యతోఽభిమానివ్యపదేశ ఏషః. మృదాద్యభిమానినో వాగాద్యభిమానిన్యశ్చ చేతనా దేవతా వదనవిసంవదనాదిషు చేతనోచితేషు వ్యవహారేషు వ్యపదిశ్యంతే న భూతేంద్రియమాత్రం.

---

తు=మీా వాదము సరికాదు.

విశేషాను గతిభ్యాం=చేతనత్వమును తెలియచేయు దేవతాది శబ్దముచేత విశేషితమగుట చేతను, అభిమాన దేవతలచే అనుగతి వినబడుటచేతను. అభిమానివ్యపదేశః= అప్రాణాదుల దేవతలు చెప్పబడుచున్నారు. కాని జడములగు పంచమహాభూతములు చెప్పబడుటలేదు.

పూ. ప: సూత్రమునందలి తుశబ్దముచేత పైన ఉపపాదింపబడిన యాశంకనుతోసి బుచ్చుచున్నారు 'మృత్తు పలికినది" అని యచేతనములకు చేతనత్వము నాపాదించు వాక్యజాలము నుదాహరించు శ్రుతిజాతముచే పంచమహాభూతములకును యింద్రియములకును చేతనత్వము చెప్పబడుచున్నది యని శంకింపవలదు. వాని యభిమానిదేవతలాశ్రుతివాక్యములచేత పలుకరింపబడుచున్నారు మృదాద్యభిమానదేవతలు వాగాదుల అభిమానదేవతలు చేతనములకుచితమగు ఉత్తరప్రత్యుత్తరాది వ్యవహారములయందు పలుకరింపబడుచున్నారు గాని భూతములు యింద్రియములుమాత్ర

అచేతనముల అభిమానదేవతలును శ్రుతిపల్కరించినది.

కస్మాత్, విశేషానుగతిభ్యాం. విశేషో హి భోక్తౄణాం భూతేంద్రియాణాం చ చేతనాచేతనప్రవిభాగలక్షణః ప్రాగభిహితః, సర్వచేతనతాయాం చాసౌ నోపపద్యేత. అపిచ కౌషీతకినః ప్రాణసంవాదే కరణమాత్రాశంకావినివృత్తయే తదధిష్ఠాతృచేతనపరిగ్రహాయ దేవతాశబ్దేన విశింషంతి 'ఏతా హ వై దేవతా అహం శ్రేయసే వివదమానా' ఇతి 'తా వా ఏతాస్సర్వా దేవతాః ప్రాణే నిశ్శ్రేయసం విదిత్వే'తి చ (కౌ. 2-14) అనుగతాశ్చ సర్వత్రాభిమానిన్యశ్చేతనా దేవతా మంత్రార్థవాదేతిహాసపురాణాదిభ్యోఽవ

---

ముదాహరింపబడుటలేదు. (8) ఏలనన! విశేషము ననుసరించుటయను కారణమువలన. విశేషమేమన, భూతములకును యింద్రియములకును వానికి భోక్తలగు జీవులకును గల అచేతన విభాగముచే గలుగుభేద మదివరకే చూపబడినది. సమస్తము చేతనమయినచో నిట్టివిభాగము సంభవింపదు. మరియు (9) కౌషీతకియుపనిషత్తునందు వినవచ్చుచున్న ప్రాణసంవాదమున కేవల ఇంద్రియములు మాత్రము ప్రస్తుతములగుచున్నవను ఆశంక దేవతాశబ్దవిశేష ప్రయోగముచేత వారింపబడుచున్నది. "శ్రేష్ఠత్వముకొరకు పరస్పరము వివరించుకొనుచున్న యీదేవతలు" అను వాక్యమునందు వినవచ్చుచున్న దేవతాశబ్దవిశేషముచేత చేతనమగు నధిష్ఠానదేవతను పరిగ్రహింపనగును (2-14). (10) "ఆయీ దేవతలందఱు ప్రాణమునం దత్యంతమగు శ్రేయస్సును గమనించి" అను వాక్యమునందలి దేవతాశబ్దముగూడ నీ యర్థమునే తెలియజేయుచున్నది. (11) మంత్రములు, అర్థస్తావకవాక్యములు, ఇతిహాస

గమ్యంతే 'అగ్నిర్వాగ్భూత్వా ముఖం ప్రావిశ' దిత్యేవమాదికా చ శ్రుతిః కరణేష్వనుగ్రాహికా దేవతా అనుగతాః దర్శయతి, ప్రాణ సంవాదవాక్యశేషే చ 'తే హ ప్రాణాః ప్రజాపతిం పితరమే త్యోచు' రితి శ్రైష్ఠ్యనిర్ధారణాయ ప్రజాపతిగమనం తద్వచనాచ్చై కైకోత్క్రమణేనాన్వయవ్యతిరేకాభ్యాం ప్రాణే శ్రైష్ఠ్యప్రతిపత్తిః, 'తస్మై బలిహరణ' మితి చైవం జాతీయకోఽస్మదాదిష్వివ వ్యవ

---

ములు, పురాణములు యివిఅన్నియు చేతనములగు అధిష్ఠాన దేవతల సంబంధమునే అంతటను చెప్పుచున్నవి. (ఐ. ఆ. 2–4 2–4) అగ్ని వాగ్రూపమును బొంది ముఖమును ప్రవేశించెను" అను శ్రుతి సాధనభూతమగు ప్రతియింద్రియమునకును అందుకు సంబంధించిన దేవతలయొక్కయు సంబంధమును చూపు చున్నది. ఆప్రాణములన్నియు తమను సృజియించిన ప్రజాపతితో చెప్పిరి యని వినవచ్చుచున్న ప్రాణసంవాదమునందలి శేషించిన వాక్యమునందు వారలయొక్క శ్రేష్ఠత్వ నిర్ధారణముకొరకు ప్రజాపతివద్దకు పోవుటయు, ఏది లేక పోయిన యితరులుండలేవో అది శ్రేష్ఠమని ఆయన చెప్పిన ప్రకారము ఒకరి తరువాత నొకరు లేచిపోవుట మూలకముగ శ్రేష్ఠత్వము నిశ్చయింపబడుటయు కాన్పించుచున్నది. అతనికి బలిప్రదానము అనునట్టి వాక్యజాతమునందు అస్మదాదులకు వలెనే చేతనసహజమగు వ్యవహార ముదాహరింపబడుచున్నది. ఇందువలన తెలియుచున్న చేతనసంబంధము పైనుదాహరింప

అభిమానదేవతల సంబంధ ముదాహరింపబడినది

హారోఽనుగమ్యమానోఽభిమానివ్యపదేశం ద్రఢయతి. 'తత్తేజ ఐక్షతే' త్యపి పరస్యా ఏవ దేవతాయా అధిష్ఠాత్ర్యాస్స్వవికారే ష్వనుగతాయా ఇయమీక్షా వ్యపదిశ్యత ఇతి ద్రష్టవ్యం, తస్మాద్వి లక్షణమేవేదం బ్రహ్మణో జగద్విలక్షణత్వాచ్చ న బ్రహ్మ ప్రకృతికమితి.

ఆక్షిప్తే ప్రతివిధత్తే.

## దృశ్యతే తు (సూ. 6)

సిద్ధాంతీ : తుశబ్దః పక్షం వ్యావర్తయతి. యదుక్తం విలక్షణ త్వాన్నేదం జగత్ బ్రహ్మప్రకృతికమితి నాయమేకాన్తః, దృశ్య

---

బడిన అధిష్ఠానదేవతలను దృఢపరుచుచున్నది. తేజస్సు ఆలోచించెను అను వాక్యమునందుగూడ తన వికారములగు తేజోబన్నముల కధిష్ఠానదేవత యగు పరదేవత వానికి సంబంధించియే యాలోచించినట్లు తెలియునగును. అందువలన యీ జగత్తు బ్రహ్మముకంటె విలక్షణమే యగుచున్నది; విలక్షణముగనుక బ్రహ్మమద్దానికి ఉపదానకారణము కానేరదు. 5

పై రెండు సూత్రములలో నీ విధముగ నాక్షేపణరాగా సూత్రకారులు సమాధానము చెప్పుచున్నారు.

తు = పూర్వపక్షవాదము సరికాదు దృశ్యతే=అచేతనములనుండి చేతనములు, చేతనములనుండి అచేతనములు బుట్టుట కాన్పించుచున్నది.

సిద్ధాంతి: తు శబ్దము పూర్వపక్షము సరికాదని త్రోసివేయుచున్నది. బ్రహ్మముకంటె జగత్తు విలక్షణము గనుక నది

తేహి లోకే చేతనత్వేన ప్రసిద్ధేభ్యః పురుషాదిభ్యో విలక్షణానాం కేశనఖాదీనాముత్పత్తిరచేతనత్వేన ప్రసిద్ధేభ్యో గోమయాదిభ్యో వృశ్చికాదీనాం.

పూ.పక్షీ : నన్వచేతనాన్యేవ పురుషాదిశరీరాణ్యచేతనానాం కేశనఖాదీనాం కారణాని అచేతనాన్యేవ వృశ్చికాదిశరీరాణ్య చేతనానాం గోమయాదీనాం కార్యాణీతి.

సిద్ధాంతీ : ఉచ్యతే, ఏవమపి కించిదచేతనం చేతనస్యాయతనభావముపగచ్ఛతి కించిన్నేత్యస్త్యేవ వైలక్షణ్యం. మహాం

---

జగత్తున కుపాదానకారణము కానేరదని ప్రతివాది చెప్పిన విషయ మెల్లప్పుడును నిలువనేరదు. (1) లోకమున చేతనములని ప్రసిద్ధిచెందిన పురుషాదులనుండి విలక్షణములనగా నచేతనములగు కేశనఖాదులును అచేతనములని ప్రసిద్ధిచెందిన గోమయాదులనుండి చేతనములగు వృశ్చికాదులును ఉత్పన్నమగుట కాన్పించుచున్నది.

కా: కొంశముకొంత మాత్రమే కార్యమునందు ప్రవేశించుచున్నది.

పూ. పక్షి. అచేతనములగు బురుషశరీరములు అచేతనములగు కేశనఖాదులకు కారణమగుచున్నవి. అచేతనములగు వృశ్చికాదిశరీరములు అచేతనములగు గోమయాదుల కార్యములగుచున్నవి.

సిద్ధాంతి : సమాధానము చెప్పుచున్నాము. అచేతనములగు గోమయాదులయందలి కొంతభాగము మాత్రమే చేతనమగు వృశ్చికమున కాశ్రయమగుచున్నది. తదితర భాగములగుటలేదు. కనుక మీవాదము ప్రకారమయినను వైలక్ష

శ్చాయం పారిణామికః స్వభావ విప్రకర్షః పురుషాదీనాం కేశనఖాదీనాం చ రూపాదిభేదాత్, తథా గోమయాదీనాం వృశ్చికాదీనాం చ, అత్యంతసారూప్యే చ ప్రకృతి వికారభావ ఏవప్రలీయేత. అథోచ్యేత, అస్తి కశ్చిత్పార్థివత్వాది స్వభావః పురుషాదీనాం కేశనఖాదిష్వనువర్తమానో గోమయాదీనాం చ వృశ్చికాదిష్వితి, బ్రహ్మణోఽపి తర్హి సత్తాలక్షణః స్వభావ ఆకాశా

---

ణ్యము కాన్పించుచున్నది. కారణమగు పురుషశరీరమునకును, కార్యములగు నఖలోమాదులకునుగల స్వరూప వర్ణాది భేదము గొప్పదై స్వభావసిద్ధమగు పరిణామమువలన గలుగుచున్నది. గోమయ వృశ్చికములకు గలభేదముగూడ నిట్టిదే. [కార్యకారణముల కిట్టి అత్యంతవైలక్షణ్యమేల గలుగున్నది? కారణధర్మములన్నియు కార్యమునందు సంక్రమించుటచేతనా? లేక కొన్నిమాత్రమే సంక్రమించుటచేతనా? కారణధర్మములన్నియు కార్యమునందు సంక్రమించినచో] కార్యకారణముల కత్యంతము రూపసామ్యము సంభవించి కార్యకారణభావమే నశించును. లేక పురుషశరీరమునందును, గోమయాదులయందును కొంత పృథివీసంబంధమగు స్వభావము గలదనియు ఆపృథివీభాగము నఖలోమాదులయందును వృశ్చికాదులయందును అనువర్తించుచున్న దంటిరేని, బ్రహ్మమునకును జగత్తునకును సత్తా (ఉనికి) రూపమగు ధర్మమొకటి సమానముగ నున్నది. కారణమగు బ్రహ్మముయొక్క స్వభావమగు సత్తాధర్మమె కార్యమగు నాకాశాదులయం దనుగత మగుచున్నది. జగత్తుకంటె బ్రహ్మము విలక్షణమగుటచే

దిష్వనువర్తమానో దృశ్యతే, విలక్షణత్వేన చ కారణేన బ్రహ్మప్రకృతికత్వం జగతో దూషయతా కిమశేషస్య బ్రహ్మస్వభావస్యాననువర్తనం విలక్షణత్వ మభిప్రేయతే ఉత యస్య కస్యచిత్, అథ చైతన్యస్యేతి వక్తవ్యం. ప్రథమే వికల్పే సమస్త ప్రకృతి వికారభావోచ్ఛేదప్రసంగః. నహ్యసత్యతిశయే ప్రకృతివికారభావ ఇతి భవతి. ద్వితీయే చాసిద్ధత్వం, దృశ్యతే హి సత్తాలక్షణో బ్రహ్మస్వభావ ఆకాశాదిష్వనువర్తమాన ఇత్యుక్తం. తృతీయే తు దృష్టాంతాభావః, కిం హి యచ్చైతన్యేనాన్వితం తదబ్రహ్మ

---

బ్రహ్మము జగదుపాదానకారణము గానేరదని వివరించువారీ ప్రశ్నకు సమాధానము చెప్పవలసియున్నారు. బ్రహ్మ స్వభావము సంపూర్ణముగ జగత్తునందు లేమింజేసియా? లేక బ్రహ్మముయొక్క యేదోయొక ధర్మము జగత్తున లేమిం జేసియా? లేక బ్రహ్మచైతన్య మచట లేమింజేసియా? రెండింటికిని వైలక్షణ్యము సంభవించుట ? (2) ప్రథమపక్షమునందు కార్యకారణభావమే లేకపోవును. [బ్రహ్మలక్షణము లత్యంతము కార్యమగు జగత్తునందు లేనిచో జగత్తు బ్రహ్మకార్యమే గానేరదు] కారణముకంటె కార్యమునం దేదో యొకవిశేషము లేనిచో వికారము సంభవింపదు. కార్యకారణములకు భేదమే లేకపోవును. (3) ద్వితీయపక్షము సంభవముకాదు. బ్రహ్మ స్వభావమగు సత్తాధర్మము ఆకాశాదులయందు కాన్పించుచున్నదియని చెప్పియుంటిమి (4) తృతీయపక్షమునకు దృష్టాంతములేదు. చైతన్యముచే ననుగతమగున దంతయు బ్రహ్మ కార్యము కాదని మేము నక్కాణించుచున్నాము. ఇది సరి

ప్రకృతికం దృష్టమితి బ్రహ్మకారణవాదినం ప్రత్యవాహ్రియేత, సమస్తస్యాస్య వస్తుజాతస్య బ్రహ్మప్రకృతికత్వాభ్యుపగమాత్. ఆగమవిరోధస్తు ప్రసిద్ధఏవ చేతనం బ్రహ్మ జగతః కారణం ప్రకృతిశ్చేత్యాగమతాత్పర్యస్య ప్రసాధితత్వాత్.

సిద్ధాంతీ : యత్తూక్తం పరినిష్పన్నత్వాత్ బ్రహ్మణిప్రమాణాంతరాణి సంభవేయురితి తదపి మనోరథమాత్రం, రూపాద్యభావాద్ధి నాయమర్థః ప్రత్యక్షస్యగోచరః, లింగాద్యభావాచ్చ నానుమానాదీనామాగమమాత్రసమధిగమ్య ఏవ త్వయమర్థోధర్మవత్.

---

కాదని నిశ్చయించుట కవసరమయిన దృష్టాంతమును మీరేమి చెప్పగలరు? సమస్త వస్తుజాతమునకు బ్రహ్మ ముపాదాన కారణమని అంగీకరింపబడుచున్నది. ఇందు కన్యథా వాదించుట శ్రుతివిరుద్ధమని సుప్రసిద్ధము. బ్రహ్మము జగత్తునకు నిమిత్త కారణము ఉపాదానముగూడ నగుట శ్రుతితాత్పర్యమని సాధింపబడినది.

(౬) సిద్ధవస్తు వగుటవలన పృథివ్యాదులయందువలనే బ్రహ్మమునందుగూడ ప్రమాణాంతరములు గలవని చతుర్థసూత్రమునం దుదాహరింపబడిన పూర్వపక్షివాద మతని మనోరథమాత్ర మగుచున్నది. బ్రహ్మమునకు రూపాదులు లేవు. కనుక నయ్యది ప్రత్యక్షప్రమాణమునకు గోచరముకాదు. పర్వతమునం దగ్నిని సూచించు ధూమమువలె బ్రహ్మమును సూచించు చిహ్నములేవియును లేకుండుటవలన నది అనుమాన ప్రమాణవిషయముకూడ కానేరదు. ధర్మమువలె

బ్రహ్మము ప్రత్యక్షాది ప్రమాణములకతీతము

తథాచ శ్రుతిః 'నైషా తర్కేణ మతిరాపనేయా ప్రోక్తాన్యేనైవ సుజ్ఞానాయ ప్రేష్ఠే'తి (కా. 1-2-9). 'కో అద్ధా వేద క ఇహ ప్రవోచత్ ఇయం విసృష్టిర్యత ఆబభూవే'తి (ఋ.సం. 1-30-6) చైతే ఋచౌ నిజసిద్ధానామపీశ్వరాణాం దుర్బోధతాం జగత్కారణస్య దర్శయతః. స్మృతిరపి భవతి 'అచింత్యాః ఖలు యే భావా న తాంస్తర్కేణ యోజయేత్. ప్రకృతిభ్యః పరం యచ్చ తదచింత్యస్య లక్షణ'మితి 'అవ్యక్తోఽయమచింత్యోఽయమవికార్యోఽయముచ్యత' (గీ. 2-15) ఇతి న మే విదుస్సురగణాః ప్రభవం నమహర్షయః. అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశ' (గీ. 10-2) ఇతి చైవంజాతీయకా. యదపి శ్రవణవ్యతిరేకేణ

---

నదిగూడ ఆగమముచేతను మాత్రమే తెలిసికొనదగి యున్నది ("కా 1-2-9). బ్రహ్మవిషయము తర్కముచే తెలిసికొనదగినదికాదు, ఇతరులచే నుపదేశింపబడినపుడు అది సుగమమగుచున్నది యని శ్రుతి పల్కుచున్నది. ఈ సృష్టి యెచటనుండి వచ్చినది? దీనిని ఎవరు తెలిసికొనగలరు? ఎవరుచెప్పగలరు? (ఋ. సం. 1-30-6) ఈమంత్రద్వయముచే జగత్కారణము సమర్థులగు సిద్ధపురుషులకు గూడ దుర్విజ్ఞేయమని తెలియుచున్నది. బుద్ధికి అందరానిభావములను తర్కముచే నూహింపరాదు అని స్మృతి పల్కుచున్నది. (గీ 2-15) ఇత డవ్యక్తస్వరూపుడు, చింతించుటకు శక్యముకానివాడు; వికారము పొందనివాడు; అనిచెప్పబడుచున్నాడు. 'సురగణము మహర్షులుగూడ నాజన్మ నెరుంగరు, దేవతలకు మనుజులకు మఱిఅన్నిటికిని నేనే ఆది' (గీ 10-2) ఇటువంటి

మననం విదధచ్ఛబ్దఏవ తర్కమప్యాదర్తవ్యం దర్శయతీత్యుక్తం నానేన మిషేణ శుష్కతర్కస్యాత్రాత్మలాభస్సంభవతి. శ్రుత్యనుగృహీతఏవ హ్యత్ర తర్కోఽనుభవాంగత్వేనాశ్రీయతే. స్వప్నాంతబుద్ధాంతయోరుభయోరితరేతర వ్యభిచారాదాత్మనోఽనన్వాగతత్వం సంప్రసాదే చ ప్రపంచపరిత్యాగేన సదాత్మనా సంపత్తేర్నిష్ప్రపంచసదాత్మకత్వం, ప్రపంచస్య చ బ్రహ్మప్రభవత్వాత్ కార్యకారణానన్యత్వన్యాయేన బ్రహ్మావ్యతిరేక ఇత్యేవం జాతీయకః 'తర్కా

---

వాక్యములు గలవు (6) శ్రవణముకంటె భిన్నముగ మననమును విధించి శాస్త్రము తర్కమాదరణీయముగ పలుకుచున్నదియని ప్రతివాది వాదించుచున్నాడు. ఈ మిషచేత శ్రుతిసమ్మతముగాని శుష్కతర్కముచే నాత్మలాభము గలుగదు. శ్రుతిచే నిశ్చితమైన విషయమును మననముచే అనుభవసిద్ధము చేసికొనుటకు తదనుకూలమయిన తర్క మంగీకరింపబడుచున్నది [ఇది యెట్లనిన! ఉదాహరణముచే వివరింపనగును].

బ్రహ్మజ్ఞానమును గూర్చితర్క మెట్లు పకరించును

జీవు డవస్థాగతుడు; దేహాది ప్రపంచముతో సంబంధము గలవానికి ప్రపంచముతో సంబంధములేని బ్రహ్మముతో ఐక్యము సంభవింపదు. ద్వైతమును గ్రహించు ప్రమాణములకు విరుద్ధమగుటవలన బ్రహ్మము అద్వితీయమనుట యుక్తముకాదు. ఇట్టి విప్రతిపత్తులవలన శ్రుతిచే నిశ్చితమగు బ్రహ్మముయొక్క అద్వితీయత్వము జీవానన్యత్వముగూడ బుద్ధిచే భావించుటకు శక్యము కాకున్నది. ఈవిప్రతిపత్తు లీవిధముగ తొలగింప శక్యము.

ప్రతిష్ఠానా’దితి చ కేవలస్య తర్కస్య విప్రలంభకత్వం దర్శయిష్యతి. యోఽపి చేతనకారణశ్రవణబలేనైవ సమస్తస్య జగతశ్చేతనతాముత్ప్రేక్షతే తస్యాపి ‘విజ్ఞానం చావిజ్ఞానంచే’తి చేతనాచేతనవిభాగశ్రవణం విభావనావిభావనాభ్యాం చైతన్యస్య శక్యత ఏవ యోజయితుమ్. పరస్యైవ త్విదమపి విభాగశ్రవణం న యుజ్యతే, కథం పరమకారణస్య హ్యత్ర సమస్తజగదాత్మనా

---

జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు మూడును భిన్నములు. ఒకటి యుండగ మరియొకటి యుండనేరదు. వీని యన్నిటియందును ఆత్మ అనుగతమగుచున్నది. కనుక ఆత్మ యీ అవస్థాత్రయముకంటె భిన్నము అసంస్పృష్టము కావలెను. సుషుప్తియందు ప్రపంచజ్ఞాన మెంతమాత్రము లేదు. సంపూర్ణమగు అజ్ఞానమనుభవింపబడుచున్నది. కనుక నకాలమున బ్రహ్మైక్యము సంభవము కాగలదు. మృత్తువలన నుత్పన్నమయిన ఘటాదులు మృత్తుకంటె భిన్నములుకానట్లె కార్యకారణములకు భేదము లేకుండుటవలన బ్రహ్మమువలన బుట్టినజగత్తు బ్రహ్మముకంటె వేరుకానేరదు. శ్రుతి నిశ్చితమయిన విషయమును మననము చేసికొనుటయందు యీ విధముగ తర్కముపయోగించుచున్నది, “తర్కాప్రతిష్ఠానాత్” (సూ 2-1-11) అనుసూత్రమునందు కేవలతర్కము యథార్థగ్రహణమున కుపయోగకారి కాదని ముందు ప్రదర్శింపబోవుచున్నారు. (7) జగత్తునకు చేతనము కారణమని చెప్పు శ్రుతివాక్యము నాధారము చేసికొని సమస్తమయిన జగత్తు చేతనమని భావించు వారలు కొందఱు అనుభవమునుబట్టి అభివ్యక్త

సమవస్థానం శ్రావ్యతే 'విజ్ఞానం చావిజ్ఞానం చాభవ'దితి. తత్ర యథా చేతనస్యాచేతనభావో నోపపద్యతే విలక్షణత్వాత్, ఏవమచేతనస్యాపి చేతనభావో నోపపద్యతే, ప్రత్యుక్తత్వాత్తు విలక్షణత్వస్య యథాశ్రుత్యైవ చేతనం కారణం గ్రహీతవ్యం భవతి.

## అసదితిచేన్న ప్రతిషేధమాత్రత్వాత్ (సూ. 7)

---

మగునది చేతనము, అనభివ్యక్త మగునది యచేతనము అని చేతనాచేతన విభాగమును కల్పించి "విజ్ఞానం చా విజ్ఞానం" అను శ్రుతికి అవకాశము కల్పించెదరుగాక: ఇట్టి విభాగము ప్రతిపక్షికి ఉపకరింపదు. [వాని వాదప్రకారము అచేతనమగు ప్రధానము జగత్కారణమైనచో సర్వ మచేతనమగుటచే చేతనాచేతన విభాగప్రసంగమున కవకాశము కలుగదు]. 'విజ్ఞానం చా విజ్ఞానం చా భవత్' అను శ్రుతి పరమకారణమగు బ్రహ్మమే సమస్త జగదాకారమున నున్నట్లు పలుకుచున్నది. విలక్షణ మగుటవలన చేతన మచేతనమెట్లు గాదో అట్లే అచేతనముగూడ చేతనము కానేరదు. [ఇది యట్లుండ నిండు] జగత్తునకు బ్రహ్మమునకుగల వైలక్షణ్యము గోమయ వృశ్చిక పురుష నఖలోమ దృష్టాంతములచేత సూత్రారంభమున సమాధానము చెప్పబడినది. కనుక శ్రుతి నిరూపితవిధమున చేతనమే జగత్తునకు కారణమని గ్రహించదగును. 6

అసత్ ఇతి చేత్ = సృష్టికి పూర్వము ఏమియు లేదని శ్రుతి చెప్పుచున్నది గనుక ప్రపంచమనునదియె వేరుకనుక అది బ్రహ్మమునుండి ఉత్పన్నము కానేరదు అని అంటిరేని,

త్పత్తేస్సత్త్వం కార్యస్య ప్రతిషేద్ధుం శక్నోతి, కథం, యథైవ హీదానీమిదం కార్యం కారణాత్మనాత్మవత్ ఏవం ప్రాగుత్పత్తే రపీతి గమ్యతే. న హీదానీమపీదం కారణాత్మానమంతరేణ స్వతంత్రమేవాస్తి 'సర్వం తం పరాదో్యఽన్యత్రాత్మనస్సర్వం వేద' (బృ. 2-4-6) త్యాది శ్రవణాత్. కారణాత్మనా తు సత్త్వం కార్యస్య ప్రాగుత్పత్తేరవిశిష్టమ్.

పూ.పక్షీ : నను శబ్దాదిహీనం బ్రహ్మ జగతః కారణం.

---

చేత లేమిమాత్రము తెలియవచ్చుచున్నది గాని యాశబ్దము చేత నిషేధింపబడిన వస్తువేదియు లేదు. ఈనఞ్ శబ్ద ముత్ప త్తికిపూర్వము కార్యముయొక్క ఉనికిని నిషేధింపలేదు. అనగా నుత్పత్తికిపూర్వము కార్యములేదని చెప్పదు. (9) ఎట్లన! ఇప్పుడుగూడ నీ జగత్కార్యము కారణమగు సద్వ స్తువుకంటె స్వతంత్రముగాను భిన్నముగాను లేదు. ఆరీతిగనే ఉత్పత్తికి పూర్వముగూడ కారణముకంటె భిన్నముగ లేదు. (బృ 2-4-6) బ్రాహ్మణాది జాతులన్నియు బ్రహ్మమే గనుక ఎవడు పైన నుదహరింపబడినదంతయు బ్రహ్మముకంటె వేరని తెలిసికొనుచున్నాడో అట్టి విపరీతజ్ఞానము గలవానిని అది శ్రేయోమార్గమునుండి తొలగించును, అని శ్రుతి పలుకు చున్నది. కార్యముత్పత్తికి పూర్వము తరువాతనుగూడ కారణరూపమున నుండుటవలన దానియునికి యెల్లపుడు నొకటిగానే యున్నది.

పూ. పక్షి : జగత్ కారణమగు బ్రహ్మము శబ్దాది రహితము జగత్కార్యము శబ్దాదిసహితముగదా యని అంటివేని నిజమే !

సిద్ధాంతీ : బాఢం. న తు శబ్దాది మత్కార్యం కారణాత్మనా హీనం ప్రాగుత్పత్తేరిదానీం వాఽస్తీతి. తేన నశక్యతే వక్తుం ప్రాగుత్పత్తేరసత్కార్యమితి. విస్తరేణ చైతత్కార్యమితి. విస్తరేణ చైతత్కార్యకారణానన్యత్వవాదే వక్ష్యామః.

## అపీతౌ తద్వత్ప్రసంగాదసమంజసమ్ (సూ. 8)

---

సిద్ధాంతీ : (9) శబ్దాదులతో కూడుకొనియున్న జగత్కార్యము, కారణముగు బ్రహ్మస్వరూపము గాక స్వతంత్రముగ నుత్పత్తికి పూర్వముగాని తరువాతగాని లేదు కనుక ఉత్పత్తికి పూర్వము కార్యములేదని చెప్పశక్యముకాదు. ఈవిషయము ముందు కార్యకారణానన్యత్వ వాదమున (2-1-14) విస్తరింపబడును. 7

అ॥ బ్రహ్మము జగత్కారణమను సిద్ధాంతమునకు పూర్వపక్షి చెప్పు మరియొక ఆక్షేపణను రాబోవు సూత్రముఖమున నుపపాదించుచున్నారు కనుక నీసూత్రముగూడ పూర్వపక్షసూత్రముగ పరిగణింపబడుచున్నది.

అపీతౌ = ప్రలయకాలమునందు అశుద్ధమగు ప్రపంచము బ్రహ్మమునందు లయమగుచుండగ తద్వత్ ప్రసంగాత్ = బ్రహ్మముగూడ అశుద్ధనే కావలయును. కనుక అసమంజసం= బ్రహ్మము జగదుపాదాన కారణమనుట సమంజసముకాదు.

పూ. పక్షీ : అత్రాహ, యది స్థౌల్యసావయవత్వాచేతనత్వ పరిచ్ఛిన్నత్వాశుద్ధ్యాదిధర్మకం కార్యం బ్రహ్మకారణకమభ్యుప గమ్యేత, తదాఽపీతౌ ప్రళయే ప్రతిసంసృజ్యమానం కార్యం కారణ విభాగమాపద్యమానం కారణమాత్మీయేన ధర్మేణ దూషయేదిత్య పీతౌ కారణస్యాపి బ్రహ్మణః కార్యస్యేవాశుద్ధ్యాదిరూపతా ప్రసంగా త్సర్వజ్ఞం బ్రహ్మ జగతః కారణమిత్యసమంజసమిదమౌపనిషదం దర్శనమ్. అపి చ సమస్తస్య విభాగస్యావిభాగప్రాప్తేః పున రుత్పత్తౌ నియమకారణాభావాత్ భోక్తృభోగ్యాదివిభాగేనోత్ప త్తిర్నప్రాప్నోతీత్య సమంజసమ్. అపిచ భోక్తౄణాం పరేణ

---

పూ. పక్షి : జగత్కార్యము స్థూలము, అవయ వోపేతము, అచేతనము, పరిమితము, అశుద్ధము ఈ మొదలగు ధర్మములతో గూడుకొనిన జగత్కార్య మునకు బ్రహ్మమే కారణమని యంగీక కరించినచో ప్రలయకాలమునం దయ్యది కారణమగు బ్రహ్మముతో నైక్యముచెంది తనధర్మములచే కారణమునుగూడ దోషవంతముగ జేయును. అపుడు కార్య మునకువలె కారణమునకుగూడ నశుద్ధ్యాదిదోషప్రసంగము సంప్రాప్తమగును కనుక బ్రహ్మము జగత్కారణమను వేదాంతముల పలుకులు సమంజసములు గాకపోవును. మఱియు (13) ప్రలయమునందు విభాగములన్నియు నశించి అవి భాగస్థితి యేర్పడుచున్నది. తిరిగి సృష్టిచేయు కాలమునందు ఇతడు భోక్త ఇది భోగ్యము అనుమొదలగు విభాగములు చేయుట కవసరమగు నియమములుండవు. కనుక బ్రహ్మ

జగత్తుచే బ్రహ్మము అశుద్ధమగుచున్నది.

బ్రహ్మణాఽవిభాగం గతానాం కర్మాదినిమిత్తప్రళయేఽపి పునరుత్పత్త్యభ్యుపగమ్యమానాయాం ముక్తానామపి పునరుత్పత్తిప్రసంగాదసమంజసమ్. అథైవం జగదపీతావపి విభక్తమేవ పరేణ బ్రహ్మణాఽవతిష్ఠేత ఏవమప్యపీతిరేవ న సంభవతి, కారణావ్యతిరిక్తం చ కార్యం న సంభవతీత్యసమంజసమేవేతి,

సిద్ధాంతి : అత్రోచ్యతే.

## న తు దృష్టాంతభావాత్ (సూ. 9)

---

కారణత్వ మసంజసము. ఇంతియు కాదు. (14) కర్మబలముచే సంప్రాప్తమగుచున్న ప్రలయమునందు ఫలముల ననుభవించు భోక్తలందరు పరబ్రహ్మముతో భేదములేనివారలగుచుండగా, తిరిగి సృష్టి యంగీకరింపబడుటవలన ముక్తులకుగూడ నపుడు జన్మ సంప్రాప్తము కావచ్చును. కనుక బ్రహ్మకారణత్వ మసమంజసము (15) ప్రలయమునందుగూడ జగత్తు బ్రహ్మముకంటె వేరుగా నుండగూడదా యనిన అపుడు ప్రలయమే సంభవింపదు. కారణముకంటె వ్యతిరిక్తముగాని కార్యము సంభవింపదు. ఇందువలనగూడ బ్రహ్మకారణత్వ మసమంజసము 8

అ॥ ఇట్టి పూర్వపక్షమునకు సమాధానము చెప్పబడుచున్నది.

న తు = మా వాదము అసమంజసము కాదు. ఏలన, దృష్టాంత భావాత్ = తనయందు లయించుచున్న కార్యధర్మముచే కారణము దూషితము కాదనుటకు దృష్టాంతము లుండుటవలన.

నైవాస్మదీయే దర్శనే కించిదసామంజస్యమస్తి. యత్తావదభిహితం కారణమపి గచ్ఛత్కార్యం కారణమాత్మీయేన ధర్మేణ దూషయేదితి, న తద్దూషణం, కస్మాత్, దృష్టాంతభావాత్. సంతి హి దృష్టాంతాః యథా కారణమపి గచ్ఛత్ కార్యం కారణమాత్మీయేన ధర్మేణ న దూషయతి, తద్యథా శరావాదయో మృత్ప్రకృతికాః వికారా విభాగావస్థాయాముచ్చావచమధ్యమప్రభేదాస్సంతః పునః ప్రకృతిమపి గచ్ఛంతో న తామాత్మీయేన ధర్మేణ సంసృజంతి రుచకాదయశ్చ సువర్ణవికారా అపీతౌ నపున

---

సిద్ధాంతీ: మా వాదమునం దసామంజస్య మిసుమంతయును లేదు. (10) కారణమునందు లయమగుచున్న కార్యము కారణమును దోషవంతముగ చేయునను పూర్వపక్షి యాక్షేపణ మా వాదమును భంగపరుప నేరదు. ఏలన! మా వాదమునకు దృష్టాంతము గలదు. కారణమునందు లయమును బొంది తద్భావమును బొందు కార్యధర్మములు కారణము నంటవనుటకు దృష్టాంతములు గలవు. శరావాదులు మృత్తువలన బుట్టిన వికారములై ఆస్థితియందు పెద్దవి, చిన్నవి, సామాన్యమయినవి మొదలగు విభాగములు గలిగియున్నవి. అవి తిరిగి వానికారణమగు మృత్తునందు లయమయినపుడు తమ ధర్మములను మృత్తున కాపాదించుటలేదు. సువర్ణవికారములగు రుచకాద్యాభరణములు సువర్ణమునందు లయమయినపుడు తమ తమ ధర్మములచే సువర్ణము నంటుటలేదు. జరాయుజాండజ స్వేదజోద్భిజ్జములను

కార్యదోషముచే కారణమసంస్పృష్టమనుటకు దృష్టాంతములు గలవు

స్సువర్ణమాత్మీయేన ధర్మేణ సంసృజంతి. పృథివీవికారశ్చతుర్విధో భూతగ్రామో న పృథివీ మపీతావాత్మీయేన ధర్మేణ సంసృజతీతి. త్వత్పక్షస్య తు న కశ్చిద్దృష్టాంతోఽస్తి, అపీతిరేవ హి న సంభవేత యది కారణే కార్యం స్వధర్మేణైవావతిష్ఠేత, అనన్యత్వేఽపి కార్యకారణయోః కార్యస్య కారణాత్మత్వం ఆరంభణశబ్దాదిభ్య (బ్ర.సూ. 2-1-14) ఇత్యత్ర వక్ష్యామః.

అత్యల్పం చేదముచ్యతే, కార్యమపీతావాత్మీయేన ధర్మేణ కారణం సంసృజేదితి, స్థితావపి హి సమానోఽయం

---

పృథివీవికారములు తిరిగి పృథివియందు లయమయినపుడు తమ ధర్మములచే పృథివిని సంసృష్టము చేయుటలేదు. ప్రతివాది పక్షమున కన్నినో దృష్టాంత మెద్దియులేదు. (11) కార్యము కారణమునందు స్వీయధర్మములతో నుండినచో కారణమునందు కార్యము లయమగుటయె సంభవింపదు. కార్యకారణముల కభేదమైనను, కార్యము కారణభావము నొందునుగాని కారణము కార్యభావము నొందదు. ఈ విషయము "ఆరంభణశబ్దాదిభ్యః" (సూ. 2-1-14) అను రాబోవు సూత్రమునందు వివరింపబడుచున్నది. [కార్యము కారణస్వరూపము నొందునుగాని కారణము కార్యస్వరూపము నొందదని భావము.

(12) లయమయిన తరువాత కార్యధర్మములు కారణము నాపాదించునను వాదము సరియయినదని అంగీకరించినపుడుగూడ నట్టి వాదమతి పేలవమగుచున్నది. కార్యకారణముల కభేదము నంగీకరించుటవలన లయమునకు పూర్వము

ప్రసంగః కార్యకారణయోరనన్యత్వాభ్యుపగమాత్, 'ఇదం సర్వం యదయమాత్మా' (బృ. 2-4-6) 'ఆత్మైవేదం సర్వం బ్రహ్మైవే' (ఛాం. 7-25-2) త్యేవమాద్యాభిః శ్రుతిభిరవిశేషేణ త్రిష్వపి కాలేషు కార్యస్య కారణాదనన్యత్వం శ్రావ్యతే. తత్ర యః పరిహారః కార్యస్య తద్ధర్మాణాం చావిద్యాధ్యారోపితత్వాన్న తైః కారణం సంసృజ్యత ఇతి అపీతావపి స సమానః. అస్తి చాయమపరో దృష్టాంతః, యథా స్వయం ప్రసారితయా మాయయా మాయావీ త్రిష్వపి కాలేషు న సంస్పృశ్యతే అవస్తుత్వాత్, ఏవం

---

కార్యరూపమున గూడ నిట్టి కారణమునందు కార్యధర్మాపాదనము సంభవించవచ్చును. "ఇదం సర్వం యదయమాత్మా" (బృ 2-4-6) ఇది అంతయు నేది గలదో అది అంతయు నాత్మయె; "ఆత్మైవేదం సర్వం" (ఛాం. 7-25-2) ఇదియంతయు నాత్మయె. "బ్రహ్మైవేద మమృతం పురస్తాత్" (ముం. 2-2-11) ఎదుటనున్నది మరణరహితమగు బ్రహ్మమె "సర్వం ఖల్విదం బ్రహ్మ" (ఛాం. 3-14-1) ఇది యంతయు బ్రహ్మమె గదా! ఈ మొదలగు శ్రుతులవలన త్రికాలములయందును కార్యము కారణముకంటె నన్యముకాదని తెలుపబడుచున్నది. (13) కార్యము కార్యధర్మములుగూడ నవిద్యచే కారణమునం దారోపితములగుటవలన ఆ ధర్మములచే కారణము సంస్పృష్టముగాదని మేము చెప్పు పరిహారము లయస్థితికిగూడ వర్తించును. ఇచట మఱియొక దృష్టాంతముగలదు. తనచే నిర్మింపబడిన యింద్రజాలముచే నైంద్రజాలికుడు త్రికాలములయందుగూడ సంస్పృష్టుడు గాడు. ఇంద్రజాలమంతయు

పరమాత్మాపి సంసారమాయయా న సంస్పృశ్యత ఇతి. యథా చ స్వప్న దృగేకః స్వప్నదర్శనమాయయా న సంస్పృశ్యతే ప్రబోధసంప్రసాదయోరనన్వాగతత్వాత్, ఏవమవస్థాత్రయసాక్ష్యేకో ఽవ్యభిచార్యవస్థాత్రయేణ వ్యభిచారిణా న సంస్పృశ్యతే. మాయామాత్రం హ్యేతత్ యత్పరమాత్మనో ఽవస్థాత్రయాత్మనావభాసనం రజ్జ్వా ఇవ సర్పాదిభావేనేతి, అత్రోక్తం వేదాంతార్థసంప్రదాయ విద్భి రాచార్యైః 'అనాదిమాయయా సుప్తో యదా జీవః ప్రబుధ్యతే, అజమనిద్రమస్వప్నమద్వైతం బుధ్యతే తదే' (గౌ.కా. 1-16) తి. తత్ర యదుక్తమపీతౌ కారణస్యాపి కార్య

---

యథార్థము కాదు. ఈ విధముగనే పరమాత్మగూడ స్వకల్పితమగు సంసారముచే సంస్పృష్టుడుగానేరడు. జాగ్రత్స్వప్న సుషుప్తుల ననుభవించువా డొక్కడే అయినను అతడు స్వప్నదర్శనముచే జాగరితమునందుగాని సుషుప్తియందుగాని సంస్పృష్టుడగుటలేదు. అతడు సృష్టిస్థితిలయములు మూడింటికిని యొకడే మార్పులేని సాక్షియగుచున్నాడు. అతడు మార్పుగలవానిచే నసంస్పృష్టుడు. అతడే సృష్ట్యాద్యవస్థాత్రయ స్వరూపముచే భాసించుట మాయామాత్రము. అట్టియవభాసనము రజ్జుసర్పావభాసమువంటిది. వేదాంతార్థ సంప్రదాయమును గుర్తెఱింగిన యాచార్యపురుషులు (గౌ. కా. 1-16) "అనాదియగు మాయచేత నిద్రించుచున్న [అనగా అజ్ఞానదశలోనున్న] జీవు డెపుడు ప్రబుద్ధుడగుచున్నాడో, అనగా జ్ఞానమును బొందునో అపుడు అజము,

కారణము కార్యదోషముచే నసంస్పృష్టము

న్యేవ స్థౌల్యాదిదోషప్రసంగ ఇత్యేతదయుక్తమ్. యత్పునరే
తదుక్తం సమస్తస్య విభాగస్యావిభాగప్రాప్తేః పునర్విభాగేనో
త్పత్తౌ నియమకారణం నోపపద్యత ఇతి, అయమప్యదోషః
దృష్టాంతభావాదేవ, యథా హి సుషుప్తిసమాధ్యాదౌ సత్యామపి
స్వాభావిక్యా మవిభాగప్రాప్తౌ మిథ్యాజ్ఞానస్యానపోదితత్వాత్ పూర్వ
వత్పునః ప్రబోధే విభాగో భవత్యేవమిహాపి భవిష్యతి. శ్రుతి
శ్చాత్ర భవతి 'ఇమాస్సర్వాః ప్రజాః సతి సంపద్య న విదుః సతి

---

అనిద్రము, అస్వప్నము, అద్వైతము నగు నాత్మతత్త్వమును దెలిసికొనును." అని పలికిరి. (14) లయమునందు కార్యము యొక్క స్థౌల్యాదిదోషములు కారణమునకుగూడ సంభవించుచున్నవి యని పూర్వపక్షులు చేయువాద మయుక్తము. లయకాలమునందు పూర్వపు విభాగస్థితి అంతయు నవిభాగ

పూర్వపక్షి యాక్షేపణలకు సమాధానము.

స్థితిని బొందుననియు అందువలన తిరిగి సృష్టియందు విభాగవ్యవస్థను చేయనవసరమగు నియమహేతువు లుండనేరవనియు చెప్పువాదము గూడ నయుక్తమే యగుచున్నది. ఈ వాదములు విరుద్ధ దృష్టాంతములుండుటచే సరియైనవి గావు. సుషుప్తిసమాధి మూర్ఛావస్థలయందు జాగరితమునకు సహజమగు విభాగము కాన్పించుటలేదు. కాని అవిద్యపూర్తిగ నశింపకుండుటవలన, మేల్కాంచి జాగరితమునకు వచ్చినపుడు తిరిగి పూర్వవిభాగ మనుభూయమానమగుచున్న విధమున యిచటగూడ గ్రహింపనగును.

సంపద్యామహ' ఇతి 'త ఇహ వ్యాఘ్రో వా సింహో వా వృకో వా వరాహో వా కీటో వా పతంగో వా దంశో వా మశకో వా యద్యద్భవంతి' (ఛాం, 6-9-2-3) ఇతి యథాహ్యవిభాగేఽపి పరమాత్మని మిథ్యాజ్ఞానప్రతిబద్ధో విభాగవ్యవహారః స్వప్నవదవ్యాహతస్థితో దృశ్యతే, ఏవమపీతావపి మిథ్యాజ్ఞానప్రతిబద్ధైవ విభాగశక్తిరనుమాస్యతే. ఏతేన చ ముక్తానాం పునరుత్పత్తి ప్రసంగః ప్రత్యుక్తః, సమ్యగ్జ్ఞానేన మిథ్యాజ్ఞానస్యాపోదితత్వాత్. యః పునరయమంతేఽపరో వికల్ప ఉత్ప్రేక్షితోఽథేదం జగదపీతావపి

---

(ఛాం. 6-9-2-3) ఈ ప్రజలందరు ప్రతిదినము సుషుప్తియందు గాని మరణ ప్రలయములయందుగాని సత్తును జేరినను యీ సంగతిని దెలిసికొనలేకున్నారు. ఆత్మ స్వరూపమని తెలియక పోవుటచేత పూర్వకర్మచే లభించిన వ్యాఘ్రాది జన్మములను పొందిన ప్రాణిజాతము సుషుప్తియందు సత్తును ప్రవేశించి తమతమ ప్రత్యేకవ్యక్తిత్వమును గోల్పోయినను నిద్రలేచినపుడు నేను వ్యాఘ్రమును, సింహమును, తోడేలును, సూకరమును, కీటమును, పిట్టను, దోమను, ఈగను అను పూర్వవాసనలతో తిరిగి వచ్చుచున్నవి యని శ్రుతి పలుకుచున్నది. స్వప్నాద్యవస్థాత్రయమునందు ద్రష్ట యొకడే అయినను స్వప్నమునందు విభాగ మనుభూతమయినట్లు పరమాత్మ విభాగములులేక యొకడే యయినను, మిథ్యాజ్ఞానముచే విభాగవ్యవహారము జాగ్రత్తునందుండవచ్చును. ఆ విధముగానే లయమునందుగూడ మిథ్యాజ్ఞాననిమిత్తమగు విభాగ వ్యవహారము నూహింపవచ్చును. [మహాప్రలయమునందు

భక్తమేవ పరేణ బ్రహ్మణాఽవతిష్ఠేతేతి సోఽప్యనభ్యుపగమాదేవ ప్రతిషిద్ధః. తస్మాత్సమంజసమౌపనిషదం దర్శనమ్.

## స్వపక్షదోషాచ్చ (సూ. 10)

స్వపక్షే చైతే ప్రతివాదినః సాధారణా దోషాః

---

గూడ నజ్ఞానముచే నియమనకారణ ముండుటచేత పునర్జన్మ నియమనము సంభవించునని భావము. ముక్తుల కజ్ఞానము లేకుండుటవలన వారలకు జన్మకారణము లేదని] (15) ముక్తులకు గూడ పునర్జన్మము సంభవించునను ప్రతివాది వాదమునకు ప్రతివచనము చెప్పబడినది. సమ్యక్ జ్ఞానముచే మిథ్యాజ్ఞాన మపాస్త మగుచున్నది. (16) లయసమయమునందు జగత్తు బ్రహ్మముకంటె వేరుగా నుండవచ్చునుగదా యని సిద్ధాంతులు చెప్పుదురేమో యను చివరవాద మసంభవము. సిద్ధాంతు లిట్టివాదము నంగీకరించియుండలేదు. కనుక నుపనిషద్బోధితమగు బ్రహ్మము జగత్కారణ మగుచున్నది యను వాదము సమంజసమే యగుచున్నది. 9

స్వ పక్ష దోషాత్ చ=ప్రకృతి వికారభావము సంభవింపకపోవుట, ఉత్పత్తికి పూర్వము జగత్తులేకుండుట, లయమునందు బ్రహ్మమునకు అశుద్ధత్వము—సాంఖ్యులు కనుపర్చు ఈ దోషములు అన్నియు వారిపక్షమునగూడ నుండుట వలన.

ప్రతివాదులచే నుపపాదింపబడు విలక్షణత్వాది దోషములు వారిపక్షమున గూడ పుష్కలముగ కాన్పించు

ప్రాదుష్ష్యుః, కథమిత్యుచ్యతే యత్తావదభిహితం విలక్షణత్వా న్నేదం జగద్బ్రహ్మ ప్రకృతికమితి, ప్రధానప్రకృతికతాయామపి సమానమేతచ్ఛబ్దాదిహీనాత్ ప్రధానాచ్ఛబ్దాదిమతో జగత ఉత్ప త్త్యభ్యుపగమాత్, అత ఏవ చ విలక్షణకార్యోత్ప త్త్యభ్యుపగ మాత్, సమానః ప్రాగుత్పత్తేరసత్కార్యవాదప్రసంగః. తథాఽ పీతౌ కార్యస్య కారణవిభాగాభ్యుపగమాత్, తద్వత్ప్రసంగోఽపి సమానః, తథా మృదితసర్వవిశేషేషు వికారేష్వపీతావిభాగా త్మతాం గతేషు 'ఇదమస్య పురుషస్యోపాదానమిదమస్యే'తి ప్రాక్ప్రలయాత్ ప్రతిపురుషం యే నియతా భేదా న తే తథైవ పున

---

౬ వ సూత్రమునందలి దోషములు ప్రధాన వాదమునకుగూడ వర్తిలును.

చున్నవి. అది యెట్లో చెప్పుచున్నాము. (17) ఈ జగత్తు బ్రహ్మముకంటె విలక్షణమగుటవలన బ్రహ్మకార్యము కానేరదను వాదము, ప్రధానము జగత్కారణమను వాదమునకుగూడ సమానమే యగుచున్నది. శబ్దాదిహీనమగు ప్రధానము వలన శబ్దాదిసహితమగు జగత్తు ఉత్పన్నమగుచున్నట్లు సాంఖ్యులు చెప్పుచున్నారు. [కనుక కారణమగు ప్రధానము కార్యమగు జగత్తుకంటె విలక్షణము] వారు కారణవిలక్షణమగు కార్యోత్పత్తిని అంగీకరించుటవలన అసత్కార్యవాద ముభయులకు సమానమే యగుచున్నది. (18) అదేవిధముగ లయము కారణమునందు కార్యవిభాగము లేదను వాదముగూడ సమానమే యగుచున్నది. లయము నందు విశేషములగు వికారములన్నియు నశించి విభాగము కాన్పించనపుడు, ఇది యీ పురుషునికి ఉపాదానకారణము, ఇది యితనికి ఉపాదానకారణమని చెప్పదగిన ప్రలయ

రుత్పత్తౌ నియంతుం శక్యంతే, కారణాభావాత్, వినైవ చ కారణేన నియమేఽభ్యుపగమ్యమానే కారణాభావసామ్యాత్ ముక్తానామపి పునర్బంధప్రసంగః. అథ కేచిద్భేదాః అపీతావవిభాగమాపద్యంతే కేచిన్నేతిచేత్ యే నాపద్యంతే తేషాం ప్రధానకార్యత్వం న ప్రాప్నోతీత్యేవమేతే దోషాః సాధారణత్వాన్నాన్యతరస్మిన్ పక్షే చోదయితవ్యాభవంతీత్యదోషతామేవైషాం ద్రఢయతి, అవశ్యాశ్రయితవ్యత్వాత్.

---

మునకు పూర్వమునందున్న నియమకారణము లన్నియు ప్రలయానంతరము లేనందున తిరిగి పురుషసృష్టిని నియమించుటకు వానికి శక్యముకాదు. ప్రతి పురుషసృష్టిని నియమించు కారణములు లేకనే సృష్టి జరుగగల దంటిరేని ముక్తునికిని బద్ధునికిని కారణము లేకుండుట సమానమగుటవలన ముక్తునికి గూడ సంసారము లభింపవచ్చును. లయకాలమునందు కొన్ని విభాగములు లయమును బొందుటలేదు, మరికొన్ని లయమును బొందుచున్నవంటిరేని అవి ప్రధానమువలన ఉత్పన్నములగు కార్యములు కాకపోవలయును. ప్రధాన కార్యములన్నియు లయకాలమున ప్రధానమునందే అవశ్యము లయముకావలయును. దానియందు లయముకానివి దాని కార్యములు కానేరవు. ప్రస్తుతవిచారణమంతయు కార్యము కారణమునందు లయమగుచున్న వాదము నాధారము చేసికొని యున్నది.] ఇట్టి దోషము లన్నియు ప్రధానవాదమునందుగూడ వర్తించుటచే ప్రధానవాదు లా దోషముల నితరులమీాద ప్రయోగింపరాదు. కనుక నివి యన్నియు దోష

## తర్కాప్రతిష్ఠానాదప్యన్యథానుమేయమితి చేదేవమప్యవిమోక్షప్రసంగః (సూ. 11)

ఇతశ్చ నాగమగమ్యేఽర్థే కేవలేన తర్కేణ ప్రత్యవస్థాతవ్యమ్, యస్మాన్నిరాగమాః పురుషోత్ప్రేక్షామాత్రనిబంధనా

---

ములు కావనువాదమునే బలపడుచున్నవి. ఉభయవాదములవారును వీనిని అంగీకరింప వలసివచ్చుచున్నది. అవి అవశ్యముగ నంగీకరింపతగినవి. 10

అ: 2-1-6 సూత్రమునందు సూచింపబడిన కేవల తర్కముయొక్క నిరుపయోగము తరువాత సూత్రమునందు విస్తరింపబడుచున్నది.

తర్క అప్రతిష్ఠానాత్ = కేవల హేతువాదమునకు స్థైర్యము లేదుగనుక అనుమానసిద్ధమగు ప్రధానము జగత్కారణము కానేరదు. అన్యథా = స్థిరమగు తర్కముచే, అనుమేయం చేత్ = ప్రధాన మూహింపదగు నంటిరేని ఏవం అపి = ఆ పక్షమున గూడ అనగా ప్రధానము జగత్కారణమని అంగీకరించినపుడుగూడ, అవిమోక్షప్రసంగః = ప్రకృతి పురుషవివేకము లేకుండుటచే మోక్షము సంభవింపనేరదు.

శాస్త్రమునుబట్టి దెలిసికొనదగిన విషయమును గూర్చి కేవలతర్కము నాధారముచేసికొని ప్రతిఘటింపతగదు ఏలనన! (19) శాస్త్రబద్ధముగాక పురుషబుద్ధి మాత్రముచేత నిబద్ధములగు తర్కములు అనగా యుక్తివాదములకు స్థైర్యము

స్తర్కా అప్రతిష్ఠితా భవంతి, ఉత్ప్రేక్షాయా నిరంకుశత్వాత్. తథాహి కైశ్చిదభియుక్తైర్యత్నేనోత్ప్రేక్షితా స్తర్కా అభియుక్తతరై రన్యై రాభాస్యమానా దృశ్యంతే, తైరప్యుత్ప్రేక్షితా స్తదన్యైరాభాస్యంత ఇతి న ప్రతిష్ఠితత్వం తర్కాణాం శక్యం సమాశ్రయితుం పురుషమతివైరూప్యాత్. అథ కస్యచిత్ప్రసిద్ధమాహాత్మ్యస్య కపిలస్యాన్యస్య వా సమ్మత స్తర్కః ప్రతిష్ఠిత ఇత్యాశ్రీయేత, ఏవమప్యప్రతిష్ఠితత్వమేవ, ప్రసిద్ధమాహాత్మ్యాభిమతానామపి తీర్థకరాణాం కపిలకణభుక్ప్రభృతీనాం పరస్పరవిప్రతిపత్తిదర్శనాత్.

---

తర్కాప్రతిష్ఠానాత్ అనుపదములవివరణము

లేదు. బుద్ధిసూక్ష్మమునకు మేర లేదు. బుద్ధిసూక్ష్మము గల కొంతమందిచే నతిప్రయత్నముతో కల్పింపబడిన యుక్తులు అంతకంటెను బుద్ధిమంతులగు వారిచే నాభాస చేయబడుచున్నవి. వీరిచే కల్పింపబడిన యుక్తులు వీరికంటెను బుద్ధిమంతులగువారిచే నాభాస చేయబడుచున్నది. (20) పురుషబుద్ధు లొకతీరుగ లేకుండుట వలన తత్కల్పితములగు యుక్తులకు స్థైర్యమున్న ట్లంగీకరింప శక్యముగాదు. ఒకవేళ సుప్రసిద్ధమగు కపిలునికిగాని మఱియొక మహాపురుషునికి గాని సంమతమగు తర్కము స్థిరమని అంగీకరింతుముగాక! అప్పుడుగూడ నద్దానికి స్థైర్యము చిక్కదు (21) ప్రసిద్ధమహాపురుషులగు కపిల కణభుగాది ధర్మకర్తలకు పరస్పరము విరోధము కాన్పించుచున్నది.

అథోచ్యేతాన్యథా వయమనుమాస్యామహే యథా నాప్రతిష్ఠితత్వదోషో భవిష్యతి, నహి ప్రతిష్ఠిత స్తర్క ఏవ నాస్తీతి శక్యతే వక్తుం, ఏతదపి హి తర్కాణామప్రతిష్ఠితత్వం తర్కేణైవ ప్రతిష్ఠాప్యతే. కేషాంచి త్తర్కాణామప్రతిష్ఠితత్వదర్శనేనాన్యేషా మపి తజ్జాతీయానాం తర్కాణామప్రతిష్ఠితత్వకల్పనాత్. సర్వ తర్కాప్రతిష్ఠాయాం చ సర్వలోకవ్యవహారోచ్ఛేదప్రసంగః. అతీత వర్తమానాధ్వసామ్యేన హ్యనాగతేఽప్యధ్వని సుఖదుఃఖప్రాప్తిపరి హారాయ ప్రవర్తమానో లోకో దృశ్యతే. శ్రుత్యర్థవిప్రతిపత్తౌ

---

స్థైర్యాభావ దోషము లేని మార్గాంతరమున తర్కించెదము గాక! సుస్థిరమగు తర్కమే లేదని వచియింప శక్యముగాదు గదాయని ప్రతివాది బల్కిన (21) తర్కమునకు స్థైర్యము లేదను విషయముగూడ తర్కముచేత స్థాపింపబడుచున్నది. కొందఱి తర్కము స్థైర్యము లేనట్లు కాన్పించుటచే నాజాతికి చెందిన యితరతర్కములు గూడ నస్థిరములయినచో సర్వలోకవ్యవహారమును పెకలించినట్లగును. జీవయాత్రను బయలువెడలిన బాటసారి అతీతమ యినట్టియు ప్రకృతమునందున్నటియు మార్గానుభవమునుబట్టి ముందుసుఖమును బొందుటకును రాబోవుదుఃఖమును పరిహరించుటకును ప్రవర్తించుట లోకమునందు కాన్పించుచున్నది. విభిన్నశ్రుతుల కాపాతముగ అర్థవైరుధ్యము కాన్పించినపుడు,

దోషరహితమగు తర్కముగూడ ప్రత్యుతమువలెప చరింపదు.

చార్థాభాసనిరాకరణేన సమ్యగర్థ నిర్ధారణం తర్కేణైవ వాక్య వృత్తినిరూపణరూపేణక్రియతే. మనురపి చైవమేవం మన్యతే 'ప్రత్యక్షమనుమానం చ శాస్త్రం చ వివిధాగమమ్, త్రయం సువిదితం కార్యం ధర్మశుద్ధిమభీప్సతా. ఆర్షం ధర్మోపదేశం చ వేదశాస్త్రావిరోధినా. యస్తర్కేణానుసంధత్తే స ధర్మం వేద నేతరః' (12-105-106) ఇతి చ బ్రువన్, అయమేవ చ తర్క స్యాలంకారో యదప్రతిష్ఠితత్వం నామ, ఏవం హి సావద్యతర్క పరిత్యాగేన నిరవద్యస్తర్కః ప్రతిపత్తవ్యో భవతి. న హి పూర్వజో మూఢ ఆసీదిత్యాత్మనాపి మూఢేన భవితవ్యమితి కించిదస్తి ప్రమాణం, తస్మాన్న తర్కాప్రతిష్ఠానం దోషః,

---

అర్థాభాసములను త్రోసిబుచ్చి సమ్యగర్థనిర్ణాయకములగు వాక్యముల తాత్పర్యము తర్కముచేతనే నిరూపింపబడు చున్నది. ధర్మముయొక్క యథార్థస్వరూపమును తెలియ గోరువాడు ప్రత్యక్షానుమాన ప్రమాణములను సంప్రదాయ సిద్ధమగు శాస్త్రమును లెస్సగా దెలిసికొని ఆచరింపవలయునని మనువు పల్కుచున్నాడు. వేదమును స్మృతిని వీనికి విరుద్ధము కాని తర్కమును అనుసంధానముచేసి విషయవిచారణము చేయువాడుమాత్రమే ధర్మమును దెలిసికొనుచున్నాడు. ఇతరు లద్దాని తెలిసికొన జాలరనియు ఆయన చెప్పెను. స్థైర్యము లేకపోవుటయె తర్కమునకు భూషణము. నింద్యమగు తర్కమును పరిత్యజించి అనింద్యమగు తర్కమును గ్రహింపవలయునని పర్యవసానము. అన్నగారు మూర్ఖుడగుటచే తమ్ముడుగూడ

ఇతి వేదస్యాప్యవిమోక్షప్రసంగః. యద్యపి క్వచిద్విషయే తర్కస్య ప్రతిష్ఠితత్వముపలక్ష్యతే తథాపి ప్రకృతే తావద్విషయే ప్రసజ్యత ఏవా ప్రతిష్ఠితత్వదోషాదనిర్మోక్షస్తర్కస్య, న హీదమతిగంభీరం భావయాథాత్మ్యం ముక్తినిబంధనమాగమమంతరేణోత్ప్రేక్షితుమపి శక్యం, రూపాద్యభావాద్ధి నాయమర్థః ప్రత్యక్షస్య గోచరో

---

మూర్ఖుడు కావలయుననుటకు ప్రమాణము దొరకదు కనుక తర్కమునకు స్థైర్యము లేకుండుట యొకదోషముకాదు.

అ॥ [ఇంతవరకు సూత్రమునందలి అవిమోక్షశబ్దమునకు దోషరాహిత్యము అర్థముగ గ్రహించి వ్యాఖ్యానము చేయబడినది. ఇక నాశబ్దమును మోక్షరాహిత్యపరముగ గ్రహించి వ్యాఖ్యానింపబోవుచున్నారు].

(21) తర్కమునకు స్థైర్యము లేకపోవుట యొకదోషము కాకపోయినను అవిమోక్షప్రసంగము కలుగును. తర్కమునకు కొన్ని స్థలములయందు ప్రతిష్ఠితత్వము సంభవించును గాక! కాని ప్రకృత స్థలమున మాత్రము తర్కమప్రతిష్ఠితమగుటవలన, నద్దానికి దోషరాహిత్యము సిద్ధింపదు. ముక్తికి ఆధారమగు జగత్కారణముయొక్క అద్వితీయస్వరూపము వేదములకంటె భిన్నమగు మఱియొక ప్రమాణమువలన నూహింప శక్యముగాదు. రూపాదులు లేనిది యగుటచే నీవిషయము ప్రత్యక్షప్రమాణముచే తెలియరాదు. దానిని సూచించు చిహ్నములేమియు లేకుండుటచే

తర్కమునకు ప్రకృత విషయమున దోష రాహిత్యము సంభవము గాదు.

లింగాద్యభావాచ్చ నానుమానాదీనామిత్యవోచామ. అపిచ సమ్యగ్జ్ఞానాత్తు మోక్ష ఇతి సర్వేషాం మోక్షవాదినామభ్యుపగమః. తచ్చ సమ్యగ్జ్ఞానమేకరూపం వస్తుతంత్రత్వాత్, ఏకరూపేణ హ్యవస్థితో యోఽర్థస్సపరమార్థో లోకే తద్విషయం జ్ఞానం సమ్యగ్జ్ఞానమిత్యుచ్యతే యథాఽగ్నిరుష్ణఇతి, తత్రైవం సతి సమ్యగ్జ్ఞానే పురుషాణాం విప్రతిపత్తిరనుపపన్నా, తర్కజ్ఞానానాం త్వన్యోన్య

---

ననుమాణప్రమాణముచే నూహింపరాదు. మఱియు సర్వసంశయరహితమగు జ్ఞానముచేతనే మోక్షము సిద్ధించునని మోక్షవాదు లందరంగీకరించుచున్నారు. అట్టి సర్వసంశయశూన్యమగు జ్ఞానము వస్తుస్వరూపము నాధారముచేసికొని యుండుటవలన ఒక రూపముగా నుండవలెను. [ఘట విషయిక జ్ఞానము సిద్ధవస్తువగు ఘటము నాధారముచేసికొని యుండుటవలన ఒక ఘటాకారముగనే యుండును.] ఎల్లప్పుడు నొకేస్వరూపముతోనే పదార్థముండునో అదియే పరమార్థము. దానిని లెస్సగా తెలిసికొనిన జ్ఞానమే సర్వసంశయశూన్యమగు సమ్యగ్జ్ఞానమని లోకమునందు చెప్పబడుచున్నది. అగ్ని ఉష్ణముగా నుండును అను జ్ఞానమున కెప్పుడును మార్పులేదుగనుక ఆ జ్ఞాన మేకరూప మగుచున్నది. సమ్యక్ జ్ఞాన మేకరూపమగుచుండ దాని విషయమై మనుజులకు భిన్నాభిప్రాయములుండుట యసంభవము. [చక్కగా చూచినవారందరు ఘటమును ఘటముగానే తెలిసికొందురుగాని ఒక రొకవిధముగాను మరియొకరు మరియొక విధము

కేవలతర్కమువలన సంసారవిమోచనము కలుగదు.

విరోధాత్ ప్రసిద్ధా విప్రతిపత్తిః, యద్ధి కేనచిత్తార్కికేణేదమేవ సమ్యగ్జ్ఞానమితి ప్రతిష్ఠాపితం తదపరేణ వ్యుత్థాప్యతే, తేనాపి ప్రతిష్ఠాపితం తతోఽపరేణ వ్యుత్థాప్యత ఇతి ప్రసిద్ధం లోకే, కథమేకరూపానవస్థితవిషయం తర్కప్రభవం సమ్యగ్జ్ఞానం భవేత్. న చ ప్రధానవాదీ తర్కవిదాముత్తమ ఇతి సర్వైస్తార్కికైః పరిగృహీతః, యేన తదీయం మతం సమ్యగ్జ్ఞానమితి ప్రతిపద్యేమహి. న చ శక్యంతే అతీతానాగతవర్తమానాస్తార్కికా ఏకస్మిన్ దేశే కాలే చ సమాహర్తుం యేన తన్మతిరేకరూపైకార్థవిషయా సమ్యఙ్మతిరితి స్యాత్, వేదస్య తు నిత్యత్వే విజ్ఞానోత్పత్తి

---

గాను తెలిసికొనరు]. (22) కేవలతర్కముచే కలుగు జ్ఞానములు పరస్పరవిరుద్ధములగుట సుప్రసిద్ధము, సమ్యక్ జ్ఞానమని యొక తార్కికునిచేత ప్రతిపాదింపబడిన జ్ఞానము మరియొకనిచే నిర్మూలనము చేయబడుచున్నది. అతనిచే నుపపాదింపబడిన జ్ఞాన మన్యునిచే నెగురగొట్టబడుచున్నది. ఈ విషయము లోకప్రసిద్ధము. తర్కముచే నుత్థాపితమై స్థిరమగు నేకరూపము లేని విషయము సమ్యక్ జ్ఞాన మెట్లుకాగలదు? ప్రధానము జగత్కారణమని వాదించు సాంఖ్యుడు తర్కశాస్త్రవేత్తలలో నుత్తముడని తార్కికులందరంగీకరించుటలేదు. అట్లయినచో అతని ప్రధానకారణత్వమతము సమ్యక్ జ్ఞానముగ పరిగ్రహించవచ్చును. గడచినట్టియు, రానున్నట్టియు, ప్రకృతమునం దున్నట్టియు తార్కికులనందరిని యొకచోట గుమిజేర్చి వారి వివిధమతముల కేకరూపమును కల్పించి యది సమ్యక్ జ్ఞానమని నిరూపింప శక్యముకాదు. వేదమో నిత్యము,

హేతుత్వే చ సతి వ్యవస్థితార్థవిషయత్వోపపత్తేః, తజ్జనితస్య జ్ఞానస్య సమ్యక్త్వమతీతానాగతవర్తమానైః సర్వైరపి తార్కికైరపహ్నోతుమశక్యమ్. అతస్సిద్ధమస్యైవౌపనిషదస్య జ్ఞానస్య సమ్యగ్జ్ఞానత్వమ్. అతోఽన్యత్ర సమ్యగ్జ్ఞానత్వానుపపత్తేస్సంసారాదవిమోక్షఏవ ప్రసజ్యేత, అత ఆగమవశేనాగమానుసారితర్కవశేన చ చేతనం బ్రహ్మ జగతః కారణం ప్రకృతిశ్చేతి స్థితమ్.

---

బ్రహ్మజ్ఞానోదయకారణము; దానివలన సర్వవ్యవస్థాజ్ఞానము కలుగును. వేదమువలన గలుగు జ్ఞానము నన్యథాకల్పించుటకు గతించినట్టియు రాబోవునట్టియు వర్తమానమునందున్నట్టియు తార్కికుల కెవ్వరికిని సాధ్యముకాదు. కనుక నుపనిషద్బోధితమగు జ్ఞానమే సమ్యక్జ్ఞానమని సిద్ధమగుచున్నది. ప్రధానాదీతర స్థలములయందు లెస్సయగు జ్ఞానము కలుగదు గనుక సంసారవిముక్తి కలుగదని తేలుచున్నది. కనుక శాస్త్రముచేతను, శాస్త్రమునసుసరించిన తర్కముచేతను చేతనమగు బ్రహ్మమే జగత్తునకు నిమిత్తకారణమనియు, ఉపాదానమనియు స్పష్టమగుచున్నది.

<u>అధికరణ సంక్షేపార్థము</u> : బ్రహ్మము జగత్తున కుపాదాన కారణము కానేరదు. ఈ రెండును అత్యంతము విలక్షణములు. విలక్షణములగు రెండు వస్తువులకు ఉపాదాననిమిత్త మగు కార్యకారణభావము ఘటింపనేరదు. అచేతనమగు జగత్తును ఉత్పాదనముచేయు కారణముగూడ నచేతనము కావలెను. జగద్బ్రహ్మలు విలక్షణములని శ్రుతి చెప్పుచున్నది. జగత్తు

అచేతనము, జలములు చూచుచున్నవి అను మొదలగు వాక్యములు తదధిదేవతల పరములు. ఇది పూర్వపక్షము. ఇందుకు సమాధానము. చేతనమునుండి అచేతనములు బుట్టుట లోకమునందు కాన్పించుచున్నది. కార్యకారణములు కేవలము అభిన్నములుకావు. అటులకాకున్నచో వికార్యవస్తువు సంభవముకాదు. బ్రహ్మము జగత్తునకు నిమిత్తోపాదానోభయకారణమగుచున్నది. బ్రహ్మము తర్కమునకందునది కాదు. 'అసద్వా ఇదం' అను వాక్యము ప్రపంచము లేదని చెప్పుటలేదు. బ్రహ్మమునందు జగత్తు లయమైనను జగత్తు యొక్క అశుద్ధతచే బ్రహ్మము సంస్పృష్టము కాదు. బ్రహ్మము జగత్కారణమనుటకు ప్రతివాదికిగల యాక్షేపణ లన్నియు వారి వాదమునందు గూడ గలవు. తర్కమునకు స్థైర్యము లేదుగనుక కేవలము తర్కముచేత బ్రహ్మమును గ్రహించ శక్యము గాదు. పురుషబుద్ధియందు విరోధములు గలవు బ్రహ్మము బుద్ధికి అందరానిది. అది ప్రత్యక్షాదిప్రమాణములకు విషయముకాదు. సిద్ధవస్తువునుగూర్చి భిన్నాభిప్రాయము లుండనేరవు. వేదములు నిత్యములు. వానిచేతనే బ్రహ్మజ్ఞానము కలుగును. వేదాంతవిరుద్ధమగు తర్కము ప్రమాణము కాదు. కనుక విరోధము లేదు. 11

## (4) శిష్టాపరిగ్రహాధికరణమ్ (సూ. 12)

వైదికస్య దర్శనస్య ప్రత్యాసన్నత్వాత్ గురుతర తర్కబలోపేతత్వాత్ వేదానుసారిభిశ్చ కైశ్చిచ్ఛిష్టైః కేనచిదంశేన పరిగృహీతత్వాత్ ప్రధానకారణవాదం తావద్వ్యపాశ్రిత్య యస్తర్కనిమిత్త ఆక్షేపో వేదాంతవాక్యేషూద్భావితః, స పరిహృతః, ఇదానీ మణ్వాదివాదవ్యపాశ్రయేణాపి కశ్చిన్మందమతిర్వేదాంతవాక్యేషు

---

### (4) శిష్టాపరిగ్రహాధికరణము

అ॥ కార్యకారణముల కభేదము ఆత్మయొక్క స్వప్రకాశత్వాసంగత్వములు సమ్యగ్దర్శన మొక్కటిమాత్రము ముక్తిహేతువగుట యీ మొదలగు విషయములయందు వైదికదర్శనమునకు సంనిహితము, పరిమాణ సమన్వయాది గురుతర తర్కబలోపేతము వేదానుయాయులగు దేవలుడు మొదలగు కొంతమంది శిష్టులచేత కార్యకారణముల కనన్యత్వాది యెదోయొక విషయమునందు పరిగృహీతమునగు ప్రధానవాదము నాశ్రయించి వేదాంతవాక్యముల గూర్చి చేయబడిన తర్కసంబంధమగు నాక్షేపము పరిహరింపబడినది. ఇపుడు తర్కమతికుశలులగు వైశేషికులయొక్క పరమాణువాదము నాశ్రయించి కొంతమంది మందబుద్ధులు తర్కము నాధారముచేసికొని వేదాంతవాక్యములగూర్చి చేయు ఆక్షేపణను ఆశంకించుచున్నారు. తర్కము నాధారముచేసికొని వేదాంతముల నాక్షేపించువారిలో సాంఖ్యులు ప్రధాన

పునస్తర్కనిమిత్తమాక్షేపమాశంకేతేత్యతః ప్రధానమల్లనిబర్హణన్యాయేనాతిదిశతి.

## ఏతేన శిష్టాపరిగ్రహా అపి వ్యాఖ్యాతాః (సూ. 12)

పరిగృహ్యంత ఇతి పరిగ్రహాః అపరిగ్రహాః, శిష్టానామపరిగ్రహాః శిష్టాపరిగ్రహాః, ఏతేన ప్రకృతేన ప్రధానకారణవాదనిరాకరణేన శిష్టైర్మనువ్యాసప్రభృతిభిః కేనచిదప్యంశేనాపరిగృహీతా యేఽణ్వాది కారణవాదాస్తేఽపి ప్రతిషిద్ధతయా వ్యాఖ్యాతా నిరాకృతా ద్రష్టవ్యాః, తుల్యత్వాన్నిరాకరణకారణస్య నాత్ర పునరాశంకితవ్యం కించిదస్తి. తుల్యమత్రాపి పరమగంభీరస్య జగ

---

ములునివంటివారు. వారలను జయించిన యితరులను జయించినట్లే యగును. కనుక సాంఖ్యులకు చెప్పిన పరిహారముచే నితరులుగూడ పరిహరింపబడుచున్నారు, విషయాదులను పూర్వాధికరణమువలెనే ఇచటగూడ గ్రహించవలెను.

ఏతేన = ప్రధాన జగత్కారణత్వమును నిరాకరించుటచేత శిష్ట అపరిగ్రహాః = శిష్టులచే పరిగ్రహింపబడని అణ్వాది కారణవాదములు గూడ వ్యాఖ్యాతాః = వ్యాఖ్యానింపబడినవి.

శిష్టులచేత పరిగ్రహింపబడనివారు శిష్టాపరిగ్రహులు. ప్రకృతమగు ప్రధానకారణవాదమును నిరాకరించుటచేత మనువు వ్యాసుడు మొదలగు శిష్టులచే పరిగృహీతములుగాని అణ్వాది కారణవాదములు గూడ నిషేధింపబడుచున్నవని గ్రహించవలయును. నిరాకరించుటకుగల కారణములు రెండింటికి సమానమే యగుచున్నవి. తిరిగి శంకించతగినది

## (5) భోక్త్రాపత్త్యధికరణమ్ (సూ. 13)

త్కారణస్య తర్కానవగాహ్యత్వం తర్కస్య చాప్రతిష్ఠితత్వ మన్యథానుమానేఽప్యవిమోక్ష ఆగమవిరోధశ్చేత్యేవంజాతీయకం నిరాకరణకారణమ్.

---

యిచట నేమియులేదు. పరమగంభీరమగు జగత్కారణము తర్కమున కందకపోవుట, తర్కముయొక్క అస్థైర్యము, స్థిరమగు తర్కముచేతగూడ మోక్షము లేకపోవుట, శాస్త్రవిరోధము, యీ మొదలగునవి అన్నియును ఇతరతర్కవాద నిరాకరణమునకు కారణము లగుచున్నవి.

అధికరణార్థ సంక్షేపము : ప్రధానకారణవాద నిరాకరణ వాదముచేతనే తదితరములగు తర్కమతాది వాదములుగూడ నిరసింపతగును. కేవలతర్కమునకు స్థైర్యము లేకుండుటచేతను దానివలన మోక్షప్రాప్తి లేకుండుటచేతను అయ్యది శాస్త్ర విరుద్ధ మగుటచేతను నిరాకరణీయ మగుచున్నది. 12

### (5) భోక్త్రాపత్త్యధికరణము

అ॥ బ్రహ్మవిషయమై కేవలతర్క మాలంబనీయము కాదని పూర్వాధికరణమున స్థాపింపబడినది. అయినను జగత్తు బ్రహ్మముకంటె భిన్నముగ కాన్పించుచున్నది కనుక విరోధము కాన్పించుచున్నది గదాయను ఆక్షేపణ పంచమాధికరణమున విచారింపబడుచున్నది.

## భోక్త్రాపత్తేర విభాగశ్చేత్స్యాల్లోకవత్ (సూ. 13)

అన్యథా పునర్బ్రహ్మకారణ వాద స్తర్కబలేనైవా క్షిప్యతే.

పూ. పక్షి: యద్యపి ప్రతిః ప్రమాణం స్వవిషయే భవతి, తథాపి ప్రమాణాంతరేణ విషయాపహారేఽన్యపరా భవితుమర్హతి,

---

విషయము : అద్వితీయబ్రహ్మమునందు జగత్కారణత్వ సమన్వయము.

విశయము : ఇట్టి సమన్వయము ప్రత్యక్షమునకు విరుద్ధ మగునా కాదా! యని సందేహము.

పూర్వపక్షము : విరుద్ధమగుచున్నది.

సిద్ధాంతి : భేదముకల్పితము గనుక విరోధములేదు.

అవలోకనీయములగు ప్రమాణవాక్యము తై 2-6.

భోక్త్రు ఆపత్తేః = ప్రపంచమంతయు బ్రహ్మస్వరూప మగుటవలన బ్రహ్మమునకును భోక్తకును అభేదమంగీక రింపబడుటచే అవిభాగఃచేత్ = బ్రహ్మము నిత్యముక్తము, జీవుడు బద్ధుడు అను విభాగము లేకపోవలె నంటిరేని లోక వత్ = లోకమునందువలెనే అగును.

బ్రహ్మముయొక్క జగత్కారణత్వమును తిరిగి తర్కము నాధారముచేసికొని మరియొకవిధముగ నాక్షేపించు చున్నారు.

పూ.పక్షి: (1) శ్రుతి యేవిషయమై చెప్పతలచినదో ఆవిషయమై తాను ప్రమాణము కావచ్చునుగాని యితర

యథా మంత్రార్థవాదౌ, తర్కోఽపి స్వవిషయాదన్యత్రాప్రతిష్ఠితత్వాత్ యథా ధర్మాధర్మయోః. కిమతో యద్యేవమత ఇదమయుక్తం యత్ప్రమాణాంతరప్రసిద్ధార్థబాధనం శ్రుతేః.

---

ప్రమాణములచే తెలియదగు విషయములయెడ నది గౌణముగామాత్రము గ్రహింపతగును. [అద్వితీయబ్రహ్మ ముపాదానకారణముగా గలిగియున్న పృథివీజలముల కభేదమను విషయము ప్రమాణాంతరముచే తెలియని విషయము, శ్రుతిచేతనే తెలియతగును. అట్టి విషయమునుగూర్చి శ్రుతి ప్రమాణమగుచున్నది. భోక్తృభోగ్యాది విభాగము ప్రత్యక్షగమ్యమగుచుండగా నీవిషయమై శ్రుతి ప్రమాణముకానేరదు.] (2) మంత్రార్థవాదములనుగూర్చి యెల్లపుడును శ్రుతి ప్రమాణము గాదు. [ఆదిత్యో యూపః ఆదిత్యుడు యూపస్తంభము అను మొదలగు వాక్యములకు యథాక్షరముగ నర్థకల్పనము ప్రత్యక్షవిరోధ మగుటంజేసి గౌణముగ వానియర్థమును గ్రహించవలెను.] (3) అదేవిధముగ తర్కముగూడ స్వవిషయమై ప్రమాణమగుచున్నది. విషయాంతరమునకు ప్రమాణముగానేరదు. [జగద్భేదము ప్రత్యక్షముగనుక తర్కవిషయమగుచున్నది. కాని] కేవల వేదబోధితములగు ధర్మాధర్మములయొక్క విధినిషేధములు తర్కసాధ్యములు గానేరవుగనుక వానిని తర్కముచే సాధించుట యుక్తముకాదు. ఇట్లనుటచే గలుగు ప్రయోజన

స్వవిషయమునుగూర్చి మాత్రమే శ్రుతులుం ప్రమాణములుం

సిద్ధాంతీ : కథం పునః ప్రమాణాంతరప్రసిద్ధోఽర్థః ప్రత్యాఖ్యాయేత ఇతి.

పూ. పక్షీ : అత్రోచ్యతే— ప్రసిద్ధో హ్యయం భోక్తృభోగ్యవిభాగో లోకే, భోక్తా చేతనశ్శారీరః, భోగ్యాశ్శబ్దాదయో విషయా ఇతి. యథా భోక్తా దేవదత్తః భోజ్య ఓదన ఇతి, తస్య చ విభాగస్యాభావః ప్రసజ్యేత, యది భోక్తా భోగ్యభావమాపద్యేత, భోగ్యం వా భోక్తృభావమాపద్యేత, తయోశ్చేతరేతరభావాపత్తిః పరమకారణాద్బ్రహ్మణోఽనన్యత్వాత్ ప్రసజ్యేత, న చాస్య ప్రసి

---

ద్ధమేమియన. ప్రమాణాంతరముచే ప్రసిద్ధమగు విషయము శ్రుతిచే బాధింపబడుట అయుక్తము.

సిద్ధాంతి : ప్రమాణాంతరముచే ప్రసిద్ధముగ తెలియబడుచున్న విషయము శ్రుతిచే నేవిధముగ బాధితమగుచున్నది?

పూ. పక్షి : చెప్పుచున్నాము. భోక్తయగువాడు చేతనుడగు జీవుడు. శబ్ద స్పర్శ రూప రస గంధములయిదు అతనికి భోగ్యవిషయములు. ఇట్టి భోక్తృ భోగ్య విభాగము లోకమునందు సుప్రసిద్ధము. దేవదత్తుడు భోక్త. అన్న మతనికి భోజ్యము. భోక్తృభోగ్యములు పరస్పర మొకదాని స్వరూపమును మరియొకటి బొందినచో, నీ రెండింటికిని గల సుప్రసిద్ధమగు భోక్తృభోగ్య విభాగము లేకపోవును. భోక్త భోగ్యమయినను కావచ్చును; భోగ్యము భోక్త అయినను కావచ్చును. (5) పరమకారణ

ప్రసిద్ధమగు భోక్తృ భోగ్య విభాగమును శ్రుతి త్రోసివేయలేదు.

 

ద్ధస్య విభాగస్య బాధనం యుక్తం. యథాఽద్యత్వే భోక్తృభోగ్య యోర్విభాగో దృష్టః తథాఽతీతానాగతయోరపి కల్పయితవ్యః, తస్మాత్ ప్రసిద్ధస్యాస్య భోక్తృభోగ్యవిభాగస్యాభావప్రసంగాద యుక్తమిదం బ్రహ్మకారణతావధారణమితి చేత్ కశ్చిచ్చోదయేత్.

సిద్ధాంతీ : తం ప్రతిబ్రూయాత్, స్యాల్లోకవదితి. ఉపపద్యత ఏవాయమస్మత్పక్షేఽపి విభాగః, ఏవం లోకే దృష్టత్వాత్. తథా హి సముద్రాదుదకాత్మనోఽనన్యత్వేఽపి తద్వికారాణాం ఫేనవీచీ

---

మగు బ్రహ్మము జగత్తునకు నుపాదానకారణమయినచో, భోగ్యభోక్త లన్యోన్యమొకటి మరియొకటియగుట అవశ్యము సంభవించును. ప్రత్యక్షప్రసిద్ధమగు నిట్టిభేదము శ్రుతిచే బాధింపబడుట యుక్తముగాదు. ప్రకృతమున కాన్పించు చున్న భోక్తృభోగ్య విభాగమునుబట్టి భూతభవిష్యత్కాల ములయందుగూడ నటులనే జరుగగలదని యూహింపతగును. ప్రసిద్ధమగు నిట్టి భోగ్య భోక్తృ విభాగము లేకుండుట తట సించుటవలన ఇదియంతయు బ్రహ్మకారణముచేతనే సంభ వించుచున్నది యని నిశ్చయించుట అయుక్తమని ఎవరయినను ఆక్షేపించినయెడల—

సింద్ధాంతి : ఇటుల సమాధానము చెప్పవచ్చును లోకసామాన్యమువలెె నద్దాని గ్రహించతగును. ఈవిభా గము మాపక్షమునందుగూడ సంభవించు చున్నది. లోకములో నిట్లుగదా కాన్పించు చున్నది (1) సముద్రమునందు కాన్పించు ఫేనతరంగబుద్బుదములు సముద్రజలము

నిజముగా భిన్న వస్తు వులకుపాధిచేభేదము కలుగవచ్చును.

తరంగబుద్బుదాదీనామితరేతరవిభాగ ఇతరేతర సంశ్లేషాదిలక్షణశ్చ వ్యవహార ఉపలభ్యతే. న చ సముద్రాదుదకాత్మనోఽనన్యత్వేఽపి తద్వికారాణాం ఫేనతరంగాదీనామితరేతరభావాపత్తిర్భవతి, న చ తేషామితరేతరభావానాపత్తావపి సముద్రాత్మనోఽన్యత్వం భవతి, ఏవమిహాపి న చ భోక్తృభోగ్యయోరితరేతరభావాపత్తిర్న చ పర స్మాద్బ్రహ్మణోఽన్యత్వమితి భవిష్యతి. యద్యపి భోక్తా న బ్రహ్మణో వికారః 'తత్సృష్ట్వా తదేవానుప్రావిశ' (తై. 2-6) దితి స్రష్టురేవావికృతస్య కార్యానుప్రవేశేన భోక్తృత్వశ్రవణాత్,

---

కంటె భిన్నములుకావు కాని యద్దానివికారములై ఒకా నొకప్పుడు వానిలో వానికి భేదము, మరియొకప్పుడవి యొక దానితో మరియొకటి కలసిపోవుటయు వ్యవహారమునందు కాన్పించుచున్నది. సముద్రజలముకంటె నవి భిన్నములు కాక పోయినను వానిలో నవి యొకదాని స్వరూపమును మఱి యొకటి బొందుటలేదు. అయినను అవి సముద్రజలముకంటె యన్యములు గావు. ప్రకృతమున నటులనే గ్రహింపతగును. భోక్తృభోగ్యము లొకదానిస్వరూపమును మఱియొకటి చెంద నేరవు. అవి పరబ్రహ్మముకంటె నన్యములును గావు. భోక్త యగు జీవుడు బ్రహ్మముయొక్క వికారముకాదు. (తై 2-6) అతడే జగత్తును సృజియించి అతడే అద్దాని ప్రవేశించెనని శ్రుతి పల్కుచున్నది, వికారము నెంతమాత్రము చెందని సృష్టికర్తయె జగత్కార్యమును ప్రవేశించి భోక్తయగు చున్నాడని శ్రుతివలన దెలియుచున్నది. అయినను కార్యమును ప్రవేశించినవానికి ఉపాధిచే విభాగము కల్పింపబడుచున్నది.

తథాపి కార్యమనుప్రవిష్టస్యాప్యుపాధినిమిత్తో విభాగః ఆకాశస్యేవ ఘటాద్యుపాధినిమిత్తః, ఇత్యతః పరమకారణాత్ బ్రహ్మణో ఽనన్యత్వేఽప్యుపపద్యతే భోక్తృభోగ్యలక్షణో విభాగః సముద్రతరంగాదిన్యాయేనేత్యుక్తమ్.

---

ఘటమును ప్రవేశించిన మహాకాశమున ఉపాధినిమిత్తమగు భేదము కాన్పించుచున్నది. కనుక భోక్తృభోగ్యములు పరమకారణమగు బ్రహ్మముకంటె నన్యములు కాకపోయినను, సముద్రతరంగాదులవలె వానిలో వానికి భేదముండుట యుక్తమే యగుచున్నది.

అధికరణార్థ సంగ్రహము: శ్రుతి స్వవిషయమై ప్రమాణమైన కావచ్చునుగాని ప్రత్యక్షముగ కాన్పించు నితరవిషయములగూర్చి ప్రమాణము కానేరదు. జీవుడు భోక్త అన్నాదులతనికి భోగ్యములు. ఈవిభాగము ప్రత్యక్షసిద్ధము. పరబ్రహ్మము జగదుపాదానకారణమైనచో నిట్టిప్రత్యక్షసిద్ధమగు భేదమునకు బాధ కలుగుచున్నది. కనుక బ్రహ్మము జగత్కారణము కానేరదు. ఈవిధమగు పూర్వపక్షమునకు సమాధానమేమన బ్రహ్మము జగత్కారణమే కాని అందువలన బుట్టు వస్తుజాతమున కన్యోన్యము సముద్రజలమునుండి బుట్టు ఫేనతరంగబుద్బుదములవలె భేదముండవచ్చును. ఇట్టిభేదముపాధికల్పితము. అంతమాత్రముచేత బ్రహ్మముయొక్క పరమకారణత్వమునకు భంగములేదు.

## (6) ఆరంభణాధికరణమ్ (సూ. 14–20)

## తదనన్యత్వమారంభణశబ్దాదిభ్యః (సూ. 14)

---

(6) ఆరంభణాధికరణము

---

అ॥ తరంగ ఫేన బుద్బుదాదులు సముద్రజల పరిణామములైనట్లు భోగ్యభోక్తృజాతము బ్రహ్మపరిణామములగుచున్నవి యను లోకసామ్యమునుబట్టి బ్రహ్మము యొక్క జగత్కారణత్వ మాపాతముగ సమర్థింపబడినది. స్థూలబుద్ధులను సమాధానపర్చుట కిట్లుచెప్పబడినను, అద్వైతులు పరిణామ వాదము నంగీకరింపరు. వారి వాదము ననుసరించి బ్రహ్మకారణత్వము స్థిరపరచుట కీయధికరణము రచియింపబడినది. విషయాదులు పూర్వాధికరణమునందు వలెనే తెలియదగును.

అవలోకనీయములగు ప్రమాణవాక్యములు ఛాం 6–4–1 6–8–7 బృ 2–4–6 ముం 2–2–11, ఛాం 7–26–2, బృ 4–4–19, 4–5–15,. ఛాం 5–2–19, 6–16–3, బృ 4–4–25 3–9–26, 3–8–8, 4–2–3, (తై 2-1; బ్ర సూ 1–1–4; ఛాం 8–14–1; 6–3–2; శ్వేత 8–15; ఛాం 7–24–1; బృ 4–5–25; గీత 5–24–25, బృ 4–4–22, గీ 18–62 ఛాం 6–2–1, ఐత 2–4–1, (తై 2–7–1, ఛాం 6–1–3 6–1–1

ప్రపంచమునకు తదన్యత్వం = బ్రహ్మముకంటె అభిన్నత్వము సంభవించుచున్నది. ఏలన, ఆరంభణ శబ్ద ఆదిభ్యః=

అభ్యుపగమ్యచేమం వ్యావహారికం భోక్తృభోగ్యలక్షణం విభాగం స్యాల్లోకవదితి పరిహారోఽభిహితః. నత్వయం విభాగః పరమార్థతోఽస్తి, యస్మాత్తయోః కార్యకారణయోరనన్యత్వమవగమ్యతే. కార్యమాకాశాదికం బహుప్రపంచం జగత్; కారణం పరం బ్రహ్మ. తస్మాత్కారణాత్ పరమార్థతోఽనన్యత్వం వ్యతిరేకేణాభావః కార్యస్యావగమ్యతే, కుతః, ఆరంభణశబ్దాదిభ్యః. ఆరంభణశబ్దస్తావదేకవిజ్ఞానేన సర్వవిజ్ఞానం ప్రతిజ్ఞాయ దృష్టాంతాపేక్షయోచ్యతే 'యథాసోమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాద్వాచారంభణం వికారో

---

వాచారంభణ శ్రుతి మొదలగు వానియందు ప్రపంచము బ్రహ్మమునం దధ్యస్తము చేయబడినట్లు తెలియుటవలన.

పూర్వసూత్రమునందు వ్యావహారికమునకాన్పించు భోక్తృభోగ్యలక్షణమగు విభాగము నంగీకరించి లోకసామ్యమునుబట్టి విభాగవాదమునకు పరిహారము చెప్పబడినది. (1) పరమార్థమున ఇట్టి విభాగము లేదు. ఏలన, అద్వైతులు కార్యకారణమునకభేదము నంగీకరించుచున్నారు.

కార్యకారణములకు భేదములేదు.

ఆకాశముతో నారంభించి సృష్టింపబడిన విస్తృతమగు నీ జగత్తు కార్యరూపము. పరబ్రహ్మ మీకార్యమునకు కారణము. పరమార్థమునం దాకారణముకంటె కార్యమనన్యము, అనగా కారణముకంటె వ్యతిరిక్తముగ కార్యమున కునికి లేదని తెలియుచున్నది. ఒక మృత్పిండము తెలిసినదగుచుండగా మృణ్మయమగు సర్వము దెలియుచున్నది; మృద్వికారమును

నామధేయం మృత్తికేత్యేవ సత్యం' (ఛాం. 6-1-1) మితి. ఏతదుక్తం భవతి. ఏకేన మృత్పిండేన పరమార్థతో మృదాత్మనా విజ్ఞాతేన సర్వం మృణ్మయం ఘటశరావోదంచనాదికం మృదాత్మకత్వావిశేషాద్విజ్ఞాతం భవేత్, యతో వాచారంభణం వికారో నామధేయం వాచా కేవల మస్తీత్యారభ్యతే, వికారో ఘటశ్శరావ ఉదంచనం చేతి, న తు వస్తువృత్తేన వికారో నామ కశ్చిదస్తి, నామధేయమాత్రం హ్యేతదనృతం మృత్తికేత్యేవ

తెలియజేయు ఘటాదినామములు వాక్కుచే నిష్పాదితమగు వికారముమాత్రములగుచున్నవి. అది మృత్తుమాత్ర మగుచున్నదనుట సత్యము" అను శ్రుతియందలి యారంభణపదము నొక వస్తువును తెలిసికొనిన సర్వమును తెలిసికొనదగునని బోధించుచున్నది. అందుకు మృత్పిండ ముదాహరణము. ఈ శ్రుత్యర్థ మిట్లుల వివరింపనగును. మృత్పిండమంతయు పరమార్థముచే మృత్స్వరూపమని తెలిసికొనినపుడు, దానితో చేయబడిన ఘటము, మూకుడు, చట్టి మొదలగునవి యన్నియు మృత్స్వరూపములగుటచే తెలియబడినవి యగుచున్నవి.

వాచారంభణ శ్రుతి వివరణము.

ఘటాదివికారములన్నియు నామమాత్రములై వాక్కుచేత మాత్రము నిష్పాద్యములగుచున్నవి. ఘటము, శరావము. ఉదంచనము మొదలగునవి మృత్తుయొక్క వికారములు మాత్రమగుచున్నవి. (2) యథార్థమున వికారమను నదేదియును లేదు. వికారమంతయు నామమాత్రము, అసత్యము,

సత్యమితి. ఏష బ్రహ్మణో దృష్టాంత ఆమ్నాతః, తత్ర శ్రుతా ద్వాచారంభణశబ్దాద్దార్ష్టాంతికేఽపి బ్రహ్మవ్యతిరేకేణ కార్యజాత స్యాభావ ఇతి గమ్యతే. పునశ్చ తేజోఽబన్నానాం బ్రహ్మకార్య తాముక్త్వా తేజోబన్న కార్యాణాం తేజోఽబన్నవ్యతిరేకేణాభావం బ్రవీతి 'అపాగాదగ్నేరగ్నిత్వం వాచారంభణం వికారో నామ ధేయం త్రీణి రూపాణీత్యేవ సత్య' (ఛాం 6-4-1) మిత్యాదినా. ఆరంభణశబ్దాదిభ్య ఇత్యాది శబ్దాత్ 'ఐతదాత్మ్యమిదం సర్వం' 'తత్సత్యం స ఆత్మా' 'త త్త్వమసి' (ఛాం 6-8-భా) 'ఇదం

---

మృత్తిక యనునది మాత్రము సత్యము. ఈ మృత్తికోదాహ రణము బ్రహ్మ విషయమై పఠింపబడుచున్నది. వాచారంభణ శ్రుతి దృష్టాంతమునందు వినవచ్చుచున్న యారంభణపదము చేత బ్రహ్మ వ్యతిరిక్తమగు కార్యజాతము లేదని దార్ష్టాంతిక మున దెలియుచున్నది. (3) మరియు తేజస్సు, జలములు, అన్నములు యీ మూడును బ్రహ్మమువలన బుట్టినవని శ్రుతి తెలియ చెప్పి ఆమూడింటివలనబుట్టినవన్నియువానికంటెవ్యతిరే కముగ లేవనియు చెప్పుచున్నది. "అగ్నియొక్క అగ్నిత్వబుద్ధి తొలగిపోయినది. అగ్నిరూపమగు కార్యము వాక్కుచే చెప్ప బడు నామమాత్రము. తేజోబన్నములను మూడురూపములు మాత్రము సత్యము" అని శ్రుతి పలుకుచున్నది. (4) 'ఈ ప్రపంచమంతయు సద్రాత్మచేతనే యాత్మవంత మగుచున్నది. ఏ యాత్మచే నీ ప్రపంచమంతయు నాత్మవంత మగుచున్నదో ఆట్టి సత్కారణమే సత్యము. అదియే జగమునకాత్మ. ఆ

సర్వంయదయమాత్మా' (బృ 2-6-6) 'బ్రహ్మైవేదం సర్వం' (ముం 2-2-11) 'ఆత్మైవేదం సర్వం' (ఛాం 7-25-2) 'నేహ నానాస్తి కించన' (బృ 4-4-10) ఇత్యేవమాద్యప్యాత్మైకత్వప్రతిపాదనపరం వచనజాతముదాహర్తవ్యమ్. న చాన్యథైకవిజ్ఞానేన సర్వవిజ్ఞానం సంపద్యేత, తస్మాద్యథా ఘటకరకాద్యాకాశానాం మహాకాశానన్యత్వం, యథా చ మృగతృష్ణికోదకాదీనామూషరాదిభ్యోఽనన్యత్వం దృష్టనష్టస్వరూపత్వాత్ స్వరూపేణ త్వను

---

సద్వస్తువే నీవగుచున్నావు; ఈప్రపంచమంతయు శ్రోతవ్యము మంతవ్యము నని చెప్పబడిన ఆత్మయే యగుచున్నది; యీ ప్రపంచమంతయు బ్రహ్మమే యగుచున్నది; ఈ జగమంతయు ఆత్మయే యగుచున్నది; ఏకరసమగు నీ బ్రహ్మమునం దేవిధమగు భేదములేదు' యీ మొదలగు ఆత్మయొక్క యేకత్వమును బోధించు వాక్యజాతమంతయు, ఆరంభణశబ్దాదిభ్యః అను స్థలమునందలి ఆదిశబ్దముచే నుదాహరింపతగియున్నది.

జగజ్జీవబ్రహ్మభేదము ఏకవిజ్ఞానశ్రుతికి విరుద్ధము.

(౫) మఱియొకవిధమున అనగా జగజ్జీవులు బ్రహ్మముకంటె వేఱను పక్షమున ఏకవిజ్ఞానముచే సర్వవిజ్ఞానము సాధ్యము కాదు. అందువలన, ఘటమునందును, వడగళ్ళయందుండు ఆకాశము మహాకాశముకంటె భిన్నముకానట్లే. ఎండమావులయందలి ఉదకము ఊషరక్షేత్రముకంటె భిన్నముకానట్లే. [ఎండమావులయందలి ఉదకములు పైకి కాన్పించుచున్నవి. దగ్గఱకు పోయినపుడు నష్టమగుచున్నవి. కనుక స్వరూపముచే వానిని నిశ్చయింప శక్యము

పాఖ్యత్వాత్, ఏవమస్య భోక్తృభోగ్యాదిప్రపంచజాతస్య బ్రహ్మ వ్యతిరేకేణాభావ ఇతి ద్రష్టవ్యం.

పూ. పక్షీ : నన్వనేకాత్మకం బ్రహ్మ యథా వృక్షోఽనేకశాఖః ఏవమనేకశక్తి ప్రవృత్తియుక్తం బ్రహ్మ. అత ఏకత్వం చోభయమపి సత్యమేవ, యథా వృక్ష ఇత్యేకత్వం శాఖా ఇతి చ నానాత్వం; యథా వా సముద్రాత్మనైకత్యం ఫేనతరంగాద్యాత్మనా నానాత్వం యథా చ మృదాత్మనైకత్వం ఘటశరావాద్యాత్మనా నానాత్వం, తత్రైకత్వాంశేన జ్ఞానాన్మోక్షవ్యవహారస్సేత్స్యతి, నానాత్వాంశేన తు

---

కాదు]. పైకి కాన్పించుచున్న యీ భోగ్యభోక్తృ జాతమంతయు బ్రహ్మముకంటె వ్యతిరేకముగ నుండజాలదని గ్రహించదగును.

పూ. పక్షి : ఒకటిగానున్నను అనేక శాఖలతో కాన్పించుచున్న వృక్షమువలె బ్రహ్మ మనేకస్వరూపములు గలిగియున్నది. అనేకములగు శక్తులు వానికనురూపములగు ననేక ప్రవృత్తులు కలిగియున్నది. కనుక బ్రహ్మమనేకము, ఏకముగూడ నగుచున్నది యనుట సత్యము. వృక్షము అని చెప్పినపు డేకత్వము, శాఖలు అని చెప్పినపు డనేకత్వము తెలియుచున్నది. సముద్రమా రూపమున నొక్కటియే: ఫేన తరంగ రూపమున యనేకము. మృత్తు మృత్స్వరూపముచే ఏకము; ఘటశరావాది రూపముచే అనేకము. అటులనే బ్రహ్మ మొక్కటియే యను జ్ఞానముచే మోక్షసిద్ధియు, అనేకమను జ్ఞానముచే కర్మకాండము నాశ్రయించియున్న లౌకికవ్యవహార

కర్మకాండాశ్రయో వైదికో లౌకికశ్చ వ్యవహారస్సేత్స్యతి, 'ఏవం చ మృదాది దృష్టాంతా అనురూపా భవిష్యంతీతి.

సిద్ధాంతీ : నైవం స్యాత్. 'మృత్తికేత్యేవసత్య' మితి ప్రకృత మాత్రస్య దృష్టాంతే సత్యత్వావధారణాత్, వాచారంభణశబ్దేన చ వికారజాతస్యానృతత్వాభిధానాత్, దార్ష్టాంతికేఽపి 'ఐతదాత్మ్య మిదం సర్వం' 'తత్సత్య' మితి చ పరమకారణస్యైవైకస్య సత్యత్వావధారణాత్ 'స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో' ఇతి చ శారీరస్య బ్రహ్మభావోపదేశాత్. స్వయం ప్రసిద్ధం హ్యేతచ్ఛారీరస్య

---

సిద్ధియు గల్గును. ఇట్లు గ్రహించినచో మృత్తు మొదలగు దృష్టాంతములు సంపూర్ణముగ ననురూపములగును.

సిద్ధాంతి : ఇట్లు భేదాభేదమును గ్రహించుట సరి కాదు. మృత్తికాదృష్టాంతమునందు వాక్కుచే నుపపాదింప బడి నామమాత్రములగు ఘటాది వికారజాతమంతయు ననృత మనియు కారణమగు మృత్తికయే సత్యమనియు ఏవశబ్దముచే నిర్ధారణ చేయబడుచున్నది. దార్ష్టాంతికమునందుకూడ ఇది యంతయు బ్రహ్మముచేతనే ఆత్మవంత మగుచున్నది అదియే సత్యము అని పరమ కారణమగు నొక్క బ్రహ్మము మాత్రము సత్యమని నిర్ధారణము సేయబడుచున్నది. అదియే ఆత్మ; ఓయి శ్వేతకేతూ! ఆ ఆత్మయే నీవగుచున్నావని, జీవబ్రహ్మ ముల కభేద ముపదేశింపబడుచున్నది. ఇట్టి జీవబ్రహ్మైక్యము స్వతఃసిద్ధమనియు జ్ఞానకర్మ సముచ్చయాద్యుపాసనాది ప్రియ

భేదాభేదము శ్రుతి విరుద్ధము.

బ్రహ్మాత్మత్వముపదిశ్యతే న యత్నాంతరప్రసాధ్యం, అతశ్చేదం శాస్త్రీయం బ్రహ్మాత్మత్వమవగమ్యమానం స్వాభావికస్య శారీరాత్మత్వస్య బాధకం సంపద్యతే రజ్జ్వాదిబుద్ధయ ఇవ సర్పాదిబుద్ధీనామ్. బాధితే చ శారీరాత్మత్వే తదాశ్రయస్సమస్తస్స్వాభావికో వ్యవహారో బాధితో భవతి, యత్ప్రసిద్ధయే నానాత్వాంశో ఽపరో బ్రహ్మణః కల్ప్యేత, దర్శయతి చ 'యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యే' (బృ. 4-5-25) దిత్యాదినా బ్రహ్మాత్వదర్శినం ప్రతి సమస్తస్యక్రియాకారకఫలలక్షణస్య వ్యవహారస్యాభావం. న చాయం వ్యవహారభావో ఽవస్థావిశేషనిబం

---

త్నాంతరములచే దెలిసికొనదగినది కాదనియుగూడ నుపదేశింపబడుచున్నది. కనుక జీవుడు బ్రహ్మాత్మస్వరూపుడనుటయె శాస్త్రసమ్మతమని యంగీకరించినచో అనాదియగు నవిద్యచే కల్పింపబడిన జీవునియొక్క స్వతంత్రవ్యక్తిత్వము బాధింపబడును. అనగా నట్టిభావమును త్రోసిబుచ్చవలసివచ్చును. రజ్జువను జ్ఞానము కలిగినవెంటనే సర్పబుద్ధి తొలగుచున్నది. జీవుడే ఆత్మయను భావము తొలగినవెంటనే బ్రహ్మమునకు నానాత్వము కల్పించిన అవిద్యానిమిత్తమగు వ్యవహారమంతయు బాధితమై తొలగును. 'ఏ స్థాయియందు బ్రహ్మవిదునకు నామరూపాదిక మంతయు నాత్మస్వరూపమే యగుచున్నదో, ఆ స్థాయియందు యే సాధనముచే దేనిని చూచును.' అని శ్రుతి పలుకుటవలన జీవబ్రహ్మైక్యజ్ఞానము గలవానికి క్రియాకారకఫల లక్షణమగు సర్వవ్యవహారము తొలగును. జ్ఞానావస్థయందు సర్వవ్యవహారలోపము,

ధనోఽభిషిచ్యత ఇతి యుక్తం వక్తుమ్, 'తత్త్వమసీ' తి బ్రహ్మాత్మ
భావస్యానవస్థావిశేషనిబంధనత్వాత్. తస్కరదృష్టాంతేన చానృ
తాభిసంధస్య మోక్షం దర్శయన్నేకత్వమేవైకం పారమార్థికం
దర్శయతి, (ఛాం. 6-16) మిథ్యాజ్ఞానవిజృంభితం చ నానాత్వం
ఉభయసత్యతాయాం హి కథం వ్యవహారగోచరోఽపి జంతురనృ
తాభిసంధ ఇత్యుచ్యతే? 'మృత్యోః స మృత్యుమాప్నోతి య ఇహ
నానేవ పశ్యతీ' తి (బృ. 4-4-16) చ భేదదృష్టిమపవదన్నేతదేవ

---

సంసారావస్థయం దద్దాని ప్రసక్తియు నంగీకరింపతగునన వీలు
లేదు. సర్వావస్థలయందు జీవుడు బ్రహ్మమే యగుచున్నా
డని తత్త్వమసి శ్రుతి పలుకుచున్నది. [చౌర్యనింద నారో
పింపబడినవాడు నిర్దోషుడైనచో కాలుచున్న యినుపగుం
డును బట్టుకొనికూడ తన నిర్దోషిత్వమును స్థాపించుకొన వెను
తీయడు. దోషియయినచో వెనుకాడును.] ఇట్టి చౌర్య-
దృష్టాంతముచేత అనృతమనగా నానాత్వమును వాదించు
వానికి బంధము, సత్యమనగా నేకత్వవాదికి మోక్షమును
ప్రదర్శించి జీవబ్రహ్మైక్యమే పరమార్థమని ఛాందోగ్య
శ్రుతి పల్కుచున్నది. నానాత్వమంతయు మిథ్యాజ్ఞాన విలసిత
మగుచున్నది. (7) నానాత్వము, ఏకత్వము రెండును పర
మార్థము లైనచో, జగత్సత్యత్వము నంగీకరించు మనుజు
డనృతత్వము నంగీకరించిన వారగుచున్నాడని శ్రుతియం దేల
చెప్పబడును? బ్రహ్మమునందు నానాత్వమును గ్రహించు
వాడు మృత్యుపరంపరావాతబడునని భేదదృష్టిని నిరసించుచు
శ్రుతి ఏకత్వమును ప్రదర్శించుచున్నది. (8) మఱియు నానా

దర్శయతి. న చాస్మిన్దర్శనే జ్ఞానాన్మోక్ష ఇత్యుపపద్యతే, సమ్యగ్జ్ఞానాపనోద్యస్య కస్యచిన్మిథ్యాజ్ఞానస్య సంసారకారణత్వేనానభ్యుపగమాత్. ఉభయసత్యతాయాం హి కథమేకత్వజ్ఞానేన నానాత్వజ్ఞానమపనుద్యత ఇత్యుచ్యతే.

పూ.పక్షీ: నన్వేకత్వైకాంతాభ్యుపగమే నానాత్వాభావాత్ ప్రత్యక్షాదీని లౌకికాని ప్రమాణాని వ్యాహన్యేరన్, నిర్విషయత్వాత్.

---

ద్వైతాద్వైతమతమునందు, జీవుడు బ్రహ్మము కంటె భిన్నుడు కాడను జ్ఞానముచేతనే మోక్షము సిద్ధించుట సంభవముగాదు. జీవబ్రహ్మలు భిన్నులను జ్ఞానము మిథ్యాజ్ఞానము. ఇట్టిమిథ్యాజ్ఞానము జీవబ్రహ్మలొకరను పరమార్థమగు నేకత్వజ్ఞానముచే తొలగగలదు. జీవబ్రహ్మలు భిన్నులను జ్ఞానముగూడ యథార్థజ్ఞానమే యయినచో, నిట్టి భేదజ్ఞానము, ఏకత్వజ్ఞానముచే తొలగనేరదు. నానాత్వమే సంసారకారణము. సంసారము తొలగనిది మోక్షము సిద్ధించదు. కనుక ఏకత్వజ్ఞానముచేత మోక్షము సిద్ధించునను శ్రుతివాక్యము నానాత్వముచే బాధితమగుచున్నది.

పూర్వపక్షి: ఏకత్వ మొక్కటియె నియతమగు యథార్థమని అంగీకరించినచో, నానాత్వమునకు తావులేదు. అపుడు ప్రత్యక్షానుమానాదిలౌకిక ప్రమాణములకు విషయములగు రూపశబ్దాదు లెవ్వియు లేకపోవును. అపుడు ప్రత్యక్షాది ప్రమాణములన్నియు పురుషుని జూచి స్థాణువని తలంచు భ్రమజ్ఞానమువలె నప్రమాణ లగుచున్నవి. [మందాంధకారమున

స్థాణ్వాదిష్వివ పురుషాదిజ్ఞానాని. తథా విధిప్రతిషేధశాస్త్రమపి భేదాపేక్షత్వాత్ తదభావే వ్యాహన్యేత, మోక్షశాస్త్రస్యాపి శిష్యశాసిత్రాదిభేదాపేక్షత్వాత్ తదభావే వ్యాఘాతస్స్యాత్, కథం చానృతేన మోక్షశాస్త్రేణ ప్రతిపాదితస్యాత్మైకత్వస్య సత్యత్వముపపద్యేతేతి.

సిద్ధాంతీ : అత్రోచ్యతే— నైష దోషః, సర్వవ్యవహారాణామేవ ప్రాగ్బ్రహ్మాత్మతావిజ్ఞానాత్ సత్యత్వోపపత్తేః, స్వప్నవ్యవహార

---

జూచిన స్థాణువు పురుషుడను భ్రమజ్ఞానము యథార్థజ్ఞానముచే నప్రమాణమగుచున్నది] అటులనే భేదము నాధారముచేసికొని యేర్పడిన విధినిషేధశాస్త్రమంతయు భేదాభావపక్షమున నిరర్థక మగును. శిష్యుడు, శాసించు ఆచార్యుడు మొదలగు భేదమును కోరు మోక్షశాస్త్రముగూడ శిష్యాచార్యభేదము లేనపుడు నిష్ప్రయోజన మగును. మోక్షశాస్త్ర మంతయు ననృతమైనచో, నద్దానిచే నుపదేశింపబడు జీవాత్మైకత్వ మెటుల సత్యము కాగలదు ?

సిద్ధాంతి ; ఇందుకు సమాధానము చెప్పుచున్నాము ఇది యొక దోషము కాదు. (9) జీవబ్రహ్మాలొకటియే యను జ్ఞానము కలుగనంతవరకు, సర్వవ్యవహారము సత్యమే యగుచున్నది. అనగా నబాధితమే యగుచున్నది. నిదురనుండి లేవనంతవరకు స్వప్నానుభవమంతయు సత్యమే యగుచున్నది. నిదుర లేచినపుడే స్వప్న మసత్యమని తెలిసికొనుచున్నాము] ఆత్మైకత్వము సత్యమను జ్ఞానము గలుగనంతవరకు ప్రత్యక్షాదులు ప్రమాణములు, రూపశబ్దాదులు వానిచే తెలిసికొన

స్యైవ ప్రాగ్బోధాత్. యావద్ధి న సత్యాత్మైకత్వప్రతిపత్తిస్తావత్ప్రమాణప్రమేయఫలలక్షణేషు వికారేష్వనృతబుద్ధిర్న కస్యచిదుత్పద్యతే, వికారానేవ త్వహం మమేత్యవిద్యయా ఆత్మాత్మీయభావేన సర్వో జంతుః ప్రతిపద్యతే స్వాభావికీం బ్రహ్మాత్మతాం హిత్వా, తస్మాత్ ప్రాగ్బ్రహ్మాత్మతా ప్రబోధాదుపపన్నః సర్వో లౌకికో వైదికశ్చ వ్యవహారః. యథా సుప్తస్య ప్రాకృతస్య జనస్య స్వప్నే ఉచ్చావచాన్ భావాన్పశ్యతో నిశ్చితమేవ ప్రత్యక్షాభిమతం జ్ఞానం భవతి ప్రాక్ ప్రబోధాత్, న చ ప్రత్యక్షాభాసాభిప్రాయస్తత్కాలే భవతి తద్వత్.

---

దగినవి, వానిని తెలిసికొనుటచే నిష్టఫలము సంప్రాప్తమగుచున్నది యను మొదలగు వికారరూపమగు వ్యవహారమునందేరికిని అప్రమాణబుద్ధి కలుగ నేరదు.

వ్యవహారమంతయు బ్రహ్మజ్ఞానపూర్వకాలికము.

అశేషజనము యథార్థమగు బ్రహ్మాత్మభావమును గమనించలేక నవిద్యచే ఇది నేను ఇది నాది యను యభిమానముచేతనే వికారముల నన్నిటిని తాదాత్మ్యభావముచే గ్రహించుచున్నది. అందువలన లౌకిక వైదిక వ్యవహారమంతయు బ్రహ్మాత్మత్వజ్ఞానమునకు పూర్వముపపన్న మగుచున్నది. స్వప్నమునందు కాన్పించు న్యూనాధిక భావములు నిశ్చయములనియే అజ్ఞానిజనము నిదురలేచు నంతవరకు తలంచును. ఆయనుభవములు ప్రత్యక్షాభాసములను భావ మిసుమంతయు నక్కాలమున లేదు. ఆతీరుననే లౌకిక వైదిక వ్యవహారములను గూర్చిగూడ నెఱుంగవలయును.

పూ. పక్షీ: కథం హ్యసత్యేన వేదాంతవాక్యేన సత్యస్య బ్రహ్మాత్మత్వస్య ప్రతిపత్తిరుపపద్యేత, న హి రజ్జుసర్పేణ దష్టో మ్రియతే, నాపి మృగతృష్ణికాంభసాఽవగాహనపానాదిప్రయోజనం క్రియత ఇతి.

సిద్ధాంతీ : నైష దోషః, శంకావిషాదినిమిత్తమరణాదికార్యోపలబ్ధేః. స్వప్నదర్శనావస్థస్య చ సర్పదంశనోదకస్నానాదికార్యదర్శనాత్. తత్కార్యమప్యనృతమేవేతి చేత్ బ్రూయాత్, తత్ర బ్రూమః—

---

పూ. పక్షి: భేదాభావపక్షమున శిష్యాచార్య భేదమును కోరు వేదాంతశాస్త్ర మంతయు నసత్యమగుచుండ, నద్దానిచే సత్యమగు బ్రహ్మాత్మైక్యభావ మెట్లు కలుగగలదు? రజ్జువు సర్పమను భ్రాంతిజ్ఞానము గలా డెవ్వడును దానిచే కాటునొందుటగాని మరణించుటగాని సంభవింపదు గదా! మృగతృష్ణికలోని జలమునం దెవ్వడును స్నానము చేయుటగాని దాహశాంతి చేసికొనుటగాని కలుగదు.

సిద్ధాంతి: ఇదియు నొక దోషము కాదు. (10) లోకమునందు రజ్జుసర్ప భ్రాంతుడగువాడు సర్పదష్టుడయినటుల భ్రాంతిచెంది విషాదిభీతిచే మరణించుట చూచుచున్నాము. స్వప్నమునందు సర్పదంశనము, మృగతృష్ణోదక స్నానాదికార్యము సంభవించుట చూచుచున్నాము. అసత్యమునుండి సత్యమగు కార్యము జనించదను నియమము లేదు. ఇట్టికార్యము గూడ ననృతమేయని యంటి రేని సమాధానము చెప్పెదము. స్వప్నావస్థయం దున్నవాని రజ్జుసర్పదంశనము, మృగతృష్ణో

అసత్యజ్ఞానముచే సత్యజ్ఞానము కలుగవచ్చును

యద్యపి స్వప్నదర్శనావస్థస్య సర్పదంశనోదకస్నానాదికార్య మనృతం తథాపి తదవగతిః సత్యమేవ ఫలం ప్రతిబుద్ధస్యాప్య బాధ్యమానత్వాత్. న హి స్వప్నాదుత్థితః స్వప్నదృష్టం సర్ప దంశనోదకస్నానాదికార్యం మిథ్యేతి మన్యమాన స్తదవగతిమపి మిథ్యేతి మన్యతే కశ్చిత్. ఏతేన స్వప్నదృశోఽవగత్యబాధనేన దేహమాత్రాత్మ వాదో దూషితో వేదితవ్యః. తథాచ శ్రుతిః. 'యదా కర్మసు కామ్యేషు స్త్రియం స్వప్నేషు పశ్యతి. సమృద్ధిం తత్రజా నీయా త్తస్మిన్ స్వప్ననిదర్శన' (ఛాం. 5-2-9) ఇత్య సత్యేన స్వప్నదర్శనేన సత్యాయాః ఫలసమృద్ధేః ప్రాప్తిం దర్శయతి.

---

దకస్నానము మొదలగుకార్యము లనృతములే యగుచున్నవి. వాని యనుభవఫలము అనగా స్వప్నానుభవ జ్ఞానము నిజమే యగుచున్నది. నిదుర లేచినతరువాతగూడ నీస్వాప్నికానుభవ జ్ఞానము బాధితమగుటలేదు. స్వప్నమునుండి మేల్కాంచినవా డెవ్వడును సర్పదంశనోదకస్నానాదకము మిథ్యయని తలంచి నను, తద్విషయక జ్ఞానము మిథ్యయని తలంచుటలేదు. [తన కిట్టి స్వప్నము కలిగినదనియే ప్రబోధానంతరము తలంచు చున్నాడు.] ఇట్లు స్వప్నదర్శనజ్ఞాన మసత్యమగు స్వప్నదర్శన ముచే నబాధిత మగుచున్నది. [కనుక జ్ఞానము దేహముకంటె వ్యతిరిక్త మగుచున్నది] దీనివలన దేహమే యాత్మయను చార్వాకవాదము దూషితమగుచున్నది యని తెలిసికొనతగును. "స్వప్నమునందు సుమంగలీదర్శనమైన కోరిన ఫలసిద్ధి యగు నని దెలిసికొన గలరు" అనుశ్రుతివాక్యమువలన అసత్యమగు స్వప్నదర్శనముచే సత్యమగు ఫలము సిద్ధించునట్లు తెలియు

తథా ప్రత్యక్షదర్శనేషు తేషువిదన్నిష్టేషు జాతేషు 'న చిరమివ జీవిష్యతీతి విద్యా'దిత్యుక్త్వా 'అథ స్వప్నాః పురుషం కృష్ణం కృష్ణదంతం పశ్యతి స ఏనం హంతి' త్యాదినా తేన తేనాసత్యేనైవ స్వప్నదర్శనేన సత్యం మరణం సూచ్యత ఇతి దర్శయతి. ప్రసిద్ధం చేదం లోకేఽన్వయ వ్యతిరేకకుశలానామీదృశేన స్వప్నప్రదర్శనేన సాధ్వాగమసూచ్యతే, ఈదృశేనాసాధ్వాగమ ఇతి. తథాఽకారాదిసత్యాక్షరప్రతిపత్తిర్దృష్టా రేఖానృతాక్షరప్రతిపత్తేః. అపిచాంత్యమిదంప్రమాణమాత్మైకత్వస్య ప్రతిపాదకం నాతః పరం కించిదాకాంక్ష్యమస్తి. యథా హి లోకే యజేతేత్యుక్తే కిం కేన కథ

---

చున్నది. మఱియు ప్రత్యక్షములగు సనిష్టశకునముచే పురుషుడు చిరకాలము జీవింపడని చెప్పి, స్వప్నమునందు కృష్ణదంతములతో కాన్పించు కృష్ణపురుషుని చూచినచో నాతడు స్వప్నద్రష్టను చంపునని స్వప్నశాస్త్రము చెప్పుచున్నది. ఇట్లసత్యమగు స్వప్న దర్శనముచే సత్యమగు మరణము సంప్రాప్తమగుచున్నట్లు కాన్పించుచున్నది. స్వప్నదర్శనముచే శుభపాపఫలములు సంప్రాప్తము లగుచున్నవని స్వప్నశాస్త్రకుశలులగు వారన్వయవ్యతిరేకముచే స్వప్నఫలముల నిరూపించుట లోకప్రసిద్ధము. అదేవిధముగ అనృతములగు అకారాది రేఖలచే సత్యములగు అకారాద్యక్షరజ్ఞానము గల్గుచున్నది. ఆత్మైకత్వ ప్రతిపాదనమునుగూర్చి వేదాంతములే చిట్టచివర ప్రమాణములు. వానితరువాత కోరతగిన దెద్దియును లేదు. [వానివలననే సంపూర్ణమగు తృప్తి కలుగుచున్నది. బ్రహ్మజ్ఞానావ్యాప్తికి పూర్వము లౌకికవ్యవహార లక్షణమగు

మిత్యాకాంక్ష్యతే నైవం 'తత్త్వమసీ'త్యుక్తే కించిదన్యదాకాంక్ష్యమస్తి, సర్వాత్మైకత్వ విషయత్వావగతేః. సతి హ్యన్యస్మిన్నవశిష్యమాణేఽర్థే ఆకాంక్షా స్యాత్, న త్వాత్మైకత్వవ్యతిరేకేణావశిష్యమాణోఽన్యోఽర్థోఽస్తి యః ఆకాంక్ష్యేత. న చేయమగవతిర్నోత్పద్యత ఇతి శక్యం వక్తుం, 'తద్ధాస్య విజజ్ఞౌ' (ఛాం. 6-16-3) విత్యాది శ్రుతిభ్యః, అవగతిసాధనానాం చ శ్రవణాదీనాం వేదానువచనాదీనాం చ విధీయమానత్వాత్. న చేయమవగతిరనర్థికా భ్రాంతిర్వేతి శక్యం వక్తుం. అవిద్యానివృత్తిఫలదర్శనాత్, బాధకజ్ఞానాంతరాభావాచ్చ. ప్రాక్చాత్మైకత్వావగతేరవ్యాహతస్సర్వ

---

నానాత్వము గోచరించినను, తత్త్వజ్ఞానానంతర మేకత్వబుద్ధిమాత్రమే నిలుచును.] లోకమునందు యజ్ఞము చేయవలయునన్న దేనిని చేయవలెను, ఏ విధానముచే చేయవలయును, ఏ సాధనముచే చేయవలయును అను ప్రశ్నలు కలుగుచున్నవి. (11) నీవే ఆ బ్రహ్మమగుచున్నావు, నేను బ్రహ్మమునగుచున్నానని చెప్పినపుడు, యితర ప్రశ్న లెవ్వియును గలుగుటలేదు. ఈ వాక్యమువలన జ్ఞానముచే ప్రత్యగాత్మ పరమాత్మల కభేదజ్ఞానము కలుగుచున్నది. కోరదగిన విషయము మఱియొకటి మిగులుచుండగ, దానిని గూర్చిన యాకాంక్ష బుట్టును. కాని ఆత్మైకత్వమునకు వ్యతిరేకమై కోరతగిన విషయమెద్దియు మిగిలియుండలేదు. ఇట్టి ఆత్మైకత్వజ్ఞానము సంభవించదనుటకుగూడ శక్యముకాదు. 'శ్వేతకేతు తండ్రియొక్క యుపదేశమువలన దేహేంద్రియాది సముదాయముకంటె వేఱగు సద్రూపమును దెలిసికొనెను'

స్యత్యానృతవ్యవహారో లౌకికో వైదికశ్చేత్యవోచామ, తస్మా దంత్యేన ప్రమాణేన ప్రతిపాదితే ఆత్మైకత్వే సమస్తస్య ప్రాచీనస్య భేదవ్యవహారస్య బాధితత్వాన్నానేకాత్మక బ్రహ్మకల్పనావకాశోఽస్తి.

పూ. పక్షీ : నను మృదాదిదృష్టాంతప్రణయనాత్ పరిణామవత్

---

అని ఛాందోగ్య శ్రుతి చెప్పుచున్నది. శ్రవణమననాదులు, వేదాధ్యయనాదులు బ్రహ్మావగతిసాధనములుగ విధింపబడినవి. వీనిచే గల్గు బ్రహ్మజ్ఞానము అనర్థమనిగాని భ్రాంతియనిగాని యన శక్యముగాదు. వానిచే నవిద్య తొలగుచున్నది. ఈ జ్ఞానమును బాధించు జ్ఞానాంతర మెద్దియును లేదు. ఆత్మావగతికి పూర్వము సత్యానృతాత్మకమగు లౌకికవైదిక రూపమగు సర్వవ్యవహార మప్రతిహతముగ సాగుచున్నది యని యిదివరకే చెప్పియుంటిమి. అందువలన చిట్టచివరిదియగు వేదాంతవాక్యప్రమాణమువలన ఆత్మైకత్వ ముపదేశింపబడుచుండగ, అంతకు పూర్వమున్న యశేష భేదవ్యవహారము ఏకత్వజ్ఞానముచే బాధితమగుచున్నది. అపుడు బ్రహ్మము నానాత్వవిశిష్టమని కల్పించుట కవకాశము లేదు. [బ్రహ్మాత్మైకత్వజ్ఞానము గలుగుచుండ నానాత్వజ్ఞానము కలుగనేరదు.]

ఆత్మైకత్వజ్ఞానము సర్వవ్యవహార బాధకము.

పూర్వపక్షి : మృదాది దృష్టాంతముల జేర్కొనుట వలన బ్రహ్మము పరిణామ స్వభావము గలదని చెప్పటయుందే

బ్రహ్మ శాస్త్రస్యాభిమత మితి గమ్యతే, పరిణామినో హి మృదా దయోఽర్థా లోకే సమధిగతాః ఇతి.

సిద్ధాంతీ : నేత్యుచ్యతే 'స వా ఏష మహానజ ఆత్మాఽజరోఽమరోఽమృతోఽభయో బ్రహ్మ, (బృ. 4-4-25) స ఏ ష నేతి నేత్యాత్మా, (బృ. 3-9-26) అస్థూలమనణ్వ (బృ. 3-8-8) త్యాదిభ్యస్సర్వవిక్రియాప్రతిషేధశ్రుతిభ్యో బ్రహ్మణః కూటస్థత్వావగమాత్. నహ్యేకస్య బ్రహ్మణః పరిణామధర్మవత్త్వం తద్రహి

---

శాస్త్రతాత్పర్యముగ కాన్పించుచున్నది. మృదాది పదార్థములన్నియు పరిణామ స్వభావము గలవిగానే కాన్పించుచున్నవి.

సిద్ధాంతి : ఇది సరికాదని మేము పలుకుచున్నాము. [12] ఆ యీ యాత్మ జన్మవికారము లేనివాడు; జర లేనివాడు; మరణము లేనివాడు; సర్వవికారశూన్యుడు; భయవర్జితుడు; అతడే బ్రహ్మము "– ఆయాత్మ ఇది కాదు, ఇది కాదు, అని బుద్ధిగోచరమగు సర్వవస్తునిషేధముచే చూపబడుచున్నాడు.–" "ఆ బ్రిహ్మము స్థూలము కానిది, అణువు కానిది–" ఇట్లు సర్వవికారములను నిషేధించు శ్రుతి వాక్యములు బ్రిహ్మముయొక్క కూటస్థత్వమును అనగా నిర్వికారత్వమును బోధించుచున్నవి. పరిణామధర్మముయొక్క యునికి లేములు రెండు నొకేబ్రిహ్మమున నుండుట శక్యముగాదు. ఒకేవస్తు

శ్రుతులకు బ్రహ్మముయొక్క పరిణామమును బోధించుటయందు తాత్పర్యము లేదు.

తత్త్వం చ శక్యం ప్రతిపత్తుమ్. స్థితిగతివత్ స్యాదితి చేన్న, కూటస్థనిత్యేతి విశేషణాత్. నహి కూటస్థస్య బ్రహ్మణః స్థితిగతివదనేకధర్మాశ్రయత్వం సంభవతి. కూటస్థం చ నిత్యం బ్రహ్మ సర్వవిక్రియా ప్రతిషేధాదిత్యవోచామ. న చ యథా బ్రహ్మణ ఆత్మైకత్వదర్శనం మోక్షసాధనం, ఏవం జగదాకారపరిణామిత్వదర్శనమపి స్వతంత్రమేవ కస్మైచిత్ ఫలాయాభిప్రేయతే.

---

వున కొకప్పుడు సంచలనము మఱియొకప్పుడు నిశ్చలనము కలిగియున్నట్లు బ్రహ్మమునకు సృష్టికాలమునందు పరిణామిత్వము, ప్రలయకాలమునందది లేకపోవుటయు సంభవించగూడదా యనిశంకింప వీలులేదు. బ్రహ్మము కూటస్థుడని విశేషించి చెప్పబడుచున్నది. కూటస్థుడగు బ్రహ్మమునకు చలనాచలములవలె ననేకధర్మములు సంభవముకావు. [కూటమన అగసాలివాని యాభరణములు చేయు పట్టెడ, దానివలె బ్రహ్మము నిర్వికారమని కూటస్థశబ్దార్థము] బ్రహ్మమునందు సమస్తవికారములు నిషేధింపబడుటచే నాపరమార్థవస్తువు కూటస్థము, నిత్యము అని చెప్పియున్నాము. బ్రహ్మాత్మైకత్వజ్ఞానము మోక్షసాధనము అట్టిబ్రహ్మము జగదాకారమున పరిణామమును బొందినదియను జ్ఞానమునకు స్వతంత్రమగు ఫలమెద్దియు కానరాదు. అందుకు ప్రమాణము కానరాదు. [పరిణామాదులను మాత్రము తెలియచేయుచు ప్రత్యేకఫలమును బోధింపక ఫలబోధకములగు శ్రుతులతో జోడింపబడు శ్రుతులన్నియు
(13) ఫలబోధకములగు శ్రుతుల కంగమాత్రము

ప్రమాణాభావాత్.' కూటస్థబ్రహ్మాత్మైకత్వవిజ్ఞానాదేవ హి ఫలం దర్శయతి శాస్త్రం 'స ఏష నేతి నేత్యాత్మే' త్యుపక్రమ్య 'అభయం వై జనకప్రాప్తోఽసీ' (బృ. 4-2-4) త్యేవం జాతీయకమ్. తత్రై తత్సిద్ధం భవతి బ్రహ్మప్రకరణే సర్వధర్మవిశేషరహిత బ్రహ్మ దర్శనాదేవ ఫలసిద్ధౌ సత్యాం య త్తత్రాఫలం శ్రూయతే బ్రహ్మణో జగదాకారపరిణామిత్వాది తద్బ్రహ్మదర్శనోపాయత్వేనైవ విని యుజ్యతే, ఫలవత్సన్నిధావఫలంతదంగమితి వత్, న తు స్వతంత్రం ఫలాయ కల్ప్యేత ఇతి. న హి పరిణామవత్త్వవిజ్ఞానాత్

---

లగుచున్నవి. [కూటస్థ బ్రహ్మాత్మైత్వ జ్ఞానమునకుమాత్రమే శాస్త్రమునందు ఫలము కనుపడుచున్నది. ఆ ఆత్మ ఇది కాదు ఇది కాదు అని సర్వజ్ఞేయవస్తు ప్రతిషేధముతో నుప క్రమముచేసి ఓయి జనక నీ వభయమును బొందితివి యని శ్రుతి ప్రకరణము నుపసంహరించుచున్నది. సృష్ట్యాదివాక్యము లకు స్వార్థమునందు ప్రయోజనము లేకుండుటచే నీయర్థము సిద్ధమగుచున్నది. బ్రహ్మ ప్రకరణమునందు సమస్తధర్మ విదూరమగు బ్రహ్మజ్ఞానముచేతనే ఫలము సిద్ధించుచున్నది. ఫలము చెప్పబడని బ్రహ్మముయొక్క జగదాకార పరిణామ త్వాది బోధకములగు వాక్యములు బ్రహ్మజ్ఞానమున కుపాయములుగ మాత్రమువినియోగపడును. ఫలమును బోధించు వాక్యముల సన్నిధియందు వినబడు ఫలాభావము లగు వాక్యములు ఫలబోధకవాక్యముల కంగములగుచున్నవి. కాని అట్టివాక్యములకు స్వతంత్రమగు ఫలములేదు. [బ్రహ్మ

పరిణామబోధక శ్రుతులు ఫలశ్రుతులకంగములు

పరిణామప్రాప్తిరాత్మనః ఫలం స్యాదితి యుక్తం వక్తుం, కూటస్థనిత్యత్వాన్మోక్షస్య.

పూ.పక్షీ : నను కూటస్థబ్రహ్మాత్మవాదిన ఏకత్వైకాంత్యాదీశిత్రీశితవ్యాభావే ఈశ్వరకారణప్రతిజ్ఞా విరోధ ఇతి చేత్.

సిద్ధాంతీ: న, అవిద్యాత్మకనామరూపబీజ వ్యాకరణాపేక్షత్వాత్

---

విదాప్నోతి పరం (తై 2-1) అను ఫలబోధక వాక్యము వెంట వినబడుచు తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః అను మొదలగు సృష్టిబోధకములగు వాక్యములు ఫలబోధకములు కాకపోయినను ఫలభూతమగు బ్రహ్మను గ్రహించుటకుపకరించుచున్నవి], "తం యథా యథోపాసతే తదేవ భవతి" అతనిని యేయే విధముగా నుపాసింతురో ఆవిధముగా నుపాసకుడగును అను శ్రుతినిబట్టి] బ్రహ్మము పరిణామ స్వభావము గలదియను జ్ఞానమువలన అట్టి పరిణామము గలుగును. అదియే ఫలమనుట యుక్తము గాదు. బ్రహ్మము కూటస్థ నిత్యము [గాని పరిణామ నిత్యము గాదు.]

పూ. పక్షి : ఈశ్వరుడు జగత్కారణమని 1-1-2 సూత్రమున ఉదాహరింపబడినది. బ్రహ్మాత్మైక్యవాదమును బట్టి ప్రతిపాదింపబడు యేకత్వము పరమావధి యయినచో, శాసించువాడు, శాసింపబడునది యను భేదము తొలగుచున్నది. కనుక జగత్తున కీశ్వరుడు కారణమను వాదమునకు భంగము కలుగును.

సిద్ధాంతి : ఇట్లనుట సరికాదు. (14) అవిద్యాకల్పితములు నామరూపాత్మకములునగు జగదంకురముల నభివ్యక్తి

సర్వజ్ఞత్వస్య. 'తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః' (తై. 2-1) ఇత్యాదివాక్యేభ్యో నిత్యశుద్ధబుద్ధముక్తస్వరూపాత్ సర్వశక్తే రీశ్వరాజ్జగదుత్పత్తిస్థితిలయాః, నాచేతనాత్ ప్రధానా దన్యస్మాద్వేత్యేషోఽర్థః, ప్రతిజ్ఞాతో 'జన్మాద్యస్య యతః'(బ్ర.సూ. 1-1-4) ఇతి, సా ప్రతిజ్ఞా తదవస్థైవ న తద్విరుద్ధోఽర్థః పునరి హోచ్యతే, కథం నోచ్యతే అత్యంతమాత్మనః ఏకత్వమద్వితీ యత్వం చ బ్రువతా. శృణు యథా నోచ్యతే- సర్వజ్ఞస్యేశ్వర స్యాత్మభూతే ఇవావిద్యాకల్పితే నామరూపే తత్త్వాన్యత్వాభ్యా

---

చేయు సంబంధమున సర్వజ్ఞత్వ మాతనికి యుపదేశింపబడి నది. పరబ్రహ్మము నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావము, సర్వజ్ఞము, సర్వశక్తి మంతము. అట్టిబ్రహ్మమగు నీయాత్మవలన ఆకాశము సముత్పన్నమయినది (తై 2-1) యను మొదలగు శ్రుతివాక్యమునందు జగత్తుయొక్క జన్మ స్థితిలయములు సంభవించున్నవిగాని అచేతనమగు ప్రధానము వలనగాని మఱియొక దానివలనగాని యవి సంభవించుటలేదను యీ విషయము జన్మాద్యస్య యతః (1-1-2) అను సూత్ర మున ప్రతిపాదింపబడినది. ఆ ప్రతిపాదన మటులనేయున్నది. దానికి విరుద్ధముగ నే విషయము నిచట చెప్పుటలేదు. బ్రహ్మముయొక్క ఆద్యంతమగు నైక్యమును అద్వితీయత్వ మును గూడ శ్రుతి యుపపాదించుచుండ విరుద్ధ విషయమును చెప్పుటలేదని మీ రెట్లనగలరంటిరేని వినుడు. అవిద్యా కల్పితములగు నామరూపములు సర్వజ్ఞుడగు నీశ్వరునికి ఆత్మ

శాసితృశాసితవ్య భేదము పరమార్థము నందు లేదు.

మనిర్వచనీయే సంసారప్రపంచబీజభూతే సర్వజ్ఞస్యేశ్వరస్య మాయాశక్తిః ప్రకృతిరితి చ శ్రుతిస్మృత్యోరభిలప్యేతే, తాభ్యా మన్యస్సర్వజ్ఞ ఈశ్వరః 'ఆకాశో వై నామరూపయోర్నిర్వహితా తే యదంతరా తద్బ్రహ్మే'తి (ఛాం. 8-14-1) శ్రుతేః. 'నామ రూపేవ్యాకరవాణి' (ఛాం. 6-3-2) 'సర్వాణి రూపాణి విచిత్య ధీరః నామాని కృత్వాఽభివదన్ యదాస్తే' (తై.ఆ. 3-12-7) 'ఏకం బీజం బహుధా యః కరోతి' (శ్వే. 6-12) త్యాది శ్రుతిభ్యశ్చ. ఏవమవిద్యాకృతనామరూపోపాధ్యనురోధీశ్వరో భవతి. వ్యోమేవ

---

భూతములైనట్లు కాన్పించుచున్నవి. అవి జడములగుటవలన ఈశ్వరరూపము లన వీలు లేదు. వానికి ప్రత్యేకముగ యునికి గాని, స్ఫూర్తిగాని కాన్పించనందున ఈశ్వరునికంటె భిన్నము లని నిరూపింప శక్యముగాదు. కాని యవి సంసారరూపమగు ప్రపంచమునకు బీజభూతము లగుచున్నవి. సర్వజ్ఞుడగు ఈశ్వరుని యొక్క మాయాశక్తి ప్రకృతి యగుచున్నది. ఇటుల శృతి స్మృతులయం దుదాహరింపబడుచున్నది. ఈశ్వరుడు నామరూపములకంటె భిన్నుడు. ఆత్మయన్నను నామరూప ముల నభివ్యక్తముల జేయువాడు. ఆ నామరూపములు దేని మధ్య నున్నవో అది బ్రహ్మము: అని ఛాందోగ్యశృతి పలుకు చున్నది. "నామరూపముల నభివ్యక్తము చేయుదునుగాక; సర్వజ్ఞుడగు పరబ్రహ్మము రూపముల నన్నిటిని సృజియించి వానికి నామముల నేర్పరచి ఉచ్చరించును." "ఎవ్వడు ఒక బీజము ననేకప్రకారముల కల్పించెనో" ఈ మొదలగు శ్రుతులుగూడ సర్వజ్ఞుడగు నీశ్వరుడు నామరూపములకంటె

ఘటకరకాద్యుపాధ్యనురోధీ, స చ స్వాత్మభూతానేవ ఘటాకాశ స్థానీయానవిద్యా ప్రత్యుపస్థాపితనామరూపకృతకార్యకరణసంఘా తానురోధినో జీవాఖ్యానాత్మనః ప్రతిష్టే వ్యవహారవిషయే. తదేవ మవిద్యాత్మకోపాధి పరిచ్ఛేదాపేక్షమేవేశ్వరస్యేశ్వరత్వం సర్వ జ్ఞత్వం సర్వశక్తిత్వం చ న పరమార్థతో విద్యయాపాస్తసర్వో

---

కార్యము కారణముకంటె వేరుగా లేదు

భిన్నుడని పల్కుచున్నవి. ఇట్లు మహాకాశము ఘటము, వడగల్లు మొదలగు నుపాధులచే పరిచ్ఛిన్నమయినట్లు ఈశ్వరుడుగూడ అవిద్యా కల్పితములగు నామరూపాదులచే పరిచ్ఛిన్ను డగుచున్నాడు. అట్టి సర్వజ్ఞుడగు నీశ్వరుడు ఘటా కాశమును బోలి అవిద్యాప్రయుక్తము, నామరూపకల్పితము నగు కార్యకరణ సంఘాతముచే పరిచ్ఛిన్నులు, స్వాత్మస్వరూ పులు, జీవులను పేరిట విఖ్యాతులునగు విజ్ఞానాత్మలకు వ్యవ హారమునందు శాసనకర్త యగుచున్నాడు. [ఉపాధిభూతము లగు శరీరము లనేకములగుటచే జీవులని యిచట బహువచ నము వాడబడినది. కాని జీవుడొక్కడే. ఈశ్వరుడు బింబ భూతుడు, జీవులు ప్రతిబింబభూతులు గనుక బింబమును ప్రతి బింబమును శాసించినట్లే ఈశ్వరుడు జీవులను శాసించు చున్నాడు]. కనుక నవిద్యాకల్పితములగు నుపాధులచే కల్పింప బడిన పరమతత్త్వమునుబట్టి యీశ్వరునికి యీశ్వరత్వము సర్వజ్ఞత్వము సర్వశక్తిమత్త్వము తటస్థించుచున్నవిగాని యవి పరమార్థములు కావు. [నిత్యశుద్ధబుద్ధముక్తత్వము పర మాత్మయొక్క స్వరూపలక్షణము. సర్వజ్ఞత్వాదులు తటస్థ

పాధిస్వరూపే ఆత్మనీశ్రితిశితవ్య సర్వజ్ఞత్వాదివ్యవహార ఉప పద్యతే. తథా చోక్తం 'యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమే'తి, (ఛాం. 7-24-1) యత్రత్వస్య సర్వ మాత్మైవాభూ త్తత్కేన కం పశ్యే' (బృ. 4-5-25) దిత్యాదినా చ. ఏవం పరమార్థావస్థాయాం సర్వవ్యవహారాభావం వద న్తి వేదాంతాః, తథేశ్వరగీతాస్వపి 'న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః, న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే.

---

లక్షణము]. యదార్థజ్ఞానముచే నుపాధికల్పితములగు స్వరూ పములు తొలగిన పరమార్థదశయందు, శాసించువాడు, శాసింపబడునది, సర్వజ్ఞుడు సర్వశక్తుడు మొదలగు వ్యవహార మాత్మయందు లేదు. "ఏ తత్త్వజ్ఞానస్థితియం దొకడు మఱి యొకదానిని జూడడో, మఱియొకదానిని వినడో, మఱియొక దానిని దెలిసికొనడో అదియె భూమము అని ఛాందోగ్యశ్రుతి పల్కుచున్నది." [భూమబ్రహ్మశబ్దము లేకార్థకములై యొకే వస్తువును బోధించుచున్నవి]. "సర్వ మాత్మయే యగు స్థాయియందు దేనిని యేసాధనముచేత చూడగలడు ?" ఇత్యాదిశ్రుతు లాత్మయొక్క నిరుపాధిక స్వరూపమును బోధించుచున్నవి. ఇట్లు సమస్తవేదాంతములు పరమార్థ మునందు దశేషవ్యవహారముయొక్క లేమినే ప్రదర్శించుచున్నవి. ఆత్మ దేహేంద్రియాది సముదాయమునకు కర్తృత్వమును గాని, కర్మలనుగాని, కర్మఫలానుసంధానమునుగాని సృజి యింపడు; అవిద్యయే కర్తృత్వాదిరూపమున బ్రవర్తించు చున్నది. ఈశ్వరు డెవ్వనిపాపమును గ్రహింపడు. పుణ్య

నాదత్తే కస్యచిత్పాపం నచైవ సుకృతం విభుః, అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః' (గీ. 5-14) ఇతి పరమార్థావస్థాయామీశిత్రీశితవ్యాదివవ్యహారాభావః ప్రదర్శ్యతే. వ్యవహారావస్థాయాం తూక్తః శ్రుతావపీశ్వరాదివ్యవహారః. 'ఏష సర్వేశ్వర ఏష భూతాధిపతిరేషభూతపాల ఏష సేతుర్విధరణఏషాం లోకానామసంభేదాయే'తి. (బృ. 4-4) తథేశ్వరగీతాస్వపి 'ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి. (గీ. 18-62) భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయే'తి, సూత్రకారోఽపి పరమార్థాభిప్రాయేణ తదనన్యత్వమిత్యాహ, వ్యవహారాభిప్రాయేణ

---

కర్మను స్వీకరింపడు. అజ్ఞానముచేత జ్ఞానమావరింపబడియున్నది. అందువలన మూఢులగు మనుజులు మోహమును జెందుచున్నారు. అను గీతావాక్యములు పరమార్థమునందు శాసితృ శాసితవ్యాది వ్యవహారము లేదనియే ప్రదర్శించుచున్నవి. వ్యవహారావస్థయం దీశ్వరాదివ్యవహారమున్నట్లు "ఈతడు సర్వేశ్వరుడు, ఇతడే జంతువులకెల్ల ప్రభువు; ఈతడే వర్ణాశ్రమాది ధర్మముల స్సాంకర్యము చెందకుండ నిలుపునట్టి ఆనకట్ట" అను శ్రుతి తెలియచెప్పుచున్నది. "సర్వనియంతయగు నారాయణుడు జంతువుల హృదయస్థానము నధిష్ఠించి యంత్రారూఢములగు దారువిగ్రహములనువలె మాయచే త్రిప్పుచున్నాడను గీతావాక్యముగూడ నీయర్థమునే చెప్పుచున్నది. సూత్రకారులుగూడ పరమార్థావస్థయందుమాత్రమే కార్యకారణముల కనన్యత్వమును జెప్పిరి. వ్యవహారమును

తు స్యాల్లోకవదితి మహాసముద్రాదిస్థానీయతాం బ్రహ్మణః కథయతి, అప్రత్యాఖ్యాయైవ కార్యప్రపంచం పరిణామప్రక్రియాంచాశ్రయతి సగుణోపాసనేషూపయోక్ష్యత ఇతి.

## భావే చోపలబ్ధేః (సూ. 15)

ఇతశ్చ కారణాదనన్యత్వం కార్యస్య, యత్కారణం భావ ఏవ కారణస్య కార్యముపలభ్యతే నాభావే. తద్యథా సత్యాం మృది ఘటః ఉపలభ్యతే. సత్సు చ తంతుషు పటః. న చ నియ

---

బట్టి "లోకమునందువలె" యని పూర్వసూత్రమున బ్రహ్మమునకు సముద్రోపమానమును వచియించెను. సగుణోపాసనములయం దుపయోగించునను తలంపుతో కార్యప్రపంచమును నిరాకరింపకయే పరిణామప్రక్రియ నాశ్రయించెను. 14

అ॥ లోకమునందు ప్రత్యక్షముగ కాన్పించు సముద్రాద్యుదాహరణముచే కార్యకారణముల కనన్యత్వము సిద్ధాంతము చేయబడినది. రాబోవు సూత్రమున అనుమానప్రమాణముచే నీవిషయము నిశ్చయింపబడుచున్నది.

భావేచ=కారణమగు బ్రహ్మము ఉన్నపుడే ఉపలబ్ధేః=కార్యమగు ప్రపంచము ఉపలబ్ధమగుటవలన కారణమునకు వ్యతిరేకముగ కార్యములేదు.

వివరింపబోవు కారణమువలన గూడ కార్యము కారణముకంటె ననన్యమగుచున్నది. కారణమున్నపుడే ఆకారణముయొక్క కార్యముపలబ్ధమగునుగాని లేనపుడు కానేరదు. అది యెట్లన మృత్తిక ఉన్నపుడే ఘట ముప

మేనాన్యథాభావేఽన్యస్యోపలబ్ధిర్దృష్టా. నహ్యశ్వో గోరన్యస్సన్ గోర్భావఏవోపలభ్యతే. న చ కులాలభావఏవ ఘట ఉపలభ్యతే సత్యపి నిమిత్తనైమిత్తికభావేఽన్యత్వాత్.

---

లభ్యమగుచున్నది. దారములున్నపుడు వస్త్ర ముపలభ్యమగుచున్నది. [ఘటపటములు మృత్తంతువులకంటె భిన్నములుగావు]. ఒకవస్తు వున్నపుడు మాత్రమే మఱియొకవస్తువుపలబ్ధమగునను నియమములేదు. అనగా ఘటపటముల మృత్తంతువులకంటె భిన్నములైనచో, మృత్తు ఉన్నపుడే ఘటముపలబ్ధము కావలెననికాని, తంతువు లున్నపుడే పట ముపలబ్ధము కావలెనినిగాని, నియమ ముండదగదు. గోవుకంటె భిన్నమగు నశ్వము గోవున్నపుడుమాత్రమే కాన్పించుట లేదు. కులాలుడు నిమిత్త కారణము ఘటము

కార్యకారణముల కభేదము అనుమాన సిద్ధము

నైమిత్తికము అనగా కార్యము అయినను ఆరెండును వేఱగుటవలన కులాలు డున్నపుడుమాత్రమే కార్యమగు ఘటముండుట లేదు, అతడు లేకపోయినను ఘట ముండును. కనుక మృత్తునకును ఘటమునకును కేవల కారణకార్యభావ ముండుటయెగాక నభేదభావముగూడ నున్నట్లూహింపవలయును [అనగా నుపాదానకారణ మున్నంతకాలము మాత్రమే నద్దాని కార్యముండును.]

పూ. పక్షీ: నన్వస్యాభావేఽప్యస్యోపలబ్ధిర్నియతా దృశ్యతే, యథాఽగ్న్యభావే ధూమస్యేతి.

సిద్ధాంతీ: నేత్యుచ్యతే, ఉద్వాపితేఽప్యగ్నౌ గోపాలఘుటికాదిధారితస్య ధూమస్య దృశ్యమానత్వాత్.

పూ. పక్షీ: అథ ధూమం కయాచిదవస్థయా విశింష్యాత్ ఈదృశో ధూమో నాసత్యగ్నౌ భవతీతి.

సిద్ధాంతీ: నైవమపి కశ్చిద్దోషః, తద్భావానురక్తాం

---

పూ. పక్షి. కారణమున్నపుడు కార్యము నియతముగా కాన్పించుచున్నది. అగ్ని యున్నపుడెల్లను, ధూమముండును [కారణమున్నపుడు కార్యమున్నంతమాత్రముచేత రెంటికిని యనన్యత్వమును చెప్పశక్యముకాదు]

సిద్ధాంతి: అటులకాదు. అగ్ని చల్లారినను, కార్యమగు ధూమము గోపాలుల తిత్తియందు నిలువజేయబడి కాన్పించుచున్నది.

పూ. పక్షి: అటులయినచో యేదో యొక విశేషణముతో గూడుకొనిన ధూమము కారణమగు అగ్నియున్నపుడు మాత్రమే యుపలబ్ధమగుచున్నదియని యందుము గాక! [కట్టెలతో సంబంధము గలిగిన నద్దానినుండి యెడతెగని ధారగా పారుచున్న ధూమము అగ్నియున్నపుడు యుపలబ్ధమగుచున్నదని యందుము.]

సిద్ధాంతి: అపుడుగూడ మీ వాదము సరికాదు, కారణముతో సంబంధించిన కార్యజ్ఞానముతోపాటు కారణ

హి బుద్ధిం కార్యకారణయోరనన్యత్వే హేతుం వయం వదామః, న చాసా వగ్నిధూమయోర్విద్యతే—

భావాచ్చోపలబ్ధేరితి వాసూత్రమ్, న కేవలంశబ్దాదేవ

---

జ్ఞానము గూడ సంభవించినపుడే కార్యకారణముల కనన్యత్వము చెప్పదగునని మా వాదము. [ఘటమును చూచినపుడు మృత్తికాజ్ఞానముగూడ కలుగుచున్నది. అందువలన మృత్తికాఘటము లనన్యమని చెప్పుదుము. తిత్తిలోని ధూమమును జూచినపుడు డద్దానికారణమగు అగ్నియొక్క జ్ఞానము కలుగుట లేదు. కనుక ధూమాగ్ను లనన్యమని చెప్ప వీలు లేదు. కారణ కార్యజ్ఞానములు రెండును కలిసి సంభవించినపుడే వాని యనన్యత్వమును చెప్ప శక్యము.] ఇట్టి కారణ కార్య జ్ఞానముల సహోత్థానము అగ్నిధూమ స్థలమునందు సంభవించుట లేదు.

భావాచ్చోపలబ్ధేః అని గూడ నీ సూత్రమునకు పాఠాంతరము గలదు. [ఆ పక్షమున భావాత్ = కారణము ప్రత్యక్షముగ కాన్పించుటవలన ఉపలబ్ధేః = కార్యము కాన్పించుచున్నది, అందువలన కార్యకారణముల కనన్యత్వము చెప్పదగునని సూత్రార్థ మగుచున్నది. అప్పుడు పూర్వసూత్రమునం దుదాహరింపబడిన అనన్యత్వకారణమగు ఆరంభణ శబ్దములతోపా టిచట కారణాంతరము చెప్పబడుచున్నది].

శ్రుతిగతమగు వాచారంభణ శబ్దముచేతనే గాక ప్రత్యక్షముగ కాన్పించుటవలన గూడ, కార్యకారణముల

కార్యకారణయోరనన్యత్వం, ప్రత్యక్షోపలబ్ధిభావాచ్చ తయోర నన్యత్వమిత్యర్థః. భవతి హి ప్రత్యక్షోపలబ్ధిః కార్యకారణయో రనన్యత్వే. తద్యథా—తంతుస్థానే పటే తంతువ్యతిరేకేణ పటో నామకార్యం నైవోపలభ్యతే, కేవలాస్తు తంతవః ఆతానవితాన వంతః ప్రత్యక్షముపలభ్యంతే, తథా తంతుష్వంశవోఽంశుషు తద వయవాః, అనయా ప్రత్యక్షోపలబ్ధ్యా లోహితశుక్లకృష్ణాని త్రీణి రూపాణి తతో వాయుమాత్రమాకాశమాత్రం చేత్యనుమేయం,

---

కనన్యత్వము చెప్పదగునని సూత్రార్థము. కార్యకారణముల యనన్యత్వము ప్రత్యక్షముగ నుపలబ్ధమగు చున్నది; అది యెట్లన, తంతువుల కూడలియే రూపముగాగల వస్త్రమునందు తంతువుల కంటె వ్యతిరేకమగు వస్త్రమను నొకకార్య ముపలబ్ధమగుట లేదు. పడుగు పేక నేయబడిన తంతువులుమాత్రి ముప లబ్ధములగుచున్నవి. అటులనే తంతువులయందు వాని యవ యవములగు సూక్ష్మతర తంతువులు కాన్పించుచున్నవి. తంతువులు వాని సూక్ష్మతరావయవములకంటె నన్యము గావు: అటులనే ప్రిత్యక్షోపలబ్ధిచే అగ్ని, లోహిత, శుక్ల, కృష్ణ రూపములకంటె భిన్నము గాదనియు, యీ రూపములు వాయు మాత్రిమనియు, వాయు వాకాశమాత్రిమే యనియు ఆకాశము బ్రిహ్మానన్యమనియు, బ్రహ్మమేకము, అద్వితీయ మనియు నూహింపతగును? [స్పష్టముగ కాన్పించు తంతుపట స్థలమున ప్రిత్యక్షప్రిమాణముచేతను, స్పష్టముగ కాన్పింపని అగ్న్యాదులయం దనుమానప్రిమాణములచేతను కార్యకార

సూత్రమునకు అర్థాంతరము.

(ఛాం. 6-4) తతః పరంబ్రహ్మైకమేవాద్వితీయం, తత్ర సర్వ ప్రమాణానాం నిష్ఠా మవోచామ.

## సత్త్వాచ్చావరస్య (సూ. 16)

ఇతశ్చ కారణాత్కార్యస్యానన్యత్వం. యత్కారణం ప్రాగుత్పత్తేః కారణాత్మనైవ కారణే సత్త్వమపరకాలీనస్య కార్యస్య శ్రూయతే 'సదేవ సోమ్యేదమగ్రఆసీత్, ఆత్మా వా ఇద

---

ణముల అనన్యత్వమును గ్రహింపదగునని తాత్పర్యము.] అందువలననే సర్వప్రమాణములు పరమకారణమగు బ్రహ్మ మొక్కదానినే తెలియచేయుచున్నవనియు ప్రధానాదీతర కారణములను దెలియచేయువనియు చెప్పియుంటిమి. 15

అ॥ కార్యకారణముల కనన్యత్వము మఱియొక విధముగ సాధించుచున్నారు.

అవరస్య = కార్యరూపమగు ప్రపంచము ఉత్పత్తికి పూర్వము కారణరూపమునందు సత్వాత్ = ఉండుటవలన గూడ కార్యకారణములకు అనన్యత్వమును అంగీకరింపవలెను.

చెప్పబోవు హేతువువలన గూడ కారణముకంటె కార్యమనన్య మగుచున్నది. ఉత్పన్నమగు కార్య ముత్పత్తికి పూర్వము కారణస్వరూపమున కారణమునందే యున్నది యని శ్రుతి చెప్పుచున్నది "ఓయి ప్రియదర్శన : పరిదృశ్యమానమగు నీజగత్తు ఉత్పత్తికి పూర్వము సత్తుగా నుండెను. మొదట ఇది ఆత్మ అయి ఒక్కటిగానే యుండెను" ఈ మొదలగు

కార్యము కారణము నందున్నది.

మేకమేవాగ్ర ఆసీ' (ఐ. 2-4-1-1) ఇత్యాదావిదంశబ్దగృహీతస్య కార్యస్య కారణేన సామానాధికరణ్యాత్. యచ్చ యదాత్మనా యత్ర న వర్తతే న తత్తత ఉత్పద్యతే, యథా సికతాభ్యస్తైలం, తస్మాత్ ప్రాగుత్పత్తేరనన్యత్వాదుత్పన్నమప్యనన్యదేవ కారణాత్కార్యమిత్యవగమ్యతే. యథాచ కారణం బ్రహ్మ త్రిషు కాలేషు సత్త్వం న వ్యభిచరతి, ఏవం కార్యమపి జగత్త్రిషు కాలేషు

---

వాక్యములయందు ఇదం–ఇది యను శబ్దముచే నుపపాదింప బడుచున్న కార్యముతో కారణము సామానాధికరణ్యమున అనగా సమానప్రతిపత్తితో నుండినట్లు తెలియుచున్నది. ఏవస్తువు దేనియందు ఆరూపమున నుండదో ఆ వస్తువు దాని నుండి ఉత్పన్నముకానేరదు. ఘటము మృత్తునందు మృద్రూప మున నుండనిచో మృత్తునుండి అది పుట్టనేరదు. పుట్టుకకు పూర్వము మృద్రూపమున మృత్తుయందుండుటచేతనే అది దానివలన బుట్టుచున్నది. అందువలననే మృత్తు ఘటమునకు కారణమగుచున్నది.[అటువలెనే శిలయందును దారువునందును విగ్రహామారూపమున యిమిడియున్నది. శిల్పి తనప్రజ్ఞచేత నారూపము నభివ్యక్తము చేయుచున్నాడు] తైలము యిసుక యందు యిసుకరూపమున లేకుండుటచే యిసుకనుండి అది పుట్టుటలేదు. ఉత్పత్తికిపూర్వము కార్యకారణముల కనన్య త్వము కలదుగనుకనే ఉత్పత్త్యనంతరముగూడ వానియనన్య త్వము తెలియుచున్నది. కారణమగు బ్రహ్మము త్రికాలముల యందు నుండియేయున్నది. ఒకప్పుడును లేకుండలేదు. కనుక కార్యమగు జగత్తుకూడ త్రికాలములయందు ఉనికిని కలిగియే

సత్త్వం న వ్యభిచరతి, ఏకం చ పునస్సత్త్వం, అతోఽప్య
నన్యత్వం కారణాత్కార్యస్య.

## అసద్వ్యపదేశాన్నేతి చేన్న ధర్మాంతరేణ వాక్యశేషాత్ (సూ. 17)

పూ.పక్షీ : నను క్వచిదసత్త్వమపి ప్రాగుత్పత్తేః కార్యస్య వ్యప
దిశతి శ్రుతిః 'అసదేవేదమగ్రఆసీ' దితి (ఛాం. 3-19-1) 'అసద్వా
ఇదమగ్రఆసీ' (తై. 2-7-1) దితి చ. తస్మాదసద్వ్యపదేశాన్న
ప్రాగుత్పత్తేః కార్యస్య సత్త్వమితి చేత్.

---

యున్నది, అందుకు భిన్నముగాలేదు. అంతటను సత్త్వమొక
టియె అనుస్యూతముగ నున్నది. అందువలన కార్యకారణముల
కనన్యత్వము చెప్పదగును. 16

అ॥ ఉత్పత్తికి పూర్వము కార్యము కారణరూపమున
నున్నదను విషయము సిద్ధముగాదని శంకించి సమాధానము
చెప్పుచున్నారు.

అసత్ వ్యపదేశాత్ = సృష్టికి పూర్వము ప్రపంచము
లేదని శ్రుతిచెప్పుటచే న ఇతి చేత్ = ప్రపంచము లేదని అంటి
రేని, న = అది సరికాదు. ధర్మ అంతరేణ = మఱియొకధర్మ
ముచే అసత్త్వము వర్ణింపబడినట్లు వాక్యశేషాత్ =
శేషించిన వాక్యభాగముచే తెలియుచున్నది.

పూ. పక్షి : సృష్టికి పూర్వ మీ జగత్తు అసత్తుగా
నుండెను. అని ఛాందోగ్య తైత్తిరీయశ్రుతులు కొన్ని కార్యో
త్పత్తికి పూర్వము అసత్తున్నటులగూడ చెప్పుచున్నవి. కార్యో

సిద్ధాంతీ : నేతి బ్రూమః. నహ్యయమత్యంతాసత్త్వాభిప్రాయేణ ప్రాగుత్పత్తేః కార్యస్యాసద్వ్యపదేశః. కింతర్హి ? వ్యాకృతనామరూపత్వాద్ధర్మాదవ్యాకృతనామరూపత్వం ధర్మాంతరం, తేన ధర్మాంతరేణాయమసద్వ్యపదేశః ప్రాగుత్పత్తేస్సతఏవ కార్యస్య కారణరూపేణానన్యస్య, కథమేతదవగమ్యతే,

---

త్పత్తికి పూర్వము అసత్తు ఉన్నటుల చెప్పటవలన ఉత్పత్తికి పూర్వము కార్యమున్నటుల చెప్పవీలులేదు.

సిద్ధాంతి : ఇట్లనుట సరికాదు. ఉత్పత్తికి పూర్వము కార్యమత్యంతము లేదని చెప్పుటకు పై వాక్యములు ప్రవర్తించుటలేదు. మఱి యేమన, అభివ్యక్తమగు నామరూపధర్మము అనభివ్యక్త నామరూపధర్మముకంటె భిన్నము. అట్టి అభివ్యక్తనామరూపధర్మముచే సృష్టికిపూర్వ మీ జగత్తు లేదని కారణరూపముకంటె ననన్యముగనున్న కార్యమున కుత్పత్తికి పూర్వముగల ధర్మాంతరము చెప్పబడు చున్నది. [అనగా కార్యమగు జగత్తు ఉత్పత్తికి పూర్వము కారణముకంటె ననన్యముగా ఉండియున్నది. ఉత్పత్తికి తరువాత అది నామరూప ధర్మములతో అభివ్యక్తమైనది. ఉత్పత్తికి పూర్వ మానామరూపధర్మ మభివ్యక్తము కాకున్నది. పై వాక్యములచే నామరూప ధర్మములు పూర్వము లేవని చెప్పబడినదిగాని కార్యము కారణరూపమున లేదని చెప్పబడలేదు.] ఈవిషయము మిగిలినవాక్యముచే తెలియు

అసద్వాక్యార్థ విచారణము

వాక్యశేషాత్. యద్ధ్యుపక్రమే సందిగ్ధార్థం వాక్యం తద్వాక్యశేషాన్నిశ్చీయతే. ఇహ చ 'అసదేవేదమగ్రఆసీ' దిత్యసచ్ఛబ్దేనోపక్రమే నిర్దిష్టం య త్తదేవ పున స్తచ్ఛబ్దేన పరామృశ్య సదితి విశినష్టి 'తత్సదాసీ' దితి. అసతశ్చ పూర్వాపరకాలాసంబంధాదాసీచ్ఛబ్దానుపపత్తేశ్చ. 'అసద్వా ఇదమగ్ర అసీ' దిత్యత్రాపి 'తదాత్మానగ్గ్స్వయమకురుతే'తి వాక్యశేషవిశేషణాన్నాత్యంతాసత్త్వమ్. తస్మాద్ధర్మాంతరేణై వాయమసద్వ్యపదేశః ప్రాగుత్పత్తేః కార్యస్య. నామరూపవ్యాకృతం హి వస్తు సచ్ఛబ్దార్హం లోకే

---

చున్నది. ఉపక్రమమునందు సందిగ్ధముగనున్న వాక్యార్థము వాక్యశేషముచే నిశ్చయింపబడును, ఉత్పత్తికి పూర్వమది అసత్తుగానుండెను అని వాక్యోపక్రమమునందు అసచ్ఛబ్దముచే యేది నిర్దేశింపబడుచున్నదో అదియే తరువాత వాక్యభాగమున సచ్ఛబ్దముచే పరామర్శింపబడి 'తత్సదాసీత్' అది సత్తుగానుండెను అని సచ్ఛబ్దముచే విశేషింపబడుచున్నది. ఆసీత్-ఉండెను అనుభూతకాలక్రియ అత్యంతాసత్త్వముతో సమన్వయము గానేరదు.[అనగా ఏకాలమునందును లేనిది అత్యంతము లేనిదియగునుగాని యొకకాలముననుండి మఱియొక కాలమున లేనిది అత్యంతమసత్తు కానేరదు.] "తనను తాను స్వయముగ చేసికొనెను" అని వాక్యశేషము వినబడుటచేత ఇది ఉత్పత్తికిపూర్వ మసత్తుగా నుండెనను వాక్యమునందుగూడ అత్యంతాసత్త్వము చెప్పబడుటలేదు. అందువలన, ఉత్పత్తికి పూర్వము కార్యము ధర్మాంతరముచే లేనట్లు చెప్పబడినది. నామరూపములచే నభివ్యక్తమగు వస్తువు లోకమునందు

ప్రసిద్ధమ్, అతః ప్రాఙ్నామరూపవ్యాకరణాదసదివాసీదిత్యుప చర్యతే.

## యుక్తేశ్శబ్దాంతరాచ్చ (సూ. 18)

యుక్తేశ్చ ప్రాగుత్పత్తేః కార్యస్య సత్త్వమనన్యత్వం చ కారణాదవగమ్యతే, శబ్దాంతరాచ్చ యుక్తిస్తావద్వర్ణ్యతే. దధి ఘటరుచకాద్యర్థిభిః ప్రతినియతాని కారణాని క్షీరమృత్తికాసువర్ణా

---

ఉన్నది యని ప్రసిద్ధముగ చెప్పతగియున్నది కనుక కార్యము నామరూపములకు పూర్వము లేనిదానివలె కాన్పించుచున్నది యని యసచ్ఛబ్దమున కుపచారార్థముం చెప్పుట సమంజసము. 17

అ॥ ప్రలయమునందుగూడ కార్యకారణముల కనన్యత్వమును తరువాత సూత్రమున చూపుచున్నారు.

యుక్తేఃచ = శూన్యమునుండి ప్రపంచముత్పన్న మగు ననుట యుక్తిసహము కాదుగనుకను, శబ్దఅంతరాత్ చ = "సదేవసోమ్య ఇదమగ్ర ఆసీత్" అను మఱియొక శ్రుతిబలముచేతను ప్రపంచము సూక్ష్మరూపమున ఉన్నదనియే అంగీకరింప దగును.

ఉత్పత్తికిపూర్వము కార్యముయొక్క యునికియు, కారణముకంటె ననన్యత్వముగూడ యుక్తివలనను, శబ్దాంతరముచేతను తెలియుచున్నది. యుక్తి అన్ననో యిట్లు చెప్ప బడుచున్నది. దధి, ఘటము, సువర్ణాభరణములను గోరు వారు వానికి నియతముగ కారణములగు క్షీరము, మృత్తిక,

దీన్యుపాదీయమానాని లోకే దృశ్యంతే, న హి దధ్యర్థిభిః మృత్తికోపాదీయతే, న ఘటాద్యర్థిభిః క్షీరం, తదసత్కార్యవాదేనోపపద్యతే. అవిశిష్టే హి ప్రాగుత్పత్తేస్సర్వత్ర సర్వస్యాసత్త్వే కస్మాత్ క్షీరాదేవ దధ్యుత్పద్యతే న మృత్తికాయాః మృత్తికాయా ఏవచ ఘట ఉత్పద్యతే న క్షీరాత్.

అసత్కార్యవాదీ : అథావిశిష్టేఽపి ప్రాగసత్త్వే క్షీర ఏవ దధ్నః కశ్చిదతిశయో న మృత్తికాయాం మృత్తికాయామేవ ఘటస్య కశ్చిదతిశయో న క్షీర ఇత్యుచ్యేత.

---

ప్రళయమున కారణమునందు కార్యము లీనమై యున్నది.

సువర్ణముల పరిగ్రహించుట లోకమునందు కాన్పించుచున్నది. దధిని గోరువాడు మృత్తునను గ్రహించుటలేదు, ఘటమును గోరువాడు క్షీరమును గ్రహించుటలేదు. ఇట్లు కార్యోత్పత్తియందు నియతమగు కారణ పరిగహణము అసత్కార్యవాదమునందు అనగా నుత్పత్తికి పూర్వము కార్యములేదను వారి వాదమునందు సంభవముకాదు. ఉత్పత్తికి పూర్వము కార్యమెక్కడను లేకుండుట సమానమయిన [అన్నిటినుండి అన్నియు నుత్పన్నము కావలెను.] క్షీరమునుండిమాత్రమే దధి యేలపుట్టవలెను? మృత్తికనుండి యేలపుట్టదు? మృత్తిక నుండి మాత్రమే ఘటమేల పుట్టవలెను? క్షీరమునుండి యేల పుట్టదు?

అసత్కార్యవాది : నిజమే! ఉత్పత్తికి పూర్వము కార్య మెక్కడను లేకుండుట సమానమే. దధిని పుట్టించు యొకానొక అతిశయము క్షీరమునందుమాత్రము కలదు. మృత్తికయందు లేదు. ఘటమును పుట్టించు నొకయతిశయము

సత్కార్యవాదీ : తర్హి అతిశయవత్త్వాత్ ప్రాగవస్థాయాః అసత్కార్యవాదహానిః సత్కార్యవాదసిద్ధిశ్చ. శక్తిశ్చ కారణస్య కార్యనియమార్థా కల్ప్యమానా నాన్యాఽసతీ వా కార్యం నియచ్ఛేత్, అసత్త్వావిశేషాదన్యత్వావిశేషాచ్చ. తస్మాత్కారణస్యాత్మభూతా శక్తిః శక్తేశ్చాత్మభూతం కార్యమ్. అపిచ కార్యకారణయోర్ద్రవ్య

---

మృత్తికయందు మాత్రమే కలదుగాని క్షీరమునందు లేదు అని యందుము.

సత్కార్యవాది : అట్లయినచో, కార్యోత్పత్తికి పూర్వము క్షీరమునందు దధిని పుట్టించునట్టియు, మృత్తికయందు ఘటమును బుట్టించునట్టియు నొక విశేషము కలదు గనుక అసత్కార్యవాదమునకు హానియు, సత్కార్యవాద సిద్ధియు సంప్రాప్తమగుచున్నది. ఒకకార్యమును నియమించు శక్తియొకటి కారణమునందు కల్పించితిరేని, అట్టిశక్తి కార్యకారణములకంటె భిన్నమయినను, అత్యంతము లేకున్నను గూడ నకార్యమును పుట్టింపలేదు. అట్టి శక్తి అసత్త్వము కంటెను అన్యత్వముకంటెను భిన్నము కాదు. [అట్లయినచో ఆశక్తియే ఆకార్యము నేల పుట్టింపవలయును?] అందువలన కారణస్వరూపమే శక్తి యనియు, శక్తిస్వరూపము కారణమనియు సిద్ధమగుచున్నది. [కనుక ఒక్కొక్క కారణమునం దొక్కొక్కకార్యము లీనమై నియమముగ నభివ్యక్తమగుచున్నది. అందువలన సత్కార్యవాదము సిద్ధించుచున్నది.] మఱియు, అశ్వమహిషములవలె కార్యము కారణముకంటె భేదము ద్రవ్యము గుణముకంటె భేదము

గుణాదీనాం చాశ్వమహిష భేదబుద్ధ్యభావాత్తాదాత్మ్యమభ్యుపగంత వ్యమ్. సమవాయకల్పనాయామపి సమవాయస్య సమవాయిభిస్సం బంధేఽభ్యుపగమ్యమానే తస్యతస్యాన్యోన్యస్సంబంధః కల్పయి తవ్య ఇత్యనవస్థాప్రసంగః.అనభ్యుపగమ్యమానేచ విచ్ఛేదప్రసంగః.

---

అను భేదబుద్ధి లేకుండుటవలన కార్యకారణములకును, ద్రవ్య గుణములకును తాదాత్మ్యభావ మంగీకరింపవలయును. [ఒక దానికిని మరియొకదానికిని యభేదభావమె తాదాత్మ్యభావము తత్స్వరూపభావము తాదాత్మ్యభావము.] కార్యకారణములు రెండును భిన్నములయినను, సమవాయ సంబంధముచే నవి సంబద్ధములగుటచే వానికింగల భేదబుద్ధి కాన్పించుటలేదు. [కార్యకారణములనుండి విడదీయవీలులేని సంబంధము సమ వాయిసంబంధ మనబడును. తంతువులనుండి పుట్టిన పటమెల్ల ప్పుడును తంతువులతో సంబద్ధమై యుండును. వానికిగల సంబద్ధమును వానినుండి విడదీయ వీలులేదు. పటమునుండి పటరూపమును విడదీయలేము. ఇట్టి సంబంధములు సమ వాయసంబంధము లనబడును.] కార్యకారణములకు సమవాయ కారణత్వము కల్పించినపు డవ్వానికి సమవాయసంబంధ మంగీకరింపక తప్పదంటిరేని[అట్లయినచో నీసమవాయ సంబం ధము స్వతంత్రమైన సంబంధమా? లేక పరతంత్రమైన సంబం ధమా? పరతంత్రమైనచో] నీ సమవాయమును కార్యకారణ ములతో చేర్పదగ్గ మరియొక సంబంధమెద్ది? మరియొక సంబంధముచే నది చేర్పబడినదియని యందురేని దానిని చేర్ప తగ్గ సంబంధమెద్ది? యని ప్రశ్నపరంపర గలిగి యనవస్థ

అసత్కార్యవాదీ : అథ సమవాయస్స్వయం సంబంధరూపత్వాదన పేక్ష్యైవాపరంసంబంధం సంబధ్యేత.

సత్కార్యవాదీ : సంయోగోఽపి తర్హి స్వయం సంబంధరూపత్వాదనపేక్ష్యైవాపరం సమవాయం సంబధ్యేత. తాదాత్మ్య ప్రతీతేశ్చ ద్రవ్యగుణాదీనాం సమవాయకల్పనానర్థక్యమ్. కథం

---

యేర్పడును? సమవాయి సంబంధము నంగీకరింపని పక్షమున, కార్యకారణములకు సంబంధమే లేకపోవును?

అసత్కార్యవాది : సమవాయము స్వయముగా సంబంధరూప మగుటవలన, యితర సంబంధాపేక్ష లేకనే, కార్యకారణములకు సంబంధము కలుగుచున్నది యని యందుము.

సత్కార్యవాది : అట్లయినచో, సంయోగము గూడ స్వయముగా సంబంధరూపమగుటవలన సమవాయ సంబంధాపేక్ష లేకనే అది రెండువస్తువులకు సంబంధము కల్పింపవచ్చును. [తార్కికమతమునందు సంయోగము రూపమువలె నొక గుణము. రూపాదిగుణములు సమవాయ సంబంధముచే రూపియందుండుననియు అదేవిధమున సంయోగ గుణముగూడ సంయుక్తములగు వస్తువులయందు సమవాయసంబంధముచే సంబంధించి యున్నదనియు వారి మతము.] ద్రవ్యగుణాదులకు తాదాత్మ్యసంబంధము తెలియుచుండుటవలన వానికి సమవాయ సంబంధము కల్పించుట నిరర్థకము.

కార్యకారణములకు సమవాయ సంబంధము కుదరదు.

[16]

చ కార్యమవయవిద్రవ్యం కారణేష్వవయవద్రవ్యేషు వర్త మానం వర్తేత కిం సమస్తేష్వవయవేషు వర్తేతోత ప్రత్య వయవమ్? యది తావత్ సమస్తేషు వర్తేత తతోఽవ యవ్యనుపలబ్ధిః ప్రసజ్యేత, సమస్తావయవసన్నికర్షస్యా శక్య త్వాత్. న హి బహుత్వం సమస్తేష్వాశ్రయేషు వర్తమానం వ్యస్తాశ్రయగ్రహణేన గృహ్యతే. అథావయవశస్సమస్తేషు వర్తేత,

---

మఱియు కార్యకారణములకు సమవాయ సంబంధము మీరు చెప్పుచున్నారుగదా? అనేకావయవములుగల వస్తువున కవయవములు కారణమగుచున్నవి. అవయవి వాని కార్య మగుచున్నది. ఇట్టి స్థలములయందు సమవాయిసంబంధ మెట్లు సిద్ధించును? అవయవి అవయవములన్నిటియందు సమూహముగా నుండునా? లేక ప్రత్యవయవమున నుండునా? అవయవము లన్నిటియం దొక్కమారుగ సమూహముగ నవయవి యుండెనేని అవయవముల నన్నిటి నొక్కమారుగ గ్రహింప బుద్ధికి సాధ్యము కాదుగనుక, అవయవసమూహమగు అవయవిని తెలిసికొనుట శక్యముగాదు. [ఘటావయవములగు పరమాణువులను మధ్యను, లోపలను, వెనుకనున్న వానినన్నిటి నొక్కమారుగ చూడలేము. అందుచే నవయవియగు ఘటమును చూడలేకపోవలసివచ్చును,] అవయవి రూపమును దెలియజేయు అవయవముల బహుత్వము కొన్నియవయవములను చూచుటచేత గ్రహింపబడదు. అవయవి ప్రత్యవయవద్వారమున సమస్తావయవముల యందుండునని యంటిరేని, అప్పుడు గూడ, అవయవికి కారణములగు నవయవములకంటె భిన్నము

తదాప్యారంభకావయవవ్యతిరేకేణావయవినోఽవయవాః కల్ప్యేరన్
యైరవయవైరారంభకేష్వవయవేష్వవయవినోఽవయవీ వర్తేత.
కోశావయవవ్యతిరిక్తైర్హ్యవయవైరసిః కోశం వ్యాప్నోతి, అన
వస్థా చైవం ప్రసజ్యేత, తేషు తేష్వవయవేషు వర్తయితు
మన్యేషామన్యేషామవయవానాం కల్పనీయత్వాత్. అథ ప్రత్యవ
యవం వర్తేత తదైకత్ర వ్యాపారేఽన్యత్రావ్యాపారస్స్యాత్, న హి

---

లగు మరికొన్ని నూతనావయవముల నవయవియందు కల్పింప వలసివచ్చును. అప్పుడే అవయవి ప్రత్యవయవమునం దుండ గలదు. [ఘటముయొక్క వెనుకను లోపలనున్న అవయవ ముల నొక్కమారుగ చూడలేకున్నను సంపూర్ణమగు ఘట జ్ఞానము కలుగుచున్నది. ప్రత్యవయవమునందును ఘటజ్ఞాన ముండునని చెప్పుచున్నారు. కనుక సంపూర్ణజ్ఞానమును కలుగ జేయు నూతనావయవములు కాన్పించుచున్న భాగమునందే కల్పింపవలయును.] వరలోనికత్తి వరయొక్క యవయవముల కంటె భిన్నమగు నవయవములచే వరను వ్యాపించియున్నది. [అనగా హస్తమునందును కోశమునందునున్న ఖడ్గము హస్త గ్రహణమాత్రముచే గ్రహింపబడుచున్నది.] ఇందుచే నన వస్థాదోషము సంప్రాప్తమగుచున్నది. ఆయా అవయవముల యందవయవి యుండుటకై మఱియొక నూతనములగు నవ యవములను కల్పింపవలసివచ్చును. ప్రత్యవయవమునందు నవయవి యుండునంటిరేని, ఒక అవయవమునందే నవయవి యుండెనేని యితరావయవములయం దుండకపోవలెను. [ఒక పరమాణువునందే ఘటమంతయు నున్న యెడల నాఘట

దేవదత్తః స్రుఘ్నే సన్నిధీయమాన స్తదహరేవ పాటలీపుత్రే సన్నిధీయతే, యుగపదనేకత్ర వృత్తావనేకత్వప్రసంగాత్, దేవదత్తయజ్ఞదత్తయోరివ స్రుఘ్నపాటలిపుత్ర నివాసినోః.

అసత్కార్యవాదీ : గోత్వాది వత్ప్రత్యేకం పరిసమాప్తేర దోష ఇతి చేత్.

సత్కార్యవాదీ : న, తథా ప్రతీత్యభావాత్. యది గోత్వాదివత్ప్రత్యేకపరిసమాప్తోఽవయవీస్యాత్ యథా గోత్వం ప్రతివ్యక్తి ప్రత్యక్షం గృహ్యతే ఏవమవయవ్యపి ప్రత్యవయవం

---

మితర పరమాణువులయం దుండనేరదు,] సన్నిధానమునం దున్న దేవదత్తు డక్కాలముననే దూరమునందున్న పాటలీపుత్రమునందుగూడ నుండలేడు. ఒక్కమారుగ ననేకస్థలములలో నుండుట సంభవించినచో ననేకత్వప్రసక్తి సంభవించును. ఇచటనున్న దేవదత్తుడును పాటలీపుత్రమునందున్న యజ్ఞదత్తుడు భిన్న పురుషులగుచున్నారు.

అసత్కార్యవాది : గోత్వజాతి ప్రతి గోవ్యక్తియందు సంపూర్ణముగ నున్నను ననేకజాతులున్నవని యెవరు ననుటలేదు. అటులనే అవయవి ప్రత్యవయవమునం దున్నను, అవయవు లనేకములని తలంప నవసరములేదు. ఇది యొక దోషము కాదు.

సత్కార్యవాది : గోత్వజాతి ప్రతిగోవ్యక్తియందు కాననించుచున్నను, గోవుయొక్క ప్రత్యవయవమునందు గోస్వరూపమంతయు కాన్పించుట లేదు. అట్లయినచో, ననేకావయవములు గల గోవునుబోలు నవయవి యొక్క స్వరూ

ప్రత్యక్షం గృహ్యేత, నత్వేవం నియతం గృహ్యతే. ప్రత్యేక
పరిసమాప్తౌ చావయవినః కార్యేణాధికారాత్ తస్య చైక
త్వాచ్ఛృంగేణాపి స్తనకార్యం కుర్యాత్ ఉరసా చ పృష్ఠకార్యం.
న త్వేవం దృశ్యతే. ప్రాగుత్పత్తేశ్చ కార్యస్యాసత్త్వే ఉత్పత్తిర
కర్తృకా నిరాత్మికా చ స్యాత్. ఉత్పత్తిశ్చ నామ క్రియా, సా
సకర్తృకైవ భవితుమర్హతి గత్యాదివత్. క్రియా చ నామ స్యాద
కర్తృకా చేతి విప్రతిషిధ్యేత. ఘటస్య చోత్పత్తిరుచ్యమానా న

---

పము ప్రత్యవయవమునందు కాన్పించితీరవలయును.
కాని యిట్టి నియమము లేదు. అవయవి యగు గోవు
యొక్క స్వరూపము ప్రత్యవయవమునందు పరి
సమాప్తిని బొందినచో, అవయవియగు గోవు ఒక్కటియే
యగుటచే, కొమ్ములచే పాలనివ్వవలెను, వక్షస్సుచే పృష్ఠ
కార్యమును చేయవలెను. ఇట్లగుపడుట లేదు. మఱియు
నుత్పత్తికిపూర్వము కార్యము లేనిచో, నద్దాని పుట్టించు
కర్త లేకపోవలసివచ్చును. అపుడు పుట్టుక స్వరూపము లేనిది
యగును. ఉత్పత్తియన నొకక్రియ; దానికి సమర్థమగు నొక
కర్త కావలయును. నడవగలవాడున్నపుడే గమనక్రియ సంభ
వించును. ఉత్పత్తిక్రియ సంభవించుచున్నది, దానిని చేయు
కర్త లేడు అనుట విరుద్ధము. ఘట ముత్పన్నమగుచున్నది.
[ఘటోత్పత్తికి పూర్వము ఘటము లేదు గనుక] ఘటో
త్పత్తికి ఘటము కారణము కానేరదు. మఱియొక కర్తను
కల్పించవలెను. అటులనే ఘటకపాలములు పుట్టుచుండగా,
వానికంటె నన్యమగు నొకకర్తను కల్పించవలెను. [ఉత్తర

ఘటకర్తృకా కింతర్హ్యన్యకర్తృకేతి కల్ప్యా స్యాత్. తథా కపాలా దీనామప్యుత్పత్తిరుచ్యమానాఽన్యకర్తృకైవ కల్ప్యేత, తథాచ సతి ఘట ఉత్పద్యతే ఇత్యుక్తే కులాలాదీని కారణాన్యుత్పద్యంత

---

దేశమునందు ఘటనిర్మాణమునకు బూర్వము రెండుసగ భాగములను జేసి వానిని అతికి ఘటమును చేయుదురు. ఈ రెండు సగభాగములు కపాలములని బిలువబడును]. అసత్కార్యవాదమే సరియయినచో, ఘట ముత్పన్న మగు చున్నది యని చెప్పినపుడు, ఘటముతో పాటు ఘటకారణము లగు కులాలాదులుగూడ నుత్పన్నము లగుచున్నవని చెప్పినట్ల గును కాని లోకమునం దట్టిప్రతీతి కలుగుట లేదు. కార్యోత్ప త్తికి పూర్వమే కర్త యుత్పన్నమై యున్నటులగూడ ప్రతీతి కలదు [ఇచట భావమిది ఘటము పుట్టుచున్నది యనుచోట పుట్టును అనుక్రియకు ఘటము కర్త. పుట్టుట యనునది యొక కార్యము కనుక ఘటముదానికి కారణమగుచున్నది. కారణ ములేక కార్యముపుట్టదు గనుక పుట్టుకకు పూర్వము కారణ మగు ఘటమెదో యొక రూపమున నుండితీరవలయును. ఘటము పుట్టుచున్నది యనువాక్యమున కంతకుపూర్వమున్న ఘటమే మఱియొక రూపమున ఆవిర్భవించుచున్నది యనియే అర్థము చెప్పవలెనుగాని యేవిధముగాను యెంతమాత్రము లేని ఘటము నూతనముగా పుట్టినది యని చెప్పవీలు లేదు. మఱియు పుట్టుట యనునది యొక కార్యము. పుట్టించుట యను వ్యాపారము లేక పుట్టుటయను కార్యము సంభవముకాదు. పుట్టించుట యను వ్యాపారమునకు కర్తయగు కులాలాదికము

ఇత్యుక్తం స్యాత్. న చ లోకే ఘటోత్పత్తిరిత్యుక్తే కులాలాదీనా మప్యుత్పద్యమానతా ప్రతీయతే, ఉత్పన్నతాప్రతీతేః.

అసత్కార్యవాదీ : అథ స్వకారణసత్తాసంబంధ ఏవో త్పత్తిరాత్మలాభశ్చ కార్యస్యేతి చేత్.

---

కారణము. ఘటము పుట్టుచున్నది యనునపుడు పుట్టుకకు కర్తయగు ఘటము నిమిత్తములగు కులాలాదులుగూడ కారణము లగుచున్నవి. ఘటము పుట్టుటకివి యన్నియు కారణములగుటచే ఘటము పుట్టకపూర్వమే యీకారణము లన్నియు నుండితీరవలయును. పుట్టించుక్రియకు కారణము కులాలాదులు; పుట్టుక్రియకు కారణము ఘటము; ఘటోత్పత్తికి బూర్వమాకారణములు లేనిచో, ఘటము పుట్టుచున్నది యనువాక్యమునకు ఘటముతోపాటు కులాలాది నిమిత్త కారణములుగూడ పుట్టుచున్నవియని అర్థము చెప్పవలెను. ఇది సంభవముకాదు. పుట్టించు వ్యాపారమునకు కులాలాదు లధిష్ఠానకారణము. పరిశేషముచే పుట్టుటయను వ్యాపారమునకు ఘటమవశ్య మధిష్ఠానకారణము కావలెను. కనుక పుట్టుటయను కార్యమునకు బూర్వ మందు కధిష్ఠానకారణ మగు ఘటముండితీరవలయును. ]

అసత్కార్యవాది : ఉత్పత్తియనునది యొక ప్రత్యేక కార్యము కాదు. ఉత్పన్నము కాబోవు కార్యమునకును ఉత్పన్నమైయున్న కారణమునకును గాని దానియునికికిగాని గలసంబంధ ముత్పత్తి యని యందుము.

సత్కార్యవాదీ : కథమలబ్ధాత్మకం సత్సంబధ్యేతేతి వక్తవ్యమ్. సతోర్హి ద్వయోస్సంబంధస్సంభవతి న సదసతోరసతోర్వా, అభావస్య చ నిరుపాఖ్యత్వాత్ప్రాగుత్పత్తేరితి మర్యాదాకరణమనుపపన్నం, సతాం హి లోకే క్షేత్రగృహాదీనాం మర్యాదా దృష్టా నాభావస్య. న హి వంధ్యాపుత్రో రాజా బభూవ ప్రాక్పూర్ణవర్మణోఽభిషేకాదిత్యేవం జాతీయకేన మర్యాదాకరణేన నిరుపాఖ్యో వంధ్యాపుత్రో రాజా బభూవ భవతి భవిష్యతీతి వా విశేష్యతే. యది చ వంధ్యాపుత్రః కారకవ్యాపారాదూర్ధ్వమభవిష్యత్ తతః ఇదమపి ఉపాపత్స్యత

---

సత్కార్యవాది : అట్లయినచో, ఉత్పన్నముగాని కార్యముతో సంబంధ మెట్లుకలుగునో మీరు చెప్పవలసి యున్నారు. రెండుపదార్థము లున్నపుడుమాత్రమే వానికి సంబంధ మేర్పడగలదు, అసలే లేనపుడుగాని, ఒకటియుండి మఱియొకటి లేనపుడుగాని సంబంధ మేర్పడజాలదు. అభావమును నిరూపింప శక్యముగాదు గనుక నుత్పత్తికి పూర్వమని యొకహద్దును అనగా పొలిమేరను కల్పింప వీలులేదు. లోకమునందు క్షేత్రములు గృహములు మొదలగు ఉన్నవస్తువులకు మాత్రము సరిహద్దులు కాన్పించుచున్నవిగాని ఆ భావమునకు కాన్పించుటలేదు. పూర్ణవర్మ రాజ్యాభిషిక్తుడుగాకపూర్వము గొడ్రాలిబిడ్డ డొకడు రాజుగా నుండెనని కాలపరిమితి కల్పనముచేత నట్టి వంధ్యాపుత్రుడు రాజుగా నుండలేడు. ప్రకృతమున లేడు. ఇకముం దుండనేరడు. క్రియావ్యాపారమువలన వంధ్యాపుత్రుడు యథార్థమయ్యె

కార్యాభావోఽపి కారకవ్యాపారాదూర్ధ్వం భవిష్యతీతి. ఏవం తు పక్షే వంధ్యాపుత్రస్య కార్యాభావస్య చాభావత్వావిశేషాత్. యథా వంధ్యాపుత్రః కారకవ్యాపారా దూర్ధ్వం న భవిష్యతి ఏవం కార్యాభావోఽపి కారకవ్యాపారా దూర్ధ్వం న భవిష్యతీతి.

అసత్కార్యవాదీ : నన్వేవం సతి కారకవ్యాపారోఽనర్థకః

---

నేని క్రియావ్యాపారముచే నభావము నుండి భావపదార్థ ముత్పన్నముకాగలదని చెప్పవచ్చును. [ఒకవస్తువు వంధ్యా పుత్రునివలె నత్యంతము లేకపోవచ్చును. దీనిని అత్యంతాభావ మందురు. పుట్టకపూర్వము వస్తువుండదు. తరువాత ఉండును. దీనిని ప్రాగభావమందురు. అనగా ప్రాక్=పుట్టుటకు పూర్వము, అభావము=లేకుండుట. ఘటము నశించినతరు వాత తిరిగి పుట్టనేరదు. ఇది ప్రధ్వంసాభావము. ప్రధ్వంస అనగా నశించినతరువాత అభావము=లేకుండుట.] వంధ్యా పుత్రుని యభావ మభావములలో నొకటియగు నత్యంతా భావము. వంధ్యాపుత్రుడు సంభవముగానట్లే అసలేలేనట్టి యత్యంతాభావమునుండి భావపదార్థము పుట్టుటయు సంభ వము గాదు. వంధ్యాపుత్రుని యసంభవమును మనము చూచుచున్నాము.

అసత్కార్యవాది : ఉత్పత్తికి పూర్వము, కార్యము కారణమునం దున్నచో ఉత్పత్తినిగూర్చి చేయబడు క్రియా వ్యాపారమంతయు నిరర్థకము కావలసివచ్చును. కారణ మది వరకే సిద్ధవస్తువు గనుక నద్దాని యుత్పత్తినిగూర్చి యెవడును ప్రయత్నించడు. అదేవిధమున పుట్టుటకుపూర్వమే కారణము

ప్రసజ్యేత, యథైవ హి ప్రాక్ సిద్ధత్వాత్కారణస్య స్వరూపసిద్ధయే న కశ్చిద్వ్యాప్రియతే. ఏవం ప్రాక్సిద్ధత్వాత్తదనన్యత్వాచ్చ కార్యస్వరూపసిద్ధయేఽపి కశ్చిద్వ్యాప్రియేత వ్యాప్రియతే చ, అతః కారకవ్యాపారార్థవత్త్వాయ మన్యామహే ప్రాగుత్పత్తేరభావః కార్యస్యేతిచేత్.

సత్కార్యవాదీ : నైష దోషః, యతః కార్యాకారేణ కారణం వ్యవస్థాపయతః కారకవ్యాపారస్యార్థవత్త్వ ముపపద్యతే. కార్యాకారోఽపి కారణస్యాత్మభూత ఏవ, అనాత్మ

---

నందు కార్యము సిద్ధమై కారణముకంటె భిన్నము గాకుండుటచే కార్యముయొక్క స్వరూపసిద్ధికొరకెవడును ప్రయత్నించడు, కాని కార్యోత్పత్తికి మనుజుడు ప్రయత్నించుచున్నాడు. కనుక కార్యవ్యాపారము ప్రయోజనవంతమగుటకుత్పత్తికిపూర్వము కార్యము లేదని మేము తలంచుదుము.

సత్కార్యవాది : ఇది యొకదోషము కాదు. క్రియావ్యాపారమువలన కారణము కార్యరూపమునుబొందుచున్నది. [కారణమగు సువర్ణము సిద్ధవస్తువు. దానియందు కార్యమగు నాభరణ ముండియేయున్నది. అట్టి యాభరణము నభివ్యక్తము చేయుటకు కార్యవ్యాపార మవసరమగుచున్నది.] అందువలన కార్యవ్యాపారము ప్రయోజనకారి యగుచున్నది, కార్యస్వరూపము కారణస్వరూపమే యగుచున్నది. [సువర్ణాభరణ స్వరూపము సువర్ణస్వరూపమే యగుచున్నది.] కారణమునందు కార్యములేనిచో, కార్యోత్పాదన ప్రయత్నము జరుగనేరదు. [సువర్ణమునందాభరణములేనిచో,

ఘాతస్యానారభ్యత్వాదిత్యాభాణి. న చ విశేషదర్శనమాత్రేణ వస్త్వ
న్తరత్వం భవతి. న హి దేవదత్తస్సంకుచితహస్తపాదః ప్రసారిత
హస్తపాదశ్చ విశేషేణదృశ్యమానోఽపి వస్త్వన్తరత్వం గచ్ఛతి,
స ఏవేతి ప్రత్యభిజ్ఞానాత్. తథా ప్రతిదినమనేకసంస్థానానామపి
పిత్రాదీనాం న వస్త్వన్తరత్వం భవతి, మమ పితా మమ మాతా
మమ భ్రాతా మమ పుత్ర ఇతి ప్రత్యభిజ్ఞానాత్, జన్మోచ్ఛేదానన్త
రితత్వాత్తత్ర యుక్తం నాన్యత్రేతి చేన్న, క్షీరాదీనామపి దధ్యా

---

నట్టిప్రయత్న మెవ్వరును చేయరు. సువర్ణముకంటె యాభర
ణమువలె] కారణముకంటె విశేషస్వరూపమున కార్యము
కాన్పించుచున్నంత మాత్రముచేత అది మరియొక వస్తువు
గానేరదు. దేవదత్తుడు తన హస్తపాదములను ముడుచుకొని
యున్నపుడవ్వాని చాచుకొని యున్నప్పటికంటె విశేష
స్వరూపముతో కాన్పించుచున్నాడు. అంతమాత్రముచే మఱి
యొక మనిషియగుట లేదు. అతడేనని గుర్తించుచున్నాము.
అదేవిధమున మన నావరించియున్న పిత్రాదిబంధువు లనుదిన
మనేకమార్పులను చెందుచున్నను, ఇతడు నాతండ్రి, ఇతడు
నాసోదరుడు, ఇతడు నాకొమరుడని గుర్తించుచునేయున్నాము.
వారల కనుదినము మార్పులు కలుగుచున్నను అట్టిమార్పులు
నూతనములగు జన్మమరణములవలన గలిగినవిగావు [మృత్స్వ
రూపము మారి ఘటముత్పన్నమగుచున్నది. ఘటరూపము
నశించినపుడు ఘటము లేకుండపోవుచున్నది. ఈ విధమగు]
ఉత్పత్తి వినాశ నిమిత్తములగు మార్పులు పితృపుత్రాదుల
యందు లేవు కనుక నీయుదాహరణ మిచట తగదంటి రేని

ద్యాకారసంస్థానస్య ప్రత్యక్షత్వాత్. అదృశ్యమానానామపి వట ధానాదీనాం సమానజాతీయావయవాంతరోపచితానామంకురాది భావేన దర్శన గోచరతాపత్తౌ జన్మసంజ్ఞా, తేషామేవావయవానా మపచయవశాదదర్శనాపత్తావుచ్ఛేదసంజ్ఞా. తత్రేదృగ్జన్మోచ్ఛేదాంత రిత్వేన చేదసతస్సత్త్వాపత్తిః సతశ్చాసత్త్వాపత్తిః, తథా సతి గర్భ వాసిన ఉత్తానశాయినశ్చ భేదప్రసంగః, తథా చ బాల్యయౌవన స్థావిరేష్వపి భేదప్రసంగః, పిత్రాదివ్యవహారలోపప్రసంగశ్చ, ఏతేన క్షణభంగవాదః ప్రతిపదితవ్యః.

---

అది సరికాదు. కారణమగు క్షీరాదులు స్వరూపనాశనమును బొంది దధ్యాది నూతనమగు కార్యరూపమును బొందినను గుర్తింపబడుచునే యున్నవి. స్వస్వరూపముచే గుర్తిం చుటకు వీలుకాని మట్టివిత్తనములుగూడ నాజాతికిచెంది వృద్ధి యయి కాన్పించు నంకురాదులవలన నవి పుట్టుచున్నవియని చెప్పుట యుక్తమగుచున్నది. అంకురాది రూపమును బొంది యావిత్తనము లారూపమున నదృశ్యము లగుటవలన నశించి నవనియు చెప్పుదుము. ఈవిధములగు నుత్పత్తి వినాశముల చేత, లేనివస్తు వుత్పన్న మగుచున్నదనియు, ఉన్నవస్తువు నశించుచున్నదనియు చెప్పశక్యముకాదు. అట్లుకానిచో, మాతృగర్భమునందున్న శిశువు, జన్మించినతరువాత తల్లిచే పరుండపెట్టబడిన శిశువు భిన్నములు కావలసివచ్చును. అదే రీతిన బాల్య యౌవన వార్ధక్యములను బట్టియు మనుజులు భిన్నులు కావలసివచ్చును. అపుడు పితృ (భ్రాతృ పుత్ర) సంబం ధములు వీడిపోవలయును. ఇందువలన బౌద్ధుల క్షణికవాదము గూడ ప్రత్యుత్తరము చెప్పబడుచున్నది.

యస్య తు పునః ప్రాగుత్పత్తేరసత్కార్యం తస్య నిర్విషయః కారకవ్యాపారస్స్యాత్, అభావస్య విషయత్వానుపపత్తేః, ఆకాశహననప్రయోజనఖడ్గాద్యనేకాయుధప్రయుక్తివత్, సమవాయికారణవిషయః కారకవ్యాపారస్స్యాదితి చేత్, న, అన్యవిషయేణ కారకవ్యాపారేణాన్యనిష్పత్తేరతిప్రసంగాత్. సమవాయికారణస్యైవాత్మాతిశయః కార్యమితి చేత్ న, తర్హి సత్కార్యతాపత్తిః. తస్మాత్ క్షీరాదీన్యేవ ద్రవ్యాణి దధ్యాదిభావేనావతిష్ఠమానాని కార్యాఖ్యాం లభంత ఇతి న కారణా

---

ఉత్పత్తికిపూర్వము కార్యములేదని వాదముచేయు వారి మతమునందు మనుజులు చేయు కార్యవ్యాపారమునకు విషయము లేకపోవలసివచ్చును. అభావము కార్యవిషయము కానేరదు. ఆకాశమునందు తూటుబొడుచుట కుపయోగించు ఖడ్గాదిప్రహారణము నిరర్థకము. కార్యకారణములకు గల

అసద్వాదమును శ్రుతి నిరాకరించినది

సమవాయ సంబంధము కార్యవ్యాపార విషయము కానేరదు. విషయమగు సమవాయి కారణసంబంధ ముత్పన్నమగుటకు బదులు తద్భిన్నమగు మఱియొకపదార్థము బుట్టుచున్నది. అది తగదు. [ఘటోత్పత్తి కార్యమునకు ఘటము విషయము. ఆకార్యముచే ఘటమే యుత్పన్నము గావలెనుగాని యన్య ముత్పన్నము గానేరదు.] సమవాయి కారణముకంటె కార్యము భిన్నముగాక దాని స్వరూపాతిశయమే యగుచున్న దంటిరేని సత్కార్యవాదము సిద్ధించుచున్నది. కనుక క్షీరాది ద్రవ్యములు దధ్యాది రూపవిశేషములను బొంది కార్యమని

దన్యతా_ర్యం వర్ష శతేనాపి శక్యం కల్పయితుమ్, తథాచ మూల కారణమేవా త్యాతా_ర్యాత్తేన తేన కార్యాకారేణ నటవత్ సర్వ వ్యవహారాస్పదత్వం ప్రతిపద్యతే. ఏవం యుక్తేః కార్యస్య ప్రాగు త్పత్తేస్సత్త్వమనన్యత్వం చ కారణాదవగమ్యతే. శబ్దాంతరాచ్చై తదవగమ్యతే. పూర్వసూత్రే అసద్వ్యపదేశినశ్శబ్దస్యోదాహృత

ప్రసిద్ధిని బొందుచున్నవి కనుక కారణముకంటె కార్యము వేరని నిశ్చయింప నూరేండ్లకయినను శక్యముగాదు. అందు వలన మూలకారణమగు పరబ్రహ్మమే తుదికార్యమువరకు గల నానా కార్యస్వరూపమున నటునివలె సర్వవ్యవహార ముల కాస్పదమగుచున్నది. [బ్రహ్మమే యాకాశము మొదలు అంతిమకార్యమునగు పురుషునివరకును గల సర్వకార్యరూప ముల వ్యవహరింపబడుచున్నది] ఈ విధమగు యుక్తివాద ముచే నుత్పత్తికి పూర్వము కార్యము కారణమునందభి న్నమై యున్నదియని గ్రహింపబడుచున్నది.

అ॥ ఇంతవరకు జరిగిన శాస్త్రార్థమంతయు ప్రకృత సూత్రమునందలి యుక్తిశబ్దమునకు భాష్యమగుచున్నది. తరు వాత భాష్యమున శబ్దాంతరాత్ చ అను పదములు వివరింపబడుచున్నది.

పూర్వసూత్రమునందు 'అసదేవ ఇదమగ్ర ఆసీత్' (ఛాం. 3–19) అను శ్రుతివాక్యమును బట్టి అసత్తును పలుక రించు శబ్ద ముపయోగింపబడినది. దానికంటె భిన్నమగు సత్తును పలుకరించు శబ్దము శబ్దాంతరమగుచున్నది. అట్టి

త్వాత్ తతోఽన్యస్య సద్వ్యపదేశే శబ్దాంతరమ్ 'సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయ' మిత్యాది 'తదేక ఆహురసదేవేదమగ్ర ఆసీ' దితి చాసత్పక్షముపక్షిప్య కథమసతస్సజ్జాయేతేత్యాక్షిప్య 'సదేవ సోమ్యేదమగ్ర ఆసీ' (ఛాం. 6-2-1) దిత్యవధారయతి, తత్రేదంశబ్దవాచ్యస్య కార్యస్య ప్రాగుత్పత్తేస్సచ్ఛబ్దవాచ్యేన కారణేన సామానాధికరణ్యస్య శ్రూయమాణత్వాత్. సత్త్వాసత్త్వే ప్రసి

---

శబ్దాంతరమువలనగూడ కార్యము కారణమునం దభిన్నముగా నున్నది యని తెలియుచున్నది. "సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయం" (ఛాం. 6-2-1) ఓయి ప్రియదర్శన! సృష్టికి పూర్వమది యంతయు సద్రూపముగానే యుండెను. దానికి సజాతీయ విజాతీయ స్వగతభేదములు లేవు. అను శ్రుతి గలదు. ఇది యంతయు సృష్టికి పూర్వ మసత్తుగానే యుండెనని గొందఱనుచున్నారని శ్రుతి యసత్పక్షము నచట యుపపాదించి అసత్తునుండి సత్తు యెట్లుత్పన్నము కాగలదని యా యసత్పక్షము నాక్షేపించినది. ఈ యాక్షేపణమునకు సమాధానముగ సృష్టికిపూర్వ మిదియంతయు సద్రూపముగానే యుండెనని యవధారణముచే నిర్ధారణచేయబడినది. ఆ శ్రుతివాక్యమునందు ఇదం-ఇది యను శబ్దముచే చెప్పబడుచున్న పరిదృశ్యమానమగు జగత్కార్యమంతయు నుత్పత్తికిపూర్వము సచ్ఛబ్దముచే చెప్పబడుచున్న కారణముతో సమాన ప్రతిపత్తి కలిగియున్నట్లుదాహరింపబడుచున్నది. అందువలన నీ జగత్కార్యము కారణమునం దభిన్నమైయు

ద్ధ్యతః. యది తు ప్రాగుత్పత్తేరసత్కార్యం స్యాత్పశ్చాదుత్పద్య మానం కారణే సమవేయాత్ తదాన్యత్కారణాత్స్యాత్ తత్ర 'యేనాశ్రుతం భవతీ' (ఛాం. 6-1-3) యం ప్రతిజ్ఞా పీడ్యేత. సత్త్వానన్యత్వావగతేస్త్వియం ప్రతిజ్ఞా సమర్థ్యతే.

---

న్నట్లు సిద్ధమగుచున్నది. ఉత్పత్తికి పూర్వము కార్యము లేనిదై ఉత్పత్త్యనంతరము కారణమునందు సమవాయముచే సంబంధించినచో, నది కారణముకంటె నన్యముకావలెను, అప్పుడు "ఏది వినిన వినబడనిది వినబడినది యే యగుచున్నది" యను నేకవిజ్ఞాన శ్రుతికి భంగము కలుగును. [ఉద్దాలకుడు విద్యాగర్వితుడగు తనకుమారుడగు శ్వేతకేతువున కాత్మజ్ఞాన ముపదేశించుటకై "ఏది దెలిసిన వినబడనిది వినబడినది యగునో, తెలియబడనిది తెలియబడినది యగునో దానిని నీవు నీ గురువువలన తెలిసికొంటివా యని యడిగెను. అతని కీ విషయము తెలియనందున నద్దాని తెలియ చెప్పుటకై సదేవ సోమ్యేదమగ్రసీత్తని ప్రారంభించి యనేకోదాహరణములచే నా విషయము నుపదేశించెను. (ఛాం. 6-1-2) ఖండికల జ్ఞాపకము చేసికొనతగును.] కార్యము కారణమునం దనన్యముగ నున్నపుడే యిట్టి యేకవిజ్ఞానప్రతిజ్ఞ సమర్థింప శక్యము. 18

అసద్వాదము ఏక విజ్ఞాన శ్రుతికి విరుద్ధము.

అ॥ కారణమునందు కార్య మనభివ్యక్తముగ నున్న దనువిషయ ముదాహరణాంతరముచే రాబోవుసూత్రమున వివరింపబడినది.

## పటవచ్చ (సూ. 19)

యథా చ సంవేష్టితః పటో న వ్యక్తం గృహ్యతే కిమయం పటః కిం వాన్యద్ద్రవ్యమితి. స ఏవ ప్రసారితో యత్సంవేష్టితం ద్రవ్యం స పట ఏవేతి ప్రసారణేనాభివ్యక్తో గృహ్యతే. యథా చ సంవేష్టనసమయే పట ఇతి గృహ్యమాణోఽపి న విశిష్టాయామవిస్తారో గృహ్యతే, స ఏవ ప్రసారణసమయే విశిష్టాయామవిస్తారో గృహ్యతే, న సంవేష్టితరూపాదన్యోఽయం పట ఇతి, ఏవం తంత్వాదికారణావస్థం పటాదికార్యమస్పష్టం సత్తురీవేమకువిందాదికారకవ్యాపారాభివ్యక్తం స్పష్టం గృహ్యతే. అతస్సంవేష్టితప్రసారితపటన్యాయేనైవానన్యత్కారణాత్కార్యమిత్యర్థః

---

పటమువలెనే–

వస్త్రము ముడువబడినపుడు వస్త్రమా మఱియొక ద్రవ్యమాయని స్పష్టముగ దెలియలేకున్నాము. విస్తరించినపుడు ముడువబడిన ద్రవ్యము వస్త్రరూపమున నభివ్యక్తమగుచున్నది. ముడువబడినపుడిది వస్త్రమని సామాన్యముగ దెలిసినప్పటికిని, దాని విశిష్టస్వరూపమగు పొడుగు వెడల్పు మొదలగునవి దెలియుట లేదు. ముడుతవిచ్చినపు డవియన్నియును దెలియవచ్చుచున్నవి. అపుడు ముడిచియున్న వస్త్రముకంటె విస్తృతవస్త్రము భిన్నమని తలంచుట లేదు. కార్యరూపమగు పటము కారణమగు నూలుపోగురూపమున నున్నపు డస్పష్టముగ నున్నది, కండె, మగ్గము, సాలె మొదలగువారి కార్యవ్యాపారముచే నభివ్యక్తమై పటరూపమున

అవస్థా భేదము భేద కారణము కాదు

## యథా చ ప్రాణాదిః (సూ. 20)

యథాచ లోకే ప్రాణాపానాదిషు ప్రాణభేదేషు ప్రాణాయామేన నిరుద్ధేషు కారణమాత్రరూపేణ వర్తమానేషు జీవన మాత్రం కార్యం నిర్వర్త్యతే నాకుంచనప్రసారణాదికం కార్యాంతరం తేష్వేవ ప్రాణభేదేషు పునః ప్రవృత్తేషు జీవనాదధికమాకుంచనప్రసారణాదికమపి కార్యాంతరం నిర్వర్త్యతే. న చ ప్రాణ

---

స్పష్టముగ తెలియుచున్నది. కనుక ముడుపు విడుపులచే అస్పష్టాస్పష్టముల నున్న పటమురీతిని కార్యము కారణము భిన్నముగాదని యర్థము. 19

అ॥ ఈ యర్థము నే మఱియొక యుదాహరణముచే రాబోవు సూత్రమున వివరించుచున్నారు.

ప్రాణాదులవలెనే—

ప్రాణవాయుభేదములగు ప్రాణాపాన వ్యానోదాన సమానాది వాయువులు ప్రాణాయామముచే నరికట్టబడి వాని కారణమగు ప్రాణవాయురూపమున నుండగా, ప్రాణధారణ కార్యముమాత్రము నిర్వహింపబడుచున్నది. [అపానాదీతర వాయువులన్నియు ప్రాణవాయుభేదములై శరీరమునందు వివిధకార్యముల నొనర్చుచున్నవి.] అప్పుడు శరీరావయవము లను ముడుచుట చూచుట మొదలగు కార్యములనది చేయదు. ప్రాణభేదములగు నపానాదులు ప్రకృతములగుచుండగా కేవల జీవనధారణముకంటె నధికములగు నవయవ ప్రసారణ సంకోచ

భేదానాం ప్రభేదవతః ప్రాణాదన్యత్వం సమీరణస్వభావావిశేషాత్, ఏవం కార్యస్య కారణాదనన్యత్వం. అతశ్చ కృత్స్నస్య జగతో బ్రహ్మకార్యత్వాత్ తదనన్యత్వాచ్చ సిద్ధైషా శ్రౌతీ ప్రతిజ్ఞా 'యేనా శ్రుతం శ్రుతం భవత్యమతం మతమవిజ్ఞాతం విజ్ఞాతమి'తి (ఛాం. 6-1-1).

---

ప్రాణవాయూదాహరణము

నాదిక్రియాంతరముల నాచరించుచున్నాము. అపానాదులు ప్రాణవాయువుకంటె భిన్నముగ కాన్పించుచున్నంత మాత్రముచే నవి ప్రాణవాయువుకంటె నన్యములుకావు. వాయుస్వభావము వానికన్నిటికిని సామాన్యమగుచున్నది. ఇట్లుగూడ కారణముకంటె కార్యమన్యముగాదని తెలియుచున్నది. అందువలన పరిదృశ్యమానమగు నీ సమస్త జగత్తు బ్రహ్మకార్యమగుచున్నది. అద్దానికంటె ననన్యముగూడ నగుచున్నది. కనుక దేని జ్ఞానముచే వినబడనిది వినబడినది యగుచున్నది, మననము చేయబడనిది మననము చేయబడినది యగుచున్నదో యని ఛాందోగ్య శ్రుతి ప్రతిపాదితమగు ప్రతిజ్ఞ సిద్ధమగుచున్నది. [కార్యము అనభివ్యక్తస్వరూపమునందు కారణముకంటె భిన్నముకాదని చూపుటకు పటోదాహరణము, కారణరూపముకంటె భిన్నరూపమున నభివ్యక్తమైనను, కార్యము కారణముకంటె భిన్నముకాదని చూపుటకు ప్రాణోదాహరణముదాహరింపబడినవి, కార్యముపాదాన కారణమునందున్నట్లుభయోదాహరణములు వ్యక్తము చేయుచున్నవి.]

అధికరణ సంక్షిప్తార్థము: లోకమునందలి భోక్తృభోగ్య విభాగము పరమార్థముకాదు. వాచారంభణశ్రుతి కార్యకారణముల కనన్యత్వమును బోధించుచున్నది. వికారమంతయు నామరూపమాత్రము, అసత్యము. బ్రహ్మము పరమకారణము, తక్కిన దంతయు వికారము అనృతము. తేజోబన్నములు వాని వికారములుగూడ నసత్యములు బ్రహ్మాత్మకములు. ఇట్లు గ్రహించుటవలన నేకవిజ్ఞానసిద్ధి గలుగును. మృత్తికేత్యేవ అనుచోటి ఏవ పదము భేదాభేదవాదమును త్రోసిపుచ్చుచున్నది, జీవుడే బ్రహ్మమను జ్ఞానముచేత యాతని నానాత్వము తొలగుచున్నది. క్రియాకారకఫలాత్మకమగు సర్వవ్యవహారము నశించును. నానాత్వము సంసారకారణము. జీవబ్రహ్మైక్యజ్ఞానము కలుగనపుడు లోకవ్యవహారము సత్యమగును. లోకవ్యవహారమంతయు నవిద్యాకల్పితమై అనృతమైనను, అద్దానిజ్ఞానము స్వప్నజ్ఞానమువలె అసత్యము కాదు. అసత్యములగు స్వప్నములు ఫలములిచ్చినట్లె జీవుడు అయథార్థమగు జ్ఞానముగూడ ఫలకారులగును. అకారాది రేఖ లసత్యములైనను వానివలన సత్యమగు నక్షరజ్ఞానము కలుగుచున్నది. ఆత్మైకత్వజ్ఞానముచే సర్వవ్యహార జ్ఞానము నశించును. బ్రహ్మము కూటస్థము. సర్వవికారరహితము. శ్రుతి సర్వవస్తునిషేధముచేతనే సద్దాని బోధించుచున్నది. సృష్ట్యాదిశ్రుతులు బ్రహ్మజ్ఞానోపాయములు. బ్రహ్మము సర్వజ్ఞమగు నీశ్వరరూపమున జగత్కారణ మగుచున్నది. ప్రకృతి ఆతని మాయాశక్తి. ఆతడు

నామరూపములకంటె భిన్నుడు. విజ్ఞానాత్మలకు శాసనకర్త. సర్వజ్ఞత్వాదులు బ్రహ్మము యొక్క తటస్థలక్షణము. కర్తృత్వాదు లవిద్యాకల్పితములు. కారణమున్నపుడే కార్యముపలబ్ధమగుచున్నది. మృత్తు లేక ఘట ముత్పన్నము కానేరదు. కారణజ్ఞానము కార్యజ్ఞానముతో పాటు కలిగినపుడే కార్యకారణ జ్ఞానముల కనన్యత్వము చెప్పవగును. ఘటజ్ఞానముతో పాటు మృత్తికాజ్ఞానము కలుగుచున్నది. కార్యకారణముల కనన్యత్వము ప్రత్యక్షముగ కాన్పించుచున్నది. తంతువులకంటె వస్త్రమునకు వేరు రూపము లేదు. అగ్న్యాదులయందనుమానప్రమాణములచేత కార్యకారణముల కభేద మూహింపబడుచున్నది. ఈ విధముగనే పరమకారణమగు బ్రహ్మమునకును తత్కార్యమగు జగత్తునకును ననన్యత్వమూహింపతగును. కారణమునందుత్పత్తికి పూర్వము కార్యముకలదు. లేనిచో నక్కార్యమా కారణమునుండి యుత్పన్నము కాలేదు. ఇద మగ్ర ఆసీత్ అను శ్రుతి ఆ విధముగ పలుకుచున్నది, ఇసుకనుండి తైలము లభింపదు. అసద్వా యను వాక్యము సృష్టికి పూర్వము కార్యమత్యంతము లేదని చెప్పుటలేదు. సృష్టికి పూర్వాపరములయందు గల ధర్మ భేదమును మాత్రము చెప్పుచున్నది. వాక్యశేష మీ యర్థమును బలపఱచుచున్నది. ప్రకృతము కాన్పించుచున్న ధర్మములు సృష్టికిపూర్వము లేవని యసచ్ఛబ్దార్థము. క్షీరమునందు దధి యుండుటచేతనే దధిని గోరువాడు క్షీరమును గ్రహించుచున్నాడు. అటుల కానిచో నన్నిటినుండి

నన్నియు నుత్పన్నము కావలెను. ఒక్కొక్క వస్తువునం దొక్కొక్కకార్యము నుత్పాదనముచేయు శక్తి గలదు. ఇదియే సత్కార్యవాద సూత్రము. కార్యకారణములకు భేదబుద్ధి లేకుండుటచే వానికి తాదాత్మ్యభావము చెప్పవల యును. కార్యకారణములకు సమవాయసంబంధము కుదరదు. కార్యోత్పత్తికి పూర్వము కర్త లేనిచో కార్యోత్పత్తి కలుగ నేరదు. ఉత్పత్తికిపూర్వము ఘట మేదో యొకరూపమున ఉండితీరవలయును. ఉత్పన్నమైయున్న కారణమునకును ఉత్ప న్నము కాబోవు కార్యమునకును గల సంబంధ ముత్పత్తి యన వీలులేదు. ఉత్పన్నమైయున్న రెండు వస్తువులకు మాత్రమే యే సంబంధమైనను యేర్పడును. అన్యతర మత్యం తము లేనప్పుడే సంబంధము ఘటింపదు. ఉత్పత్తికి బూర్వమున్న వస్తువే క్రియావ్యాపారముచే నభివ్యక్తము చేయబడి నూతన రూపమునందుగూడ పూర్వరూపము గుర్తింపబడుచున్నది. సువర్ణము. వృక్షాంకురములు, నిత్యము మార్పుచెందుచున్న పితృపుత్రాదులిందు కుదాహరణములు. కనుక అసత్కా ర్యవాదము సద్వాదము కాదు. అసత్తునుండి సత్తు ఉత్ప న్నము కానేరదని శ్రుతి ఆక్షేపించినది. అసద్వాద మేక విజ్ఞాన శ్రుతికి విరుద్ధము, అవస్థాభేదముచే కార్యకారణములు భిన్నములు కావు. ప్రాణవాయు వనేకరూపముల బొందుచు న్నది. ఆ విధముగనే జగత్తంతయు బ్రహ్మరూప మగుచు న్నది. అందువలన నేకవిజ్ఞానశ్రుతి సార్థకమగుచున్నది. 20

# (7) ఇతరవ్యపదేశాధికరణమ్ (సూ. 21–23)

## (7) ఇతరవ్యపదేశాధికరణము

అ॥ కార్యము కారణముకంటె ననన్యమని చెప్పుటచే ఛాందోగ్యశ్రుతియందు జేయబడిన ఏకవిజ్ఞానశ్రుతి ప్రతిజ్ఞయు జీవునియొక్క బ్రహ్మానన్యత్వము గూడ సిద్ధముచేయబడినవి. అట్లయినచో జీవుడు చేయు నహితకార్యాచరణాదులు బ్రహ్మమునందు ప్రసక్తములు కావలసివచ్చుచున్నవను సందేహమును నివారించుట కీయధికరణము రచింపబడినది.

విషయము : జగదుపాదనమగు బ్రహ్మము జీవునికంటె వ్యతిరిక్తముగాదని సమన్వయముచేయుట

విశయము : అటువంటి బ్రహ్మము జగత్తు నుత్పత్తి చేసినచో, తన కనిష్టమగుదానిని ఉత్పత్తి చేయకుండుట న్యాయముగనుక జీవబ్రహ్మలకు విరుద్ధముగలదా లేదా యనిసందేహము

పూర్వపక్షము : బ్రహ్మమునకు హితాకరణము సంప్రాప్తమగును కనుక సమన్వయము కుదరదు.

సిద్ధాంతము : హితాకరణదోషము లేదుగనుక సమన్వయము చేయతగును.

అవలోకనీయములగు ప్రమాణవాక్యములు :

ఛాం. 6–8–7, తై. 2–6, ఛాం. 6–3–2, బృ. 2–4–5 ఛాం. 8–7–1, 6–8–1; బృ. 4–3–35.

# ఇతరవ్యపదేశాద్ధితాకరణాదిదోషప్రసక్తిః (సూ. 21)

పూ. పక్షీ : అన్యథా పునశ్చేతనకారణవాద ఆక్షిప్యతే. చేతనాద్ధి జగత్ప్రక్రియాయామాశ్రీయమాణాయాం హితాకరణాదయో దోషాః ప్రసజ్యంతే, కుతః, ఇతరవ్యపదేశాత్, ఇతరస్య శారీరస్య బ్రహ్మాత్మత్వం వ్యపదిశతి శ్రుతిః 'స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో' ఇతి (ఛాం. 6-8-7) ప్రతిబోధనాత్. యద్వా ఇతరస్య చ బ్రహ్మణశ్శారీరాత్మత్వం వ్యపదిశతి 'తత్సృష్ట్వా తదేవాను

---

అ॥ మున్ముందు పూర్వపక్షసూత్ర ముదాహరింపబడుచున్నది,

ఇతర వ్యపదేశాత్, ఇతర = జీవుడు బ్రహ్మకంటె వేఱుగాదనియు లేక ఇతర=బ్రహ్మమునకు శరీరముగలదనియు వ్యపదేశాత్=చెప్పబడుటవలన, బ్రహ్మమునకు హిత అకరణ అది ప్రసక్తిః = జీవులయొక్క ఇష్టానిష్ట సాధనత్వ దోషమంతయు బ్రహ్మమునకు చెప్పవలసివచ్చును.

జగత్తుయొక్క చేతనకారణత్వమును మఱియొకవిధముగ నాక్షేపించుచున్నారు.

పూ. పక్షి : చేతనమగు బ్రహ్మమువలన జగత్తుయొక్క సృష్టిక్రియ గలుగుచున్నది యని యంగీకరించినచో, తనకు హితమగుదానిని చేయకుండుట, అహితమును చేయుట మొదలగుదోషములచట ప్రసక్తములగును. ఏలనన "స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో" (ఛాం 6-8-7) ఓయి శ్వేతకేతూ! అదియె ఆత్మ : ఆ ఆత్మయె నీవగుచున్నావు" అని జీవప్రబోధముచేత జీవుడు బ్రహ్మ

ప్రావిశత్' (తై. 2-6) ఇతి స్రష్టురేవావికృతస్య బ్రహ్మణః కార్యానుప్రవేశేన శారీరాత్మత్వప్రదర్శనాత్ 'అనేన జీవేనాత్మనాను ప్రవిశ్య నామరూపే వ్యాకరవాణీ'తి (ఛాం. 6-3-2) చ పరా దేవతా జీవమాత్మశబ్దేన వ్యపదిశంతీ న బ్రహ్మణో భిన్నశ్శారీర ఇతి దర్శయతి. తస్మాద్యద్బ్రహ్మణః స్రష్టృత్వం తచ్ఛారీరస్యైవేత్యతస్స్వతంత్రః కర్తా సన్ హితమేవాత్మనః సౌమనస్యకరం కుర్యాత్ నాహితం జన్మమరణజరారోగాద్యనేకానర్థజాలమ్.

---

స్వరూపమే యని శ్రుతిచెప్పుచున్నది. జగత్తును సృష్టించి దానిని తానే ప్రవేశించెను అనువాక్యమునందు బ్రహ్మము జీవస్వరూపమని మరియొకశ్రుతి చెప్పుచున్నది. వికారము చెందని బ్రహ్మము సృష్టికర్త అయి కార్యమగు జగత్తును ప్రవేశించినట్లువా హరింపబడుటవలన, బ్రహ్మమే జీవస్వరూపమున నున్నట్లు కాన్పించుచున్నది. [ఇట్లు సూత్రములోని యితరశబ్దము బ్రహ్మముగా గ్రహించినను, జీవునిగా గ్రహించినను వారల కనన్యత్వ మూహింప తగియున్నది.] 'ఆత్మయగు యీ జీవస్వరూపముతో జగత్తును ప్రవేశించి నామరూపముల నభివ్యక్తము చేయుదును' అను మఱియొక శ్రుతి స్పష్టముగ జీవుడు బ్రహ్మముకంటె భిన్నుడు కాడని చూపుచున్నది. కనుక బ్రహ్మమున కాపాదింపబడుచున్న జగత్సర్జనము జీవునిక్రియ యగుచున్నది. అందువలన, సర్జనక్రియయందు స్వతంత్రుడు, సర్వజ్ఞుడు నగుటవలన బ్రహ్మము తనకు హితమగుదానినే నిర్మించునుగాని, ఆహిత

బ్రహ్మము జగత్కారణమైనచో గలుగుదోషములు

న హి కశ్చిదపరతంత్రో బంధనాగారమాత్మనః కృత్వాఽనుప్రవిశతి. న చ స్వయమత్యంతనిర్మలస్సన్నత్యంతమలినం దేహమాత్మత్వేనోపేయాత్ కృతమపి కథంచిద్దుఃఖకరం తదిచ్ఛయా జహ్యాత్ సుఖకరం చోపాదదీత, స్మరేచ్చ మయేదం జగద్బింబం విచిత్రం విరచితమితి, సర్వో హి లోకః స్పష్టం కార్యం కృత్వా స్మరతి మయేదం కృతమితి. యథా చ మాయావీ స్వయం ప్రసారితాం మాయామిచ్ఛయాఽనాయాసేనైవోపసంహరతి, ఏవం శారీరోఽపీమాం సృష్టిముపసంహరేత్, స్వకీయమపి తావచ్ఛరీరం

---

మగు జననమరణ రోగాద్యనేకమగు ననర్థజాలమును నిర్మించడు పరతంత్రుడుగాని వాడెవ్వడును స్వయముగా బంధనగృహమును నిర్మించుకొని అందు ప్రవేశించడు. మఱియు తానత్యంతనిర్మలుడు, అత్యంతమలినమగు శరీరమును తనరూపముగ భావించడు, దుఃఖకరములగు తన చేతల నిచ్ఛాపూర్వకముగా వదలిపెట్టును. సుఖకరమగు దానిని పరిగ్రహించును. నేనుగదా విచిత్రమగు నిట్టి జగద్బింబమును రచియించితిని యని స్మరించుచుండును. లోకమునందు ప్రతి మనుజుడు స్పష్టముగ కాన్పించుచున్న నొక కార్యనిర్మాణమును చేసి దీనిని నేనుగదా చేసితినని స్మరియించును. [సృష్టి నిజముకాదు మాయాకల్పిత మనుకొన్నను] ఇంద్రజాలికుడు తాను కల్పించిన యింద్రజాలము ననాయాసముగ ఇష్టానుసార ముపసంహారించునట్లే జీవుడుగూడ నీజగత్తు నుపసంహరించును. కాని జీవుడు [జగత్తునే గాక] తన శరీరమునుగూడ ననాయసముగ నుపసంహారింప నసమర్థుడగుచున్నాడు. కనుక

శారీరో న శక్యోఽనాయాసేనోపసంహర్తుమ్. ఏవం హితక్రియా ద్యదర్శనాదన్యాయ్యా చేతనాత్ జగత్ప్రక్రియేతి గమ్యతే.

## అధికం తు భేదనిర్దేశాత్ (సూ. 22)

తుశబ్దః పక్షం వ్యావర్తయతి. యత్సర్వజ్ఞం సర్వశక్తి బ్రహ్మ నిత్యబుద్ధముక్తస్వభావం శారీరాదధికమన్యత్తద్వయం జగతస్స్రష్టృ బ్రూమః. న తస్మిన్ హితాకరణాదయో దోషాః ప్రసజ్యంతే, న హి తస్య హితం కించిత్కర్తవ్యమస్తి, అహితం

---

హితక్రియాచరణాదికము కాన్పింపకుండుటవలన జగత్సృష్టి ప్రక్రియకు చేతనము కారణమని తలంచుట న్యాయసమ్మతము గా నేరదు. 21

అ॥ ఇట్టి పూర్వపక్ష సూత్రమునకు ప్రతివచన రూపమున రాబోవు సిద్ధాంతసూత్రము రచియింపబడినది.

తు = మీ పూర్వపక్షము సరికాదు. అధికం = బ్రహ్మము జీవునికంటె నధికుడు, ఏలనన! భేదనిర్దేశాత్ = వారలిరువురికి భేదము నిర్దేశింపబడుచున్నది గనుక.

సిద్ధాంతి: సూత్రమందలి తు శబ్దము పూర్వపక్షమును త్రోసి బుచ్చుచున్నది. సర్వజ్ఞము సర్వశక్తియుతము నిత్యశుద్ధ బుద్ధ ముక్త స్వభావమగు బ్రహ్మము శారీరునికంటె భిన్నము, ఆ బ్రహ్మము జగత్తును సృజియించెనని మేము చెప్పుదుము. అట్టి బ్రహ్మమునందు హితమును చేయమి మొదలగు దోషములు ప్రసక్తములు కానేరవు. అతనికి చేయదగిన హితము గాని పరిహరించదగిన యహితముగాని యెద్దియును లేదు,

వా పరిహర్తవ్యం. నిత్యముక్తత్వాత్. న చ తస్య జ్ఞానప్రతిబంధ
శ్శక్తిప్రతిబంధో వా క్వచిదప్యస్తి, సర్వజ్ఞత్వాత్సర్వశక్తిత్వాచ్చ.
శారీరస్త్వనేవంవిధః, తస్మిన్ ప్రసజ్యంతే హితాకరణాదయో
దోషాః న తు తం జగత్స్రష్టారం బ్రూమః. కుత ఏతత్? భేద
నిర్దేశాత్ 'ఆత్మావా అరే ద్రష్టవ్యశ్శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యా
సితవ్యః (బృ. 4-4-5) సోఽన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః (ఛాం.
8-7-1) సతా సోమ్య తదా సంపన్నో భవతి (ఛాం. 6-8-1)
శారీర ఆత్మా ప్రాజ్ఞేనాత్మనాన్వారూఢః' (బృ. 4-3-35) ఇత్యేవం
జాతీయకః కర్తృకర్మాదిభేదనిర్దేశో జీవాదధికం బ్రహ్మ దర్శయతి.

---

బ్రహ్మము నిత్యము ముక్తస్వభావము, సర్వజ్ఞము, సర్వశక్తి
యుతము నగుటచే నాజ్ఞానమునకుగాని

బ్రహ్మముసర్వజ్ఞము జీవుడుకాడు.

ప్రతిబంధ మేమియునుండ నేరదు. శారీరు
డిట్టివాడు గాడు. అతనియం దహితా
చరణాది దోషములు సంభవించును. అతడు జగత్కర్తయని
మేమనుట లేదు. ఏలనన! జీవబ్రహ్మలకు భేదము చెప్పబడు
చున్నది. బ్రహ్మము సాక్షాత్కారము చేసికొనతగిన వాడు.
శ్రవణము చేయతగును, మననము చేయతగును, నిదిధ్యాస
నము చేయతగును" అనియు, అత డన్వేషింపతగినవాడు,
తెలిసికొన తగినవాడు" అనియు, 'అపుడతడు సత్తుతో
నైక్యమును జెందును" అనియు, ఈజీవుడు ప్రజ్ఞాత్మచే నారూ
ఢుడై యున్నాడు" అనియు నిట్టిజాతికి చెందిన శ్రుతివాక్య
ములు కర్తృ కర్మాది భేదమును పలుకరించుచు బ్రహ్మము
జీవునికంటె అధికమని చూపించుచున్నది.

పూ.పక్షి : నన్వభేదనిర్దేశోఽపి దర్శితః 'తత్త్వమసి' త్యేవం జాతీయకః, కథం భేదాభేదౌ విరుద్ధౌ సంభవేతామ్.

సిద్ధాంతి : నైష దోషః, మహాకాశఘటాకాశన్యాయేనోభయసంభవస్య తత్ర తత్ర ప్రతిష్ఠాపితత్వాత్. అపి చ యదా తత్త్వమసీత్యేవంజాతీయకేనాభేదనిర్దేశేనాభేదః ప్రతిబోధితో భవతి అపగతం భవతి తదా జీవస్య సంసారిత్వం బ్రహ్మణశ్చ స్రష్టృత్వం, సమస్తస్య మిథ్యాజ్ఞానవిజృంభితస్య భేదవ్యవహారస్య సమ్యగ్జ్ఞానేన బాధితత్వాత్, తత్ర కుత ఏవ సృష్టిః కుతో వా హితాకరణాదయో

---

ప్రతిపక్షి ! [జీవబ్రహ్మలకు భేదమును చెప్పుచున్నట్లై] తత్త్వమస్యాది జాతికి చెందిన శ్రుతివాక్యము లభేదముగూడ పలుకరించుచున్నవి. విరుద్ధములగు భేదాభేదములు రెండు నెట్లు సంభవింపగలవు ?

సిద్ధాంతి : ఇది యొకదోషము కాదు. మహాకాశ మొకటి యయినను, ఉపాధిచే ఘటాకాశము, కరకాశము మొదలగు భేదములు సంభవములని యచ్చటచ్చట సిద్ధాంతము చేయబడినది. మఱియు [జీవబ్రహ్మము లకభేదమును దెలుపు వాక్య జాతికి చెందిన] తత్త్వమస్యాది వాక్యము లచే నభేదము బోధింపబడుచుండగ, జీవునియొక్క సంసారిత్వము, బ్రహ్మముయొక్క స్రష్టృత్వముగూడ తొలగి పోవుచున్నది. మిథ్యాజ్ఞానమువలన విజృంభించిన సమస్త భేద వ్యవహారము సమ్యక్ జ్ఞానముచే బాధితమై నశించును. అట్టి స్థాయియందు సృష్టియెక్కడ? హితాకరణాది దోషమెక్కడ?

పరమార్థమునందు జీవబ్రహ్మ భేదము లేదు.

దోషాః, అవిద్యాప్రత్యుపస్థాపితనామరూపకృతకార్యకరణసంఘాతోపాధ్యవివేకకృతా హి భ్రాంతిః హితాకరణాదిలక్షణస్సంసారో న తు పరమార్థతోఽస్తీత్యసకృదవోచామ. జన్మమరణచ్ఛేదనభేదనాద్యభిమానవదేవ, అబాధితే తు భేదవ్యవహారే 'సోఽన్వేష్టవ్యస్సవిజిజ్ఞాసితవ్య' ఇత్యేవంజాతీయకేన భేదనిర్దేశేనావగమ్యమానం బ్రహ్మణోఽధికత్వం హితాకరణాదిదోషప్రసక్తిం నిరుణద్ధి.

అవిద్యచే నామరూపములు కల్పింపబడుచున్నవి. వానిచే కార్యకరణాది భేదసంఘాత మేర్పడుచున్నది. ఇట్టి యుపాధులను ప్రత్యేకింపచేతకాకుండుటవలన హితాకరణాది లక్షణమగు సంసారభ్రాంతి కలుగుచున్నది. పరమార్థమునం దీసంసారము లేదని యనేకమారులు పలికియుంటిమి, సంసారభ్రాంతి జననము, మరణము, ఛేదనము మొదలగు నభిమానమును బోలియున్నది. భేదవ్యవహారము యథార్థ జ్ఞానముచే నంశిపనంతవరకు, అత డన్వేషింపతగినవాడు, తెలిసికొనతగినవాడు మొదలగు వాక్యములచే తెలియబడుచున్న బ్రహ్మముయొక్క అధికత్వము హితాకరణాది దోషమును నివారించుచున్నది. [అనగా జీవబ్రహ్మైక్యజ్ఞానము కలిగినతరువాత సర్వత్వాది దోషములకు తావులేదు. అట్టి జ్ఞానము కలుగనంతవరకు బ్రహ్మము జీవునికంటె నధికుడు గనుక జీవుని దోషము లద్దానికి ఆపాదించవని తాత్పర్యము] 22

అ॥ బ్రహ్మ మఖండైకరూప మగుచుండ జీవేశ్వరులయందు కార్యములయందును వైచిత్ర్య మెట్లుసంభవింపగలదను శంకను దృష్టాంతములచే తరువాత సూత్రమున నివారించుచున్నారు.

## అశ్మాదివచ్చ తదనుపపత్తిః (సూ. 23)

యథా చ లోకే పృథివీత్వసామాన్యాన్వితానామప్యశ్మనాం కేచిన్మహార్హా మణయో వజ్రవైడూర్యాదయోఽన్యే మధ్యమవీర్యాస్సూర్యకాంతాదయోఽన్యే ప్రహీణాశ్శ్వవాయసప్రక్షేపణార్హాః పాషాణాః ఇత్యనేకవిధం వైచిత్ర్యం దృశ్యతే. యథా చైకపృథివీవ్యపాశ్రయాణామపి బీజానాం బహువిధం పత్రపుష్పఫలగంధరసాది వైచిత్ర్యం చందనకింపాకచంపకాదిషూపలభ్యతే. యథా చైకస్యాప్యన్నరసస్య లోహితాదీని కేశలోమాదీని చ విచి

---

అశ్మాఆది వత్ చ = పృథివినుండి జన్మించు వజ్రవైడూర్య పాషణాదిభిన్న సృష్టిపలెనే వైచిత్ర్యము ఉండును, ఆవిధముగనే బ్రహ్మకార్యముల యందుగూడ స్వరూప వైచిత్ర్యము ఉండనోపు, అందువలన తత్ అనుపపత్తిః = పూర్వోక్తదోషము ఉపపన్నము కాదు.

లోకమునందు వివిధములగు పాషాణము లన్నియును పృథివీ సంభవములయినను, కొన్ని యనర్ఘములగు వజ్రవైడూర్యాది మణులగుచున్నవి. కొన్ని సూర్యకాంతాదులు మధ్యమార్ఘము లగుచున్నవి. మఱికొన్ని మూల్యము లేక నీచములై కుక్కలను కాకులను తోలుటకు మాత్రముపయోగించును. ఇట్లనేకవిధమగు వైచిత్ర్యము కాన్పించుచున్నది. విత్తనము లన్నియు పృథివియందు వేయబడునవి యయినను పత్ర పుష్ప ఫల గంధరసములయెడ వివిధమగు వైచిత్ర్యము చందన తాళవృక్షాదులయందు కాన్పించుచున్నది. అన్నరస మొక్కటి యయినను, రక్తము, కేశ

త్రాణి కార్యాణి భవంతి, ఏవమేకస్యాపి బ్రహ్మణో జీవప్రాజ్ఞ పృథక్త్వం కార్యవైచిత్ర్యం చోపపద్యత ఇతి అత స్తదనుపపత్తిః. పరపరికల్పితదోషానుపపత్తిరిత్యర్థః. శ్రుతేశ్చ ప్రామాణ్యాద్వికా

---

ములు, రోమములు మొదలగు వివిధకార్యముల నుత్పాదనము చేయుచున్నది. [పాషాణ దృష్టాంతముచే స్వరూపవైచిత్ర్యము, బీజములచే ధర్మవైచిత్ర్యము, అన్నరస దృష్టాంతముచే ప్రయోజనవైచిత్ర్యము ప్రదర్శింపబడుచున్నది. ఈ యుదాహరణములలో చెప్పబడిన పాషాణ బీజాన్నరసములు మూడును పృథివీ సంబంధము లైనను కొన్నిటికి రూపమునందు, కొన్నిటికి ధర్మమునందు, మఱికొన్నిటికి ప్రయోజనమునను వైచిత్ర్యము కాన్పించుచున్నది.] ఈ విధముగనే బ్రహ్మమొక్కటి యయినను, అద్దానికి జీవుడు ప్రాజ్ఞుడు మొదలగు భేదములు, కార్యవైచిత్ర్యము కాన్పించవచ్చును. [జీవునికంటె భిన్నము కాదు గనుక జీవగత దోషములన్నియు బ్రహ్మమునం దుండవలయు నను పూర్వవాదులు చేయువాదము స్వతః ప్రమాణములగు శ్రుతికి విరుద్ధము లగుచున్నది. కర్తృత్వ భోక్తృత్వాది వికారములన్నియు మిథ్యారూపములగుటంజేసి జీవునికే లేనపుడు సర్వసాక్షియగు పరమేశ్వరునికి యెట్లు చెప్పనగును] కనుక నీవిషయమున అనుపపత్తి ఏమియును లేదు.

జగద్వైచిత్ర్యము బ్రహ్మకారణత్వమునకు విరుద్ధము కాదు.

అనగా బ్రహ్మము జగత్కారణ మను విషయమును గుఱించి ప్రతివాదులు కల్పించిన దోషము

వికారము అనిత్యము

రస్య చ వాచారంభణమాత్రత్వాత్ స్వప్నదృశ్యభావవైచిత్ర్యవ
చ్చేత్యభ్యుచ్చయః.

---

లకు తావులేదని తాత్పర్యము. మఱియు శ్రుతి స్వతఃప్రమా
ణము [దాని ప్రామాణ్యమును నిరసించుటకు తగుకారణము
లేదు. కనుక ప్రతివాదియొక్క అనుమానము శ్రుతి విరుద్ధ
మగుటచే నంగీకార్యము కాదు] వికారమంతయు వాక్కు
మాత్రముచే నిష్పాదితమగుచున్నది. [దర్పణమునందు తన
యాకారమాలిన్యమును చూచుకొని యెవడును దుఃఖింపడు.
అటులనే జీవునియం దాభాసమాత్రముగనున్న సంసారము
బ్రహ్మకు విచారకారణము కాదు.] స్వప్నమునందు విచిత్ర
భావము లనేకములు కాన్పించుచున్నవి. అయినను స్వప్న
ద్రష్ట యొకడే యగుచున్నాడు. [అటులనే చిదాత్మయొకడే
అయినను, జీవేశ్వరాది వైచిత్ర్యమునకు విరోధములేదు.]
అందువలన బ్రహ్మము జగత్కారణమను వాద మభ్యుచ్చ
యము నొందుచున్నది.

అధికరణ సంక్షేపార్థము: సర్జనప్రవేశ శ్రుతులచే జీవ
బ్రహ్మముల కనన్యత్వము సిద్ధమగుచున్నది. కనుక జగత్సర్జన
క్రియ జీవునిదేయనదగును. జీవుడు తనకు హితమైనదానిని
సృజించునుగాని అహితమైనదానిని సృజింపడు. బ్రహ్మము
శుద్ధము. మలినమగు శరీరమును తనదిగ భావింపడు. ఇంద్ర
జాలికునివలె జీవుడు తా సృజించిన జగత్తు నుపసంహరింప
శక్తుడు కావలెను. కనుక చేతనము జగత్కారణము కానే
రదు. ఇది పూర్వపక్షము. ఇందుకు సిద్ధాంతి సమాధానము:

బ్రహ్మము నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావము. సర్వజ్ఞము. అతనికి ప్రతిబన్ధకారణములు లేవు. జీవు డట్టివాడు కాడు. బ్రహ్మము సాక్షాత్కార్యము; జీవుడు ప్రజ్ఞాత్మచే నారాధ్యుడు. బ్రహ్మము జీవునికంటె నధికము, ఇట్టి జీవబ్రహ్మ భేదము ఉపాధికృతము. పరమార్థమున అట్టి భేదము లేదు. అట్టి పరమార్థజ్ఞానము కల్గువరకు జీవబ్రహ్మభేదము ఉండకతప్పదు. సృష్టి వైచిత్ర్యము బ్రహ్మకారణత్వమునకు విరుద్ధము కాదు. వైచిత్ర్యమంతయు నామమాత్రము. 23

(8) ఉపసంహారదర్శనాధికరణము

అ॥ జీవబ్రహ్మలకు కాన్పించుచున్న భేద ముపాధిగతమగుటచే జీవదోషములు బ్రహ్మము నాపాదింపనేరవుగనుక బ్రహ్మము జగత్కారణము కావచ్చునని పూర్వాధికరణ భావము. ఉపాధివలన విభిన్నమగు సహకారి సంపత్తి లేదు గనుక బ్రహ్మము జగత్కారణము కానేరదను పూర్వపక్షమునకు ప్రకృతాధికరణమున సమాధానము చెప్పుటకుత్తర సూత్ర మారంభింపబడుచున్నది.

విషయము : అసహాయమగు బ్రహ్మమునందు జగత్సృష్టి సమన్వయము.

విశయము : నిస్సహాయమగునది కారణము కానేరదను లౌకిక న్యాయమునుబట్టి నిస్సహాయమగు

## ఉపసంహారదర్శనాన్నేతిచేన్న క్షీరవద్ధి (సూ. 24)

చేతనం బ్రహ్మైకమద్వితీయం జగతః కారణమితి యదుక్తం తన్నోపపద్యతే. కస్మాదుపసంహారదర్శనాత్. ఇహ హి లోకే కులాలాదయో ఘటపటాదీనాం కర్తారో మృద్దండచక్ర

---

బ్రహ్మము జగత్కారణ మగునా లేదా యని సందేహము.

పూర్వపక్షము : బ్రహ్మము నిస్సహాయముగనుక జగత్కారణము కాదు.

సిద్ధాంతము : జగత్కారణ మగుచున్నది.

అవలోకనీయములగు ప్రమాణవాక్యములు :

శ్వేత 6-2-

ఉపసంహార దర్శనాత్ = లోకమునందు మనుజుడు చేయదలచిన కార్యమునకు అనుకూలించు సాధనములను సంపాదించుకొనుట కాన్పించుచుండుటవలన న, ఇతిచేత్ = బ్రహ్మమునకు జగత్సర్జనక్రియయం దట్టి సాధనసంపత్తి కానరాకుండుటచే అతడు జగత్కర్త కానేరడంటివేని న=అది సరి కాదు. హి = ఏలనన్న! క్షీరవత్ = క్షీరము బాహ్యసాధనము కోరకయె దధిగ మారుచున్నది. అటులనే బ్రహ్మము గూడ!

పూ. పక్షి : చేతనము, ఏకము, అద్వితీయమునగు బ్రహ్మము జగత్కారణ మనుట సహేతుకముగాదు. ఏలన! సాధనముల సమకూర్చుట కాన్పించుచున్నది. ఘటపటాదులను తయారుచేయు కులాలాదులు మృత్తు దండము చక్రము నూలు

సూత్రసలిలాద్యనేకకారకోపసంహారేణ సంగృహీతసాధనాస్సంతః తత్తత్కార్యం కుర్వాణాః దృశ్యంతే, బ్రహ్మ చాసహాయం తవాభిప్రేతం, తస్య సాధనాంతరానుపసంగ్రహే సతి కథం స్రష్టృత్వముపపద్యేత, తస్మాన్న బ్రహ్మజగత్కారణమితి చేత్.

సిద్ధాంతీ : నైష దోషః. యతః క్షీరవద్ద్రవ్యస్వభావవిశేషాదుపపద్యతే. యథా హి లోకే క్షీరం జలం వా స్వయమేవ దధిహిమకరకాదిభావేన పరిణమతే అనపేక్ష్య బాహ్యం సాధనం తథేహాపి భవిష్యతి.

పూ.పక్షీ : నను క్షీరాద్యపి దధ్యాదిభావేన పరిణమమానమపేక్షత ఏవ బాహ్యం సాధనమౌష్ణ్యాదికం, కథముచ్యతే క్షీరవద్ధీతి.

---

మొదలగనేక సాధనములను సమకూర్చి ఆ యా కార్యముల నెరవేర్చుట లోకమునందు కాన్పించుచున్నది. బ్రహ్మ మసహాయమని మీ వాదము. సాధన్నాంతరములు లేనపుడతనికి స్రష్టృత్వ మెట్లుసంభవించును? కనుక బ్రహ్మము జగత్కారణము కానేరదు.

సిద్ధాంతి : ఇది యొక దోషముకాదు. క్షీరమునవలెనే వస్తుస్వభావముచేతనే యదిసంభవించును. లోకమునందు బాహ్యసాధనము నపేక్షింపకయె క్షీరము దధిగాను

బ్రహ్మమునకు సృష్టి సాధనావసరములేదు

జలము మంచుగడ్డగాను స్వయముగా మారుచున్నది. అలాగునే సృష్టివిషయమునగూడ జరుగును.

పూ. పక్షి : క్షీరము దధిగ పరిణామము నొందక పూర్వము కాగపెట్టుట మొదలగు బాహ్యసాధనము లవస

సిద్ధాంతీ : నైష దోషః, స్వయమపి హి క్షీరం యాం చ యావతీం చ పరిణామమాత్రామనుభవత్యేవ. త్వార్యతే త్వౌష్ణ్యా దినా దధిభావాయ. యదిచ స్వయం దధిభావశీలతా న స్యాన్నై వౌష్ణ్యాదినాపి బలాద్దధిభావమాపద్యేత. న హి వాయురాకాశో వౌష్ణ్యాదినాపి బలాద్దధిభావమాపద్యతే, సాధనసామగ్ర్యా చ తస్య పూర్ణతా సంపద్యతే. పరిపూర్ణశక్తికం తు బ్రహ్మ. న తస్యాన్యేన కేనచిత్పూర్ణతా సంపాదయితవ్యా. శ్రుతిశ్చాత్ర భవతి 'న తస్య కార్యం కరణం చ విద్యతే న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీజ్ఞానబలక్రియాచ'

---

రము లగుచున్నవి. కనుక సృష్టివిషయమై క్షీరసామ్యము నెట్లు చెప్పనగును ?

సిద్ధాంతి : ఇది దోషముకాదు. క్షీరము స్వభావముచే స్వయముగా దధిపరిణామమును పొందగలదు. కాచుటచే నట్టిపరిణామము త్వరచేయబడుచున్నది. స్వయముగా క్షీరమునం దట్టి స్వభావము లేనిచో, కాచి దధిగామారుట కద్దాని బలవంతము చేయలేము. వాయువునుగాని ఆకాశమునుగాని వెచ్చపెట్టి దధిగామార్చలేము. కాచుట మొదలగు సాధనసామగ్రిచే క్షీరము పూర్ణముగ దధిపరిణామమును బొందుచున్నది. బ్రహ్మము పరిపూర్ణశక్తియుతము. మఱియొకదానిచే దేనిచేతనుగూడ నద్దానికి పరిపూర్ణత్వమును సమకూర్చుటకు సాధ్యముగాదు. ఈశ్వరునకు దేహాది, సాధనము లేదు. అతనికి సముడుగాని, అతనికంటె నధికుడుగాని కానరాడు. ఉత్కృష్టమగు నతనిమాయాశక్తి వివిధము, స్వభావ

(శ్వేత. 6-8) ఇతి. తస్మాదేకస్యాపి బ్రహ్మణో విచిత్రశక్తి యోగాత్ క్షీరాదివద్విచిత్రః పరిణామ ఉపపద్యతే.

## దేవాదివదపి లోకే (సూ. 25)

పూ.పక్షీ: స్యాదేతత్, ఉపపద్యతే క్షీరాదీనామచేతనానా మనపేక్ష్యాపి బాహ్యం సాధనం దధ్యాదిభావః దృష్టత్వాత్,

---

సిద్ధము, జ్ఞానసంపాదితమగు క్రియాబలములుగలది యని విన బడుచున్నదియని శ్రుతిచెప్పుచున్నది. కనుక బ్రహ్మ మేకమ యినను, విచిత్రశక్తిసంపన్న మగుటచే క్షీరమువలే విచిత్ర ములగు పరిణామములను బొందుచున్నట్లు కాన్పించుచున్నది. 24

అ॥ బ్రహ్మము చేతనమైనను సాధనములేక సర్జనక్రి యాసమర్థము కానేరదు. చేతనులగు కులాలాదులు మృదాది సాధనములు లేక ఘటాదినిర్మాణమునం దసమర్థులగుచున్నారు. ఈవాదము క్షీరస్వభావ వాదమునకు విరుద్ధముగాదను శంకకు తరువాత సూత్రమున సమాధానమును చెప్పుచున్నారు.

లోకే=మంత్రఅర్థవాద ఇతిహాసపురాణముల యందు దేవ ఆదివత్ = దేవతలు, పితరులు, ఋషులు మొదలగు వారలు స్వభావసిద్ధమగు సామర్థ్యముచేతనే బాహ్యసాధన సహాయమును కోరకనే సంకల్పమాత్రమున నానావిధకార్య ముల చేయుచున్నారు. బ్రహ్మముగూడ అటువలెనే.

పూ. పక్షి. క్షీరముగూర్చి మీ రనినట్లగుగాక! [ఈవాద మన్నిస్థలములయందును నిలువనేరదు]అచేతనములగు

చేతనాః పునః కులాలాదయః సాధనసామగ్రీమపేక్ష్యైవ తస్మై తస్మై కార్యాయ ప్రవర్తమానా దృశ్యంతే, కథం బ్రహ్మ చేతనం సదసహాయం ప్రవర్తేతేతి.

సిద్ధాంతీ : దేవాదివదితి బ్రూమః. యథా లోకే దేవాః పితర ఋషయ ఇత్యేవమాదయో మహాప్రభావాశ్చేతనా అపి సంతోఽనపేక్ష్యైవ కించి ద్బాహ్యం సాధనమైశ్వర్యవిశేషయోగాదభిధ్యాన మాత్రేణ స్వత ఏవ బహూని నానాసంస్థానాని శరీరాణి ప్రాసాదాదీని రథాదీని చ నిర్మిమాణా ఉపలభ్యంతే మంత్రార్థవాదేతిహాస

---

క్షీరాదులు బాహ్యసాధన సహాయ్యములేకనే దధిభావము నొందునుగాక ! లోకమునం దట్లుకాన్పించుచున్నది. కాని చేతనులగు ఘటకారులు మొదలగువా రవసరమగు సాధన సామగ్రిని సమకూర్చుకొనియె తమతమ పనులయందు ప్రవర్తించుచున్నట్లు కాన్పించుచున్నారు. చేతనమయినను బ్రహ్మ మసహాయ్యమై యెట్లు ప్రవర్తించును ?

సిద్ధాంతి : దేవతలు మొదలగువారి వలెనేయని సమాధానము చెప్పుదుము. దేవతలు, పితరులు, ఋషులు మొదలగు వారలు, చేతనులు, గొప్పప్రతిభావంతులునై బాహ్యమగు సాధనము నించుమంతయు గోరకనే, స్వీయమగు నైశ్వర్య విశేషమును గలిగియుండుటచే సంకల్పమాత్రముచేతనే శరీరములు, ప్రాసాదములు, రథములు, మొదలగు అనేక వంస్థలను స్వయముగా నిర్మించుచున్నట్లు ప్రమాణభూతములగు మంత్రార్థవాదాది శాస్త్రము లందును, వృద్ధవ్యవహారము నందును కాన్పించుచున్నది. సాలెపురుగు స్వయముగ దార

పురాణప్రామాణ్యాత్. తంతునాభశ్చ స్వతఏవ తంతూన్ సృజతి, బలాకా చాంతరేణైవ శుక్రం గర్భం ధత్తే, పద్మినీ చానపేక్ష్య కించిత్ప్రస్థానసాధనం సరోఽన్తరాత్ సరోఽన్తరం ప్రతిష్ఠతే, ఏవం చేతనమపి బ్రహ్మానపేక్ష్యైవ బాహ్యం సాధనం స్వతఏవ జగత్స్రక్ష్యతి. స యది బ్రూయాత్.

పూ. పక్షీ : ఏతే దేవాదయో బ్రహ్మణో దృష్టాంతా ఉపాత్తాస్తే దార్ష్టాంతికేన బ్రహ్మణా సమాన స్వభావా న భవంతి, శరీరమేవ హ్యాచేతనం దేవాదీనాం శరీరాంతరవిభూత్యుత్పాదనే ఉపాదానం న తు చేతన ఆత్మా, తంతునాభస్య

---

ములను సృజియించుచున్నది. చాతకపక్షి సంపర్కము లేక నే గర్భమును ధరించుచున్నది. కమలము సాధనమేమియు లేక నే యొక సరోవరము నుండి మఱియొక సరోవరమును జేరుచున్నది. అలాగునే చేతనమగు బ్రహ్మము బాహ్యసాధనమపేక్షింపక నే స్వయముగా జగత్తును సృజియించుచున్నది.

సంకల్పసామర్థ్యముచే సృష్టిక్రియజరుగును.

ఇందుకు పూర్వపక్షి యిట్లు ప్రతివాదము చేయవచ్చును. దృష్టాంతములుగ గ్రహింపబడిన దేవతంతునాభబలాకలు బ్రహ్మముకంటె భిన్నస్వరూపులగు చున్నవి. దేవాదులు శరీరాంతరాదివిభూతుల నుత్పాదనము సేయుటయందచేతనమగు వారిశరీరముపాదాన కారణమగు చున్నది గాని, చేతనమగువారి యాత్మ కారణ మగుటలేదు. సాలెపురుగు లతిస్వల్ప జంతువులను దినుటచే దానిచొంగ శాఖ

చ క్షుద్రతరజంతుభక్షణాల్లాలాకఠినతామాపద్యమానా తంతుర్భవతి. బలాకా చ స్తనయిత్నురవశ్రవణాద్గర్భం ధత్తే. పద్మినీ చ చేతనప్రయుక్తా సతీ అచేతనేనైవ శరీరేణ సరోఽన్తరాత్ సరోఽన్తరముపసర్పతి వల్లీవ వృక్షం, న తు స్వయమేవాచేతనా సరోఽన్తరోపసర్పణే వ్యాప్రియతే, తస్మాన్నైతే బ్రహ్మణో దృష్టాంతా ఇతి.

---

న్యమునొంది దారమగుచున్నది. బలాకి గూడ మేఘధ్వనిని వినుటచే గర్భమును ధరించుచున్నది. కమలము చేతనప్రయుక్తమై అచేతనమగు శరీరముచే తీగె వృక్షముమీదికి ప్రాకినట్లే యొకసరస్సు నుండి మఱియొకసరస్సునకు జరుగును. కాని స్వయముగ నచేతనమగుటవలన మఱియొక సరస్సునకు జరుగలేదు. [కమలము మొదలగు మొక్కలు, యితర తరుగుల్మలతాది జాతులందు చేతనాంశము అచేతనాంశము గలవు. శాఖాపల్లవపుష్పపల్లవాదు లచేతనాంశములు. ఇవి యన్నియు చేతనాంశముచే వృద్ధియగుచున్నవి. వీటియన్నిటికిని సుఖదుఃఖానుభవము గలదు. వీనిని తరుగుటయందు కలుగచేయుచున్న బాధకు ప్రాయశ్చిత్తముగ వైశ్వదేవము విధింపబడుచున్నది. ఇట్టి వృక్షాదులచైతన్యమును నూతన మార్గమున జె. సి. బోస్ మహాశయుడు ప్రదర్శించి పాశ్చాత్య దేశముల నచ్చెరువొందించెను.] అందువలన నివి యెవ్వియు బ్రహ్మవిషయమైన దృష్టాంతములు గానేరవు.

సిద్ధాంతీ : తం ప్రతిబ్రూయాన్నాయం దోషః, కులాలాది దృష్టాంత వైలక్షణ్యమాత్రస్య వివక్షితత్వాదితి. యథా హి కులాలాదీనాం చ సమానే చేతనత్వే కులాలాదయః కార్యారంభే బాహ్యం సాధనమపేక్షంతే న దేవాదయః, తథా బ్రహ్మ చేతనమపి బాహ్యం సాధనమపేక్షిష్యత ఇత్యేతావత్ వయం

---

సిద్ధాంతి: ఇందుకిట్లుసమాధానము చెప్పుదుము. ఇట్టిదృష్టాంత వైషమ్య మొకదోషముకాదు. కులాలదేవాదులకు చేతనత్వము సమానమే, అయినను, కులాలాదులు కార్యార్థము బాహ్యాసాధము నపేక్షించుచున్నారు. దేవతలకయ్యది యవశ్యము కాదు. అలాగే బ్రహ్మము చేతనమయినను బాహ్యసాధనము నపేక్షింపదు. దేవాదుల యుదాహరణముచే నింతమాత్రము చెప్పబడుచున్నది. [ఇచట చేతనత్వశబ్దముచే నహం అను జ్ఞానముగల బుద్ధివృత్తి చెప్పబడుచున్నది. అనగా చైతన్యవిశిష్టమగు దేహాసాధారణమని యర్థముగాని ముఖ్యాత్మ యర్థముగాదు. తనకంటె భిన్నమయిన మఱియొక కారణము లేకుండుటయె అసహాయత్వము. అహంజ్ఞాన విశిష్టమగుబుద్ధి వృత్తియు తమకంటె వ్యతిరిక్తమగు కారణాంతరముయొక్క లేమియుంగూడ దేవతలయందు కాన్పించుచున్నది.కులాలునికి చైతన్యవిష్టమగు దేహమున్నను తద్వ్యతిరిక్తమగు సాధనాంతరమతనికి యవసరమగుచున్నది. దేవతలకువలె బ్రహ్మమునకు శరీరము లేదు.అయ్యది కేవల చైతన్యస్వరూపము. నరులకును దేవతలకును కార్యారంభమునకుగల సామగ్రి

దేవాద్యుదాహరణేన వివక్షామః, తస్మాద్యథైకస్య సామర్థ్యం దృష్టం తథా సర్వేషామేవ భవితుమర్హతీతి నాస్త్యేకాంత ఇత్యభిప్రాయః.

---

యనేకాకారముగనున్నది. [శ్రీకృష్ణుడు సంకల్పమాత్రము చేతనే ద్రౌపదికివలువపరంపరనుప్రసాదించెననివినుచున్నాము] కులాలాదుల కొకశక్తి కాన్పించుచున్నది గనుక ఆశక్తియందరికిని యుండవలయునను నియమము లేదని తాత్పర్యము. 25

అధికరణ సంక్షేపార్థము : బ్రహ్మమునకు సృష్టిచేయుటకు సాధనాపేక్ష లేదు. స్వభావముచేతనే అట్టి శక్తి కలదు. అతని మాయాశక్తి వివిధము. దేవతలు సంకల్పబలముచే క్రియా సిద్ధిని బొందుచున్నారు. సాధనములను కోరుటలేదు. వారలకు శరీరముకలదు. బ్రహ్మమునకు శరీరము గూడలేదు. సంకల్పముచేతనే సృష్టిక్రియ జరుగును.

## (9) కృత్స్నప్రసక్త్యధికరణము

అ॥ పూర్వాధికరణమున నుదాహరింపబడిన క్షీరోదాహరణముచే బ్రహ్మము జగద్రూపమున బరిణామము నొందుచున్నాడను నొక పూర్వపక్షము కలుగుచున్నది. అద్దాని నివారించుటకై యీయధికరణ మారంభింపబడు చున్నది. మున్ముందు రాబోవుసూత్రమున పూర్వపక్షము ముపపాదింపబడు చున్నది.

విషయము : క్షీరోదాహరణముచే బ్రహ్మమునకు సావయవత్వసిద్ధి

## కృత్స్నప్రసక్తిర్నిరవయవత్వశబ్దకోపో వా (సూ. 26)

చేతనమేకమద్వితీయం బ్రహ్మ క్షీరాదివద్దేవాదివచ్చా నపేక్ష్య బాహ్యం సాధనం స్వయం పరిణమమానం జగతః కారణమితి స్థితం, శాస్త్రార్థపరిశుద్ధయే తు పునరాక్షిపతి.

---

విశయము : బ్రహ్మము సావయవమా? నిరవయవమా?

పూర్వపక్షి: ఉభయపక్షములయందు బ్రహ్మము అనిత్యమగును.

సిద్ధాంతి : బ్రహ్మము నిత్యము

అవలోకనీయ ప్రమాణములు : శ్వేత 6-19 ముం 2-1-2, బృ 2-4-42, బృ 3-9-16, 6-8-1. బృ. 4-2-4 4-3-10,

బ్రహ్మము నిరవయవమై పరిణమించునా? సావయవమై పరిణమించునా? మొదటిపక్షమున, కృత్స్నప్రసక్తిః=బ్రహ్మమంతయు కార్యాకారమున పరిణమించుట సంభవించును. వా = లేక రెండవపక్షమున, ఏదో యొకభాగము పరిణమించినను, నిరవయవత్వ శబ్దకోపః = బ్రహ్మము నిష్కలమను నిరవయవత్వ శ్రుతికి విరోధము సంభవించును.

బ్రహ్మము చేతనము అద్వితీయము, క్షీరము దేవతలంబోలి బాహ్యసాధనము నపేక్షింపకయే స్వయముగ జగద్రూపమున పరిణామము నొంది జగత్కారణ మగుచున్నది. ఇది తేలిన పర్యవసానము, విషయము స్పష్టమగుటకు మఱియొక యాక్షేపణను చేయుచున్నారు.

పూ.పక్షీ : కృత్స్నప్రసక్తిః, కృత్స్నస్య బ్రహ్మణః కార్య రూపేణ పరిణామః ప్రాప్నోతి, నిరవయవత్వాత్. యది బ్రహ్మ పృథివ్యాదివత్ సావయవమభవిష్యత్ తతోఽస్యైకదేశః పర్యణం స్యత, ఏకదేశశ్చావాస్థాస్యత, నిరవయవం తు బ్రహ్మ శ్రుతిభ్యోఽవగమ్యతే 'నిష్కళం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజనం. (శ్వేత, 6-19) దివ్యో హ్యమూర్తః పురుషస్సబాహ్యాభ్యంతరో హ్యజః.' (ముండక. 2-1-2) 'ఇదం మహద్భూత మనంతమపారం విజ్ఞానఘన ఏవ (బృ. 2-4-12) స ఏష నేతి నేత్యాత్మాఽస్థూలమనణ్వ' (బృ. 3-9-26—3 8 8) త్యాద్యాభ్య

---

పూర్వపక్షి : బ్రహ్మము నిరవయవము గనుక సకలము జగత్కార్యరూపమున పరిణామము నొందుచున్నది. బ్రహ్మమునకు పృథివ్యాదులవలె నవయవములున్నచో, నేదో యొక భాగము పరిణామము నొందవచ్చును, మిగిలిన భాగ మారూపమున యుండవచ్చును. బ్రహ్మము నిరవయవమని శ్రుతులవలన దెలియుచున్నది. బ్రహ్మము అవయవములు లేనిదిగనుక క్రియాశూన్యము, రాగద్వేషాదిశూన్యము, సర్వదోషశూన్యము, తమశ్శూన్యమునగుచున్నది" పురుషుడు స్వయంప్రకాశుడు, శరీరము లేనివాడు; సర్వవ్యాపి, శరీరమునకు బయటను లోపల నున్నవాడు, జన్మాదివికారములు లేనివాడు; ఈ యద్వయమగు బ్రహ్మమాకాశాదికారణము, మహాంతము, అనంతము, అపారము, విజ్ఞానఘనము. ఆయాత్మ ఇదికాదు ఇదికాదని బోధింపబడుచున్నది; ఆత్మ స్థూలముకాదు; సూక్ష్మముకాదు. ఇట్లనేక

బ్రహ్మముసావయవమైననుజగత్కారణము కాదు.

స్సర్వవిశేషప్రతిషేధినీభ్యః. తత్రైకదేశపరిణామాసంభవాత్ కృత్స్నపరిణామప్రసక్తౌ సత్యాం మూలోచ్ఛేదః ప్రసజ్యేత. ద్రష్టవ్యతోపదేశానర్థక్యం చాపద్యేత, అయత్నదృష్టత్వాత్ కార్యస్య, తద్వ్యతిరిక్తస్య చ బ్రహ్మణోఽభావాత్, అజత్వాదిశబ్దవ్యాకోపశ్చ. అథైతద్దోషపరిజిహీర్షయా సావయవమేవ బ్రహ్మాభ్యుపగమ్యేత, తథాపి యే నిరవయవత్వస్య ప్రతిపాదకాశ్శబ్దా ఉదా

---

శ్రుతులు 'బ్రహ్మము నిర్విశేషమని బలుకుచున్నది. బ్రహ్మము యొక్క యేదోయొక భాగము జగత్తుగ పరిణమించుట యసంభవము. కనుక సకలబ్రహ్మము పరిణమించినది యని చెప్పవలసివచ్చును. అపుడు మొదటికే మోసమువచ్చుచున్నది. [అనగా బ్రహ్మమే లేకపోవలసి వచ్చుచున్నది..] పయత్నము లేకనే ప్రపంచరూపమున బ్రహ్మము కాన్పించుట వలన అంతకంటె వ్యతిరిక్తమగు బ్రహ్మమసంభవము గనుకను ఆత్మావా అరేద్రష్టవ్యః యని [శ్రవణమనన నిదిధ్యాసనాది ప్రయత్నపూర్వకముగ] చేయబడుచున్న యాత్మద్రష్టవ్యోపదేశము నిరర్థక మగుచున్నది. బ్రహ్మము జగద్రూపమున పరిణామము చెందినచో, బ్రహ్మమునకు జరామరణములు లేవను శ్రుతులకు వైరుధ్యము గలుగును. ఇట్టిదోషములను పరిహరింపగోరి బ్రహ్మమున కవయవములు గలవని యంగీకరించవలెను. అపుడుగూడ బ్రహ్మము నిరవయవమని చెప్పు శ్రుతి వాక్యములకు వైరుధ్యము సంభవించును. బ్రహ్మము సావయవమైనచో, [కొంత భాగము పరిణమించుటచే]

హ్యతాస్తే ప్రకుప్యేయుః, సావయవత్వే చానిత్యత్వప్రసంగ ఇతి సర్వథాఽయం పక్షో న ఘటయితుం శక్యత ఇత్యాక్షిపతి.

## శ్రుతేస్తు శబ్దమూలత్వాత్ (సూ. 27)

తు శబ్దేనాక్షేపం పరిహరతి. నఖల్వస్మత్పక్షే కశ్చిదపి దోషోఽస్తి. న తావత్కృత్స్నప్రసక్తిరస్తి కుతః, శ్రుతేః. యథైవ హి బ్రహ్మణోఽవస్థానం శ్రూయతే, ప్రకృతివికారయోర్భేదేన వ్యపదేశాత్ 'సేయం దేవతైక్షత హంతాహమిమాస్తిస్రో

---

యనిత్యముగూడ గావలసివచ్చును. ఏవిధముగా చూచినను బ్రహ్మము జగత్కారణమను వేదాంతి వాదము ఘటింపదు. ఇట్లు పూర్వపక్షి యాక్షేపించుచున్నాడు. 26

అ॥ పరిణామవాదము దుర్ఘటమని యంగీకరించుచు వివర్తవాదమును సిద్ధాంతము చేయుచున్నారు.

బ్రహ్మమునకు పరిణామము లేదు. శ్రుతేః=బ్రహ్మము జగదుపాదానకారణమని శ్రుతి యందు వినవచ్చుటవలన. బ్రహ్మము శబ్దమూలత్వాత్=వేదమువలనమాత్రమే తెలియ గలదు గనుక.

సిద్ధాంతి : తు శబ్దముచేత పై ఆక్షేపణను పరిహరించు చున్నారు. మా వాదమునం దే దోషము లేదు. మావాదము వలన సకలబ్రహ్మము పరిణామమును బొందుననుటకు కారణము లేదు. శ్రుతియె యిందుకు కారణము. శ్రుతులు జగత్తు బ్రహ్మమువలన బుట్టినవని జెప్పినట్లే బ్రహ్మము నిర్వికారముగ గూడ నున్నది యని చెప్పుచున్నవి. 'నా రూప

దేవతా అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరణవాణీ'తి (ఛాం. 6) 'తావానస్య మహిమా తతో జ్యాయాగ్ శ్చ పూరుషః పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివీ'తి (ఛాం. 3-12-6) చైవంజాతీయకాత్, తథాహృదయాయతనత్వవచనాత్, సత్సంపత్తివచనాచ్చ. యది చ కృత్స్నం బ్రహ్మకార్యభావేనోప యుక్తం స్యాత్ 'స తా సోమ్య తదా సంపన్నో భవతీ' (ఛాం. 6-8-1) తి సుషుప్తిగతం విశేషణమనుపపన్నం స్యాత్, వికృతేన బ్రహ్మణా నిత్యసంపన్నత్వాదవికృతస్య చ బ్రహ్మణోఽభావాత్,

---

బ్రహ్మము యొక్క జగత్కారణత్వము శ్రుతిసిద్ధము.

మగు నీ జీవునిచేత తేజోబన్నములనుప్రవేశించి నామరూపముల నభివ్యక్తము జేసెదను'; 'బ్రహ్మము యొక్క మహిమాతిశయము ప్రపంచమెంత పెద్దదియో యంత పెద్దది. దానికంటెను పెద్దది', 'స్థావరజంగమాత్మకములగు భూతములన్నియు నీతనియొక్క నాల్గవ భాగము. మిగిలిన మూడు భాగము లమృతరూపమై ద్యులోకమున నున్నవి': ఈ విధమగు వాక్యములన్నియు కార్యకారణములకు భేదమును తెలియబఱచుచున్నవి. అదే విధముగ ఆ యీ యాత్మ హృదయమునందుగలదు" అను వచనము, "సుషుప్తికాలమునందు పురుషుడు సత్తుతో కూడుకొనియుండును" అను వచనములుగూడ నీ యర్థమునే చెప్పుచున్నవి. సకలబ్రహ్మము కార్యభావమును బొందినచో సుషుప్తియందు సత్తుతో కూడుకొని యుండును అని సుషుప్తి యను విశేషణము నిరర్థకమగుచున్నది. జీవుడెల్లపుడును వికారమునుబొందిన బ్రహ్మముతో

తథేంద్రియగోచరత్వప్రతిషేధాత్ బ్రహ్మణో వికారస్య చేంద్రియ గోచరత్వాపత్తేః, తస్మాదస్త్యవికృతం బ్రహ్మ. న చ నిరవయ వత్వశబ్దవ్యాకోపో ఽస్తి, శ్రూయమాణత్వాదేవ నిరవయవత్వస్యా భ్యుపగమ్యమానత్వాత్. శబ్దమూలం చ బ్రహ్మ శబ్దప్రమాణకం నేంద్రియాదిప్రమాణకం. తద్యథాశబ్దమభ్యుపగంతవ్యమ్. శబ్దశ్చో భయమపి బ్రహ్మణః ప్రతిపాదయత్యకృత్స్నప్రసక్తిం నిరవయ వత్వం చ, లౌకికానామపి మణిమంత్రౌషధి ప్రభృతీనాం దేశకాల

---

సంబద్ధుడగుటచే నవికృతమగు బ్రహ్మము లేకుండ పోవు చున్నది.

బ్రహ్మ మింద్రియగోచరముగాదని "న చక్షుషా గృహ్యతే" "యతో వాచో నివర్తంతే అప్రాప్యమనసా సహ" ఇత్యాది శ్రుతులు వినవచ్చుచుండ వికృతమగు బ్రహ్మము జగద్రూపమున నింద్రియగోచరమగుచున్నది. అందువలన అవికృతమగు బ్రహ్మము గలదని యంగీకరించ

బ్రహ్మము శబ్దైక వేద్యము

వలయును. బ్రహ్మముయొక్క నిరవయవ త్వము శ్రుతిచే నంగీకరింపబడుటవలన, శ్రుతి విరుద్ధముగూడ గానేరదు. బ్రహ్మము శబ్ద మూలకము అనగా శబ్దప్రమాణముచేతనే దెలియదగినదిగాని యింద్రియములచే దెలియదగినది కాదు. కనుక శబ్దము లెట్లు జెప్పుచున్నవో యటులనే అంగీకరించవలయును. బ్రహ్మ మంతయు వికారము చెందుట లేదనియు, నిరవయవమనియు గూడ శ్రుతి చెప్పుచున్నది. లౌకికములగు మణులు, మంత్ర ములు, ఔషధములు మొదలగునవి దేశకాలకృతములగు

నిమిత్తవైచిత్ర్యవశాచ్ఛక్తయో విరుద్ధానేకకార్యవిషయా దృశ్యంతే, తా అపి తావన్నోపదేశమంతరేణ కేవలేన తర్కేణావగంతుం శక్యంతే. అస్య వస్తున ఏతావత్య ఏతత్సహాయా ఏతద్విషయా ఏతత్ప్రయోజనాశ్చ శక్తయ ఇతి, కిముతాచింత్యప్రభావస్య బ్రహ్మణో రూపం వినాశబ్దేన న నిరూప్యేత. తథాహుః పౌరాణికాః 'అచింత్యాః ఖలు యే భావా న తాం స్తర్కేణ యోజయేత్. ప్రకృతిభ్యః పరం యచ్చ తదచింత్యస్య లక్షణ' మితి. తస్మాచ్ఛబ్దమూలఏవాతీంద్రియార్థయాథాత్మ్యాధిగమః.

పూ.పక్షీ : నను శబ్దేనాపి న శక్యతే విరుద్ధోఽర్థః ప్రత్యాయ

---

భేదములనుబట్టి విభిన్నఫలముల నిచ్చుచున్నవి. గురూపదేశము లేక దీనిపరిణామమిట్టిది, దీని కియ్యాది సహాయము, దీని కిది ప్రయోజనము, దీని విషయమిది యని యీ శక్తులను నిరూపించుట శక్యముకాదు. బుద్ధికి అందరాని బ్రహ్మస్వరూపమును శబ్దసహాయములేక నిరూపింప శక్యముగాదని మఱి యేమి చెప్పవలయును! బుద్ధికి అందరానిభావము లెవ్విగలవో వానిని హేతువాదముచేత సంయోజనము చేయరాదు. "ప్రత్యక్షములగు పదార్థస్వభావములకంటె విలక్షణము, ఆచార్యోపదేశముచేతనుమాత్రము దెలియతగినది యేది కలదో అది అచింత్యము" అని పౌరాణికవచనము గలదు. కనుక యింద్రియముల కతీతములగు విషయములయొక్క యాథాత్మ్యము శబ్దమూలముగనే తెలియనగును.

పూ. పక్షి : బ్రహ్మము నిరవయవము పరిణామమును చెందుచున్నది. కాని సకలము పరిణమించుటలేదు

యితుమ్, నిరవయవం చ బ్రహ్మ పరిణమతే న చ కృత్స్న మితి. యది నిరవయవం బ్రహ్మ స్యాన్నైవ పరిణమేత కృత్స్న మేవ వా పరిణమేత. అథ కేనచిద్రూపేణ పరిణమేత కేనచిద్రూపేణావతిష్ఠేత రూపభేదకల్పనాత్ సావయవమేవ ప్రసజ్యేత. క్రియావిషయే హి 'అతిరాత్రే షోడశినం గృహ్ణాతి నాతిరాత్రే షోడశినం గృహ్ణాతీ' త్యేవంజాతీయకాయాం విరోధప్రతీతావపి వికల్పాశ్రయణం విరోధ పరిహారకారణం భవతిపురుషతంత్రత్వా

---

అను విరుద్ధమగు నీవిషయము శబ్దము చేతగూడ తెలియ శక్యము కాదు. బ్రహ్మము నిరవయవమైనచో పరిణామ మును బొందలేదు. లేదా సంపూర్ణముగ పరిణామమును చెందవలెను. ఒకరూపము చేత పరిణమించును, మరియొక రూప మాతీరుననేయుండును అని రూపభేదమును కల్పించుట చేత, బ్రహ్మ మవయవసహితము కావలెను. "అతిరాత్ర మను క్రతువునందు షోడశి యను పాత్రను గ్రహించుచు న్నాడు; అతిరాత్ర క్రతువునందు షోడశి పాత్రను గ్రహిం పడు" ఇట్టి విరుద్ధకర్మాచరణమును బోధించుస్థలములయందు కర్మాచరణము పురుషబుద్ధ్యధీనముగనుక యేదో యొక వికల్పముననుసరించి విరోధమును పరిహరింపవచ్చును. బ్రహ్మ విషయమన్ననో, నయ్యది సిద్ధవస్తువగుటంజేసి, వికల్పమును పరిగ్రహించినను విరోధపరిహారము కానేరదు. [బ్రహ్మము నిరవయమైనచో, పరిణామము శక్యము కాదు. సావయవమై నచో నిరవయవత్వశ్రుతికి విరోధము. సిద్ధవస్తువునుగూర్చి

దనుష్ఠానస్య, ఇహ తు వికల్పాశ్రయణేనాపి న విరోధపరిహార స్సంభవతి అపురుషతంత్రత్వాద్వస్తునః, తస్మాద్దుర్ఘటమేతదితి.

సిద్ధాంతీ : నైష దోషః, అవిద్యాకల్పితరూపభేదాభ్యుపగమాత్. నహ్యవిద్యాకల్పితేన రూపభేదేన సావయవం వస్తు సంపద్యతే. న హి తిమిరోపహతనయనేనానేకఇవ చంద్రమాదృశ్యమానోఽనేకఏవ భవతి. అవిద్యాకల్పితేన చ నామరూపలక్షణేన రూపభేదేన వ్యాకృతా వ్యాకృతాత్మకేన తత్త్వాన్యత్వాభ్యామనిర్వచనీయేన బ్రహ్మపరిణామాది సర్వవ్యవహారాస్పదత్వం ప్రతిపద్యతే, పారమార్థికేన చ రూపేణ సర్వవ్యవహారాతీతమపరిణతమవ

---

వికల్పము సంభవింపదు. కనుక నేవిధముగ గ్రహించినను శ్రుతులకు వైరుధ్య మనివార్యమగుచున్నది.] అందువలన నీ విషయము దుర్ఘటమగుచున్నది.

సిద్ధాంతి : ఇది యొక దోషము కాదు. రూపభేద మవిద్యాకల్పితమని మేము చెప్పుచున్నాము. రూపభేద మవిద్యాకల్పితమైనపుడు, సిద్ధవస్తువునకు సావయవత్వము సంభవముకాదు. కంటిజబ్బుకలవానికి చంద్రుడనేకములుగ కాన్పించుచున్నాడు. అంతమాత్రముచేత నాత డనేకముగానేరడు. నామరూపము లవిద్యాకల్పితములు. వీనిచే రూపభేదము కాన్పించుచున్నది. ఇట్టి రూపభేదము అభివ్యక్తము అనభివ్యక్తముగూడ నగుటవలన యథార్థమనిగాని అయథార్థమనిగాని చెప్పశక్యముగాదు. ఇట్టి స్థితియందు బ్రహ్మము పరిణామాది సర్వవ్యవహారముల కాస్పదమగుచున్నది. పరమార్థరూపముచే బ్రహ్మము సర్వవ్యవహారమున కతీతము,

త్తిష్ఠతే. వాచారంభణమాత్రత్వాచ్చావిద్యాకల్పితస్య నామరూప భేదస్య న నిరవయవత్వం బ్రహ్మణః కుప్యతి. న చేయం పరిణామశ్రుతిః పరిణామప్రతిపాదనార్థా. తత్ప్రతిపత్తౌ ఫలానవగమాత్. సర్వవ్యవహారహీనబ్రహ్మాత్మభావప్రతిపాదనార్థా త్వేషా తత్ప్రతిపత్తౌ ఫలావగమాత్ 'సఏవ నేతి నేత్యాత్మే' త్యుపక్రమ్యాహ 'అభయం వై జనకప్రాప్తోఽసీ'తి (బృ. 4-2-4). తస్మాదస్మత్పక్షే న కశ్చిదపి దోషప్రసంగోఽస్తి.

---

బ్రహ్మము పరిణామము పొందుట లేదు.

పరిణామ విరహితము. నామరూపభేదమంతయు వాక్కుచేతనుమాత్రము నిర్వహింపబడుచున్నది. అందువలన బ్రహ్మము యొక్క నిరవయవత్వమునకు భంగము లేదు. బ్రహ్మము పరిణామమును బొందుచున్నదియని చెప్పుటయందు పరిణామశ్రుతి తాత్పర్యము కాదు. పరిణామిత్వమును బోధించుటచే ప్రయోజనమేమియు లేదు. సర్వవ్యవహారహీనమగు బ్రహ్మభావమును బోధించుటయె యీశ్రుతికి ప్రయోజనము. అట్టిజ్ఞానముచే ఫలముదెలియుచున్నది. ఆ ఆత్మ ఇదికాదు ఇదికాదు అని ఉపక్రమించి ఓయి జనక! నీవభయమును బొందితివియని శ్రుతి చెప్పుచున్నది. కనుక మావాదమునందు దోషప్రసంగ మెంతమాత్రము లేదు. [బ్రహ్మము నిరవయవము పరిణామమును బొందదు. కాని చూపరులకు జగత్తను విశేషాకారమున వర్తించుచున్నది. వారలయందవిద్యచే కల్పింపబడిన భ్రాంతియె యిందులకు

వివర్తవాదము.

కారణము. త్రాడు మందాంధకారమున సర్ప

ముగాకొందఱికి జలధారగా మఱికొందరికి దండముగ తదన్యు
లకు, యిట్లనేక విశేషాకారముల ప్రవర్తించుచున్నది.
ఇందుకుచూపరుల భ్రాంతిదృష్టి భేదమే కారణము. త్రాడు
లేనిచో వీరలకిట్టి భ్రాంతిజ్ఞానములు కలుగనేరవు. ఏదోయొక
యధిష్ఠానము లేనిది భ్రాంతిజ్ఞానముపుట్టదు. భ్రాంతిజ్ఞానమునకు
పూర్వము, భ్రాంతిజ్ఞానససమయమునందు, అజ్ఞానముపోయిన
తరువాతగూడ త్రాడుత్రాడుగానే యున్నది. స్వయముగా
తాను సర్వవికారరహితమైనను, సర్వభ్రాంతికి కారణమగు
చున్నది. అటులనే బ్రహ్మము స్వయముగా నిర్వికారము.
జగత్తు దానియందు చూపరులచేకల్పింపబడిన యవిద్యావిలసిత
మగు భ్రాంతిమాత్రము. జ్ఞానదీపముచే పరికించినపుడు
మిథ్యారూపమగు జగద్భ్రాంతి యవగతమై భ్రాంతికధిష్ఠా
నము నిర్వికారమునగు బ్రహ్మము తెలియవచ్చును. అధి
ష్ఠానమునందే మార్పులేక చూపరుల భ్రాంతికారణమై
వారలన్యథా గ్రహించుట శాస్త్రమునందు వివర్తమందురు.
పరిణామము వస్తుస్థితియందు సంభవించు మార్పు. వివర్తము
వస్తువునందేమార్పులేక చూపరుల భ్రాంతదృష్టినిమిత్తము.
కనుక బ్రహ్మము నిరవయవము, పరిణామవిహీనము, జగ
త్కారణముగూడ నగుచున్నది యని సూత్ర తాత్పర్యము.]
27

అ॥ క్షీరమునకు దధివలె పూర్వస్వరూపము నాశమై
మఱియొక స్వరూపముగలుగుట పరిణామము, శుక్తికిరజతము
వలె పూర్వస్వరూపమునందు మార్పులేకనే మరియొక స్వరూ

## ఆత్మని చైవం విచిత్రాశ్చ హి (సూ. 28)

అపిచ నైవాత్ర వివదితవ్యం కథమేకస్మిన్బ్రహ్మణి స్వరూపానుపమర్దేనైవానేకాకారా సృష్టిస్స్యాదితి, యతః ఆత్మన్యప్యేకస్మిన్ స్వప్నదృశి స్వరూపానుపమర్దేనైవానేకాకారా సృష్టిః పఠ్యతే 'న తత్ర రథా న రథయోగా న పంథానో భవంత్యథ రథాన్ రథయోగాన్ పథస్సృజతే' (బృ. 4-3-10) ఇత్యాదినా. లోకేఽపి దేవాదిషు మాయావ్యాదిషు చ స్వరూపానుపమర్దేనైవ

---

పము భాసించుట వివర్తము, బ్రహ్మమునకు వివర్తముచే జగదుపాదాన కారణత్వము సంప్రాప్తమగుచున్నది యని స్వప్నసాక్షిదృష్టాంతము చేత రాబోవుసూత్రమున మాయావాదమును బలపఱచుచున్నారు.

ఆత్మని=నిరవయవమగు జీవాత్మయందు విచిత్రాః=సృష్టి విచిత్రములు వినవచ్చుచున్నవి. ఏవం = ఆవిధముగనే నిరవయమగు బ్రహ్మమునందుగూడ మాయచే విచిత్రాః = ప్రపంచవిచిత్రములు హి = కాన్పించుచున్నవి.

మఱియు నిరవయమగునాకే బ్రహ్మమునందు స్వరూపనాశము లేకయే అనేకాకారమగు సృష్టికలుగ గలదను విషయము నిర్వివాదము కాతగును. స్వప్నమున రథములు, అశ్వములులేవు, రథమార్గములులేవు. అయినను నవ్వాని నన్నింటిని సృజియించుచున్నాడు" అను శ్రుతియందు స్వరూపనాశము నేకనే స్వప్నమునందనేకా కారమగుసృష్టి స్వప్నద్రష్టయగు జీవాత్మయందు కల్పింపబడుచున్నట్లు తెలియుచున్నది. లోకమునందుగూడ దేవాదులు ఇంద్రజాలికులు

విచిత్రా హస్త్యశ్వాదిసృష్టయో దృశ్యంతే. తథైకస్మిన్నపి బ్రహ్మణి స్వరూపానుపమర్దేనైవానేకాకారా సృష్టిర్భవిష్యతీతి.

## స్వపక్షదోషాచ్చ (సూ. 29)

పరేషామప్యేషసమానస్స్వపక్షదోషః, ప్రధానవాదినోఽపి హి నిరవయవమపరిచ్ఛిన్నం శబ్దాదిహీనం ప్రధానం సావయవస్య పరిచ్ఛిన్నస్య శబ్దాదిమతః కార్యస్య కారణమితి

---

మొదలగువారలయందు హస్త్యశ్వాది విచిత్రసృష్టులు కాన్పించుచున్నవి. అటులనే నిరవయమగునొక్క బ్రహ్మము నందు స్వరూపనాశము లేకనే యనేకాకారమగు సృష్టి సంభవించుచున్నది. 28

అ॥ స్వపక్షమునందు దోషముండ, యితరులదోషముల నుద్భావము చేయుట న్యాయము కాదని తరువాత సూత్రము నందలించుచున్నది.

స్వపక్షదోషాత్ చ = సాంఖ్యులుచేయు ప్రధాన వాదమునందు గూడ నీదోషములు కాన్పించుటవలన మా దోషముల నుద్భావించుట న్యాయ్యముగాదు.

సిద్ధాంతి వాదమునందు చూపబడుచున్న దోషములు పూర్వపక్షవాదమునందు గూడ సమానముగానే యున్నవి.

సాంఖ్యపక్షము నందలి దోషములు.

ప్రధానము జగత్కారణమని వాదించు వారలుగూడ నిరవయవము, అపరిచ్ఛిన్నము శబ్దాదిహీనమునగు ప్రధానము సావయవము పరిచ్ఛిన్నము శబ్దాదిసహితమునగు జగత్కా

స్వపక్షస్తత్రాతికృత్స్నప్రసక్తిర్నిరవయవత్వాత్ప్రధానస్య ప్రాప్నోతి నిరవయవత్వాభ్యుమగమకోపో వా.

పూ. పక్షీ : నను నైవ తైర్నిరవయవం ప్రధానమభ్యుపగమ్యతే, సత్త్వరజస్తమాంసి హి త్రయోగుణాః, తేషాం సామ్యావస్థాప్రధానం తైరేవ చావయవైస్తత్సావయవమితి.

సిద్ధాంతీ : నైవం జాతీయకేన సావయవత్వేన ప్రకృతో దోషః పరిహర్తుం పార్యతే, యతః సత్వరజస్తమసామప్యేకైకస్య సమానం నిరవయవత్వమేకైకమేవ చేతరద్వయానుగృహీతం

---

ర్యమునకు కారణమని తమపక్షమున వాదించుచున్నారు. ఆవాదమునందుగూడ, ప్రధానము నిరవయవము గనుక సకల ప్రధానము జగద్రూపమున పరిణామము నొందవలెను. లేదా నిరవయత్వవాదము విరుద్ధమగును.

పూ. పక్షి : ప్రధానము నిరవయవమని ప్రధాన వాదులనుటలేదు. సత్త్వరజస్తమస్సులను మూడుగుణములు గలవు. వానిసామ్యావస్థ ప్రధానము. వానిచేనది సావయవమగుచున్నది.

సిద్ధాంతి : ఈరూపమగు సావయవత్వముచేత సంపూర్ణపరిణామదోషము పరిహారమగుటలేదు. సత్వరజస్తమస్సులను గుణత్రయమునందలి ప్రతిగుణము నిరవయవము. వీనిలోనొక్క గుణ మితరగుణముల సాయ్యమునుబొంది దానింబోలు ప్రపంచమునకు కారణమగుచున్నదనినచో కృత్స్నపరిణామవాదదోషముపుడుగూడ సమానమేయగుచున్నది. [సత్వాది గుణత్రయముయొక్క సముదాయము సావయవమైనను,

సజాతీయస్య ప్రపంచస్యోపాదానమితి సమానత్వాత్ స్వపక్షదోష ప్రసంగస్య.

పూ.పక్షీ : తర్కాప్రతిష్ఠానాత్ సావయవత్వమేవేతిచేత్.

సిద్ధాంతీ : ఏవమప్యనిత్యత్వాదిదోషప్రసంగః. అథ శక్తయ ఏవ కార్యవైచిత్ర్యసూచితా అవయవా ఇత్యభిప్రాయః, తాశ్చ బ్రహ్మవాదినోఽప్యవిశిష్టాః, తథాఽణువాదినోఽప్యణురణ్వంత

---

ప్రతిగుణము నిరవయవము. వానిపరిణామమే జగత్కారణ మని యంగీకరించుటవలన, ప్రతిగుణము సంపూర్ణముగ పరిణామమునొందవలెను. లేక ప్రతిగుణము కొంతభాగము మాత్రమే పరిణమించినదనిన సావయత్వము సంభవించుచున్నది. ఇట్లు ప్రధానవాదము నందుగూడ దోషద్వయ మని వార్యమగుచున్నది.]

పూ. పక్షి : కేవల తర్కమునకు నిలకడలేదుకనుక ప్రధానము సావయమందుము గాక.

సిద్ధాంతి : అపుడుగూడ ననిత్యత్వాదిదోషము ప్రసక్తమగుచున్నది. [సావయవమగు ప్రధానము నిత్యముకానేరదు, అయ్యది నిత్యమని సాంఖ్యులవాదము.] జగత్కార్యము యొక్క వైచిత్ర్యమును సూచించుచు ప్రధానమునందలి శక్తులు ప్రధానావయవముల నివారించినచో నట్టి మాయాశక్తులు బ్రహ్మమునందున్నట్లు మేము నంగీకరించుచున్నాము. [పరమాణువాదమునందు గూడ నీ దోష మనివార్యమగుచున్నది. రెండుపరమాణువులు గలసి ద్వ్యణుకము, మూడు

రేణ సంయుజ్యమానో నిరవయవత్వాద్యది కార్త్స్న్యేన సంయుజ్యేత తతః ప్రథిమానుపపత్తేరణుమాత్రత్వప్రసంగః. అథైకదేశేన సంయుజ్యేత తథాపి నిరవయవత్వాభ్యుపగమకోప ఇతి స్వపక్షేఽపి

---

పరమాణువాద దోషములు

ద్వ్యణుకములు గలసి త్ర్యణుకము, నాలుగు ద్వ్యణుకములు గలసి చతురణుకము ఇట్లు అణుకసంయోగప్రక్రియచే జగదుత్పత్తి సంభవించుచున్నది యని వారి వాదము.] ఒక అణువు మఱియొక అణువుతో సంపూర్ణముగా కలిసి ద్వ్యణుకమగుచున్నదా లేక నొక అణువులో నొకభాగము మఱియొక యణువులో నొకభాగముతో గలసి ద్వ్యణుక మేర్పడుచున్నదా?] పరమాణువు నిరవయవము గనుక సంపూర్ణములగు నణువులకే సంయోగము కలుగవలెను. అపుడు పరిమాణము నందు వృద్ధి సంభవింపనేరదు. [ఒక యణువు మఱియొక యణువుతో నుపరిభాగముననో, అధోభాగముననో, పార్శ్వముననో సంయోగము నొందవలెను. అపుడు పరిమాణవృద్ధి సంభవించి ద్రవ్య మధికమగును. అట్లయినచో నణువు సావయవము కావలసివచ్చును. సావయవము గాదనుపక్షమున, నొక యణువు మఱియొక యణువులో దూరుటచేతనే వానికి సంయోగము సంప్రాప్తము కావలెను. ఆ పక్షమున పరిమాణాభివృద్ధి కానేరదు. ఒక వెండిలోటాలో మఱియొక వెండి లోటాను దూర్చినపుడు మొదటిలోటాయొక్క పరిమాణము హెచ్చుగాదు.] కనుక అణువు అణువుమాత్రముగ నుండును. ఒకభాగమునమాత్రము సంయోగము జరుగునందురేని నిర

సమాన ఏష దోషః. సమానత్వాచ్చ నాన్యతరస్మిన్నేవ పక్షే ఉపక్షేప్తవ్యో భవతి. పరిహృతస్తు బ్రహ్మవాదినా స్వపక్షే దోషః.

---

వయత్వవాద భంగమాపాదించును. ఈదోషము పరమాణువాదులకు గూడ సమానమే యగుచున్నది. దోషసామాన్యమున్నపుడు [తన నలుపును చూచుకొనక] ప్రతిపక్షము నాక్షేపించుట తగదు. బ్రహ్మవాదుల స్వపక్షమునందలి దోషములకు పరిహారమును 28 వ సూత్రమున ప్రదర్శించినాము. [కనుక నిరవయవమగు బ్రహ్మమునందు జగత్కారణత్వ సమన్వయము విరుద్ధము కాదు.]

అధికరణ సంక్షిప్తార్థము : బ్రహ్మము నిరవయవమైనచో, అంతయు పరిణామము నొందవలయును. అపుడు బ్రహ్మమే లేకపోవును. సావయవమైనచో అపుడు నిరవయవ శ్రుతి వ్యాకోపము. ఏ పక్షమునందైనను బ్రహ్మము జగత్కారణ మను వేదాంతి వాదము నిలువనేరదు. ఇది పూర్వపక్షము. ఇందుకు సిద్ధాంతము శబ్దైకగమ్యమగు బ్రహ్మము పరిణామము బొందుచున్నట్లు శ్రుతి చెప్పుటలేదు. అటువంటి బోధవలన ప్రయోజనము లేదు. బ్రహ్మాత్మబోధయె శ్రుతి తాత్పర్యము. నిర్వికారబ్రహ్మము స్వరూపనాశము లేక అనేక రూపముల కాన్పించవచ్చును. బ్రహ్మము యొక్క స్వరూపానేకత్వము చూచువారి దృష్టి ఫలము. బ్రహ్మముయొక్క వికారిత్వ ఫలము కాదు. 29

# (10) సర్వోపేతాధికరణమ్ (సూ. 30–32)

## సర్వోపేతా చ తద్దర్శనాత్ (సూ. 30)

### (10) సర్వోపేతాధికరణము

అ॥ బ్రహ్మము మాయాశక్తిసుంతమగుటచే జగత్సృజనము గలుగుచున్నదనియు బ్రహ్మము శరీరరహితమనియు చెప్పబడినది. శరీరము లేని వానికి మాయ సంభవముకాదు. కనుక బ్రహ్మము జగత్కారణమగుచున్నది యని చేయబడిన సమన్వయము విరుద్ధమగునా లేదా యను ఆశంకకు రాబోవు అధికరణమున సమాధానము చెప్పుచున్నారు.

విషయము : అశరీరమగు బ్రహ్మమునకు, విచిత్రశక్తిమత్త్వము.

విశయము : బ్రహ్మమునందు జగత్సర్జన సమన్వయము విరుద్ధమగునా? కాదా?

పూర్వపక్షము : విరుద్ధము.

సిద్ధాంతము : విరోధము లేదు.

అవలోకనీయములగు ప్రమాణములు :

ఛాం. 3–14–4, 8–7–1–; ముండ. 1–1–9; బృ. 3–8–9, 3–8–8, 3–9–26; శ్వే. 3–19.

సర్వ ఉపేతా చ = పరదేవత సర్వశక్తియుక్తము. ఏలన! తత్ దర్శనాత్ = సర్వశక్తిసమేతత్వము శ్రుతుల యందు కాన్పించుటచేత.

జాతీయకం, కథం సా సర్వశక్తియుక్తాపి సతీ కార్యాయ ప్రభవేత్? దేవాదయో హి చేతనా స్సర్వశక్తియుక్తా అపి సంతః ఆధ్యాత్మికకరణసంపన్నా ఏవ తస్మై తస్మై కార్యాయ ప్రభవంతో విజ్ఞాయంతే. కథం చ 'నేతినేతీ'తి (బృ. 3-9-26) ప్రతిషిద్ధసర్వవిశేషాయాః దేవతాయాః సర్వశక్తియోగః సంభవేదితి చేత్.

సిద్ధాంతీ : యదత్ర వక్తవ్యం తత్పురస్తాదేవోక్తం శ్రుత్యవగాహ్యమేవేదమతిగంభీరం బ్రహ్మ న తర్కావగాహ్యమ్, న చ

---

దెల్పుచున్నది. ఆయమ సర్వశక్తిసమన్వితయయినను సృష్టి కార్యసమర్థ యెట్లు కాగలదు? చేతనులగు దేవాదులు శర్వశక్తి యుతులైనను, శరీరసంబంధమగు కార్యకరణ సంపన్నులైనపుడు మాత్రమే కార్యమునందు సమర్థులగు చున్నట్లు మంత్రార్థవాదములయందు దెలియవచ్చుచున్నది. ఇదికాదు ఇదికాదు అనిబుద్ధిగోచరములు ప్రసిద్ధములునగు సర్వవిశేషములను నిషేధించుటచేతనే బోధింపబడుచున్న పరాదేవతకు సర్వశక్తిసంయోగమే విధమున సమకూరును? [ఆనగా సమస్తశక్తులున్నను దేహాదిసాధనములు లేనిది కార్యాచరణమెట్లు సంభవము! దేహములులేనపుడు శక్తులెట్లు సంభవము? అనిరెండువిధముల యాక్షేపణముచేయ బడుచున్నది.]

సిద్ధాంతి : ఈవిషయమున చెప్పదగినదంతయు నింతకు పూర్వమే విలక్షణత్వాధికరణమునందు (2-1-3) చెప్పియుంటిమి. అతిగంభీరము అనగా లోకులు తెలియరాని బహ్మము శ్రుతిచేతనే దెలిసికొనవలయునుగాని హేతువాదముచే దెలిసి

యథైకస్య సామర్థ్యం దృష్టం తథాఽన్యస్యాపి సామర్థ్యేన భవితవ్యమితి నియమోఽస్తీతి, ప్రతిషిద్ధసర్వవిశేషస్యాపి బ్రహ్మణస్సర్వశక్తియోగస్సంభవతీత్యేతదప్యవిద్యాకల్పితరూపభేదోపన్యాసేనోక్తమేవ. తథాచ శాస్త్రం 'అపాణిపాదో జవనో గృహీతా పశ్యత్యచక్షుస్సశృణోత్యకర్ణః' (శ్వే. 3-19) ఇత్యకరణస్యాపి బ్రహ్మణస్సర్వసామర్థ్యయోగం దర్శయతి.

---

కాన శక్యముగాదు. ఒకనియందు కాన్పించు సామర్థ్యము మఱియొకనియం దుండవలెనను నియమము లేదు. బ్రహ్మము సర్వవిశేషశూన్యమని శాస్త్రము చెప్పుచున్నను, అవిద్యాకల్పితమగు రూపభేదములచే సర్వశక్తులు సంభవమనియుగూడ చెప్పియుంటిమి.

*బ్రహ్మమునకు బాహ్యాభ్యంతరములగు అవయవములు లేవు.*

హస్తపాదాదులులేనివాడయ్యును, త్వరితగతిగలవాడు, గ్రహణశక్తిగలవాడు, కన్నులులేనివాడైనను, చూడగలడు, శ్రోత్రములులేనివాడయ్యును వినగలడు అనుశ్రుతివలన బ్రహ్మము సర్వసాధన విహీనమైనను సమస్తశక్తిసముపేతమని దెలియుచున్నది. [ఇంతకుపూర్వము చెప్పినసాధనములు శరీరమునకు బాహ్యమగు దండచక్రాదులు, ఈసూత్రమునందు చెప్పిన సాధనములుశరీరము తద్గతములగునవయవయములు.కులాలుడు చక్రదండాదులచే ఘటనిర్మాణము చేయుచున్నాడు మాయావికి దేహేంద్రియముల మాత్రముచేత కార్యకరణత్వసిద్ధి గల్గుచున్నది. బ్రహ్మమున కీరెండువిధములైన సాధనసంబంధములేదని పైశ్రుతితాత్పర్యము.]

## (11) ప్రయోజనవత్త్వాధికరణమ్ (సూ. 32-33)

<u>అధికరణ సంక్షిప్తార్థము</u>: బ్రహ్మము సర్వశక్తి సముపేతము. బాహ్యాభ్యంతరములగు అవయవములు లేనిది. అయినను సృష్టికి కారణమగుచున్నది. కులాలాదులవలే బ్రహ్మము సర్వసాధన సముపేతమై సృష్టినిచేయుటలేదు. బ్రహ్మము నిరవయవము, నిర్వికారము, నిష్క్రియము. అద్వితీయము. అయినను మాయాశక్తిచే చూపరులకు అనేక విధములుగ కాన్పించుచున్నది. అనిఫలితార్థము. 32

### (11) ప్రయోజనవత్త్వాధికరణము

అ॥ శ్రుతిప్రమాణము నాధారముచేసికొని బ్రహ్మము సర్వశక్తియుతమని యింతకుపూర్వ ముదాహరింపబడినది. శక్తిమంతమైనను, జగత్సర్జనమువలన బ్రహ్మమునకు ప్రయోజనమేమిలేదు గనుక. అద్దానియందు స్రష్టృత్వసమయ మసమంజసమగు చున్నదను నాశంకకు సమాధాన మీయధికరణమున చెప్పబడుచున్నది.

**విషయము** : బ్రహ్మము పరితృప్తమగుటవలన జగత్సర్జన మతనియందు సమన్వయము చేయుట

**విశయము** : బ్రహ్మము భ్రాంతచిత్తుడుగాడు. అభ్రాంతుడు ఫలములేకనే కార్యముచేయడు. జగన్నిర్మాణముచే బ్రహ్మకు ప్రయోజనమేమియులేదు. కనుక జగత్సర్జన సమన్వయము విరోధించునాలేదా యని సందేహము.

## న ప్రయోజనవత్త్వాత్ (సూ. 32)

అన్యథా పునశ్చేతనకర్తృకత్వం జగత ఆక్షిపతి, న ఖలు చేతనః పరమాత్మేదం జగద్బింబం విరచయితుమర్హతి.

---

పూర్వపక్షము : బ్రహ్మము నిత్యతృప్తుడు, ప్రయోజనము నందభిలాషలేనివాడు. కనుక జగత్సర్జన సమన్వయమతనికి విరుద్ధము.

సిద్ధాంతము : విరుద్ధముకాదు.

అవలోకనీయములగు ప్రమాణవాక్యములు :

బృ. 2-4-5.

ఇట్టి పూర్వపక్షమును రాబోవుసూత్రమున నిరూపించు చున్నారు.

న = బ్రహ్మమునకు జగత్కర్తృత్వము సంభవము కాదు. ప్రయోజనవత్త్వ అభావాత్ = అవాప్తసర్వ కాము డగు బ్రహ్మమునకు జగత్సృష్టివలన ప్రయోజనము లేకుండు టవలన.

చేతనము జగత్కారణము కావలయునను వాదమునకు మఱియొక యాక్షేపణచేయబడు చున్నది.

పూర్వపక్షి : చేతనుడగు పరమాత్మ జగద్రచయిత కానేరడు. ఏలనన ప్రవృత్తులన్నిటికిని ప్రయోజనము కలదు. చేతనుడగు మనుజుడు స్వల్పవిషయము లనుగూడ నాలోచించిచేయును. తన కనుపయోగములగు పనులనారంభింపడు.

సృష్టిచే బ్రహ్మమునకు ప్రయోజనము లేదు.

కుతః, ప్రయోజనవత్త్వాత్ ప్రవృత్తీనామ్. చేతనో హి లోకే బుద్ధిపూర్వకారీ పురుషః ప్రవర్తమానో న మందోపక్రమామపి తావత్ప్రవృత్తిమాత్మప్రయోజనానుపయోగినీమారభమాణో దృష్టః కిముత గురుతరసంరంభామ్. భవతి చ లోకప్రసిద్ధ్యనువాదినీ శ్రుతిః 'న వా అరే సర్వస్య కామాయ సర్వం ప్రియం భవతి ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతీ'తి (బృ. 2-4-5). గురుతరసంరంభా చేయం ప్రవృత్తిః యదుచ్చావచప్రపంచం జగద్బింబం విరచయితవ్యమ్. యదీయమపి ప్రవృత్తిశ్చేతనస్య పరమాత్మనః ఆత్మప్రయోజనోపయోగినీ పరికల్ప్యేత నిత్యపరితృప్తత్వం పరమాత్మనః శ్రూయమాణం బాధ్యేత, ప్రయోజనాభావో వా ప్రవృత్త్యభావోఽపి స్యాత్. అథ చేతనోఽపి సన్ ఉన్మత్తో బుద్ధ్యపరాధాదంతరేణైవాత్మప్రయోజనం ప్రవర్తమానో దృష్టః తథా పరమాత్మాపి ప్రవర్తిష్యత ఇత్యుచ్యేత, తథా సతి

---

ఇక నత్యంతము భారములగు పనులను గురించియేమి చెప్పవలయును. సమస్తవస్తువులు ప్రియము లగునని ఎవరును వానిని ప్రేమించుటలేదు. స్వప్రయోజనమును కోరియే మనుజునికి అవి ప్రియములగుచున్నవి యను శ్రుతి లోకప్రసిద్ధిని అనుభవమునుగూడ ప్రదర్శించుచున్నది. ఒడుదుడుకులుగల నీప్రపంచసృష్టి భారతరము కావలయును. ఇట్టి పరమాత్మయొక్క జగద్రచనాప్రవృత్తి స్వప్రయోజనమును గోరియె యని యన్నచో, శృతులయందు వినబడు పరమాత్మయొక్క పరితృప్తికి విరోధము కలుగును. ప్రయోజనములేనిచో ప్రవృత్తిలేక పోవలెను. చేతనుడైనను యొకపుడు మనుజ

సర్వజ్ఞత్వం పరమాత్మనశ్ప్రియమాణం బాధ్యేత, తస్మాదశ్లిష్టా చేతనాత్సృష్టిరితి.

## లోకవత్తు లీలాకైవల్యమ్ (సూ. 33)

తుశబ్దేనాక్షేపం పరిహరతి. యథాలోకే కస్యచిదాప్తైషణస్య రాజ్ఞో రాజామాత్యస్య వా వ్యతిరిక్తం కించిత్ ప్రయోజనమనభిసంధాయ కేవలం లీలారూపాః ప్రవృత్తయః క్రీడావిహారేషు భవంతి, యథా చోచ్ఛ్వాసప్రశ్వాసాదయోఽనభి

---

దున్మత్తుడై అవివేకమువలన స్వప్రయోజనము లేకనే ప్రవర్తించుటను చూచుచున్నాము. ఆతీరుననే పరమాత్మ గూడ సృష్టికర్మయందు ప్రవర్తించినాడని చెప్పవలయును. యాతని సర్వజ్ఞత్వమునకు బాధకలుగుచున్నది. అందువలన సృష్టిక్రియ చేతనముతో సంబంధించినది కాదు. 32

అ॥ ఇట్టి పూర్వపక్షమునకు సిద్ధాంతి తరువాతసూత్రమున సమాధానము చెప్పుచున్నాడు.

తు=పూర్వపక్షవాదము సరికాదు. లోకవత్=రాజులు మొదలగు వారలకువలేనే, లేక ఉచ్ఛ్వాసాదుల వలేనే బ్రహ్మమునకు విచిత్రకార్య రచనము లీలాకైవల్యం=కేవల లీలామాత్రము. ఫలసహితమైనది కాదు.

సిద్ధాంతి : సూత్రమునందలి తుశబ్దముచే పూర్వపక్షము త్రోసివేయ బడుచున్నది. లోకమునందు కోరికలన్నియును సమకూరినరాజుగాని రాజమంత్రిగాని లీలకంటె వ్యతిరిక్తమగు ప్రయోజనమును కోరకయే లీలారూపములగు క్రీడావిహారములయందు ప్రవర్తించుదురు, [ఒకవేళ వీనియందు

సంధాయ బాహ్యం కించిత్ ప్రయోజనాంతరం స్వభావాదేవ భవంతి. ఏవమీశ్వరస్యాప్యనపేక్ష్య కించిత్ప్రయోజనాంతరం స్వభావాదేవ కేవలం లీలారూపా ప్రవృత్తిర్భవిష్యతి. న హీశ్వరస్య ప్రయోజనాంతరం నిరూప్యమాణం న్యాయతః శ్రుతితో వా సంభవతి, న చ స్వభావః పర్యనుయోక్తుం శక్యతే. యద్యప్యస్మాకమియం

---

స్వల్పసుఖము ఉత్సాహము మొదలగు ప్రయోజనము లుండు గాక] కాని బాహ్య ప్రయోజనము నెంతమాత్రము కోరకనే, ఉచ్ఛ్వాసనిఃశ్వాసములు స్వభావముచేతనే ప్రవృత్తములగు చున్నవి. [వీనిచే జీవికి ఉపయోగముండ వచ్చునుగాని వీనికే మాత్రము ప్రయోజనములేదు.] ఆవిధముగనే ప్రయోజనము నేమియు కోరకయే కేవలకాలకర్మ సహితమైన స్వభావము చేత నీశ్వరునికి సృష్టియందు ప్రవృత్తి కలుగ వచ్చును. శ్రుతి వలనగాని న్యాయముచేతగాని యీశ్వరప్రవృత్తికి ప్రయోజనము నిరూపింప శక్యముకాదు. [పరమేశ్వరుడాత్మ కాముడని శ్రుతిపలుకుచున్నది. తనకు ప్రయోజనములేనిది యితరులకు దుఃఖకారణమునగు సృష్టిని పరమేశ్వరుడేల చేయవలెను! ఊరక కూర్చొనరాదాయన] అతనిస్వభావమును మాన్పుటకు శక్యముకాదు. [కాలముకర్మము మొదలగు సామగ్రియుండగా నీశ్వరునికిసృష్టి అపరిహార్యమగు చున్నది. ప్రయోజనము నపేక్షింపక స్వభావముచేతనే అవిద్యకార్యోన్ముఖమగుచున్నది. ద్విచంద్రగంధర్వనగరాది భ్రాంతులు ప్రయోజనము నుద్దేశించి సంభవించుటలేదు. అవిద్య అనిర్వాచ్యము; అదియే

బ్రహ్మమునకుసృష్టి అపరిహార్యము.

జగద్బింబవిరచనా గురుతరసంరంభేవాభాతి తథాపి పరమేశ్వరస్య లీలైవ కేవలేయమపరిమితశక్తిత్వాత్. యది నామ లోకే లీలాస్వపి కించిత్సూక్ష్మం ప్రయోజనముత్ప్రేక్ష్యేత తథాపి నైవాత్ర కించిత్ ప్రయోజనముత్ప్రేక్షితుం శక్యతే, ఆప్త కామశ్రుతేః. నాప్యప్రవృత్తిరున్మత్తప్రవృత్తిర్వా, సృష్టిశ్రుతేః, సర్వజ్ఞశ్రుతేశ్చ. న చేయం పరమార్థవిషయా సృష్టిశ్రుతిః, అవిద్యాకల్పిత నామరూపవ్యవహారగోచరత్వాత్ బ్రహ్మాత్మభావప్రతిపాదనపరత్వాచ్చేత్యేతదపి నైవ విస్మర్తవ్యమ్.

---

పరమేశ్వరునియొక్క స్వభావమనియు లీలయనియు చెప్పబడుచున్నది. మనబోంట్లకి జగద్రచన గురుతరముగ కాన్పించవచ్చునుగాక, అపరిమితశక్తిసముపేతుడగు నీశ్వరునికి కేవలము లీలామాత్రమే యగును. లోకమునందు లీలలవలన గూడనే స్వల్పప్రయోజనమునో యపేక్షించవచ్చును. పరమేశ్వరుని విషయమైు ప్రయోజన మినుమంతయు కనుగొనలేము. అతడాప్తకాముడని శ్రుతిపల్కుచున్నది. సృష్టియందతని ప్రవృత్తి ఉన్మత్తప్రవృత్తి యన వీలులేదు. అతడు సర్వజ్ఞుడనియు ఆలోచించి సృష్టియందు ప్రవర్తించినాడనియు శ్రుతులు చెప్పుచున్నవి. మఱియు నీసృష్టివిషయమంతయు పరమార్థమని బోధించుట కుద్దేశింపబడినదిగాదు. అవిద్యాకల్పితమగు నామరూపములకు మాత్రమది వ్యవహారవిషయమగుచున్నది. [నామరూపములభివ్యక్తమగుటయే సృష్టియని శ్రుతిపలుకుచున్నది.] సర్వము బ్రహ్మస్వరూపమని యుపదేశించుటకు మాత్రము సృష్టిప్రక్రియవర్ణింపబడినది. ఈ విషయముగూడ మఱువదగినదికాదు.

## (12) వైషమ్యనైర్ఘృణ్యాధికరణమ్ (సూ. 34-36)

అధికరణ సంక్షిప్తార్థము : బ్రహ్మము సర్వశక్తి సంయుత మైనను, సృష్టిచే ఆతనికి ప్రయోజనములేదు గనుక జగత్కారణము కానేరదు అని మఱియొక పూర్వపక్షము, ఇందుకు సిద్ధాంతి సమాధానము కాలకర్మసహితమైన బ్రహ్మమునకు సృష్టి అనివార్యము. అవిద్యాకల్పితము, అవిద్య పరమేశ్వరుని స్వభావమనదగును. అదియే పరమేశ్వరుని లీలయని చెప్పబడుచున్నది. సృష్టివాక్యము లన్నియు జగత్తు యొక్క బ్రహ్మస్వరూపము చెప్పనుద్దేశింపబడినవి. 33

### (12) వైషమ్యనైర్ఘృణ్యాధికరణము

అ॥ కాలకర్మమాయామయమగు లీలవలన బ్రహ్మమునకు స్రష్టృత్వము సంభవించినట్లు పూర్వసూత్రమున నుదాహరింపబడినది. అందువలన బ్రహ్మము సృష్టివిషయమై పరాధీనుడగుటవలన అనీశ్వరుడగుచున్నాడు. స్వతంత్రుడయినచో సృష్టియందు వైషమ్యము కాన్పించుటచేత బ్రహ్మము రాగాదిదోషదూషితమగుచున్నది. కనుక బ్రహ్మమునకు స్రష్టృత్వము సంభవముగాదు. ఇట్టి పూర్వపక్షమునకు సమాధానముకొరకే యధికరణము రచియింపబడినది.

విషయము : బ్రహ్మమునందు జగత్సర్జన సమన్వయము.

విశయము : విషమముగ ప్రవర్తించువాడు దోషి అను న్యాయముచే నట్టి సమన్వయము విరుద్ధమగునా కాదా యని సందేహము.

# వైషమ్యనైర్ఘృణ్యే న సాపేక్షత్వాత్తథాహి దర్శయతి (సూ. 34)

పునశ్చ జగజ్జన్మాదిహేతుత్వమీశ్వరస్యాక్షిప్యతే స్థూణానిఖననన్యాయేన ప్రతిజ్ఞాతస్యార్థస్య దృఢీకరణాయ.

పూ. పక్షీ : నేశ్వరో జగతః కారణముపపద్యతే, కుతః,

---

పూర్వపక్షము : సమన్వయము కుదురదు.
సిద్ధాంతము : కుదురును.

రాబోవు సూత్రమున నట్టి పూర్వపక్షమును నిరూపించి సమాధానము చెప్పుచున్నారు.

బ్రహ్మమునకు సృష్టివిషయమై వైషమ్య నైర్ఘృణ్యే= పక్షపాతముగాని నిర్దయగాని లేదు. సృష్టికార్యమంతయు స ఆపేక్షత్వాత్=జీవుల పుణ్యాపాపకర్మము నాధారముచేసికొని యుండుటవలన, శ్రుతి తథాహి = ఆ విధముగ దర్శయతి=చెప్పుచున్నది.

ఇంతవరకు సిద్ధాంతముచేయుబడిన బ్రహ్మము జగత్కర్తయను విషయము స్థూణానిఖనన న్యాయముచేత దృఢము చేయుటకుగాను పూర్వపక్షులుచేయు మఱియొక యాక్షేపణము నెత్తుకొనుచున్నారు. [స్థూణ మన స్థంభము లేక గుంజ. నిఖనన మన పాతుట, గుంజను నేలలోపాతి గట్టి చేయుటకుగాను అటునిటు కదిలించెదరు. ఇది స్థూణానిఖనన న్యాయ మందురు.]

పూ. పక్షి : ఈశ్వరునికి జగత్కారణత్వ ముపపన్నము గాదు. ఏలనన! పక్షపాతము నిర్దయ యను రెండుదోషము

వైషమ్యనైర్ఘృణ్యప్రసంగాత్. కాంశ్చిదత్యంతసుఖభాజః కరోతి దేవాదీన్, కాంశ్చిదత్యంతదుఃఖభాజః కరోతి పశ్వాదీన్, కాంశ్చిన్మధ్యమభోగభాజో మనుష్యాదీనిత్యేవం విషమాంసృష్టిం నిర్మిమాణస్యేశ్వరస్య పృథగ్జనస్యేవ రాగద్వేషోపపత్తేః, శ్రుతిస్మృత్యవధారితస్వచ్ఛత్వాదీశ్వరస్వభావవిలోపః ప్రసజ్యేత. తథా ఖలజనైరపి జుగుప్సితం నిర్ఘృణత్వమతిక్రూరత్వం దుఃఖయోగవిధానాత్ సర్వప్రజోపసంహరణాచ్చ ప్రసజ్యేత. తస్మాద్వైషమ్యనైర్ఘృణ్యప్రసంగాన్నేశ్వరః కారణమితి.

---

లతనికి గలుగుచున్నవి. దేవాదులు మొదలగు కొందరిని అత్యంత సుఖానుభవితలగును, పశ్వాది మరికొన్ని ప్రాణుల నత్యంత దుఃఖానుభవితలగును, మనుష్యాది తదితరులను మధ్యమభోగానుభవితలగను నిర్మాణము చేయుచున్నాడు. పామరునికివలెనే అతనికిని రాగద్వేషాదు లుపపన్నములగుచున్నవి. శ్రుతిస్మృతులలో నుపపాదింపబడిన స్వచ్ఛత్వము, ఈశ్వరత్వము మొదలగు గుణములకు లోపము సంభవించుచున్నది. [నిరవద్యం, నిరజనం” న మే ద్వేషోస్తి న ప్రియః—అను శ్రుతి స్మృతివాక్యము లిచట ప్రస్తుతములు. నిర్హేతుకమగు విషమాచరణమే వైషమ్యదోషము. నిష్క్రియత్వ నిష్కలత్వాదులు స్వచ్ఛత్వశబ్దార్థము.] ఆ విధముగనే ప్రజలందఱికి దుఃఖమును కల్పించి వారల నుపసంహరించుటవలన, ఖలులు గూడ నేవగించునంతటి నిర్దయయు క్రూరత్వ మతనికి ప్రసక్తము లగుచున్నవి. వైషమ్యనైర్ఘృణ్యములు ప్రసక్తములగుటవలన ఈశ్వరుడు జగత్కారణము కానేరడు.

సిద్ధాంతీ: ఏవం ప్రాప్తే బ్రూమః—వైషమ్యనైర్ఘృణ్యే నేశ్వరస్య ప్రసజ్యేతే, కస్మాత్, సాపేక్షత్వాత్. యది హి నిరపేక్షః కేవల ఈశ్వరో విషమాం సృష్టిం నిర్మిమీతే స్యాతామేతౌ దోషౌ వైషమ్యం నైర్ఘృణ్యం చ, న తు నిరపేక్షస్య నిర్మాతృత్వమస్తి. సాపేక్షో హీశ్వరో విషమాం సృష్టిం నిర్మిమీతే. కిమపేక్షత ఇతి చేత్, ధర్మాధర్మాపేక్షా విషమా సృష్టిరితి నాయమీశ్వరస్యాపరాధః. ఈశ్వరస్తు పర్జన్యవద్ద్రష్టవ్యః. యథా హి పర్జన్యో వ్రీహియవాది సృష్టౌ సాధారణం కారణం భవతి, వ్రీహియవాదివైషమ్యే తు తత్తద్బీజగతాన్యేవాసాధారణాని సామర్థ్యాని కారణాని భవంతి,

---

సిద్ధాంతి: ఇట్లు పూర్వపక్షము రాగా సమాధానము చెప్పుచున్నాము. ఈశ్వరునికి వైషమ్య నైర్ఘృణ్యము లాపాదింప నేరవు. ఏలనన! అతనిసృష్టికిని ధర్మాధర్మముల నాధారపడి యుండుటవలన. ఈశ్వరుడు యితర కారణము నాధారము చేసికొనక విషమసృష్టిని చేసినచో వైషమ్య నైర్ఘృణ్య దోషములతనికి ఆపాదించును. కాని యతనిసృష్టి నిరపేక్షముగాదు. కారణముల ననుసరించియే యీశ్వరుడు విషమసృష్టిని చేయుచున్నాడు. ధర్మాధర్మముల నతడపేక్షించు చున్నాడు. సృష్టింపబడు ప్రాణులయొక్క ధర్మాధర్మముల ననుసరించి విషమసృష్టి జరుగుచున్నది. ఇది యీశ్వరుని యపరాధముగాదు. ఈశ్వరుడు మేఘమువంటివాడు. వ్రీహులు యవలు మొదలగు ధాన్యములు పండుటయందు మేఘము సామాన్యకారణము. ఆ సస్యముల న్యూనాధికములకు విత్తనములయందు గుణదోషములు సామాన్య

సృష్టికిప్రాణులధర్మాధర్మములాధారము

ఏవమీశ్వరో దేవమనుష్యాదిసృష్టౌ సాధారణం కారణం భవతి, దేవమనుష్యాదివైషమ్యే తు తత్తజ్జీవగతాన్యేవాసాధారణానికర్మాణి కారణాని భవంతి, ఏవమీశ్వరస్సాపేక్షత్వాన్న వైషమ్యనైర్ఘృణ్యాభ్యాం దుష్యతి, కథం పునరవగమ్యతే సాపేక్ష ఈశ్వరో నీచమధ్యమోత్తమం సంసారం నిర్మిమీత ఇతి, తథా హి దర్శయతి శ్రుతిః 'ఏష హ్యేవ సాధు కర్మకారయతి తం యమేభ్యో లోకేభ్య ఉన్నినీషతే ఏష ఉ ఏవాసాధు కర్మ కారయతి తం

---

కారణములై సస్యము నిచ్చుటకు సమర్థము లగుచున్నవి. [వర్ష మన్నిటియందు సమానముగా కురిసినను, విత్తనములు, భూసారము, కాలమునకు నాటుట మొదలగు సహకారి కారణములచేత సస్యము న్యూనాధికముగ ఫలించును. వర్షము సామాన్యకారణము. బీజాదులు అసాధారణ కారణములు లేక విశేష కారణములు]. ఈ విధముగనే దేవమనుష్యాది సృష్టియం దీశ్వరుడు సాధారణ కారణ మగుచున్నాడు. ఆయా జీవుల సకృత దుష్కృతములు దేవమనుష్యాది జన్మ వైషమ్యమున కసాధారణ కారణము లగుచున్నవి. ఇట్లీశ్వరుని సృష్టికిని సృష్టమగు ప్రాణికోటియొక్క సుకృత దుష్కృతముల ననుసరించుటవలన నతడు వైషమ్య నైర్ఘృణ్యములచే దూషితుడు గానేరడు. ఈశ్వరు డిట్టితర కారణముల నపేక్షించి నీచమధ్యమోత్తమ సృష్టిని నిర్మించుచున్నాడని శ్రుతి చెప్పుచున్నది. ఈశ్వరు డెవనిని యీలోకములనుండి నుత్తమ లోకములను బొందించగోరునో వానిచే సాధుకర్మ చేయిం

సృష్టికి ఈశ్వరుడు సామాన్య కారణము.

యమధో నినీషతే' (కౌ. 3-8) ఇతి. 'పుణ్యో వై పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేనే' తి (బృ. 3-2-13) చ. స్మృతిరపి ప్రాణికర్మవిశేషాపేక్షమీశ్వరస్యానుగ్రహీతృత్వం నిగ్రహీతృత్వం చ దర్శయతి 'యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహ' (గీ. 4-11) మిత్యేవంజాతీయకా.

## నకర్మావిభాగాదితిచేన్నానాదిత్వాత్ (సూ. 35)

---

చును. ఎవనిని అధోలోకముల బొందింపగోరునో అతనిచే యసాధుకర్మ చేయించునని శ్రుతి పలుకుచున్నది. పుణ్యకర్మల చేత పుణ్యాత్ముడు, పాపకర్మలచేత పాపాత్ముడు నగుచున్నాడు అని మఱియొక శ్రుతి చెప్పుచున్నది. ఎవ్వరు నన్నేవ్విధమున సేవింతురో వారిని యాప్రకారముననే ననుగ్రహించుచున్నానను గీతావాక్యము ప్రాణికోటియొక్క కర్మవిశేషము ననుసరించి యీశ్వరుని నిగ్రహానుగ్రహములు లభించుచున్నట్లు చూపుచున్నది. 34

అ॥ ఈశ్వరుని సృష్టి ప్రాణికర్మనిబద్ధమగుటవలన అతనికి వైషమ్యనైర్ఘృణ్యము లాపాదింప శక్యముగాదను సిద్ధాంత వాక్యమునకు సృష్టికిపూర్వము కర్మలేదుగనుక నీసిద్ధాంతము సరికాదను పూర్వపక్షమునకు సమాధానము చెప్పుచున్నారు.

సృష్టికి బూర్వము కర్మ అవిభాగాత్ = కర్మ విభాగము లేకుండుటవలన ఇతిచేత్ = ఈశ్వరసృష్టి కర్మాధీనము కానేరదంటివేని, న = అది సరికాదు. అనాదిత్వాత్ = సంసారము అనాదియగుటవలన.

పూ.పక్షి: 'సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయ' మితి (ఛాం. 6-2-1) ప్రాక్సృష్టేరవిభాగావధారణాన్నాస్తి కర్మ యదపేక్ష విషమా సృష్టిస్స్యాత్. సృష్ట్యుత్తరకాలం హి శరీరాదివిభాగాపేక్షం కర్మ, కర్మాపేక్షశ్చ శరీరాదివిభాగ ఇతీతరేతరాశ్రయత్వం ప్రసజ్యేత. అతో విభాగాదూర్ధ్వంకర్మాపేక్ష ఈశ్వరః ప్రవర్తతాం నామ. ప్రాక్తువిభాగాద్వైచిత్ర్యనిమిత్తస్య కర్మణోఽభావాత్తుల్యైవాద్యాసృష్టిః ప్రాప్నోతీతి చేత్.

సిద్ధాంతీ : నైష దోషః, అనాదిత్వాత్సంసారస్య. భవేదేష

---

పూ. పక్షి : సృష్టికిం బూర్వము ఒక్కడు అద్వితీయుడునగు సద్వస్తుపుమాత్ర ముండెనని శ్రుతి శాసించుచున్నది. ఆ వాక్యమునలన శరీరాదివిభాగమే లేనట్లు అవధారణ చేయబడుచున్నది. అందువలన కర్మలేదు, కనుక విషమసృష్టి కారణములేదు. సృష్ట్యనంతరము శరీరాది విభాగము, దానినిబట్టి కర్మ, కర్మనుబట్టి తిరిగి శరీరాది విభాగము ఇట్లొకదానిననుసరించి మఱియొకటి సంభవించుచున్నది. శరీరాదివిభాగానంతర మీశ్వరుడు ప్రాణి కర్మానుసారముగ సృష్టిక్రియయందు ప్రవర్తించునుగాక; విభాగమునకుపూర్వము వైచిత్ర్యకారణమగు కర్మలేమింజేసి ప్రథమ సృష్టియందు కూడ వైచిత్ర్యములేనిదే యగుచున్నది. [ప్రథమసృష్టియందు వైచిత్ర్యకారణములేనిచో తరువాత సృష్టియందు నట్టిభేదము లేదనక తప్పదు.]

సిద్ధాంతి : ఇదియొక దోషముకాదు. సంసార మనాది.

దోషో యద్యాదిమానయం సంసారస్స్యాత్, అనాదౌ తు సంసారే బీజాంకురవద్ధేతు హేతుమద్భావేన కర్మణస్సర్గవైషమ్యస్య చ ప్రవృత్తిర్న విరుధ్యతే. కథం పునరేతదవగమ్యతే అనాదిరేష సంసార ఇతి, అత ఉత్తరం పఠతి—

## ఉపపద్యతే చాప్యుపలభ్యతే చ (సూ. 36)

ఉపపద్యతే చ సంసారస్యానాదిత్వమ్, ఆదిమత్త్వే హి సంసారస్య అకస్మాదుద్భూతేర్ముక్తానామపి పునస్సంసారోద్భూతి

---

సంసార మనాది

సంసారమునకు మొదలనునది యొకటి యున్నచో మీరు చెప్పుదోషము సంభవించ వచ్చును. సంసారమునకు మొదలులేదు. బీజాంకురమునకు వలెనే యొకదానికి మఱియొకటి కారణమగుచున్నది. [విత్తనమునకు చెట్టు కారణము, చెట్టు విత్తనమునకు కారణము గనుక కార్యకారణవ్యవస్థచేయ శక్యముకాదు.] కనుక సృష్టి వైషమ్యమునకు కర్మ కారణమగుటయందు విరోధమేమియును లేదు. 35

పూ. పక్షి : సంసార మనాదియని యెట్లు తెలియు చున్నది?

సిద్ధాంతి : సమాధానము చెప్పుచున్నాము.

ఉపపద్యతే—సంసారము అనాదియని ఉపపన్నమగు చున్నది. ఉపలభ్యతే చ = శ్రుతిస్మృతులయందు కాన్పించు చున్నది.

సంసారమునకనాదిత్వము యుక్తిసహమగుచున్నది. సంసారమునకు మొదలనునది యున్నచో నది కారణములేక

ప్రసంగోఽకృతాభ్యాగమకృతవిప్రణాశప్రసంగశ్చ. సుఖదుఃఖాది వైషమ్యస్య నిర్నిమిత్తత్వాత్. నచేశ్వరో వైషమ్యహేతురిత్యుక్తమ్. న చావిద్యా కేవలా వైషమ్యకారణమ్, ఏకరూపత్వాత్. రాగాదిక్లేశవాసనాక్షిప్తకర్మాపేక్షా త్వవిద్యా వైషమ్యకరీ స్యాత్, న చ కర్మాంతరేణ శరీరం సంభవతి, న చ శరీరమంతరేణ కర్మ

---

నకస్మాత్తుగ నుద్భవముకావలెను. అపుడు ముక్తులగువారికి గూడ సంసారప్రసంగము సంగతమగుచున్నది. సుఖ దుఃఖములు కారణములేకనే సంప్రాప్తమగును. [సుఖ దుఃఖములు పూర్వకర్మ ఫలములు. పూర్వజన్మము పూర్వకర్మాచరణలేనిచో నీ జన్మమున తత్ఫలభూతములగు సుఖదుఃఖముల యనుభవము సంభవింపదు గనుక] నీ జన్మము నందనుభవించు సుఖదుఃఖము లంతకు పూర్వము చేయని కర్మఫలము లగును. మేఘమువలె నీశ్వరుడు వైషమ్య హేతువుకాదని యింతకుపూర్వము చెప్పబడినది. కేవలమవిద్యగూడ వైషమ్యహేతువు కానేరదు. దానిస్వరూపమునందు భేదములేదు. [కనుక వైషమ్యవైచిత్ర్యములను గలుగ చేయలేదు.] పూర్వజన్మసంబధములగు రాగాది దుఃఖవాసనలచే నీ జన్మమున సంభవించు కర్మవైచిత్ర్యమునసరించి అవిద్య వైషమ్యహేతువగుచున్నది. [అవిద్యచే కర్మాచరణము సంభవించుచున్నది. పూర్వజన్మవాసనలు భిన్నములగుటచే వానిననుసరించి యీాజన్మమున చేయు కర్మలుగూడ విభిన్నము లగుచున్నవి.] కర్మము లేక శరీరము సంభవింపదు.

సంసారము యొక్క అనాదిత్వము ఉపపన్నము

సంభవతీతీతరేతరాశ్రయదోష ప్రసంగః. అనాదిత్వేతు బీజాంకుర న్యాయేనోపపత్తేర్న కశ్చిద్దోషోభవతి.

ఉపలభ్యతే చ సంసారస్యానాదిత్వం శ్రుతి స్మృత్యోః. శ్రుతౌ తావత్ 'అనేనజీవేనాత్మనే' తి (ఛాం. 6-3-2) సర్గప్రముఖే శారీరమాత్మానం జీవశబ్దేన ప్రాణధారణనిమిత్తేనాభిలపన్ననాది స్సంసార ఇతి దర్శయతి. ఆదిమత్త్వే తు ప్రాగనవధారితప్రాణస్సః కథం ప్రాణధారణనిమిత్తేన జీవశబ్దేన సర్గప్రముఖేఽభిల

---

శరీరము కర్మము లేక గలుగదు. శరీరము కర్మము లన్యోన్య కారణములగుచున్నవి. బీజాంకురములవలె సంసార మనాది యనిన సహేతుకముగనున్నది. [అకృతాభ్యాగమాది] దోష మేమియు కాన్పింపదు.

సంసారముయొక్క యనాదిత్వము శ్రుతి స్మృతుల యందు దొఱకుచున్నది. "ఈ జీవస్వరూపము చేతనే నేను ప్రవేశించుచున్నాను" అను శ్రుతివాక్యము కాన్పించుచున్నది. ఈశ్వరుడు సృష్టికి తొలుదొలుత శరీరమునుపొంది తనను ప్రాణధారణకారణమగు జీవశబ్దముచే చెప్పుకొనుచున్నట్లీ శ్రుతివాక్యమువలన తెలియుచున్నది. [ప్రాణమును ధరించు వాడని జీవశబ్దమున కర్థము.] ఇందుచే సంసారమనాది యని తెలియుచున్నది. సంసారమునకాదియె యున్నచో నంతకు పూర్వము ప్రాణమును ధరింపక ప్రాణధారణకారణమగు జీవ శబ్దముచే సృష్ట్యారంభమున తననెట్లు చెప్పుకొగలుగును?

ప్యేత. న చ ధారయిష్యతీత్యతోఽభిలప్యేత, అనాగతార్థ సంబంధాదతీతస్సంబంధో బలీయాన్ భవతి అభినిష్పన్నత్వాత్. 'సూర్యా చంద్రమసౌ ధాతాయథాపూర్వమకల్పయ' (ఋ. సం. 10. 1903) దితి చ మంత్రవర్ణః పూర్వకల్పసద్భావం దర్శయతి. స్మృతావప్యనాదిత్వం సంసారస్యోపలభ్యతే 'న రూపమస్యేహ తథోపలభ్యతే నాంతో న చాదిర్న చ సంప్రతిష్ఠేతి (గీ. 15-3) పురాణే చాతీతానామనాగతానాం చ కల్పానాం న పరిమాణమస్తీతి స్థాపితమ్.

---

సంసారము అనాది యని శ్రుతి చెప్పు చున్నది.

ధరించబోవుచున్నానని చెప్ప వీలులేదు. అంతకుపూర్వమున్నదగుటచే పూర్వసంబంధము యొక ముందుకలుగబోవు సంబంధము కంటె బలవత్తరము. [సృష్టిక్రియ జీవునితో నారంభమగుచున్నది. ముందు జీవుడు తరువాత సృష్టి కలుగవలెను. ముందు జీవుడు, తరువాత సృష్టి, తరువాత నద్దానియందు ప్రవేశము— ఈ విధముగ సృష్టిక్రియ తత్సృష్ట్వాతదేవాను ప్రావిశత్ అను శ్రుతివాక్యమునకర్థము. సృష్టిచేసినవాడు, అందుప్రవేశించినవాడు నొకడే యని యీ శ్రుతివాక్యము దెలియజేయుచున్నది.] ధాత సూర్య చంద్రమసులను పూర్వకల్పమునం దెట్లు సృజియించెనో యను మంత్రివర్ణము పూర్వకల్ప మొకటియున్నట్లు చూపుచున్నవి. సంసారమనాదియని స్మృతివలన గూడ దెలియుచున్నది. ఈ సంసారవృక్షముయొక్క ఆకార మెవనికిని దెలియదు. దీని నాశము, ఆరంభము స్థితిగూడ నెవనికిని తెలియరాదు. అని గీత పలుకుచున్నది. గడచినట్టియు రానున్నట్టియు కల్పము

లను నిశ్చయించు కొలమానము లేదని పురాణములు స్థాపించు చున్నవి. [సంసారమనాది, అవిద్యాకల్పిత మగుటవలన మిథ్యారూపము గనుక ఏకమేవాద్వితీయమగు బ్రహ్మము మిగిలియున్నదని యవధారణరూపమున నిర్ధారణ చేయబడు చున్నది.]

అధికరణ సంక్షిప్తార్థము: సంసారముయొక్క అనాదిత్వము ఉపపన్నమగుచున్నది. పూర్వజన్మకర్మచే ఈ జన్మము, ఈ జన్మమునందలి కర్మముచే తిరిగి జన్మము– ఈవిధముగ బీజాంకురన్యాయమున సంసారము సంభవించుచున్నది. కర్మాచరణమునకు అవిద్య కారణము. సంసారముయొక్క అనాదిత్వము శ్రుతిసిద్ధము. 36

## (13) సర్వధర్మోపపత్త్యధికరణము

అ॥ కర్మవైచిత్ర్యవశమున యీశ్వరునికి విషమసృష్టి సంప్రాప్తమైనట్లు పూర్వాధికరణమున నిశ్చయింపబడినది. అయినను సగుణమగు బ్రహ్మము జగత్తున కుపాదానకారణమగుచున్నది యని వేదాంతములు నిర్వచించుచున్నవి. నిర్గుణమగు బ్రహ్మమునకు సగుణత్వము సంభవము కాదు, కనుక బ్రహ్మము జగదుపాదాన కారణమెట్లగును అనుశంక కలుగుచున్నది. ఈశంకను తీర్చుట కుత్తరాధికరణ మారంభమగుచున్నది.

## సర్వధర్మోపపత్తేశ్చ (సూ. 37)

చేతనం బ్రహ్మ జగతః కారణం ప్రకృతిశ్చేత్యస్మిన్నవధారితే వేదార్థే పరైరుపక్షిప్తాన్ విలక్షణత్వాదీన్ దోషాన్ పర్యహార్షీదాచార్యః, ఇదానీం పరపక్షప్రతిషేధప్రధానం ప్రకరణమారిప్సమాణః స్వపక్షపరిగ్రహప్రధానం ప్రకరణముపసంహరతి.యస్మా

---

విషయము : సగుణబ్రహ్మము. జగదుపాదానమని నిరూపించు వేదాంత వాక్యముల నిర్గుణబ్రహ్మమునందు సమన్వయము చేయుట.

విశయము : నిర్గుణబ్రహ్మ ముపాదానకారణము కానేరదు అట్టిబ్రహ్మమువలన జగదుత్పత్తిగల్గుచున్నదని సమన్వయము చేయుట విరుద్ధమగునా కాదాయని సందేహము.

పూర్వపక్షము : విరుద్ధమగును.

సిద్ధాంతము : విరుద్ధముకాదు.

విరుద్ధముగాదని రాబోవుసూత్రమున చూపబడుచున్నది.

సర్వధర్మ ఉపపత్తేః చ = జగత్కారణత్వము, సర్వజ్ఞత్వము, మొదలగు సర్వకారణ ధర్మములు బ్రహ్మమునందు సంభవమగుటవలన అతడే జగత్కారణము అగుచున్నాడు.

ప్రకృతమున మఱికొంతమంది ప్రతికక్షులు చేయు నాక్షేపణములను ప్రతిషేధించుటయె ముఖ్యోద్దేశ్యముగా గల తరువాత ప్రకరణము నారంభింపదలచి మున్ముందు స్వపక్ష పరిగ్రహణ కారణమును ప్రదర్శించిన నీ ప్రకరణ ముపసంహా

దస్మిన్ బ్రహ్మణికారణే పరిగృహ్యమాణే ప్రదర్శితేన ప్రకారేణ సర్వే కారణధర్మాః ఉపపద్యంతే 'సర్వజ్ఞం సర్వశక్తిమహామాయం

---

రించుచున్నారు. ఇంతవరకు ప్రదర్శించిన విధానమున బ్రహ్మము జగత్కారణమని యంగీకరించుచుండగ, సర్వజ్ఞత్వము, సర్వశక్తి సముపేతత్వము, మహామాయిత్వము మొదలగు కారణ ధర్మములన్నియు నుపపన్నములగుచున్నవి. [నిర్గుణబ్రహ్మము రజ్జు సర్ప స్థలమునందువలెనే జగత్తునకు వివర్తముచే నుపాదాన కారణ మగుటలో విరోధమేమియు లేదు. జగద్భ్రమ కధిష్ఠానమగుటయే యచట

బ్రహ్మమునందు సృష్టి కారణ ధర్మములన్నియు నుపపన్నములు.

ప్రయోజనము. సగుణబ్రహ్మము శబ్దాదులవలెనే నిత్యత్వభ్రమ కాస్పదమగుచున్నది. సర్వజ్ఞత్వ సర్వశక్తిమత్వములు కారణమునందు ప్రత్యక్ష ప్రసిద్ధములుగావు. ఆ తడే యే కార్యమును నిర్వర్తించునో ఆకార్యమును సంపూర్ణముగ నెరవేర్చ శక్తిగలవాడనియు ప్రసిద్ధిగలదు. ఈశ్వరుడు సర్వజగత్కర్తయని శ్రుతులయందు వినుచున్నాము. కనుక నతనికి నిరతిశయ సర్వజ్ఞత్వ సర్వశక్తిమత్వములు సిద్ధించుచున్నవి. స్వయముఃగా బ్రహ్మము నిష్క్రియము నిష్కలము నయినను మహా మాయియగుటచే నతనికి జగత్కర్తృత్వము ఉపాదానత్వముగూడ సంభవమగుచున్నది. ఇట్లు సర్వశంకా పంకము ప్రక్షాళనము చేయబడుచున్నది.] అందువలన యుప

చ బ్రహ్మేతి తస్మాద నతిశంకనీయమిదమౌపనిషదం దర్శనమితి.

ఇతి శ్రీమచ్ఛారీరక మీమాంసాభాష్యే శ్రీశంకర
భగవత్పాదకృతౌ ద్వితీయాధ్యాయస్య
ప్రథమః పాదః సమాప్తః.

---

నిష ర్థాపితమగు నద్వైత దర్శనము మేరమీరిన శంకల కాస్పదము కానేరదు. 37

అధికరణ సంక్షేపార్థము: బ్రహ్మము జగత్కారణమని సిద్ధము చేయబడినది. అందువలన సృష్టి సాధనములు అన్నియు నుపపన్నము లగుచున్నవి.

ద్వితీయాధ్యాయము — ప్రథమ పాదము
సమాప్తము.

---



బ్రహ్మసూత్ర

# శాంకరమీమాంసాభాష్యమ్

కల్యాణ కౌముదీ సమేతమ్.

## ద్వితీయాధ్యాయే — ద్వితీయః పాదః

## (1) రచనానుపపత్త్యధికరణమ్ (సూ. 1–10)

వేదాన్తవాక్యముల కద్వైతపరముగ చేయబడిన సమన్వయమునందు సాంఖ్యయోగకాణాది దర్శనకర్తలు ప్రదర్శించిన విరోధములు ద్వితీయాధ్యాయ ప్రథమపాదమునందు తర్కపురస్సరముగ పరిహరింపబడినవి. స్వపక్షము సిద్ధము చేయబడినది. ద్వితీయపాదమునందు పరమతము నిరసింపబడుచున్నది. ఈ విధముగ నీ పాదము ప్రథమపాదమున కనుబంధమగుచున్నది. 'సర్వధర్మోపపత్తేశ్చ' (2–1–37) అను పూర్వసూత్రమునందు బ్రహ్మమును జగత్కారణముగ గ్రహించినపుడు సమస్త కారణధర్మములు అచట ఉపపన్నము లగుచున్నవి యని నిరూపింపబడినది. ప్రధానమునం దట్టి కారణధర్మము లేల నుపపన్నము కాకూడదను పూర్వపక్షమునకు రాబోవు అధికరణమున సమాధానము చెప్పుచున్నారు.

పూర్వోత్తర గ్రన్థ సంగతి

# రచనానుపపత్తేశ్చ నానుమానమ్ (సూ. 1)

యద్యపీదం వేదాంతావాక్యానామైదంపర్యం నిరూపయితుం శాస్త్రం ప్రవృత్తం; న తర్కశాస్త్రవత్ కేవలాభిర్యుక్తిభిః కంచిత్సిద్ధాంతం సాధయితుం దూషయితుం వా ప్రవృత్తం, తథాపి

---

విషయము : అచేతనమగు ప్రధానము జగదుపాదాన కారణమను సాంఖ్యసిద్ధాంతము.

విశయము : ఈవిషయము ప్రమాణమూలకమా? లేక భ్రాంతిమూలకమా యని సందేహము.

పూర్వపక్షము : ప్రమాణమూలకమని సాంఖ్యులు.

సిద్ధాంతి : భ్రాంతిమూలకమని వేదాంతులు.

అవలోకనీయములగు ప్రమాణములు, బ్ర. సూ. 1-1-5 1-1-18 1-4-28. బృ 3-7-4. 3-8-9; బ్ర. సూ, 2-1-14.

అనుమానం = అనుమానప్రమాణముచే దెలియదగు ప్రధానము జగత్కారణము న = కానేరదు; ఏలనన! రచనా అనుపపత్తేః చ=ప్రధానము జడము గనుక సృష్టికి అనుకూలమగు జ్ఞానము లేనందున.

వేదాంత వాక్యములన్నియు తత్త్వమును నిరూపించుటకు ప్రవృత్తములయినను తర్కశాస్త్రమువలె కేవల యుక్తులచే నేసిద్ధాంతమును సాధించుటకుగాని దూషించుటకుగాని ప్రవర్తించుట లేదు. అయినను సమ్యగ్దర్శన

వేదాంతవాక్యాని వ్యాచక్షాణై స్సమ్యగ్దర్శనప్రతిపక్షభూతాని సాంఖ్యాది దర్శనాని నిరాకరణీయానీతి తదర్థః పరః పాదః ప్రవర్తతే. వేదాంతార్థనిర్ణయస్య చ సమ్యగ్దర్శనార్థత్వాత్ తన్నిర్ణయేన స్వపక్షస్థాపనం ప్రథమం కృతం తద్ధ్యభ్యర్హితం పరపక్షప్రత్యాఖ్యానాదితి.

మాధ్యమికః : నను ముముక్షూణాం మోక్షసాధనత్వేన సమ్యగ్దర్శననిరూపణాయ స్వపక్షస్థాపనమేవ కేవలం కర్తుం యుక్తం. కిం పరపక్షనిరాకరణేన పరవిద్వేషకారణేన.

---

మునకు ప్రతిపక్ష స్థానమునందున్న సాంఖ్యాది దర్శనములను నిరాకరించుట వేదాంతవాక్యముల వ్యాఖ్యానము చేయువారల కవశ్యమగు చున్నది. అందుకొఱ కీపాదము ప్రవర్తించుచున్నది.

ఉత్తరగ్రంథప్రయోజనము.

వేదాంతముల అర్థనిర్ణయమునకు సమ్యగ్దర్శనమే ప్రయోజనము గనుక మున్ముందు వేదాంతముల అర్థనిర్ణయము చేసి స్వపక్షమును స్థాపించి యుంటిమి. పూర్వపక్షమును త్రోసిపుచ్చుటకంటె మున్ముందు స్వపక్షస్థాపన మెక్కువ అవసరము.

మాధ్యమికుడు : ముముక్షువులకు మోక్షసాధన మగుటచే సమ్యక్ జ్ఞానమును నిరూపించుటకు స్వపక్షస్థాపనమును మాత్రము చేయుట యుక్తము. పరపక్షమును నిరాకరించుట వలన నేమి ప్రయోజనము ? అది యితరులతో ద్వేషమునకు కారణమగును గదా !

సిద్ధాంతీ : బాఢమేవమ్, తథాపి మహాజనపరిగృహీతాని మహాంతి సాంఖ్యాదితంత్రాణి సమ్యగ్దర్శనాపదేశేన ప్రవృత్తాన్యుప లభ్య భవేత్కేషాంచిన్మందమతీనామేతాన్యపి సమ్యగ్దర్శనాయో పాదేయానీత్యపేక్షా. తథా యుక్తిగాఢత్వసంభావనాత్సర్వజ్ఞభాషిత త్వాచ్చ శ్రద్ధాచ తేష్విత్యత స్తదసారతోపపాదనాయ ప్రయత్యతే.

మాధ్యమికః : నను 'ఈక్షతేర్నాశబ్దమ్' (అ 1 పా 1 సూ 5) 'కామాచ్చ నానుమానాపేక్షా' (అ 1 పా 1 సూ 18) 'ఏతేన సర్వే వ్యాఖ్యాతా వ్యాఖ్యాతాః' (అ 1 పా 4 సూ 28) ఇతి చ పూర్వ త్రాపి సాంఖ్యాదిపక్షప్రతిషేధః కృతః కింపునః కృతకరణేనేతి.

---

సిద్ధాంతి : మీరు లెస్సగాపలికితిరి. అయినను, సాంఖ్యాది దర్శనములు గొప్పవి; మహాజనులు వానిని గ్రహించుచున్నారు. వానివలన లెస్సయగు జ్ఞానమలవడునను మిషతో ప్రచారము నొందుచున్నవి. వానిని సేకరించి లెస్సయగు జ్ఞానమును బొందగలమను కోర్కె కొంతమంది మందమతులకు కలుగవచ్చును. వానియందు యుక్తులు మెండుగా కాన్పించుచున్నవి. సర్వజ్ఞుడగు కపిలమహర్షిచే చెప్పబడినవి. జనులకు వానియం దెక్కువగ శ్రద్ధయు గలదు. అవి సారహీనములని ప్రదర్శించుటకు యత్నించుచున్నాము.

మాధ్యమికుడు : ఈక్షతేర్నాశబ్దమ్ (1-1-5) కామాచ్చ నానుమానాపేక్షా (1-1-18) ఏతేన సర్వే వ్యాఖ్యాతాః వ్యాఖ్యాతాః (1-4-28) ఈ మొదలగు పూర్వసూత్రముల యందు గూడ సాంఖ్యాదిపరపక్షముల త్రోసివేసితిరి గదా? చేసినదానినే మఱి యేలచేయవలెను ?

సిద్ధాంతీ : తదుచ్యతే, సాంఖ్యాదయః స్వపక్షస్థాపనాయ వేదాంతవాక్యాన్యప్యుదాహృత్య స్వపక్షానుగుణ్యేనైవ యోజయంతో వ్యాచక్షతే, తేషాం యద్వ్యాఖ్యానం తద్వ్యాఖ్యానాభాసం న సమ్యగ్వ్యాఖ్యానమిత్యేతావత్పూర్వత్ర కృతం, ఇహ తు వాక్యనిరపేక్షస్స్వతంత్రస్తద్యుక్తిప్రతిషేధః క్రియత ఇత్యేష విశేషః.

పూ. పక్షీ : తత్ర సాంఖ్యాః మన్యంతే—యథా ఘటశరావాదయో భేదా మృదాత్మతయాఽన్వీయమానా మృదాత్మకసామాన్యపూర్వకా లోకే దృష్టాః, తథా సర్వ ఏవ బాహ్యాధ్యాత్మికా భేదా

---

సిద్ధాంతి : అది యేలనో చెప్పుదుము. సాంఖ్యాదులు తమ పక్షమును స్థాపనము చేసికొనుటకు వేదాంతవాక్యములను గూడ నుదాహరించి వానికి తమ వాదమున కనుకూలముగ నర్థకల్పనము చేసిరి. వేదాంతవాక్యములను గూర్చి వారు చేయు వ్యాఖ్యానము వ్యాఖ్యానాభాసముగాని నిజముగ లెస్సయగు వ్యాఖ్యానము కాదనిమాత్రము పూర్వము మాచే ప్రదర్శింపబడినది. శ్రుతిప్రమాణములతో నిమిత్తము లేక స్వాంతత్రమగు యుక్తిచేతనే వారి మతఖండన మిచట చేయుచున్నాము. ఇదియే యిచట విశేషము.

పూ. పక్షి : ఘటశరావాదులు భిన్నములు, మృత్తిక స్వరూపముతో సమన్వయమగుచున్నవి. వీని యన్నిటికిని మృత్తిక సామాన్యకారణము. ఆ విధముగానే బాహ్యములు, ఆంతరంగికములు నగు వికారములన్నియు సుఖ దుఃఖ మోహా

స్సుఖదుఃఖమోహాత్మతయాఽన్వీయమానాః సుఖదుఃఖమోహాత్మక సామాన్యపూర్వకా భవితుమర్హంతి. యత్సుఖదుఃఖమోహాత్మకం సామాన్యం తత్త్రిగుణం ప్రధానం మృద్వదచేతనం చేతనస్య పురుషస్యార్థం సాధయితుం స్వభావభేదేనైవ విచిత్రేణ వికారాత్మనా వివర్తత ఇతి. తథా పరిమాణాదిభిరపి లింగైస్తదేవ ప్రధానమనుమిమతే.

సిద్ధాంతీ : తత్ర వదామః—యది దృష్టాంతబలేనైవైతన్నిరూప్యేత నాచేతనంలోకే చేతనానధిష్ఠితం స్వతంత్రంకించిద్విశిష్ట

---

స్వరూపములతో సమన్వయమగుచున్నవి. వీనికన్నిటికిని సుఖ దుఃఖ మోహములు సామాన్యకారణములు. (2) సుఖ దుఃఖ మోహ స్వరూపమగు నీ సామాన్యకారణము సత్వరజస్తమస్సులను గుణత్రయముయొక్క స్వరూపమగు ప్రధానము. అది మృత్తికవలె నచేతనము. (3) అయ్యది చేతనుడగు బురుషునికి భోగాపవర్గరూపమగు ప్రయోజనమును సాధించుటకై అప్రయత్నముగ విచిత్రములగు మహదాదివికారరూపములు పరిణమించును. (4) వికారములయొక్క పరిమాణములు మొదలగు లింగములచే ప్రధానము ననుమానప్రమాణముచే నూహించుచున్నారు.

సిద్ధాంతీ : ఇందుకు మేమిట్టుల చెప్పుచున్నాము (1) మృత్తికా దృష్టాన్త బలముచేతనే ప్రధానము జగదుపాదాన కారణమని మీ రూహించినచో

చేతనవ్యాపారము లేక అచేతనమునకు ప్రవృత్తికలుగదు.

అచేతనము చేతనముచే చోదితముగాక స్వతంత్రముగ పురుష ప్రయోజనములను సాధింప సమర్థమైనట్టుల లోకమున కాన్పిం

పురుషార్థనిర్వర్తనసమర్థాన్ వికారాన్ విరచయద్దృష్టం. గేహప్రాసాదశయనాసనవిహారభూమ్యాదయో హి లోకే ప్రజ్ఞావద్భిః శిల్పిభిర్యథాకాలం సుఖదుఃఖప్రాప్తిపరిహారయోగ్యా రచితాః దృశ్యంతే, తథేదం జగదఖిలం పృథివ్యాదినానాకర్మఫలోపభోగయోగ్యం బాహ్యమాధ్యాత్మికం చ శరీరాది నానాజాత్యన్వితం ప్రతినియతావయవవిన్యాసమనేకకర్మఫలానుభవాధిష్ఠానం దృశ్యమానం ప్రజ్ఞావద్భిస్సంభావితతమైశ్శిల్పిభిర్మనసాప్యాలోచయితుమశక్యం సత్ కథమచేతనం ప్రధానం రచయేత్. లోష్టపాషాణాదిష్వదృష్ట

---

చుట లేదు. గృహములు, నగరములు, శయనములు, ఆసనములు ఉద్యానభూములు మొదలగు వానిని ఆయాపురుషుల సుఖప్రాప్తికొఱకును దుఃఖపరిహారము కొఱకును ప్రవీణులగు పనివాండ్రు కాలానుసారముగ యోగ్యమగు రీతిన నిర్మించుచున్నటుల కాన్పించుచున్నారు. ఒకవైపున పృథివి మొదలగు బాహ్యమగు నీ జగత్తంతయు ననేకములగు పూర్వకర్మ ఫలముల ననుభవించుటకు యోగ్యముగ కానవచ్చుచున్నది. మఱియొక వైపున చేతనసహితమై అనేక జాతులుగ నేర్పడి ప్రతివ్యక్తికిని నియతమగు నవయవముల విచిత్రరచనలతో నమర్పబడి అనేకములగు కర్మఫలముల కనుభవభూమి యగు నీశరీరము కానవచ్చుచున్నది, ఈరచనానైపుణ్యము జ్ఞానవంతులని పరిగణింపబడు శిల్పుల బుద్ధికిగూడ నందరాకున్నది. ఇట్టి విచిత్రరచన మచేతనమగు ప్రధానమున కెటులసాధ్యము? మట్టిపెళ్ల పాషాణము మొదలగు నితర అచేతనముల యందిట్టి సామర్థ్యము కాన్పించుట లేదు. మృత్తిక మొదలగు

త్వాత్. మృదాదిష్వపి కుంభకారాద్యధిష్ఠితేషు విచిత్రాకారా రచనా దృశ్యంతే, తద్వత్ ప్రధానస్యాపి చేతనాంతరాధిష్ఠితత్వప్రసంగః, న చ మృదాద్యుపాదానస్వరూపవ్యపాశ్రయేణైవ ధర్మేణ మూలకారణమవధారణీయం, న బాహ్యకుంభకారాదివ్యపాశ్రయేణేతి కించిన్నియామకమస్తి, నచైవం సతి కించిద్విరుధ్యతే. ప్రత్యుత శ్రుతిరనుగృహ్యతే చేతనకారణత్వసమర్పణాత్, అతో రచనానుపపత్తేశ్చ హేతోర్నా చేతనం జగత్కారణమనుమాతవ్యం భవతి.

నవిగూడ కుమ్మరి మొదలగు చేతనము వ్యవహరించినపుడే ఘటము మొదలగు ప్రత్యేక వికారముల గాన్పించుచున్నవి. ఆవిధముననే జగద్రచన విషయమై ప్రధానమునకు గూడ మరియొక చేతనవ్యాపార ప్రసక్తి కలుగుచున్నది. [ఘటమేర్పడుటకు మృత్తు ఉపాదాన కారణము కులాలుడు నిమిత్త కారణము. ఉపాదానకారణ మాంతరము. నిమిత్త కారణము బాహ్యము.] (2) జగత్తుయొక్క మూల కారణము నాలోచించునపు డాంతరమగు నుపాదాన కారణధర్మమును మాత్రమాలోచింప వలయునుగాని బాహ్యమగు నిమిత్తకారణ ధర్మము నాలోచింప నవసరము లేదను నియమము లేదు. ఈపక్షమున విరోధ మేమియు గానరాకుండుటయే గాక చేతనకారణత్వమును పరిగ్రహించుటచే శ్రుతికి గూడ నంగీకార మగును. [అమేయ విచిత్ర రచనా వైభవముతో నొప్పారు] జగద్రచన ప్రధానమునకు చేతనసహాయము లేక నుపపన్నము కాకుండుటవలన అచేతనమగు ప్రధానము జగత్కారణమని యూహింప శక్యముగాదు. (3) సుఖ

నిమిత్తకారణము గూడ నాలోచనీయము.

అన్వయాద్యనుపపత్తేశ్చేతి చ శబ్దేన హేతోరసిద్ధిం సముచ్చినోతి. న హి బాహ్యాధ్యాత్మికానాం భేదానాం సుఖదుఃఖమోహాత్మకతయాఽన్వయ ఉపపద్యతే. సుఖాదీనామాంతరత్వప్రతీతేః శబ్దాదీనాం

---

దుఃఖాదుల సమన్వయము గూడ సంభవము కాదు గనుక ప్రధానము జగత్కారణము కానేరదని చ శబ్దార్థము.

చ శబ్దార్థము.

బాహ్యములు ఆంతరంగికములు నగు భేదము సుఖ మోహాములతో నన్వయించుట శక్యము కాదు, సుఖ దుఃఖాదు లాంతరములు – అంతఃకరణనిష్ఠములు, శబ్దాదులు ఆంతర ములు కావు కేవలము బాహ్యములు. ఆంతరంగికములగు సుఖ దుఃఖాదులకు కారణ భూతములు. [సుఖదుఃఖాదు లాంతరంగికములగు నధ్యాత్మ ధర్మములు. శబ్దస్పర్శాదులు బాహ్యములు, సుఖాదులకు నిమిత్త కారణభూతములు గాని ఉపాదానకారణములు కావు.] శబ్దాదులన్నిటియందు విశేషము లేకున్నను, వాని భావనా భేదముచేత సుఖదుఃఖాది విశేషములు సంభవించుచున్నవి. [శబ్ద మొకటి యయినను విను వాని అంతఃకరణవృత్తి విశేషముచే నొకనికి సుఖానుభవము, యింకొకనికి దుఃఖానుభవము, మఱియొకనికి మోహాను భవము సంభవించుచున్నది.] కనుక

విషయములు సుఖ స్వరూపములు కావు

విషయములు సుఖస్వరూపములు కానేరవు. [విషయములే సుఖ దుఃఖమోహాదు లని సాంఖ్యమతము. అటులయినచో వేసవియందు సుఖమగు కుంకుమ పంకము హేమంత ఋతువునందు గూడ సుఖకరము

చాతద్రూపత్వప్రతీతే స్తన్నిమి త్తత్వప్రతీతేశ్చ, శబ్దాద్యవి శేషే౽పిచభావనావి శేషాత్ సుఖాదివి శేషోపలబ్ధేః, తథా పరిమితానాం భేదానాం మూలాంకురాదీనాం సంసర్గపూర్వకత్వం దృష్ట్వా బాహ్యాధ్యాత్మికానాం భేదానాం పరిమితత్వాత్ సంసర్గపూర్వకత్వమనుమిమానస్య సత్వరజ స్తమసామపి సంసర్గపూర్వకత్వప్రసంగః పరిమితత్వావి శేషాత్. కార్యకారణభావస్తు ప్రేక్షాపూర్వకం నిర్మితానాం

---

కావలెను. కుంకుమపంక మెల్లవుడును కుంకుమ పంకముగనే యుండును. అదేవిధముగ నుష్ట్రమునకు సుఖకరమగు కంటకము ప్రాణిధారులగు మనుజులకు గూడ సుఖకరము కావలసి యుండెను] (5) అదేవిధముగ మూలము అంకురము మొదలగు పరిమితములగు భేదము అనేకవస్తువుల యొక్క సంసర్గ వలన సంభవించుచున్నట్లు కాన్పించుచున్నది. కనుక బాహ్యములు ఆంతరంగికములు నగు వికారము లన్నియు పరిమితములగుటచే సంసర్గచేతనే సంభవించుచున్నవి యని యూహించినచో, సత్వరజస్తమస్సులు గూడ పరిమితము లగుటంజేసి సంసర్గము నాధారము చేసికొని యున్నవి యనియే చెప్పవలసి వచ్చును. [అనగా స్వభావముచేతనే నీమూడు గుణములు అనేకవస్తువులతో సంస్పృష్టములగు చున్నవియని చెప్పవలసి వచ్చును. సత్వరజస్తమస్సులకు గూడ మూలకారణముతో సంసర్గ యుండవలసి వచ్చునని తాత్పర్యము.] (6) బాహ్యాధ్యాత్మికముల కచేతనము కారణమని చెప్పుటకు కార్యకారణసంబంధ మొక హేతువు కానేరదు. ఆలోచనా

కార్యకారణ సంబంధము చేతనముచే కలుగును.

శయనాసనాదీనాం దృష్ట ఇతి న కార్యకారణభావాద్బాహ్యాధ్యాత్మికానాం భేదానామచేతనపూర్వకత్వం శక్యం కల్పయితుమ్.

## ప్రవృత్తేశ్చ (సూ. 2)

సిద్ధాంతి : ఆస్తాం తావదియం రచనా తత్సిద్ధ్యర్థా యా ప్రవృత్తిః సామ్యావస్థానాత్ప్రచ్యుతిస్సత్త్వరజస్తమసామంగాంగిభావాపత్తిః విశిష్టకార్యస్యాభిముఖప్రవృత్తిః, సాపి నాచేతనస్య

---

పూర్వకముగ నిర్మింపబడిన శయనాసనాదులకు గల కార్యకారణభావము వానిని నిర్మించిన చేతనముచే కలుగుచున్నదియని చూపియుంటిమి. 1

ప్రధానము జడము యిచ్ఛలేనిదిగనుక ప్రవృత్తేః చ= ఇచ్ఛాపూర్వకమగు ప్రయత్నము అనుపపత్తేః చ=సంభవించదు గనుక జగత్కారణము కానేరదు.

సిద్ధాంతి : ఈ జగద్రచనా విషయ మటులుండనిండు. ఈ జగద్రచన సమకూరుట కవసరమగు ప్రయత్నము సత్వరజస్తమోగుణములు సామ్యావస్థనుండి తొలగుటచే కలుగుచున్నది. [త్రిగుణములు సామ్యావస్థయందుండుట ప్రలయావస్థ. అప్పుడేకార్యము బుట్టనేరదు. మొదట వానికి సామ్యావస్థ తొలగి వైషమ్య మేర్పడును. అపుడేదోయొక గుణమునకు ప్రాముఖ్యత తదితరములకు మొదటిదానికి సహాయభూతత్వము సంభవించును.] ఇటుల వానికి అంగాంగి భావమేర్పడును. అపుడు విశిష్టమగు కార్యము నుత్పాదనము చేయుటకు ప్రవృత్తి కలుగును. ఇట్టి ప్రవృత్తి అచేతనమగు ప్రధాన

ప్రధానమునకు ప్రవృత్తి సంభవము కాదు.

ప్రధానస్య స్వతంత్రస్యోపపద్యతే, మృదాదిష్వదర్శనాత్ రథాదిషు చ. న హి మృదాదయో రథాదయో వా స్వయమచేతనాస్సంతశ్చే తనైః కులాలాదిభిరశ్వాదిభిర్వాఽనధిష్ఠితా విశిష్టకార్యాభిముఖ ప్రవృత్తయో దృశ్యంతే. దృష్టాచ్చాదృష్టసిద్ధిరతః ప్రవృత్త్యనుప పత్తేరపి హేతోర్నా చేతనం జగత్కారణ మనుమాతవ్యం భవతి.

పూ. పక్షీ: నను చేతనస్యాపి ప్రవృత్తిః కేవలస్య న దృష్టా.

సిద్ధాంతీ: సత్యమేతత్, తథాపి చేతనసంయుక్తస్య రథా దేరచేతనస్య ప్రవృత్తిర్దృష్టా.

---

మునకు స్వతంత్రముగ కలుగనేరదు. మృదాదులయందు అట్టి ప్రవృత్తి కాన్పించుటలేదు. స్వయముగ నచేతనములగు మృదాదులుగాని, రథాదులుగాని కులాలాదులు అశ్వములు వ్యాపారవంతములు కానపుడు విశిష్టమగు కార్యము నుత్పా దనముచేయుట కభిముఖములుగ కాన్పించుటలేదు. [వివిధ కార్యముల నుత్పాదనముచేయునది ప్రవృత్తి. ప్రవృత్తిచే నుత్పాదనము చేయబడు వివిధకార్యముల స్థాపనము రచన.] దృష్టవస్తువునుండి అదృష్టవస్తువును నిశ్చయింతుము. (1) ప్రధానమునకు జగత్తు నుత్పాదనము చేయు ప్రయత్నము సాధ్యముకాకుండుటచే కూడ అది జగత్కారణమగునని యూహింప శక్యముకాదు.

పూ. పక్షి: కేవలము చేతనమునకు గూడ ప్రవృత్తి కాన్పించుటలేదు గదా?

సిద్ధాంతి: ఇది నిజమే! అయినను చేతనముతో గూడి యున్న రథాదులకు ప్రవృత్తి కాన్పించుచున్నది.

పూ. పక్షీ : స త్వచేతనసంయుక్తస్య చేతనస్య ప్రవృత్తి ర్దృష్టా.

మాధ్యమికః : కిం పునరత్ర యుక్తం? యస్మిన్ ప్రవృత్తి ర్దృష్టా తస్య నేతి ఉత యత్సంప్రయుక్తస్య దృష్టా తస్యైవ నేతి.

పూ. పక్షీ : నను యస్మిన్ దృశ్యతే ప్రవృత్తిస్తస్యైవ సేతి యుక్తముభయోః ప్రత్యక్షత్వాత్, న తు ప్రవృత్త్యాశ్రయత్వేన కేవలశ్చేతనో రథాదివత్ ప్రత్యక్షః. ప్రవృత్త్యాశ్రయదేహాది సంయుక్తస్యైవ తు చేతనస్య సద్భావసిద్ధిః కేవలా చేతనరథాది

---

పూ. పక్షి : అచేతనముతో కూడుకొనియున్నను చేతనమునకు ప్రవృత్తి కాన్పించుటలేదే!

మాధ్య : ఈ రెండుపక్షములలో నేదియుక్తము. [సాంఖ్యవాద ప్రకారము] దేనియందు ప్రవృత్తి కాన్పించుచున్నదో దానిదే ఆ ప్రవృత్తి యగునా? లేక [వేదాంతమతప్రకారము] దేని సంబంధముచే నీ ప్రవృత్తి కలుగుచున్నదియో దానిదే యీ ప్రవృత్తి యగునా? [రథమునందు ప్రవృత్తి కాన్పించుచున్నదికనుక నా ప్రవృత్తి రథమునకు చెందినది యని సాంఖ్యవాదము. రథమునకు కట్టిన అశ్వమువలన రథమునకు ప్రవృత్తి కలుగుచున్నది కనుక నా ప్రవృత్తి ప్రవృత్తిప్రవర్తకమగు నశ్వముది యని వేదాంతి వాదము].

పూ. పక్షి : దేనియందు ప్రవృత్తికాన్పించుచున్నదో ఆ ప్రవృత్తి దానిదేయనుట యుక్తము. ప్రవృత్తి దాని ఆశ్రయము-ఈ రెండును ప్రత్యక్షముగ కాన్పించుచున్నవి. రథాదులవలె కేవలచేతనము ప్రవృత్తికి ఆశ్రయముగ నున్నటుల

వైలక్షణ్యం జీవద్దేహస్య దృష్టమితి, అతఏవ చ ప్రత్యక్షే దేహే సతి చైతన్యస్య దర్శనాదసతి చాదర్శనాద్దేహస్యైవ చైతన్యమితి లోకాయతికాః ప్రతిపన్నాః తస్మాదచేతనస్యైవ ప్రవృత్తిరితి.

సిద్ధాంతీ : తత్రాభిధీయతే, న బ్రూమో యస్మిన్నచేతనే ప్రవృత్తిర్దృశ్యతే న తస్య సేతి, భవతు తస్యైవ సా. సా తు చేతనాద్భవతీతి బ్రూమః, తద్భావే భావాత్తదభావే చాభావాత్ యథా కాష్ఠ

---

కాన్పించుట లేదు. ప్రవృత్తికి ఆశ్రయమగు నేదోయొక దేహాదికముతో సంబంధించి యున్నప్పుడే చేతనమున కునికియున్నటుల నూహింపబడుచున్నది. [కాని చేతనమునకు సాక్షాత్ప్రవృత్త్యాశ్రయము లేదు.] ప్రాణవంతములగు దేహములకును రథాది అచేతనములకును గల భేదముచేత నే ఇటుల నూహింపబడుచున్నది. దేహము ప్రత్యక్షముగ నుండగా చైతన్యము కాన్పించుట, అది కాన్పించనపుడు, చైతన్యము కాన్పించకుండుట, యీకారణముచేత నే చేతనత్వము దేహమున కొక విశేషణమని లోకాయతికులు తలంచుచున్నారు. అందువలన ప్రవృత్తి అచేతనసంబంధమగును.

సిద్ధాంతి : ఇందుకు సమాధానము చెప్పుచున్నాము. (2)ఏఅచేతనమునందు ప్రవృత్తి కాన్పించుచున్నదో ఆప్రవృత్తి దానిది కాదని మేమనుట లేదు. ఆ ప్రవృత్తి దానిదే కానిండు. కాని ఆ ప్రవృత్తి చేతనమువలన సంభవించుచున్నది యని మేమందుము. చేతనమున్నపుడు ప్రవృత్తి యుండుటయు, అది లేనపు డదిలేకుండుటయు కాన్పించు

అచేతనము నందలి ప్రవృత్తి చేతనకృతము.

దివ్యప్రాంశయాపి దాహప్రకాశాదిలక్షణా విక్రియాఽనుపలభ్యమా నాపి కేవలే జ్వలనే జ్వలనాదేవ భవతి తత్సంయోగే దర్శనాత్ తద్వియోగే చాదర్శనాత్తద్వల్లోకాయతికానామపి చేతన ఏవ దేహోఽచేతనానాం రథాదీనాం ప్రవర్తకో దృష్ట ఇత్యవిప్రతిపన్నం చేతనస్య ప్రవర్తకత్వమ్.

మాధ్యమికః : నను తవ దేహాదిసంయుక్తస్యాప్యాత్మనో విజ్ఞానస్వరూపమాత్రవ్యతిరేకేణ ప్రవృత్త్యనుపపత్తేరనుపపన్నం ప్రవర్తకత్వమితిచేత్.

---

చున్నది. కాష్ఠము మొదలగువాని నాశ్రయించియున్నదహన శక్తి ప్రకాశనశక్తి మొదలగు వికారములు కేవల అగ్ని యున్నపుడు మాత్రము కాన్పింపవు. [అనగా కాష్ఠములేక కేవల మగ్నియుండదు గనుక జ్వలనప్రకాశము లగ్నివలన మాత్రము కలుగవు.] కాని జ్వలనమువలననే సంభవించు చున్నవి. అగ్నియున్నపు డవి సంభవించును. అది లేనపు డవి సంభవింపవు. చేతనమగు దేహమే రథాదుల ప్రవర్తింపజేయు చున్నది యని లోకాయతికులు గూడ నంగీకరించుచున్నారు. (2) కనుక చేతనమే ప్రవర్తింపచేయుచున్నది యను విష యము నిర్వివాద విషయము.

మాధ్య : ఆత్మ దేహసంబంధము గలిగియున్నది. [సర్వప్రవర్తకమగు] జీవసంబంధము లేక కేవలాత్మకు ప్రవ ర్తకత్వము కాన్పించుటలేదు. [అనగా రాజువలె స్వయ ముగా ప్రవృత్తి గలవానికి ప్రవర్తకత్వ ముండును. గాని ప్రవృత్తి లేనివానికి ప్రవర్తకత్వము సంభవముకాదు. ఆత్మకు

సిద్ధాంతీ : న; అయస్కాంతవద్రూపాదివచ్చ ప్రవృత్తిరహిత స్యాపి ప్రవర్తకత్వోపపత్తేః. యథాఽయస్కాంతో మణిః స్వయం ప్రవృత్తిరహితోఽప్యయసః ప్రవర్తకో భవతి, యథా చ రూపాదయో విషయాః స్వయం ప్రవృత్తిరహితా అపి చక్షురాదీనాం ప్రవర్తకా భవంతి, ఏవం ప్రవృత్తిరహితోఽపీశ్వరస్సర్వగతస్సర్వాత్మా సర్వజ్ఞస్సర్వశక్తిశ్చ సన్ సర్వం ప్రవర్తయేదిత్యుపపన్నమ్, ఏకత్వాత్ప్రవర్త్యాభావే ప్రవర్తకత్వానుపపత్తిరితి చేత్,

---

ప్రవృత్తి లేదు. జీవరూపమున ప్రవృత్తి కలదు.] కనుక చేతనమునకు దేహసంబంధమున్నంతమాత్రమున ప్రవర్తకత్వము సంభవము కాదు.

సిద్ధాంతి : అది సరికాదు. అయస్కాంతము, రూపములు మొదలగువానివలె స్వయముగ ప్రవృత్తి రహితములగువస్తువులుగూడ నితరవస్తువులయందు ప్రవృత్తిని కల్పింపవచ్చును. అయస్కాంతమణి స్వయముగా ప్రవృత్తిరహితమైనను యినుపముక్కలను ప్రవర్తింపచేయుచుచున్నది. రూపాదివిషయములు స్వయముగా ప్రవృత్తిరహితములైనను చక్షురాదులకు ప్రవర్తకములగుచున్నవి. (3) ఆవిధముగనే ఈశ్వరుడు ప్రవృత్తిరహితుడైనను, సర్వగతుడు సర్వాత్మకుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు నగుటవలన సమస్తమును ప్రవర్తింపజేయుచున్నాడు. అద్వైతమునందేకత్వము మాత్రముండుటవలన ప్రవర్తింపబడునది లేదుకనుక ప్రవర్తకుడు లేడందురేని అది సరికాదు, అనాదియు అని

ఈశ్వరుడు ప్రవృత్తి రహితుడు సర్వప్రవర్తకుడు.

న, అవిద్యాప్రత్యుపస్థాపితనామరూపమాయావేశవశేనాసకృత్ప్రవృత్త్యుక్తత్వాత్, తస్మాత్సంభవతి ప్రవృత్తిః సర్వజ్ఞకారణత్వే, నత్వచేతనకారణత్వే.

## పయోఽమ్బువచ్చేత్తత్రాపి (సూ. 3)

పూ.పక్షి : స్యాదేతత్, యథా క్షీరమచేతనం స్వభావేనైవ వత్సవివృద్ధయే ప్రవర్తతే, యథా చ జలమచేతనం స్వభావేనైవ

ర్వాచ్యము నగు నవిద్యచే కల్పితములగు నామరూపములు మాయా కార్యములగుటవలన (4) మాయచే నధ్యస్తమగు చిదాత్మసంబంధగతుడగు నీశ్వరుని అంతర్యామి సామర్థ్యము వలన నట్టి ప్రవృత్తి కలుగుచున్నది యని పలుమా ఱింతకు పూర్వమే చెప్పియుంటిమి. కనుక జగద్రచనయందు చేతన కారణముచేతనే ప్రవృత్తి కలుగుచున్నదిగాని అచేతనమగు ప్రధానకారణముచే గలుగనేరదు. 2

పయః అంబువత్ చేత్ = క్షీరములు, జలము స్వయముగా నచేతనములైనను ప్రవర్తించినటుల నచేతనమగు ప్రధానముగూడ ప్రవర్తించవచ్చునంటిరేని, తత్ర అపి = అచటగూడ చేతనప్రవర్తకత్వము నూహింతుము.

పూ. పక్షి : ఆ విషయమటుల నగుగాక! (1) క్షీరమచేతనము. స్వభావముచేతనే శిశువుయొక్క అభివృద్ధి కొఱకు ప్రవర్తించుచున్నది. (2) జలమచేతనము. స్వభావముచేతనే లోకోపకారమునకు ప్రవహించుచున్నది.

లోకోపకారాయ స్యందతే, ఏవం ప్రధానమప్యచేతనం స్వభావే నైవ పురుషార్థసిద్ధయే ప్రవర్తిష్యత ఇతి.

సిద్ధాంతీ : నైతత్సాధూచ్యతే. యతస్తత్రాపి పయోఽమ్బునో శ్చేతనాధిష్ఠితయోరేవ ప్రవృత్తిరిత్యనుమిమీమహే, ఉభయ వాది ప్రసిద్ధే రథాదావచేతనే కేవలే ప్రవృత్త్యదర్శనాత్, శాస్త్రం చ 'యోఽప్సు తిష్ఠన్ యోఽపోఽన్తరో యమయతి. (బృ. 3-7-4) ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి. ప్రాచ్యోఽన్యా నద్యస్స్యం దంత' (బృ. 3-8-9) ఇత్యేవం జాతీయకం సమస్తస్య లోకపరి స్పందితస్యేశ్వరాధిష్ఠితతాం శ్రావయతి. తస్మాత్ సాధ్యపక్ష నిక్షిప్తత్వాత్ పయోఽమ్బువదిత్యనుపన్యాసః చేతనాయాశ్చ ధేనోః

---

(3) ఆ తీరుగనే ప్రధాన మచేతన మైనను స్వభావముచేతనే పురుషార్థసిద్ధికి ప్రవర్తింప గలదు.

సిద్ధాంతి : మీరు చెప్పునది బాగాలేదు. చేతనము చేత ప్రేరేపింపబడినపుడే క్షీరములకును జలములకును ప్రవృత్తి సంభవించుచున్నటుల నూహించుచున్నాము. అచేతనములగు రథాదులకు స్వయముగా ప్రవృత్తి లేదని యుభయపక్షముల వార మంగీకరించుచున్నాము. "ఎవడుదకములయందుండి ఉదకములకు లోనున్నవాడై వానిని స్వవ్యాపారమునందు ప్రవర్తింపచేయుచున్నాడో," "తూర్పుదిక్కున నున్న నితర నదులు పరమేశ్వరుని యొక్క ఆజ్ఞయందుండి ప్రవహించు చున్నవి" (1) ఈవిధమగు వాక్యములు సమస్తలోక ప్రవృత్తికి నీశ్వరుడే ప్రేరకుడని తెలియచేయుచున్నవి. కనుక నచేతనము ప్రవృత్తిహేతువు గాదను సామాన్యసూత్రమునకు

స్నేహేచ్ఛయా వత్సవివృద్ధయే పయసః ప్రవర్తకత్వోపపత్తేః, వత్సచూషణేన చ పయస ఆకృష్యమాణత్వాత్. న చాంబునోఽప్యత్యంతమనపేక్షా నిమ్నభూమ్యాద్యపేక్షత్వాత్ స్యందనస్య. చేతనాపేక్షత్వం తు సర్వత్రోపదర్శితమ్. 'ఉపసంహారదర్శనాన్నేతి చేన్న క్షీరవద్ధి' (అ ౨. పా ౧. సూ ౨౪) ఇత్యత్ర తు బాహ్యనిమిత్తనిరపేక్షమపి స్వాశ్రయం కార్యం భవతీత్యేతల్లోకదృష్ట్యా నిదర్శితమ్, శాస్త్రదృష్ట్యా తు పునః సర్వత్రైవేశ్వరాపేక్షత్వమాపద్యమానం న పరాణుద్యతే.

---

జలక్షీరములు విశేషశాస్త్రమును కల్పింపనేరవు (2) గోవు చేతనము. తన దూడయందలి ప్రేమచే పాలనివ్వగోరి వాని స్రవింపచేయుచున్నది. ఆ క్షీరమును దూడ కుడుచుచున్నది. జలమునకు గూడ చేతనాపేక్ష అత్యంతము లేకపోలేదు. జలము ప్రవహించుటకు పల్లపుభూమి మొదలగునవి యవసరమగుచున్నది. [ఈశ్వరుడే అంతర్యామి రూపమున పృథివికి అధిదేవతయై యితరులకు తెలియకనే జలమును ప్రవహింపచేయుచున్నాడు] అంతటను ప్రవృత్తికి చేతన మవసరమని ప్రదర్శించితిమి. [2-1-14 సూత్రమున కీసూత్రము విరుద్ధము కాదు] ఆసూత్రమునందు బాహ్యకారణముతో నవసరము లేకయే కార్యము తన ఆశ్రయముచేతనే సంభవింప వచ్చునని లోకదృష్టినిబట్టి చెప్పబడినది. ఈశ్వర ప్రేరణచేతనే సర్వవ్యవహారము ప్రవృత్త మగుచున్నది యని శాస్త్రదృష్టిచే నీసూత్రమున నుదాహరింపబడినది. కనుక నీ రెండింటికిని విరోధము లేదు. 3

## వ్యతిరేకానవస్థితేశ్చానపేక్షత్వాత్ (సూ. 4)

సిద్ధాంతీ : సాంఖ్యానాం త్రయో గుణాః సామ్యేనావతిష్ఠ మానాః ప్రధానం తు తద్వ్యతిరేకేణ ప్రధానస్య ప్రవర్తకం నివర్తకం వా కించిద్బాహ్యమపేక్ష్యమవస్థితమస్తి, పురుషస్తూదాసీనో న ప్రవర్తకో న నివర్తక ఇత్యతోఽనపేక్షం ప్రధానం, అనపేక్షత్వాచ్చ కదాచిత్ప్రధానం మహదాద్యాకారేణ పరిణమతే, కదాచిన్న పరిణమత ఇత్యేతదయుక్తమ్, ఈశ్వరస్య తు సర్వజ్ఞత్వాత్సర్వశక్తిత్వాన్మహామాయత్వాచ్చ ప్రవృత్త్యప్రవృత్తీ న విరుధ్యేతే.

---

సాంఖ్య మతమునందు వ్యతిరేక అనవస్థితేః చ = ప్రధానవ్యతిరిక్తమగు ప్రేరకుడు లేకుండుట వలనను అనపేక్షత్వాత్ = ప్రధానము స్వతంత్రమగుటవలన సర్వకార్యముల యందు సృష్టి జరుగవలెను.

సిద్ధాంతి : సాంఖ్యులసత్త్వాది గుణత్రయము సామ్యావస్థయం దున్నపుడు ప్రధానమగును. ప్రధానముకంటె భిన్నము

ప్రధానమునకు ప్రవర్తకత్వము లేదు.

బాహ్యమునై దాని ప్రవర్తి నివృత్తులను కలుగజేయునది మఱి యేదియును లేదు. బ్రహ్మముదాసీనము, ప్రవర్తకము కాదు. ప్రధానము స్వతంత్రము కనుక నది యొకపుడు మహదాద్యాకారేణ పరిణమించుననియు మఱియొకపుడు పరిణమించదనియు ననుట యుక్తముకాదు. ఈశ్వరుడు సర్వజ్ఞుడు, సర్వశక్తియుతుడు, మహామాయతో సంబంధించియున్నవాడు. కనుక నతడు ప్రవృత్తి గలిగియుండుట లేకుండుట విరుద్ధము

## అన్యత్రాభావాచ్చ న తృణాదివత్ (సూ. 5)

పూ పక్షీ : యథా తృణపల్లవోదకాది నిమిత్తాంతరనిరపేక్షం స్వభావాదేవ క్షీరాద్యాకారేణ పరిణమతే, ఏవం ప్రధానమపి మహదాద్యాకారేణ పరిణంస్యత ఇతి.

సిద్ధాంతీ : కథం చ నిమిత్తాంతరనిరపేక్షం తృణాదీతి గమ్యతే.

---

కాదు. [ప్రధానము స్వతంత్రము. జగత్కారణము కనుక నది యెల్లపుడు సృష్టికార్యమునే చేయుచుండవలెను. కార్యము నకు వ్యతిరేకమగు స్థితి దానికి సంభవము కాదు. కనుక ప్రధానము జగత్కారణము కానేరదు] 4

తృణ ఆదివత్ = తృణము మొదలగువానివలె ప్రధానముగూడ కారణాంతరము లేకనే పరిణామము నొందుచున్న దంటిరేని న = అది సరికాదు. ఏలన ! అన్యత్ర = ఇతరస్థలములయందు తృణము అభావాత్ = క్షీరముగ మారకుండుట వలన.

పూ. పక్షి : ఈవిషయ మట్లుండనిండు. తృణము, చిగురుటాకులు జలము మొదలగునవి కారణాంతరము లేకనే స్వభావము చేతనే క్షీరాదిరూపమున పరిణమించుచున్నవి. ఆవిధముగనే ప్రధానముగూడ మహదాదిరూపముల పరిణమించుగాక !

సిద్ధాంతి : తృణాదికము నిమిత్తాంతరమును కోరకయే పరిణమించుచున్నది యని యెటుల తెలియుచున్నది ?

పూ. పక్షీ : నిమిత్తాంతరానుపలంభాత్. యది హి కించి న్నిమిత్తాంతరముపలభేమహి తతో యథాకామం తేన తేన నిమి త్తేన తృణాద్యుపాదాయ క్షీరం సంపాదయేమహి న తు సంపా దయామహే, తస్మాత్స్వాభావిక స్తృణాదేః పరిణామః, తథా ప్రధానస్యాపి స్యాదితి.

సిద్ధాంతీ : అత్రోచ్యతే—భవే త్తృణాదివత్ ప్రధానస్య స్వాభావికః పరిణామో యది తృణాదేరపి స్వాభావికః పరిణా మోఽభ్యుపగమ్యేత, న త్వభ్యుపగమ్యతే నిమిత్తాంతరోపలబ్ధేః.

పూ. పక్షీ : కథం నిమిత్తాంతరోపలబ్ధిః?

---

పూ. పక్షి : కారణాంతరము దొఱకుట లేదు. కారణాంతరము దొఱకుచో నిచ్చవచ్చినటుల దానిచే తృణాదులను గ్రహించి క్షీరాదులను సంపాదింపగలము కాని యటుల సంపాదించుట లేదు. కనుక తృణాదుల పరిణామము స్వభావసిద్ధము. అటులనే ప్రధానమును గూర్చి గూడ కాగలదు.

కారణాంతరము లేక ప్రధానము వికారమును పొందదు.

సిద్ధాంతి : ఈవిషయమై యిట్లు చెప్పుదుము. తృణాదులకు పరిణామము స్వభావసిద్ధమని మేమంగీకరించినచో తృణాదులకు వలెనే ప్రధానమునకుగూడ పరిణామము స్వాభావికము కావచ్చును. కాని మేమట్లంగీకరించుట లేదు. తృణాదికమునకు కారణాంతరము కాన్పించుచున్నది.

పూ. పక్షి : నిమిత్తాంతర మెటుల కాన్పించుచున్నది.

సిద్ధాంతీ : అన్యత్రాభావాత్. ధేన్వైవ హ్యుపయుక్తం తృణాది క్షీరీభవతి న ప్రహీణమనడుహాద్యుపయుక్తం వా. యది హి నిర్నిమిత్తమేతత్స్యాద్ధేనుశరీరసంబంధాదన్యత్రాపి తృణాది క్షీరీభవేత్. న చ యథాకామం మానుషైర్న శక్యం సంపాదయితుమిత్యేతావతా నిర్నిమిత్తం భవతి, భవతి హి కించిత్కార్యం మానుషసంపాద్యం కించిద్దైవసంపాద్యమ్. మనుష్యా అపి చ శక్నువంత్యేవ స్వోచితేనోపాయేన తృణాద్యుపాదాయ క్షీరం సంపాదయితుమ్, ప్రభూతం హి క్షీరం కామయమానాః

---

సిద్ధాంతి : తృణాదికము క్షీరముగ పరిణమించుట గోవుకంటె నితరస్థలముల కాన్పించుట లేదు, గోవుచే భుజియింపబడిన తృణాదికము మాత్రమే క్షీరముగ మారుచున్నది. కాని దానిని గోవు భుజియింపనపుడు గాని వృషభము భుజియించినపుడు గాని క్షీరముగ మారుటలేదు. (2) వేరు కారణము లేకనే తృణాదికమునకు క్షీరపరిణామము సంభవించునేని గోశరీర సంబంధము లేకనే యది క్షీరము కావలెను. మనుజు లిచ్ఛవచ్చినటుల తృణాదికము నుండి క్షీరమును సంపాదింప లేనంత మాత్రముచేత నిమిత్తాంతరము లేదని చెప్పశక్యముకాదు. కొన్ని కార్యములు మనుజులకు సంపాదనాశక్యములు మఱికొన్ని దైవసంపాద్యములు. గోశరీరమునందలి జాఠరాగ్నివలన తృణము క్షీరముగ మారినను అచటగూడ సర్వజ్ఞుడగు నీశ్వరుని శక్తి గలదని యొప్పుకొనవలెను. మనుజులుగూడి తృణాదుల వలన తగు నుపాయముచేతనే క్షీరమును సంపాదింపగలరు. పుష్కలమగు క్షీర

ప్రభూతం ఘాసం ధేనూశ్చారయంతి, తతశ్చ ప్రభూతం క్షీరం లభంతే, తస్మాన్న తృణాదివత్ స్వాభావికః ప్రధానస్య పరిణామః.

## అభ్యుపగమేఽప్యర్థాభావాత్ (సూ. 6)

సిద్ధాంతీ : స్వాభావికీ ప్రధానస్య ప్రవృత్తిర్న భవతీతి స్థాపితం, అథాపి నామ భవతశ్శ్రద్ధామనురుధ్యమానాః స్వాభావికీమేవ ప్రధానస్య ప్రవృత్తిమభ్యుపగచ్ఛేమ. తథాపి దోషోఽనుషజ్యేతైవ, కుతః, అర్థాభావాత్. యది తావత్ స్వాభావికీ ప్రధానస్య ప్రవృత్తిః న కించిదన్యదపేక్షత ఇత్యుచ్యేత, తతో యథైవ సహ

---

మును గోరువాడు గోవును తృణవిస్తారముతో మేపును; కనుక తృణాదికమువలె ప్రధానమునకు పరిణామము స్వాభావికము కాదు. 5

అభ్యుగమే అపి=ప్రధానమునకు పరిణామము స్వాభావికమని అంగీకరించినను, అర్థ అభావాత్—ప్రయోజనము లేకుండుటవలన మీవాదము నిలువనేరదు.

సిద్ధాంతి : ప్రధానమునకు ప్రవృత్తి స్వభావసిద్ధము కాదని స్థాపింపబడినది. అయినను అట్టి ప్రవృత్తి స్వాభావికమని మీరాకద్దానియందు గల శ్రద్ధనుబట్టి అరికట్టబడినవారమై మేమంగీకరింతుము గాక. కాని అపుడుగూడ దోషము కాన్పించుచూనే యున్నది. ఏలనన ! (1) ప్రయోజనము కాన్పింపనందువలన. ప్రధానమునకు ప్రవృత్తి స్వాభావికమైనచో ఆప్రవృత్తి మఱిదేనిని కోరదని చెప్పవలెను. అపుడది సహకారికారణము నెటుల కోరుటలేదో

ప్రమాణముయొక్క ప్రవృత్తికి ప్రయోజనములేదు.

కారి కించిన్నాపేక్షతే ఏవం ప్రయోజనమపి కించిన్నాపేక్షత ఇత్యతః ప్రధానం పురుషస్యార్థం సాధయితుం ప్రవర్తత ఇతీయం ప్రతిజ్ఞా హీయేత. స యది బ్రూయాత్సహకార్యేవ కేవలం నాపేక్షతే న ప్రయోజనమపీతి, తథాపి ప్రధానప్రవృత్తేః ప్రయోజనం వివేక్తవ్యం భోగో వాస్యాదపవర్గో వా ఉభయం వేతి. భోగశ్చేత్ కీదృశోఽనాధేయాతిశయస్య పురుషస్య భోగో భవేదనిర్మోక్షప్రసంగశ్చ. అపవర్గశ్చేత్ప్రాగపి ప్రవృత్తేరపవర్గస్య సిద్ధత్వా

---

యటులనే ప్రయోజనమునుగూడ కోరుట లేదని చెప్పవలసి వచ్చును. (2) ఆ పక్షమున ప్రధానము పురుషార్థమును సాధించుటకు ప్రవర్తించుచున్నదను మీ ప్రతిజ్ఞకు భంగము కలుగును. ప్రయోజనము సహకారి కారణమును మాత్రము కోరుట లేదందుము గాని ప్రయోజనమును కోరుట లేదని మేమనుట లేదంటిరేని అపుడుగూడ ప్రధానప్రవృత్తికి ఆ ప్రయోజన మేమియో వివేకింపవలయును. ఆ ప్రయోజనము భోగమా? లేక మోక్షమా? లేక నుభయమా? భోగమందురేని, కూటస్థుడు, సుఖదుఃఖప్రాప్తి పరిహారమున న్యూనాతిశయములులేని వాడునగు ఆత్మ యొక్క భోగ మెటువంటిది? (3) ప్రధానప్రవృత్తికి భోగమే ప్రయోజనము గనుక నాప్రవృత్తియందు మోక్షమున కవకాశము లేదు. (4) అపవర్గ మద్దాని ప్రయోజన మంటిరేని సృష్టిప్రవృత్తికి పూర్వమే అపవర్గము సిద్ధమై యుండుటవలన ప్రవృత్తి నిరుపయోగమగును

భోగాపవర్గములు. ప్రధానమునకు ప్రయోజనములు కావు.

త్ప్రవృత్తిరనర్థికా స్యాత్ శబ్దాద్యనుపలబ్ధిప్రసంగశ్చ. ఉభయార్థతాభ్యుపగమేఽపి భోక్తవ్యానాం ప్రధానమాత్రాణామానంత్యాద నిర్మోక్షప్రసంగ ఏవ. న చౌత్సుక్యనివృత్త్యర్థా ప్రవృత్తిః, న హి ప్రధానస్యాచేతనస్యౌత్సుక్యం సంభవతి, న చ పురుషస్య నిర్మలస్య నిష్కలస్యౌత్సుక్యమ్. దృక్శక్తిసర్గశక్తివైయర్థ్యభయాచ్చేత్ ప్రవృత్తిః తర్హి దృక్శక్త్యనుచ్ఛేదవత్ సర్గశక్త్యనుచ్ఛేదాత్సంసారానుచ్ఛేదాదనిర్మోక్షప్రసంగ ఏవ, తస్మాత్ప్రధానస్య పురుషార్థా ప్రవృత్తిరిత్యేతదయుక్తమ్.

---

(5) [స్వస్వరూపమునందున్న ఆత్మకు ప్రవృత్తి లేదుగనుక] శబ్దాదులను గ్రహించుట కవసరము లేకుండును. భోగాపవర్గములు ప్రధానప్రవృత్తికి ప్రయోజనములని యంగీకరించినచో (6) [ప్రధానప్రవృత్తి ప్రవృత్తములగు] భోగములనంతములగుటంజేసి మోక్షము ప్రసక్తమే కాకుండును. (7) ఇచ్ఛను తృప్తిపరుచుట ప్రధానప్రవృత్తికి ప్రయోజనము కాదు. అచేతనమగు ప్రధానమునకు యిచ్ఛ యుండనేరదు. నిర్మలుడు నిష్కలుడు నగు పురుషునికిగూడ నిచ్ఛ సంభవము కాదు. చిత్స్వరూపుడగు పురుషునియొక్క దృక్శక్తియు ప్రధానముయొక్క ప్రవృత్తియు నిరర్థకములు కాకుండుటకై ప్రధానమునకు ప్రవృత్తి యుండవలెనందురేని దృక్శక్తికివిచ్ఛేదము లేనట్లె ప్రధానముయొక్క సృష్టిక్రియాప్రవృత్తికి విచ్ఛేదము లేకపోవును. (8) అపుడు జగత్తునకు విచ్ఛేదము లేకుండును. మోక్షము లేకపోవును. అందువలన ప్రధానముయొక్క ప్రవృత్తి పురుషార్థము ప్రయోజన-మనుటయుక్తముకాదు. 6

## పురుషాశ్మ వదితి చే త్తథాపి (సూ. 7)

పూ. పక్షీ : స్యాదేతత్, యథా కశ్చిత్పురుషో దృక్ఛక్తి సంపన్నః ప్రవృత్తిశక్తివిహీనః పంగురపరం పురుషం ప్రవృత్తి శక్తిసంపన్నం దృక్ఛక్తివిహీనమంధమధిష్ఠాయ ప్రవర్తయతి, యథా వాఽయస్కాంతోఽశ్మా స్వయమప్రవర్తమానోఽప్యయః ప్రవర్తయతి, ఏవం పురుషః ప్రధానం ప్రవర్తయిష్యతీతి దృష్టాంత ప్రత్యయేన పునః ప్రత్యవస్థానమితి.

సిద్ధాంతీ : అత్రోచ్యతే తథాపి నైవ దోషాన్నిర్మోక్షోఽస్తి అభ్యుపేతహానం తావద్దోష ఆపతతి ప్రధానస్య స్వతంత్రస్య ప్రవృ

---

పురుష అశ్మవత్ ఇతిచేత్ = పురుషుడు గ్రుడ్డివానిని నడిపించినటులను అయస్కాంతము లోహమును ప్రవర్తింప చేసినట్లును, పురుషుడు ప్రధానమును ప్రవర్తింపచేయునంటి వేని-న = అదిసరికాదు. తథాఆపి = అని మీారనినను మా ఆక్షేపణము అటులనేయుండును.

పూ పక్షీ : కంటిచూపు సంపూర్ణముగ గల్గి నడుచుటకు శక్తిలేనిపురుషుడు నడుచుటకు శక్తిగలిగి చూచుటకు శక్తి లేనియొక గ్రుడ్డివానిని ప్రవర్తింపచేయు చున్నాడు. అయస్కాంతశిల స్వయముగ ప్రవృత్తిలేనిదైనను ఇనుమును ప్రవర్తింపజేయుచున్నది. ఈవిధముగనే పురుషుడు ప్రధానమును ప్రవర్తింపచేయునని దృష్టాంతమునందలి విశ్వాసముచే సాంఖ్యుడు తిరిగి అడ్డుపడుచున్నాడు.

సిద్ధాంతి : ఇందుల కిట్లు చెప్పుదుము. ఏ విధముగా నయినను మీా వాదము దోషగ్రస్తమే యగుచున్నది. మీా

_త్త్యభుపగమాత్, పురుషస్య చ ప్రవ_ర్తకత్వానభ్యుపగమాత్. కథం చోదాసీనః పురుషః ప్రధానం ప్రవ_ర్తయేత్. పంగురపి హ్యంధం పురుషం వాగాదిభిః ప్రవ_ర్తయతి, నైవం పురుషస్య కశ్చిత్ప్రవ_ర్తనవ్యాపారోఽ_స్తినిష్క్రియత్వాన్నిర్గుణత్వాచ్చ. నాప్యయస్కాంతవత్సన్నిధిమాత్రేణ ప్రవ_ర్తయేత్, సన్నిధినిత్యత్వేన ప్రవృ_త్తినిత్యత్వప్రసంగాత్. అయస్కాంతస్య త్వనిత్య సన్నిధేర_స్తి స్వవ్యాపారస్సన్నిధిః, పరిమార్జనాద్యపేక్షా చాస్యా_స్తీత్యనుపన్యాసః పురుషాశ్మవదితి. తథా ప్రధానస్యాచైతన్యాత్పురుషస్య చౌదాసీ

---

పురుషుడు ప్రధాన ప్రవ_ర్తకుడుగాడు.

ప్రకృతవాదము ప్రధానము స్వాంతంత్రము పురుషుడు ప్రవ_ర్తకుడుగాడనియు మీారింతకు పూర్వ మంగీకరించిన వాదమునకు విరుద్ధమగుచున్నది. పై రెండు దృష్టాంతములచే పురుషుడు ప్రధానమును ప్రవ_ర్తింప చేయుచున్నాడని మీారనుచున్నారు. (1) ఉదాసీనుడగు పురుషుడు ప్రధానమును ప్రవ_ర్తింపజేయలేడు. కుంటివాడుగూడ గ్రుడ్డివానిని వాగాదులచే ప్రవ_ర్తింపజేయును. పురుషుడు నిర్గుణుడు నిష్క్రియుడు నగుటవలన నన్యుల ప్రవ_ర్తింపజేయు వ్యాపార మతనికి సంభవముగాదు. (2) అయస్కాంతశిలవలె కేవల సన్నిధానమాత్రముచేతగూడ ప్రవ_ర్తింపచేయలేదు. [ప్రధానపురుషులు నిత్యములు సర్వవ్యాపకము లగుటవలన] ప్రధానమునకు పురుషసన్నిధి నిత్యమగుచున్నది. (3) సన్నిధి నిత్యమగుటచే ప్రవ_ర్తకత్వము గూడ నిత్యముకావలయును. అయస్కాంతముయొక్క సన్నిధి అనిత్యము, స్వవ్యాపారమువలన కలుగును. తుడుచుట మొదలగు సంస్కారములగోరుచున్నది. కనుక పురుషఅశ్మదృష్టాం

న్యాత్ తృతీయస్య చ తయోస్సంబంధయితురభావాత్ సంబంధానుపపత్తిః. యోగ్యతానిమిత్తే చ సంబంధే యోగ్యత్వానుచ్ఛేదాదనిర్మోక్షప్రసంగః. పూర్వవచ్చేహాప్యర్థాభావో వికల్పయితవ్యః, పరమాత్మనస్తు స్వరూపవ్యపాశ్రయమౌదాసీన్యం మాయావ్యపాశ్రయం చ ప్రవర్తకత్వమిత్యస్త్యతిశయః.

---

తములు సరికావు. (3) ప్రధాన మచేతనము; పురుషు డుదాసీనుడు; వీరిద్దరికిని సంబంధమును కలుగజేయు తృతీయ మెద్దియును లేదు. కనుక ప్రధానపురుషులకు సంబంధమే ఘటింపదు. (4) [పురుషుడు దృగ్రూపము, ప్రధానము దృశ్యరూపము] గనుక పురుషప్రధానముల రెండింటికిని ద్రష్టృ దృశ్యయోగ్యత కలిగియుండుటయె సంబంధ మంటిరేని యిట్టి సంబంధమునకు విచ్ఛేదము లేదుగనుక మోక్షమసంభవమగును. (5) [ప్రధానముయొక్క ప్రవృత్తి పురుషాధీనమని అంగీకరించిన పక్షమునగూడ ప్రధానము పురుషుని భోగము

ప్రధాన పురుషుల కెట్టి సంబంధము కలుగనేరదు.

కొరకు ప్రవర్తించుచున్నదా ? లేక అతని మోక్షముకొఱకు ప్రవర్తించుచున్నదా ? యని] పూర్వసూత్రము నందువలెనే యిచటగూడ ప్రయోజనాభావము నుండి వికల్పించవలసియున్నది. (6) [మాయావాదముప్రకారము] పరమాత్మయన్నచో స్వరూపముచే నుదాసీనము, మాయ ఆశ్రయించియుండుటచే ప్రవర్తకము. ఈవిధముగ సాంఖ్యుల ప్రధానముకంటె పరమాత్మయందతిశయము గలదు.

## అంగిత్వానుపపత్తేశ్చ (సూ. 8)

సిద్ధాంతీ: ఇతశ్చ న ప్రధానస్య ప్రవృత్తిరవకల్పతే, యద్ధి సత్త్వరజస్తమసామన్యోన్యగుణప్రధానభావముత్సృజ్య సామ్యేన స్వరూపమాత్రేణావస్థానం సా ప్రధానావస్థా, తస్యామవస్థాయామనపేక్షస్వరూపాణాం స్వరూపప్రణాశభయాత్ పరస్పరం ప్రత్యంగాంగిభావానుపపత్తేః. బాహ్యస్య చ కస్యచిత్ క్షోభయితుర భావాద్గుణవైషమ్యనిమిత్తోమహదాద్యుత్పాదో న స్యాత్.

---

సత్త్వరజస్తమోగుణముల మూడింటికిని అంగిత్వ అనుపపత్తే చ = ఒకటి అంగి తదితరము లంగములనుట సంభవింపదు గనుక ప్రధానమునకు ప్రవృత్తి యుండనేరదు.

సిద్ధాంతి: ఈకారణము వలనగూడ ప్రధానమునకు ప్రవృత్తి సంభవముకాదు. సత్త్వరజస్తమో గుణములు మూడును పరస్పరము న్యూనాధికభావమును వదలి సామ్యమగు స్వరూపమున మాత్రముండుట యేది కలదో అది ప్రధానముయొక్క స్థితి. అట్టి సామ్యావస్థయందు వానిలోనొకదానికి మఱియొకదానికంటె న్యూనభావము సంభవము కాదు. న్యూనాధికభావము సంభవించినచో వానిస్వాతంత్ర్యము నే యవి కోల్పోవును. కనుక వానికి (1) అన్యోన్య మంగాంగిభావము సంభవముకాదు. (2) వానికి వత్తిడి కలిగించు బాహ్యావిషయ మేదియు కానరానందున మహదాదులనుత్పన్నముచేయుట కవసరమగు విషమస్థితి సంభవింపదు: [త్రిగుణములయొక్క సామ్యావస్థయందు సృష్టి గలుగదు. వానికి

ప్రధానపురుషుల కంగాంగిభావము సంభవముకాదు.

## అన్యథానుమితౌ చ జ్ఞశక్తి వియోగాత్ (సూ. 9)

పూ. పక్షీ: అథాపి స్యాదన్యథా వయమనుమిమీమహే యథా నాయమనంతరోక్తో దోషః ప్రసజ్యేత. న హ్యానపేక్షస్వభావాః

---

విషమస్థితి సంభవించినపుడే సృష్టికలుగును. సత్వసృష్టియందు సత్వమునకు ప్రాధాన్యము, తదితరముల కప్రాధాన్యము. అటులనే రజః ప్రధాన సృష్టియందు రజోగుణమునకు ప్రాధాన్యము. ఈవిధముగ ప్రవృత్తి గుణత్రయముయొక్క అంగాంగిభావమున్నపుడే సృష్టి సంభవించును. (3) ఒక వేళ వీనికి అంగాంగిభావము నంగీకరించిన ప్రధానస్వరూపమగు సామ్యావస్థకు భంగము కలుగును. (4) సామ్యావస్థనుండి ప్రచ్యుతి నంగీకరించినచో, ప్రచ్యుతి కార్యరూపముగనుక, సామ్యావస్థయందు కార్యము పుట్ట నేరదు. పురుషు డుదాసీనుడు గనుక నతడు ప్రచ్యుతికి కారణము కానేరడు. ప్రచ్యుతిలేక నంగాంగీభావము సంభవము కాదు. [అనగా కార్యముత్పన్నము కానేరదు అని తాత్పర్యము.] 8

అన్యథా అనుమితౌ = ప్రధాన మనేకస్వభావములు గలదని యంగీకరించినను, జ్ఞశక్తివియోగాత్ = జడమగుట వలన జ్ఞానశక్తి లేమిచే యెల్లపుడును ప్రపంచసృష్టియె కలుగవలెననుపూర్వోక్తమగు ఆక్షేపణ అటులనే యుండును.

పూ. పక్షి: చెప్పబడిన దోషము కలుగకుండుటకు మేము మఱియొక విధముగ నూహింతుము గాక! గుణములు

కూటస్థాశ్చాస్మాభిర్గుణా అభ్యుపగమ్యంతే ప్రమాణాభావాత్. కార్య వశేన తు గుణానాం స్వభావోఽభ్యుపగమ్యతే, యథా యథా కార్యోత్పాదః ఉపపద్యతే తథా తథైతేషాం స్వభావోఽభ్యుపగంతవ్యః, 'చలం గుణవృత్త'మితి చాస్త్యభ్యుపగమః, తస్మాత్సామ్యావస్థాయామపి వైషమ్యోపగమయోగ్యా ఏవ గుణా అవతిష్ఠంత ఇతి.

సిద్ధాంతీ : ఏవమపి ప్రధానస్య జ్ఞశక్తివియోగాద్రచనానుపపత్త్యాదయః పూర్వోక్తదోషాస్తదవస్థా ఏవ. జ్ఞశక్తిమపి త్వను

---

కూటస్థునివలె నత్యంతము నిత్యములు గావు; అవి కూటస్థనిత్యములనుటకు ప్రమాణము కానరాదు. కార్యానుసారముగ గుణములస్వభావము నంగీకరించెదము. ఏయే విధముగ కార్యముత్పాదమగునో ఆయా విధముగ వాని స్వభావముండునని కార్యములనుబట్టి గుణముల స్వభావము నూహింతుము. గుణస్వభావములు చలనములని మే మంగీకరింతుము. అందువలన సామ్యావస్థయందుగూడ నీ గుణము లన్యోన్యము వైషమ్యమును బొందుటకు యోగ్యములుగా నున్నవి.

సిద్ధాంతి : ఆ పక్షమునగూడ ప్రధానమునకు జ్ఞానశక్తి లేకుండుటవలన జగద్రచన యసంభవమగుట మొదలగు పూర్వోక్తదోషములు నిలిచేయున్నవి.

ప్రధానమునకు జ్ఞానశక్తి లేదు.

(1) జగద్రచననుబట్టి ప్రధానమునకు జ్ఞానశక్తి యున్నటుల సాంఖ్యు లూహింతుమందురేని అప్పుడు మాకు ప్రతికక్షులే కాకుందురు. బహు

మిమానః ప్రతివాదిత్వాన్నివర్తేత, చేతనమేకమనేకప్రపంచస్య జగత ఉపాదానమితి బ్రహ్మవాదప్రసంగాత్. వైషమ్యోపగమ యోగ్యా అపి గుణాః సామ్యావస్థాయాం నిమిత్తాభావాన్నైవ వైషమ్యం భజేరన్, భజమానా వా నిమిత్తాభావావిశేషాత్సర్వ దైవ వైషమ్యం భజేరన్నితి ప్రసజ్యత ఏవాయమనంతరోఽపి దోషః.

## విప్రతిషేధాచ్చాసమంజసమ్ (సూ. 10)

సిద్ధాంతీ : పరస్పరవిరుద్ధశ్చాయం సాంఖ్యానామభ్యుపగమః, క్వచిత్సప్తేంద్రియాణ్యనుక్రామంతి, క్వచిదేకాదశ, తథా క్వచి

---

విస్తృతమగు నీ జగత్తునకు అద్వితీయమగు నొక్క చేతన ముపాదానకారణ మగుచున్నది యనుట బ్రహ్మవాదమే యగుచున్నది. (2) గుణములు సామ్యావస్థన గూడ వైషమ్య మును బొందుటకు యోగ్యములైనను నిమిత్తకారణము లేక నట్టి వైషమ్యమును బొందలేవు. (3) ఒకవేళ నట్టి వైషమ్య మును బొందినను, అవి యెల్లపుడు నా స్థితిలోనేయుండవలెను. [వైషమ్యస్థితిని మార్చుటకుకూడ నిమిత్తకారణము కావలసి యుండును] ఆప్పుడుకూడ నట్టినిమిత్తకారణము లేదు. కనుక సాంఖ్యవాదమునకు బూర్వము చెప్పిన దోషము తొలగ నేరదు. 9

విప్రతిషేధాత్ = ప్రధానవాదము సకలవేదాంతము లకు విరుద్ధమగుటవలన గూడ అసమంజసం = ఉపపన్నము కానేరదు.

సిద్ధాంతీ : సాంఖ్యవాదము పరస్పరవిరుద్ధము ఒకపుడు

న్మహత స్తన్మాత్రసర్గముపదిశంతి క్వచిదహంకారాత్, తథా క్వచి త్త్రీణ్యంతఃకరణాని వర్ణయంతి, క్వచిదేకమితి, ప్రసిద్ధఏవ తు శ్రుత్యేశ్వరకారణవాదిన్యావిరోధః తదనువర్తిన్యా చ స్మృత్యా, తస్మాదప్యసమంజసం సాంఖ్యానాం దర్శనమితి.

పూ. పక్షీ : అత్రాహ—నన్వౌపనిషదానామప్యసమంజస మేవ దర్శనం, తప్యతాపకయోర్జాత్యంతరభావానభ్యుపగమాత్.ఏకం

---

సప్తేంద్రియముల బేర్కొనుదురు. ఒకపుడు పదునొకండందురు.

సాంఖ్య వాదమం దలి వైరుధ్యము

ఒకపుడు మహత్తునుండి తన్మాత్రలు పుట్టి నవందురు. ఒకపు డహంకారము నుండి పుట్టినవందురు. ఒకపు డంతఃకరణములు మూడందురు. ఒకపుడొకటియె యందురు [పంచకర్మేంద్రియములు. త్వక్కు. మనస్సు-ఇట్లు యింద్రియము లేడు. జ్ఞానేంద్రియము లయిదు, కర్మేంద్రియము లయిదు, మనస్సు-ఇట్లింద్రియములు పదునొకండు. బుద్ధి, అహంకారము,మనస్సు అని అంతఃకరణములు మూడు. బుద్ధి యొకటి యని, మరి యొక వాదము.] ఈశ్వరుడు జగత్కారణమని ప్రతిపాదించు శ్రుతికిని దాని ననువర్తించు స్మృతికిని వీరి వాద వైరుద్ధ్యము సుప్రసిద్ధము. అందువలనగూడ సాంఖ్యవాదము సమంజసముగా లేదు.

పూ. పక్షి : వేదాంతదర్శనముగూడ నసమంజసమే యగుచున్నది. తపింపబడువాడు (జీవుడు) తపింపజేయునది (సంసారము) ఈభేదము సుప్రసిద్ధమైనను వేదాంతు లంగీ

హి బ్రహ్మ సర్వాత్మకం సర్వస్య ప్రపంచస్య కారణమభ్యుపగచ్ఛతాం, ఏకస్యైవాత్మనో విశేషౌ తప్యతాపకౌ న జాత్యంతరభూతావిత్యభ్యుపగంతవ్యం స్యాత్. యది చైతౌ తప్యతాపకావేకస్యాత్మనో విశేషౌ స్యాతాం స తాభ్యాం తప్యతాపకాభ్యాం న నిర్ముచ్యేతేతి తాపోపశాంతయే సమ్యగ్దర్శన ముపదిశచ్ఛాస్త్రమనర్థకం స్యాత్.న హ్యౌష్ణ్యప్రకాశధర్మకస్య ప్రదీపస్య తదవస్థస్యైవ తాభ్యాం నిర్మోక్ష ఉపపద్యతే యోఽపి జలవీచీతరంగఫేనాద్యుపన్యాసస్తత్రాపి జలాత్మన ఏకస్య వీచ్యాదయో విశేషా ఆవిర్భావతిరోభావ

---

కరించుట లేదు. బ్రహ్మమొక్కటి సర్వాత్మకము. సర్వప్రపంచ కారణము, అని మీరంగీకరించుచున్నారు. అపుడు తపించునది, తపింపచేయునది-ఈరెండు నాత్మయొక్క విశేషములు కావలయును కాని యవి విభిన్నజాతులకుచెంద వీలు లేదు. ఈరెండు నొక్కటియగు నాత్మయొక్క విశేషములైనచో, ఆత్మ కెపుడును వీనివలన విముక్తి కలుగ నేరదు. కనుక తాపోపశమనము కొఱకు సమ్యక్ జ్ఞానము నుపదేశించు శాస్త్ర మనర్థకమగును. ఉష్ణప్రకాశములు రెండును దీప ధర్మములు దీపముగా నున్నంతవర కాధర్మము లద్దాని వదలి పోనేరవు. తరంగములు, నురుగు మొదలగునవి జలభేదములను స్థలమునగూడ, నివి యన్నియు నొక జలముయొక్క విశేషస్వరూపములు; ఒకపుడు కాన్పించుచున్నవి; మఱి యొకపుడు కాన్పించుటలేదు. ఎటులయినను జలస్వరూపములే యగుచున్నవి. కనుక ఉష్ణప్రకాశములు దీపమును వదలి పోనట్లే తరంగాది విశేషస్వరూపములు జలమును వదలిపోవుట

రూపేణ నిత్యా ఏవేతి సమానో జలాత్మనో వీచ్యాదిభిరవిరోధః. ప్రసిద్ధశ్చాయం తప్యతాపకయోర్జాత్యంతరభావో లోకే. తథాహి, అర్థీ చార్థశ్చాన్యోన్యభిన్నౌ లక్ష్యేతే. యద్యర్థినస్స్వతోఽన్యోఽర్థో న స్యాద్యస్యార్థినో యద్విషయమర్థిత్వం స్యాత్. యథాప్రకాశాత్మనః ప్రదీపస్యప్రకాశాఖ్యోఽర్థో నిత్యసిద్ధ ఏవేతి న తస్యతద్విషయమర్థిత్వం తస్యసంభవతి, అప్రాప్తేహ్యర్థేఽర్థినోఽర్థిత్వం స్యాదితి, తథార్థస్యాప్యర్థత్వం న స్యాత్, యది స్యాత్స్వార్థత్వమేవ స్యాత్, నచైతదస్తి. సంబంధిశబ్దౌ హ్యేతావర్థీచార్థశ్చేతి, ద్వయోశ్చ సంబం

---

లేదు. ఈతప్యతాపక భేదము లోకప్రసిద్ధము. ఇటులగదా కాన్పించుచున్నది. అర్థించువారు, అర్థింపబడునది - ఈరెండు నన్యోన్యము భిన్నములుగ కాన్పించుచున్నవి. అర్థింపబడునది స్వభావముచే నర్థించువానికన్న భిన్నము కానిచో, అర్థించు వానికి అర్థింపబడుచున్నది నిత్యసిద్ధముగా నుండుటచే నతని కావిషయ మర్థింపబడునది కాకపోవలెను. ప్రకాశమె స్వరూపముగాగల దీపమునకు ప్రకాశమను ప్రయోజనము స్వయముగ సిద్ధమైయున్నది. కనుక దీపమునకు ప్రకాశ మర్థింపతగు విషయము కానేరదు. ఏ పదార్థమైనను లేనపుడే లేని వానికది అర్థింపతగు విషయమగును. అర్థించువానికి అర్థించతగినది లేనపు డర్థించువాడు లేనట్లై అర్థించతగిన దానిని అర్థించువాడు లేనపుడు అర్థించతగువిషయముగూడ నుండదు. అర్థించతగు విషయమున్నచో అర్థించువాడు లేనపు డది స్వార్థమే యగును. కాని యథార్థమున నిటుల కాన్పించుట లేదు. అర్థించువాడు, అర్థించునది—ఈ రెండు శబ్దము లన్యోన్య సంబ

ర్థినోస్సంబంధస్యాన్యైకస్యైవ, తస్మాద్భిన్నౌ వేవార్థార్థినౌ, తథాఽనర్థానర్థినావపి. అర్థినోఽనుకూలోఽర్థః ప్రతికూలోఽనర్థ స్తాభ్యామేకః పర్యాయేణోభాభ్యాం సంబధ్యతే, తత్రార్థస్యాల్పీయ స్త్వాత్ భూయస్త్వాచ్చానర్థస్యోభావప్యర్థానర్థావనర్థవేతి తాపకస్స ఉచ్యతే. తప్యస్తు పురుషో య ఏకః పర్యాయేణోభాభ్యాం సంబ ధ్యత ఇతి తయో స్తప్యతాపకయోరేకాత్మతాయాంమోక్షానుపపత్తిః. జాత్యంతరభావే తు తత్సంయోగహేతుపరిహారాత్స్యాదపి కదాచి న్మోక్షోపపత్తిరితి.

---

ర్థములు. ఈ రెండు నున్నపుడే అన్యోన్యసంబంధముకలుగును. ఒకటిమాత్రి మున్నపు డట్టి సంబంధ మేర్పడదు. కనుక అర్థి అర్థ మను నీ రెండును విభిన్నములు. అదేరీతిగ, అర్థించనివాడు అర్థింపబడనిది—ఈ రెండునుగూడ విభిన్నములే. అర్థించువాని కనుకూలమైనది అర్థింపబడునది. అనుకూలముకానిది అర్థింప బడనిది. అర్థము, అనర్థము—ఈ రెండింటితో నర్థించువానికి ఒక దాని తర్వాత నొకటిగా సంబంధము కలుగును. అర్థింపబడు నవి స్వల్పములు. అర్థింపబడనివి బహుతరములు. కనుక నీరెండు ననర్థములనియే చెప్పవచ్చును. కనుక నవి తపింపజేయునవి యని చెప్పబడుచున్నవి. తపింపబడువాడు పురుషుడొక్కడే. ఆతడు అర్థానర్థములచే నొకటి తర్వాత నొకటిగ తపింపచేయ బడుచున్నాడు. కనుక [వేదాంతులు చెప్పునటుల] తపింపబడు వాడు, తపింపచేయునది— ఈరెండు నొక్కటియే యయినచో మోక్షమే సంభవము కాదు. ఈ రెండును విభిన్నములయి నచో నీ రెండింటికిని సంబంధము గలుగజేయు కారణమునకు పరిహారముకలిగి యొకానొకపుడు మోక్షము లభింపవచ్చును.

సిద్ధాంతీ : అత్రోచ్యతే—నైకత్వాదేవ తప్యతాపకభావానుపపత్తేః, భవేదేష దోషో యద్యేకాత్మతాయాం తప్యతాపకావన్యోన్యస్య విషయవిషయిభావం ప్రతిపద్యేయాతాం, నత్వేతదస్తి ఏకత్వాదేవ. న హ్యగ్నిరేకస్సన్నాత్మానం దహతి ప్రకాశయతి వా, సత్యప్యౌష్ణ్యప్రకాశాదిధర్మభేదే పరిణామిత్వే చ కిముకూటస్థే బ్రహ్మణ్యేకస్మిం స్తప్యతాపకభావస్సంభవేత్.

పూ. పక్షీ : క్వ పునరయం తప్యతాపకభావస్స్యాదితి.

---

సిద్ధాంతి : ఇందుకు సమాధానము చెప్పెదుము. మీరు చెప్పినది సరికాదు. [పరమార్థమున] (2) తప్యతాపకులిద్దరు నొకటియగుటవలన నట్టిభావము సంభవము కాదు. [కనుక దోషము లేదు]ఆత్మ యొకటి యగుచుండ తప్యతాపకు లిద్దరికి విషయి విషయ భావ మన్యోన్యము సంభవమగు నెడ మీరు చెప్పుదోషము కలుగును. వీరలిద్దరు నొక్కటియే యగుటచే నట్టి విషయి విషయభావ మేర్పడనేరదు. [విషయి విషయ శబ్దములు అధ్యాసభాష్యప్రారంభమున వివరింపబడినవి.] అగ్నికి ఉష్ణత్వప్రకాశత్వ పరిణామత్వ ధర్మములున్నను ఒక్కటియే యగుటచే తనను తాను దహింపదు ప్రకాశింపదు. కూటస్థమగు బ్రహ్మమొకటి యగుచుండగా తప్యతాపక సంబంధ మెటుల సంభవించును.

పరమార్థమున తప్యతాపక భేదము లేదు

పూ. పక్షి : [లోకమున సుప్రసిద్ధముగ కాన్పించుచున్న] యీతప్యతాపక భావమెట్టిది ?

సిద్ధాంతీ : అత్రోచ్యతే—కిం న పశ్యసి కర్మభూతో జీవద్దేహస్తప్యస్తాపకస్సవితేతి.

పూ. పక్షీ : నను తప్తిర్నామ దుఃఖం సా చేతయితుర్నాచేతనస్య దేహస్య, యది హి దేహస్యైవ తప్తిస్స్యాత్సా దేహనాశే స్వయమేవ నశ్యతీతి తన్నాశాయ సాధనం నైషితవ్యం స్యాదితి.

సిద్ధాంతీ : ఉచ్యతే—దేహాభావే హి కేవలస్య చేతనస్య తప్తిర్నదృష్టా, న చ త్వయాపి తప్తిర్నామ విక్రియా చేతయితుః కేవలస్యేష్యతే, నాపి దేహచేతనయోస్సంహతత్వమశుద్ధ్యాది

---

సిద్ధాంతి : చెప్పుచున్నాము. (ప్రాణసహితమగు శరీరము తపనక్రియకు కర్మభూతమై తపింపబడుటయు, సూర్యుడు తపింపచేయుటయు మీరుచూచుట లేదా ?

పూ. పక్షి : తపనమనగా దుఃఖము. దానిననుభవించువాడు చేతనుడుకాని అచేతనమగు దేహముకాదు. తపనము దేహమునకే యయినచో దేహము నశించుచుండగ నది స్వయముగానే నశించును. కనుక దాని నాశనముకొఱకు మఱి యొక సాధనమును కోరనవసరములేదు గదా ?

సిద్ధాంతి : చెప్పెదుము, (౨) దేహములేనపుడు కేవల చేతనము తపనమునొందుట కాన్పించుటలేదు. తపనము వికారము, కేవల చేతనమునకు సంబంధించినదియని మీరుగూడ తలంపరు. [ఆత్మ అసంగ చిద్రూపమని మీరుగూడ నంగీకరించుటవలన] దేహచేతనములకు సంహతత్వము సంభవము

దోషప్రసంగాత్. న చ తప్తేరేవ తప్తిమభ్యుపగచ్ఛసీతి కథం తవాపి తప్యతాపకభావః.

పూ. పక్షి : సత్వం తప్యం తాపకం రజ ఇతి చేత్.

సిద్ధాంతి : న తాభ్యాం చేతనస్య సంహతత్వానుపపత్తేః.

పూ. పక్షి : సత్వానురోధిత్వాచ్చేతనోఽపి తప్యత ఇవేతి చేత్.

సిద్ధాంతి : పరమార్థతస్తర్హి నైవ తప్యత ఇత్యాపతతి, ఇవ శబ్ద ప్రయోగాత్, న చేత్తప్యతే నేవశబ్దో దోషాయ. న హి

---

కాదు. అపుడాత్మకు అశుద్ధత్వము మొదలగుదోషము లాపాదించును. తపనము తపనము ననుభవించునని మీరుగూడ నంగీకరింపరు. అట్లయినచో మీవాదముప్రకారము తప్య తాపక భావమెట్లుఘటించును ?

పూ. పక్షి : తపింపబడునది సత్వగుణము, తపింప చేయునది రజోగుణము.

సిద్ధాంతి : అదిగూడ సరికాదు. చేతనముతో వానికి సంహతత్వము ఘటింపదు.

పూ.పక్షి. [పురుషుడసంగుడైనను తపింపబడు] సత్వము నందు ప్రతిబింబితుడగుటవలన నతడుగూడ తపింపబడినవానివలె కనుపించుచున్నాడు.

సిద్ధాంతి : మీరు ప్రయోగించిన 'ఇవ' శబ్దమువలన అనగా 'తపింపబడినవానివలె' యనుటచే పరమార్థమున నత నికి తపనము లేదని సంభవించుచున్నది. నిజముగ నతడు తపింపబడనిచో, ఇవశబ్దమున కాక్షేపణలేదు. డుంచుభము (విషము

డుండుభస్సర్ప ఇవేత్యేతావతా సవిషో భవతి సర్పో వా డుండుభ ఇవేత్యేతావతా నిర్విషః. అతశ్చావిద్యాకృతోఽయం తప్యతాపకభావో న పారమార్థిక ఇత్యభ్యుపగంతవ్యమేతత్. నైవం సతి మమాపి కించిద్దుష్యతి.

అథ పారమార్థికమేవ చేతనస్య తప్యత్వమభ్యుపగచ్ఛసి తథైవ సుతరామనిర్మోక్షః ప్రసజ్యేత. నిత్యత్వాభ్యుపగమాచ్చ తాపకస్య.

పూ పక్షి:తప్యతాపకశక్త్యోర్నిత్యత్వేఽపి సనిమిత్తసంయో

---

లేని సర్పము) సర్పమువలెనున్నదని నంతమాత్రముచే నద్దానికి విష మాపాదింపదు. సర్పము డుండుభమువలెనున్నదని నంతమాత్రముచే సర్పము విషహీనముకానేరదు. కనుక నీ తప్యతాపకభావమవిద్యచే కల్పింపబడినది, కాని పరమార్థము కాదని అంగీకరించవలయును., ఈ విషయమును మీ రంగీకరించిన మాకుగూడ నేమియు నాక్షేపణలేదు. [సాంఖ్యవాదమునుబట్టిగూడ తప్యతాపకభావమునకు తగు సమాధానము కుదుర లేదుగనుక నది అవిద్యాకల్పితమని నిశ్చయించవలసియున్నది.]

(4) చేతనము పరమార్థమున తపింపబడుచున్నటుల నీవంగీకరించిన మీకు సంపూర్ణముగ మోక్షములేకపోవును. తాపకమగు ప్రధానము నిత్యమని మీరంగీకరించుచున్నందున [ఈవాదము దృఢమగుచున్నది.]

పూ. పక్షి : ఆత్మయొక్క తప్యశక్తియు, ప్రధానము యొక్క తాపకశక్తియు నిత్యములు. తపన మారెంటి

గాపేక్షత్వాత్ తత్ప్రేస్సంయోగనిమిత్తాదర్శననివృత్తావాత్యంతికస్సం యోగో పరమ స్తతశ్చాత్యంతికో మోక్ష ఉపపన్న ఇతిచేత్.

సిద్ధాంతీ : న, అదర్శనస్య తమసో నిత్యత్వాభ్యుపగమాత్. గుణానాం చోద్భవాభిభవయోరనియతత్వాదనియతస్సంయోగని మిత్తోపరమ ఇతి వియోగస్యాప్యనియతత్వాత్సాంఖ్యస్యైవానిర్మో క్షోఽపరిహార్యస్స్యాత్. ఔపనిషదస్యత్వాత్మైకత్వాభ్యుపగమాదే కస్య చ విషయవిషయిభావానుపపత్తేర్వికారభేదస్య చ వాచారం

---

సంయోగముచే కలుగును. సంయోగము కారణము లేక సంభవముకాదు. సంయోగమును కల్పించు అజ్ఞానము నివర్తించినపుడు సంయోగము సంపూర్ణముగ దొలగిపోవును అపుడు ఆత్యంతికమగు మోక్షము సంభవించును అని అందుము.

సిద్ధాంతి : మీవాదము సరికాదు. (5) అజ్ఞానమనగా తమోగుణము. అది నిత్యమని మీరనుచున్నారు. [తమస్సు నిత్యమైనను వివేకముచే నది ఉపరమించవచ్చును అనగా న్యూనభావము నొందవచ్చునంటిరేని] (6) గుణములయొక్క అభివ్యక్తితిరోభావములకు నియమము లేదు. పురుషప్రధాన ముల సంయోగ కారణముపరమించుటయందు నియ మములేదు. కనుక పురుషప్రధానముల వియోగమునకు గూడ నియతములేదు. సాంఖ్యునివాదఫలమగు మోక్షాభావము అపరిహార్యమే యగుచున్నది. ఉపనిషద్బోధితమగు ఆత్మ యొక్కటియెయని యంగీకరించుటవలన ఒక్కరికే విషయి విషయభావము పొసగదు. వికారభేదము వాక్కుచేతను

భణమాత్రత్వశ్రవణాదనిర్మోక్షశంకా స్వప్నేఽపి నోపజాయతే. వ్యవహారే తు యత్ర యథాదృష్టస్తస్యతాపకభావస్తత్ర తథైవ స ఇతి న చోదయితవ్యః పరిహర్తవ్యో వా భవతి.

---

మాత్రముపపాదింపబడినట్లు శ్రుతి పల్కుటచేతను మోక్షము కలుగదను శంక స్వప్నమునందుగూడ కలుగదు. వ్యవహారమునం దన్నదో తప్యతాపకభావ మెచట యేవిధముగ కాన్పించుచున్నదో అది అటులనే యగును గనుక ప్రశ్నింపదగినది కాని సమాధానము చెప్పవలసినది కాని యేమియు లేదు.

అధికరణ సంక్షేపార్థము: ప్రధానము జడము ప్రపంచ రచనమున కవసరమగు జ్ఞాన మద్దానికి లేనందున రచనాప్రవృత్తి ప్రధానమునకు సాధ్యముకాదు. గృహాశయనాదులు చేతనచోదితములై నిర్మింపబడుచున్నవి. బుద్ధికందరాని జగద్రచనా వైచిత్ర్యము చేతనసాధ్యము కాని అచేతనసాధ్యము కాదు. జగద్రచనగూర్చి నిమిత్తోపాదాన కారణములు రెండును విచారణీయములు. కార్యకారణ సంబంధము చేతనముచేకలుగును. ప్రధానమునకు జగద్రచనాప్రయత్నము సాధ్యముకాదని రథాదిప్రవృత్తిని బట్టి యూహింపతగును. చేతనముచే ప్రవర్తింపబడి అచేతనముప్రవర్తించును. ఈశ్వరుడు ప్రవృత్తిరహితుడైనను సమస్తమునకు ప్రవర్తకుడగుచున్నాడు. మాయాసంబంధముచే నతనికి అట్టి ప్రవర్తకత్వము సంభవమగుచున్నది. క్షీరజలాదులు చేతనమగు గోవుచే నిర్దిష్టమై స్రవించుచున్నవి. దూడచే పుడువబడుచున్నవి.

## (2) మహద్దీర్ఘాధికరణమ్ (సూ. 11)

ప్రధానకారణవాదో నిరాకృతః, పరమాణుకారణవాదః ఇదానీం నిరాకర్తవ్యః. తత్రాదౌ తావద్యోఽణుకారణవాదినా బ్రహ్మవాదిని దోష ఉత్ప్రేక్ష్యతే స ప్రతిసమాధీయతే. తత్రాయం వైశేషి

---

ప్రధానమునకు ప్రవర్తకుడు లేడు. ఈశ్వరుడు ఉదాసీనుడు, ప్రవర్తకత్వ నివర్తకత్వములు లేనివాడు. ప్రధానము స్వతంత్రము గనుక నెల్లప్పుడును సృష్టికార్యమును చేయుచుండవలెను. ప్రధానము స్వయముగ వికారమును చెందలేదు. దానికి కారణాంతరముండవలయును. తృణాదిక మన్నిస్థలముల క్షీరముగ మారుటలేదు. ప్రమాణము యొక్క ప్రవృత్తికి ప్రయోజనములేదు. భోగాపవర్గములు దాని ప్రయోజనములు కావు. ప్రధాన పురుషులకు గాని గుణత్రయమున కన్యోన్యము గాని అంగాంగి భావము సంభవము కాదు. ప్రధానము జడముగనుక జ్ఞానశక్తి లేదు. సాంఖ్యుల వాదము పరస్పర విరుద్ధము. తప్యతాపక భావ మజ్ఞానకల్పితము. ప్రధానవాదము వేదాంతవిరుద్ధము. 10

### (2) మహద్దీర్ఘాధికరణము

---

అ॥ ప్రధానము జగత్కారణమను సాంఖ్యవాదమును త్రోసిబుచ్చితిమి. ఇప్పుడు పరమాణువులు జగత్కారణమను వాదమును త్రోసిపుచ్చవలసి యున్నది. బ్రహ్మవాదమునందు పరమాణువాది చూపించిన దోషమునకు మున్ముందు సమాధానము చెప్పవలసియున్నది. అణువాదులలో చేరిన వైశే

కాణామభ్యుపగమః, కారణద్రవ్యసమవాయినో గుణాః కార్యద్రవ్యే సమానజాతీయం గుణాంతరమారభంతే శుక్లేభ్య స్తంతుభ్యశ్శుక్లస్య పటస్య ప్రసవదర్శనా త్తద్విపర్యయాదర్శనాచ్చ. తస్మాచ్చేతనస్య బ్రహ్మణో జగత్కారణత్వేఽభ్యుపగమ్యమానే కార్యేఽపి జగతి చైతన్యం సమవేయాత్. తదదర్శనాత్తు న చేతనం బ్రహ్మ జగత్కారణం భవితుమర్హతీతీమమభ్యుపగమం తదీయయైవ ప్రక్రియయా వ్యభిచారయతి.

---

షికుల వాదమిది. కారణద్రవ్యమునంటియుండి విడదీయుటకు సాధ్యముకాని గుణములు తమజాతికిచెందిన యితర గుణములను కార్యమునందుత్పాదనము చేయును. తెల్లని దారములవలన తెల్లని వస్త్రముత్పనమగుచున్నది. ఇందుకువ్యతిరేకము కాన్పించుట లేదు. [తెల్లని దారములనుండి మరియొక రంగు వస్త్రముత్పన్నమగుట లేదు.] చేతనమగు బ్రహ్మము జగత్కారణమని అంగీకరించినచో కార్యమగు జగత్తునందు గూడ చైతన్యమనపాయముగ నుండవల్లయును. కాని అటుల కాన్పించుట లేదు. కనుక చేతనమగు బ్రహ్మము జగత్కారణము కానేరదు. ఈవాదము సరికాదని వైశేషిక వాదమును బట్టియే సూత్రకారులు ప్రదర్శించు చున్నారు.

విషయము : జగత్సర్జనము బ్రహ్మము వలన కలుగునని వేదాంతవాక్య సమన్వయము.

విశయము : వైశేషికుల గుణారంభవాదము వేదాంత మతమునకు విరుద్ధమా యని సందేహము

పూర్వపక్షము : గుణారంభముచే సృష్టికలుగుచున్నది.

## మహద్దీర్ఘవద్వా హ్రస్వపరిమండలాభ్యామ్
(సూ. 11)

సిద్ధాంతీ : ఏషా తేషాం ప్రక్రియా. పరమాణవః కిల కించి త్కాలమనారబ్ధకార్యా యథాయోగం రూపాదిమంతః పారిమాం డల్యపరిమాణా స్తిష్ఠంతి, తే చ పశ్చాదదృష్టాదిపురస్సరాస్సం

---

సిద్ధాంతము : చేతనమగు బ్రహ్మమే జగత్కారణము.

హ్రస్వపరిమండలాభ్యాం=ద్వ్యణుకముల వలనను పరమాణులవలనను, మహత్ దీర్ఘవత్ =మహాంతము దీర్ఘము నగు నణువువలెనే చేతనమగు బ్రహ్మమునుండి అచేతనమగు జగత్తు కలుగుచున్నది.

సిద్ధాంతి : వైశేషికుల జగత్సృష్టి ప్రక్రియ యిటుల నుపపాదింపబడుచున్నది. పృథివి, జలము, తేజస్సు వాయువు అను నీనాల్గు భూతములయొక్క ప్రత్యేక ప్రత్యేక పరమాణువులు [ప్రలయము నందు] కార్యములను బుట్టింపక కొంత కాలము వానికి సహజములగు రూపాదిగుణములతో నిశ్చలముగ నుండును. వాని పరిమాణము గుండ్రముగా నుండును. ఈగుండ్రటి పరిమాణమును వైశేషిక పరిభాషయందు పారిమాండల్యమందురు [పారిమాండల్యశబ్దముఅణుపరిమాణమును చెప్పుటచే అణుపరముగగూడ వాడబడుచున్నది.] పిమ్మట నూతనసృష్టి ఆరంభమున నీ పరమాణువులు అదృష్టమగు కారణమును పురస్కరించుకొని తమలోతా మన్యోన్యము

వైశేషిక జగత్కారణత్వనిరూపణము.

యోగసచివాశ్చసంతో ద్వ్యణుకాదిక్రమేణ కృత్స్నం కార్యజాత మారభంతే. కారణగుణాశ్చ కార్యే గుణాంతరం. యదా ద్వౌ పర మాణూ ద్వ్యణుకమారభేతే తదా పరమాణుగతారూపాదిగుణవిశే షాశ్శుక్లాదయో ద్వ్యణుకేశుక్లాదీనపరానారభంతే.పరమాణుగుణవిశే షస్తు పారిమాండల్యం న ద్వ్యణుకే పారిమాండల్యమపరమార భతే, ద్వ్యణుకస్య పరిమాణాంతరయోగాభ్యుపగమాత్. అణుత్వ హ్రస్వత్వే హి ద్వ్యణుకవర్తినీ పరిమాణే వర్ణయంతి. యదాపి ద్వే ద్వ్యణుకే చతురణుకమారభతే తదాపి సమానం ద్వ్యణుక

---

సంయోగమును బొందినవై ద్వ్యణుకముతో నారంభించి సృష్టి కార్యజాతమునంత నారంభించును. [పరమాణువులు జగత్తున కుపాదానము. వాటి అన్యోన్య సంయోగము బాహ్యకార ణము. ఈ సంయోగమును కల్పించుకారణమదృష్టము.] కార ణమగు పరమాణుగుణములు కార్యమునందాజాతికి చెందిన గుణముల నుత్పాదనముచేయును. రెండు పరమాణువులు కలసి ద్వ్యణుకముగ నేర్పడినపు డాపరమాణుగతములగు శుక్లాది రూపాది గుణవిశేషములు ద్వ్యణుకము నందు శుక్లాదివర్ణముల నారంభించును. కాని పరమాణుగుణ విశేషమగు పారిమాండల్యము మాత్రము ద్వ్యణుకమునందు మఱియొక పారిమాండల్యము నారంభింపదు. ద్వ్యణుకమునకు మఱియొక పరిమాణమున్నట్లు వారందురు- ద్వ్యణుకమునం దణుత్వము హ్రస్వత్వమున్నటుల వారు వర్ణించుచున్నారు. రెండేసి ద్వ్యణుకములు కలసి చతురణుకము నారంభించును. [అనగా నాలుగు ద్వ్యణుకములుకలసి చతురణుకమేర్పడును.]

సమవాయినాం శుక్లాదీనామారంభకత్వం అణుత్వహ్రస్వత్వే తు ద్వ్యణుకసమవాయిని అపి నైవారభేతే, చతురణుకస్య మహత్త్వదీర్ఘత్వపరిమాణయోగాభ్యుపగమాత్. యదాపి బహవః పరమాణవో బహూని వా ద్వ్యణుకాని ద్వ్యణుకసహితో వా పరమాణుః కార్యమారభతే తదాపి సమానైషా యోజనా.

తదేవం యథా పరమాణోః పరిమండలాత్సతోఽణు హ్రస్వం చ ద్వ్యణుకం జాయతే మహద్దీర్ఘం చ త్ర్యణుకాది న పరిమండలం, యథా వా ద్వ్యణుకాదణోః హ్రస్వాచ్చ సతో మహద్దీర్ఘం చ త్ర్యణుకాది జాయతే నాణు నో హ్రస్వం, ఏవం

---

అప్పుడుగూడ ద్వ్యణుకమునందనపేతముగనున్న శుక్లాదివర్ణములు చతురణుకమున ఆ గుణముల నారంభించును. అణుత్వహ్రస్వత్వములు ద్వ్యణుకమునం దనపేతముగ నున్నను చతురణుకమునం దారంభము కావు. దానికి మహత్త్వదీర్ఘత్వములు సంభవించునని వారి మతము. అనేక పరమాణువులుగాని అనేక ద్వ్యణుకములుగాని ద్వ్యణుకముతో గూడిన పరమాణువులుగాని నూతనకార్యము నారంభము చేసినపుడుగూడ నీప్రక్రియనే అనుసంధానము చేసికొనవలయును.

వర్తులాకారము గల పరమాణువలన అణుత్వహ్రస్వత్వగుణములు గల ద్వణుకమునుండి మహాంతము దీర్ఘమునగు త్ర్యణుకమారంభమగుచున్నను పరిమండలమారంభము కాదు. అణుకము హ్రస్వమునగు ద్వ్యణుకమునుండి మహాంతము దీర్ఘమునగు త్ర్యణుక మారంభమైనను అణుత్వహ్రస్వత్వము,

చేతనాద్బ్రహ్మణోఽచేతనం జగజ్జనిష్యత ఇత్యభ్యుపగమే కిం తవ ఛిన్నమ్.

పూ. పక్షీ: అథ మన్యసే విరోధినా పరిమాణాంతరేణా క్రాంతం కార్యద్రవ్యం ద్వ్యణుకాదీత్యతో నారంభకాణి కారణ గతాని పారిమాండల్యాదీన్యభ్యుపగచ్ఛామి, న తు చేతనావిరోధినా

---

లారంభము కావు. అటులనే చేతనమగు బ్రహ్మము నుండి అచేతనమగు జగత్తు బుట్టుచున్నది యని యంగీకరించిన మీ కేమినష్టము ? [కారణగుణములు కార్యమునందు సంక్రమించు నని వైశేషికులు చేయువాదమెంతమాత్రము యుక్తముకాదు. వారివాదము ప్రకారమే కారణ గుణములన్నియు కార్యము నందు సంక్రమించుటలేదు. పరమాణువు యొక్క పారిమాండల్యము ద్వ్యణుకమునందు సంక్రమించుటలేదు. ద్వ్యణుకము యొక్క అణుత్వహ్రస్వత్వములు త్ర్యణుకమునందును సంక్ర మించుట లేదు. అనగా కార్యములగు ద్వ్యణుకత్ర్యణుకముల పరిమాణము కారణమగు పరమాణువువలన కలుగుటలేదు. కలిసియుండు పరమాణువుల సంఖ్యనుబట్టి అది యేర్పడుచు న్నది యని తాత్పర్యము. ఆవిధముగనే చేతనమగు బ్రహ్మ కారణమునుండి విలక్షణము అనగా అచేతనమగు జగత్కా ర్యము పుట్టుచున్నదని అంగీకరింపవచ్చును గదా !

పూ. పక్షి : కార్యద్రవ్యమగు ద్వ్యణుకము దానికంటె భిన్నము విరుద్ధమునగు మరియొక పరిమాణముచే నాక్ర మింపబడియుండుటవలన కారణగతములగు పారిమాండల్యా దులు కార్యమునం దారంభమగుటలేదు, అని మీవాదము.

గుణాంతరేణ జగతః ఆక్రాంతత్వమస్తి, యేన కారణగతా చేతనా కార్యే చేతనాంతరం నారభేత, న హ్యచేతనానాం చేతనావిరోధీ కశ్చిద్గుణోఽస్తి, చేతనాప్రతిషేధమాత్రత్వాత్. తస్మాత్పారిమాండల్యాదివైషమ్యాత్ప్రాప్నోతి చేతనాయాః ఆరంభకత్వమితి.

సిద్ధాంతీ : మైవం మంస్థాః యథా కారణే విద్యమానానామపి పారిమాండల్యాదీనామనారంభకత్వమేవం చైతన్యస్యాపీత్యస్యాంశస్య సమానత్వాత్. న చ పరిమాణాంతరాక్రాంతత్వం పారి

---

చేతనమునకు విరుద్ధముకాని గుణాంతరముచే జగత్తు ఆక్రమింప బడుటలేదు. అందువలన కారణగతమగు చేతనము కార్యమునందు చేతనాంతరము నారంభింపదని యనవీలులేదు. చేతనమునకు విరోధియగు అచేతనమను నొక ప్రత్యేక గుణములేదు. చేతనము కానిది అచేతనము. కనుక పారిమాండల్య ఉదాహరణ మిచట తగదు. చేతనమగు కారణము అంతరమగు కార్యము నారంభింప వచ్చును అని మేము తలంచుచున్నాము.

సిద్ధాంతి : మీరటుల తలంచకూడదు. కారణమగు పరమాణువునందు గల పారిమాండల్యాదులు కార్యమునందు పారిమాండల్యాంతరముల నారంభింపనట్లే కారణమగు బ్రహ్మమునందు గల చేతనము కార్యమగు జగత్తునందు చేతనాంతరము నారంభమును చేయదను విషయము రెండింటికిని సమానమే. కార్యమగు ద్వ్యణుకము మరియొక పరిమాణముచే నాక్రాంతమగుచుండుటచేత

మాండల్యాదీనామనారంభకత్వే కారణం, ప్రాక్పరిమాణాంతరా రంభాత్పారిమాండల్యాదీనామారంభకత్వోపపత్తేః. ఆరబ్ధమపి కార్యద్రవ్యం ప్రాగ్గుణారంభాత్ క్షణమాత్రమగుణం తిష్ఠతీత్యభ్యుపగమాత్. న చ పరిమాణాంతరారంభే వ్యగ్రాణి పారిమాండల్యాదీని, అతస్స్వసమానజాతీయం పరిమాణాంతరం నారభంతే, పరిమాణాంతరస్యాన్యహేతుత్వాభ్యుపగమాత్ 'కారణబహుత్వా

---

పారిమాండల్యము ద్వ్యణుకమునందు సజాతీయమగు మరియొక పరిమాండల్యము నారంభింపలేదని చెప్ప శక్యము కాదు. ద్వ్యణుకాదులయం దుత్పన్నమైనపుడే పరిమాణాంతరము పారిమాండల్యమునకు విరోధి యగుచున్నది కాని అంతకు పూర్వమేమియు విరోధము లేదు. కనుక ద్వ్యణుకమునందు పారిమాండల్యాంతరము నారంభింపవచ్చును. కార్యద్రవ్య మారంభమైనతరువాత నొకక్షణము గుణవిహీనముగ నుండుననియు నటుతరువాత నే దాని గుణము లారంభము లగుననియు మీరంగీకరించు చున్నారు. పారిమాండల్యాదులు తమకంటె నన్యమగు పరిమాణాంతరము నారంభించుటయందు వ్యగ్రములగుటవలన తమ జాతికిచెందిన పరిమాణాంతరము నారభింపలేకున్నవియని యన వీలులేదు. ద్వ్యణుకముల పరిమాణాంతరమునకు మరియొక కారణమును మీరే అంగీకరించు చున్నారు. [ద్వ్యణుకముయొక్క అణుత్వహ్రస్వత్వాది పరిమాణమునకు పరమాణువుల పారిమాండల్యము కారణము కాదనియు వాని సంఖ్య కారణమనియు వైశేషిక మతము.] కారణమగు ద్వ్యణుకములనేకములగుటచే త్ర్యణుకమునందు

త్కారణమహత్త్వాత్ ప్రచయవిశేషాచ్చ మహత్' (వై. అ ౭. ఆ ౧. సూ ౯.) 'తద్విపరీతమణు' (వై. ౭. ౧. ౧౦.) 'ఏతేన దీర్ఘత్వహ్రస్వత్వే వ్యాఖ్యాతే' (వై. ౭. ౧. ౧౭) ఇతి హి కాణభుజాని సూత్రాణి. న చ సన్నిధానవిశేషాత్ కుతశ్చిత్కారణబహుత్వాదీన్యేవారభంతే న పారిమాండల్యాదీనీత్యుచ్యేత ద్రవ్యాంతరే గుణాంతరే వారభ్యమాణే సర్వేషామేవ కారణగుణానాం స్వాశ్రయసమవాయావిశేషాత్. తస్మాత్స్వభావాదేవ పారిమాం

---

మహత్త్వము, వృత్తియొక్క మహత్త్వమువలన ఘటమునందు మహత్త్వము, అనగా రెండు మూడవయవముల సంయోగము వలన మహత్త్వము, (2) మహత్త్వమునకు విరుద్ధమగు నణుత్వము పరమాణువులు రెండను సంఖ్యచే ద్వ్యణుకమునందు కలుగుచున్నది; (3) మహత్త్వమునకు కారణమగు సంఖ్యయగు దీర్ఘత్వమునకు కారణమగుచున్నది. అణుత్వమునకు కారణమగు సంఖ్యయే హ్రస్వత్వమునకు కారణమగుచున్నది; అని కణాద సూత్రములు పలుకుచున్నవి. [కనుక పారిమాండల్యము మహత్త్వాదులకు కారణముకాకుండుటచే కార్యాంతర ప్రసక్తి యద్దానికి సంభవముకాదు.] మఱియు కారణములగు ననేక పరమాణువులు అన్యోన్యము సాన్నిధ్యవిశేషము వలన కార్యము నారంభించుచున్నవి యనిగాని, అట్టి సాన్నిధ్య విశేషము లేకపోవుటవలన పారిమాణ్యాదులు కార్యారంభమును చేయలేవనిగాని యన వీలులేదు, మఱియొక ద్రవ్యముగాని గుణముగాని యారంభమగుచుండగా కారణగుణములన్నియు తమ ఆశ్రయమునం దసవాయముగానుండును. ఈవిషయమున

డల్యాదీనామనారంభకత్వం తథా చేతనాయా అపీతి ద్రష్టవ్యమ్. సంయోగాచ్చ ద్రవ్యాదీనాం విలక్షణానాముత్పత్తి దర్శనాత్ సమాన జాతీయాత్సమానజాతీయోత్పత్తివ్యభిచారః.

పూ. పక్షీ : ద్రవ్యే ప్రకృతే గుణోదాహరణమయుక్తమితి. చేత్.

సిద్ధాంతీ : న దృష్టాంతేన విలక్షణారంభమాత్రస్య వివక్షితత్వాత్. న చ ద్రవ్యస్య ద్రవ్యమేవోదాహర్తవ్యం గుణస్య వా

---

భేదమేమియు లేదు. కనుక స్వభావము చేత నే పారిమాండల్యాదులు నూతనగుణముల నారంభింప లేకున్నవిగాని [సన్నిధి విశేషము లేకుండుట చేత కాదు.] చేతనమును గూర్చిగూడనిటులనే గ్రహించతగును. [పారిమాండల్యాదులు స్వభావము చేత నే సజాతీయములనారంభింప లేనటులనే బ్రహ్మముగూడ విజాతీయ కార్యము నుత్పన్నము చేయవచ్చును.] ద్రవ్యముల అన్యోన్య సంయోగము చే విలక్షణములగు ద్రవ్యము లుత్పన్నమగుట లోకమునందు కాన్పించుచున్నది. గనుక కారణగుణములు సజాతీయములనే యారంభింప నవసరము లేదు.

పూ. పక్షి . ప్రకృత విచారణా విషయము ద్రవ్యము. అప్రకృతమగు గుణము నిచట చూప్పించుట యుక్తముకాదు.

సిద్ధాంతి: మీారనునది సరికాదు. కారణము విలక్షణకార్యముల నారంభించగలదను విషయమును వివరించుటకు మాత్రమీాదృష్టాంతమును మేము పలుకరించితిమి. ద్రవ్యమునుగూర్చి చెప్పునపుడు ద్రవ్యమునే యుదాహరణముగా గ్రహించవలె

గుణఏవేతి కశ్చిన్నియమే హేతురస్తి. సూత్రకారోఽపి భవతాం ద్రవ్యస్య గుణముదాజహార 'ప్రత్యక్షాప్రత్యక్షాణామప్రత్యక్షత్వాత్సంయోగస్య పంచాత్మకత్వం న విద్యత' ఇతి (వై. అ ౪. ఆ ౨. సూ ౨.) యథా ప్రత్యక్షాప్రత్యక్షయోర్భూమ్యాకాశయోస్సమవయన్ సంయోగోఽప్రత్యక్షః ఏవం ప్రత్యక్షా ప్రత్యక్షేషు పంచసు భూతేషు సమవయచ్ఛరీరమ ప్రత్యక్షం స్యాత్. ప్రత్యక్షం తు శరీరం ద్రృశ్యతే తస్మాన్న పాంచభౌతికమితి. ఏతదుక్తం భవతి— గుణశ్చ సంయోగో ద్రవ్యం శరీరం 'దృశ్యతే' (బ్ర. సూ. 2. 1. 6) త్వితిచాత్రాపి విలక్షణోత్పత్తిః ప్రపంచితా.

---

నని గాని గుణములను గూర్చి చెప్పునపుడు గుణమునే ఉదాహారణముగా గ్రహించవలయునని గాని నియమమునకు కారణములేదు. మీదర్శన ప్రవర్తకుడగు కణాదుడే ప్రత్యక్షములు అప్రత్యక్షములు నగువాని సంయోగ మప్రత్యక్షము గనుక, శరీరము పంచభూతాత్మకము కాదను" సూత్రము నందు ద్రవ్యమునుగూర్చి చెప్పుచు గుణము నుదాహారణముగ గ్రహించెను. ప్రత్యక్షా ప్రత్యక్షములగు భూమ్యాకాశములకు సంయోగము అనపాయమై అప్రత్యక్షముగ నెటుల నున్నదో ఆవిధముగనే ప్రత్యక్షా ప్రత్యక్షములగు పంచభూతములయందు శరీరము అనపేతముగ సంయోగమును జెంది అప్రత్యక్షము కావలెను. కాని శరీరము ప్రత్యక్షముగ కాన్పించుచున్నది కనుక శరీరము పంచభూతాత్మకము గాదు అని కణాదవాదము. ఇందుచే నిటుల చెప్పినట్లగు చున్నది. సంయోగము గుణము; శరీరము ద్రవ్యము. దృశ్యతేతు అను

పూ. పక్షీ : నన్వేవం సతి తేనైవైతద్గతం.

సిద్ధాంతి : నేతి బ్రూమః, తత్సాంఖ్యం ప్రత్యుక్తం ఏతత్తు వైశేషికం ప్రతి.

పూ. పక్షీ : నన్వతిదేశోఽపి సమానన్యాయతయాకృతః 'ఏతేన శిష్టాపరిగ్రహా అపి వ్యాఖ్యాతాః (బ్ర. సూ. 2. 1. 12) ఇతి.

సిద్ధాంతీ : సత్యమేతత్. తస్యైవ త్వయం వైశేషికపరీక్షారంభే తత్ప్రక్రియానుగతేన నిదర్శనేన ప్రపంచః కృతః.

---

సూత్రమునందు (2-1-6) కారణ విలక్షణమగు కార్యోత్పత్తి విస్తరింపబడినది.

పూ. పక్షి : అటులయినచో అచటనే యీవిషయము గడచిపోయినది. [తిరిగి యిచటనేల విచారింప వలయును ?)

సిద్ధాంతి : గడచిపోలే దనుచున్నాము. అచట సాంఖ్య వాదమునకు సమాధానము చెప్పితిమి. ఇచట వైశేషికుని గూర్చి సమాధానము చెప్పవలసియున్నది.

పూ. పక్షి : "ఏతేనశిష్టా పరిగ్రహా అపి వ్యాఖ్యాతాః" అను సూత్రమునం దుభయులకు సమానమగు వాదము పేర్కొనబడినది.[కనుక సాంఖ్యులగూర్చి చెప్పినదియే వైశేషికులకు గూడ ప్రత్యుత్తరమన గూడదా ?]

సిద్ధాంతి : నిజమే ! వైశేషిక మత విచారారంభమున వారి వాదమున కనుకూలమగు యుక్తులచే ప్రత్యుత్తరము చెప్పుట యుక్తమని విస్తరించితిమి.

# (3) పరమాణుజగదకారణత్వాధికరణమ్
## (సూ. 12-17)

అధికరణ సంక్షేపార్థము : కారణ గుణములు కార్యమునందు సంక్రమించుచున్నవి యను వైశేషికన్యాయము ద్వ్యణుకత్ర్యణుకములయొక్క అణుత్వమహత్వములయందు వర్తించుటలేదు. ఆవిధముననే చేతనమగు బ్రహ్మమునుండి అచేతనమగు జగుత్తుత్పన్నమగుచున్నదనిన విరోధమేమియులేదు. 11

(3) *పరమాణుజగదకారణత్వాధికరణము*

అ॥ కారణ గుణములు కార్యమునందు సంక్రమించు నను న్యాయమునుబట్టి చేతనమగు బ్రహ్మము అచేతనమగు జగత్తునకు కారణము కానేరదను వైశేషిక వాదము నిలువనేరదనిపూర్వాధికరణమున వారి వాదముచేతనే చూపబడినది.

పూర్వోత్తరసంగతి.

పరమాణువులు జగత్కారణమే కానేరవని రాబోవు అధికరణమున చూపుచున్నారు. చేతనముతో కూడుకొని యుండనందున ప్రధానము జగత్కారణము కానేరదని రచనాధికరణమున సిద్ధాంతము చేయబడినది. పరమాణువులు చేతనాధిష్ఠితములు కనుక జగత్కారణము కాగలవను వాదమిచట నిరాకరింప బడుచున్నది.

విషయము : వైశేషికు లుపపాదించు పరమాణు ప్రక్రియచే జగత్తు ఉత్పన్నమగుచున్నది యను వైశేషిక రాద్ధాంతము.

సందేహము : ఇట్టి రాద్ధాంతము ప్రమాణ మూలకమా? లేక భ్రాంతిమూలకమా యని సందేహము

పూర్వపక్షము : ప్రమాణమూలకము,

సిద్ధాంతము : భ్రాంతిమూలకము.

ఉభయథా అపి=ఈశ్వరనికి గాని జీవునికి గాని ఉభయ పక్షములందుగూడ కర్మ = పరమాణువుల చలనము న = సంభవము కాదు. అతః = పరమాణువులకు చలనము లేదు గనుక, తత్ అభావః=పరమాణువులకు పరస్పరము సంయోగము సంభవము కాదు గనుక ద్వ్యణుక త్ర్యణుకాదుల ఉత్పత్తి సంభవము కాదు.

[రెండు పదార్థములు సంయుక్తముగా నున్నవి యనుటకు గల కారణము వానికిగల సంయోగము. ఇది ద్రవ్యముల యందుండు నొకగుణము. సంయోగ గుణముచే గలుగు సంబంధము సంయుక్త ద్రవ్యములకంటె బాహ్యము. సంయోగ సంబంధముచే సంబద్ధములగు ద్రవ్యములు సంయోగిద్రవ్యము లనబడును. ద్రవ్యములు సంయుక్తములుగ నున్నంతకాల మీా సంయోగ సంబంధము వానినివదలక ననపాయముగ నుండును. సంయోగ సంబంధము పీడిపోవుట వియోగమందురు. ఇదియు నొకగుణమే. సంయోగ వియోగము లెపుడును రెండు ద్రవ్యములమధ్య జరు

వివిధ కారణ వివరణము

గును. తంతువులు కలిసి వస్త్రమగుచున్నది. తంతువులు కారణము, వస్త్రము కార్యము. తంతువులు వస్త్రము యొక్క అవయవములు, వస్త్రము అవయవి. తంతువులకంటె భిన్నముగ వస్త్రము లేదు. అనగా వస్త్రము తంతువులలో యిమిడి విడదీయ వీలులేకున్నది. కార్యమగు వస్త్రమునకును కారణమగు తంతువులకును గల సంబంధము నిత్యము. పటాకారమునకు పటము కారణము. పటాకార కార్యము పట కారణమునం దనపేతమై నిత్యముగ నున్నది. ఏకారణము నందు కార్యమనపేతమై నిత్యసంబంధముగ నిమిడియుండునో అది సమవాయి కారణమనబడును. సమవాయి కారణములు ద్రవ్యములు. కార్యముతోగాని కార్యముయొక్క సమవాయి కారణముతో గాని కలిసియున్న కారణము అసమవాయి కారణము. తంతువులు వస్త్రమునకు సమవాయి కారణము కాని తంతువుల సంయోగము లేనిది వస్త్రమేర్పడదు. వస్త్ర కార్యమునకు తంతువులు, తంతు సంయోగము గూడ కారణములే. తంతువులొకదానితో నొకటి సంయుక్తములగుటచే వస్త్రమేర్పడుచున్నది. వస్త్రమేర్పడుట కవసరమైన తంతువుల సంయోగ కారణము వస్త్రమునకు సమవాయి కారణమునం దనపేతముగ సంక్రమించి యున్నది. తంతువుల యొక్క శుక్లాదివర్ణము పటముయొక్క శుక్లాది వర్ణమునకు కారణము. పటవర్ణమునకు కారణమగు తంతువర్ణము కార్యమగు బటమునందు సంక్రమించి అనపాయముగనున్నది. ఈ విధముగనే కారణము కార్యమునందు గాని కార్యముయొక్క

సమవాయి కారణమునందు గాని అనపేతమై సంక్రమించి యుండునో అది అసమవాయి కారణమనబడును. అసమవాయి కారణము గుణముగాని ద్రవ్యము కాదు. మృత్తు ఘటాదు లకును, సువర్ణము ఆభరణములకును కారణమగుచున్నది. ఏద్రవ్యము వికారమును జెంది మఱియొకద్రవ్యముగ పరిణ మించుచున్నదో అది దానికి ఉపాదాన కారణమనబడును. దీనినే సామాన్యభాషలో ద్రవ్యకారణమని గ్రహించవచ్చును. చేత నుడగు కులాలుడు స్వర్ణకారుడు లేక మృత్తు సువర్ణము ఘటకుండలములుగ పరిణమింపలేవు ఇట్టి చేతన కారణము నిమిత్తమాత్ర మగుటచే నిమిత్తకారణ మనబడుచున్నది. ఉపాదానకారణము కార్యమునందు ప్రత్యక్షముగ కాన్పిం చును. నిమిత్త కారణము కార్యముచే నూహింపబడును. ఘటమునందు మృత్తు ప్రత్యక్షముగ కాన్పించుచున్నది. కులా లుడు లేనిది మృత్తువలననే ఘట మేర్పడదు గనుక నాతడున్న టుల నూహించుచున్నాము. సమవాయి కారణము ఉపాదాన కారణము రెండు నొకటికావు. ఉపాదాన కారణము సమ వాయి కారణము కావచ్చును. సమవాయి కారణ ముపా దాన కారణము కానేరదు. తంతువులు పటమునకు సమవాయి కారణము ఉపాదాన కారణము గూడ నగును. కార్యకారణ ములు రెండును ద్రవ్యము లయినపుడే రెండు కారణము లొకటి కావచ్చును. పటము పటరూపమునకు సమవాయి కారణము గాని ఉపాదాన కారణముగాదు.]

సిద్ధాంతీ : ఇదానీం పరమాణుకారణవాదం నిరాకరోతి. స చ వాద ఇత్థంసముత్తిష్ఠతి.

పూ. పక్షీ : పటాదీని హి లోకే సావయవాని ద్రవ్యాణి స్వానుగతైః సంయోగసచివైస్తంత్వాదిభిర్ద్రవ్యైరారభ్యమాణాని దృష్టాని తత్సామాన్యేన యావత్కించిత్సావయవం ద్రవ్యం తత్సర్వం స్వానుగతైరేవ సంయోగసచివైస్తైస్తైర్ద్రవ్యైరారబ్ధమితి గమ్యతే. సచాయమవయవావయవివిభాగో యతో నివర్తతే సోఽపకర్షపర్యంతగతః పరమాణుః, సర్వం చేదం గిరిసముద్రాదికంసావయవంజగత్, సావయవత్వాదాద్యంతవత్, న చాకార

---

సూత్రకారు లిపుడు పరమాణువులు జగత్కారణ మను వాదమును నిరాకరించు చున్నారు. ఆవాదమిట్లు సమర్థింపబడు చున్నది.

పూ. పక్షి : అవయవములతో గూడుకొనియున్న వస్త్రాదిద్రవ్యములు వానితో ననుగతములై సంయోగమును చెందిన తంతువులు మొదలగు ద్రవ్యములచేత నారంభింపబడుట లోకమునందు కాన్పించుచున్నది. ఇందువలన యేదేది అవయవముల కలిగియున్నదో అది అంతయు తనతో అనపాయముగ కలసియున్న ఆయాద్రవ్యములచే నారంభింప బడుచున్నదియని సామాన్యసూత్రమును నిశ్చయించుచున్నాము.

కణాద మత స్వరూపము

అవయవ అవయవి విభాగమెచట ఆగిపోవునో యెచట వస్తువిభాగము పూర్తిగ ఆగిపోవునో అట్టి ద్రవ్యస్థితి పరమాణువు. గిరిసముద్రాదికమగు నీజగత్తంతయు నవయవ

ణేన కార్యేణ భవితవ్యమిత్యతః పరమాణవో జగతః కారణమితి కణభుగభిప్రేయాయ. తానీమాని చత్వారి భూతాని భూమ్యుదక తేజఃపవనాఖ్యాని సావయవానుపలభ్య చతుర్విధాః పరమాణవః పరికల్ప్యంతే. తేషాం చాపకర్షపర్యంతగతత్వేవ పరతో విభాగా సంభవాద్వినశ్యతాం పృథివ్యాదీనాం పరమాణుపర్యంతో విభాగో భవతి స ప్రళయకాలః. తతస్సర్గకాలే వాయవీయేష్వణుష్వదృష్టా పేక్షం కర్మోత్పద్యతే, తత్కర్మ స్వాశ్రయమణుమణ్వంతరేణ

---

ములు కలిగియున్నది. అవయవములుండుటవలన అది అంతము కలిగి యున్నది. కారణము లేక కార్యముత్పన్నము కాదు. కనుక పరమాణువులు జగత్కారణమని కణాదుని అభిప్రాయము. భూమియుదకము, తేజస్సు, వాయువు అనునాలుగు భూతములు కాన్పించుచున్నవి. [జగత్తంతయు వీనివలననే యేర్పడుచున్నది.] వీనిలో ప్రతిభూతము అవయవవిభాగము కలిగి యున్నది. కనుక చతుర్విధములగు పరమాణువు లేర్పడుచున్నవి. ప్రతిభూతమును పరమాణుదశవరకు విభాగము చేయవచ్చును. తరువాత విభాగము సంభవము కాదు. కనుక పృథివ్యాదులు పరమాణువులువరకు నశించును. ఇట్టి పృథివ్యాదుల యొక్క అవిభాజ్యమగు పరమాణుస్థితివరకు విభాగము ప్రలయమనబడును. సృష్టికాలమునందు వాయుపరమాణువుల యందు అదృష్టమగు నేదోయొక్క చలనకర్మ ఉత్పన్నమగుచున్నది. ఈచలనకర్మ పరమాణువు నాశ్రయించియుండుట వలన యొకపరమాణువును మఱియొక పరమాణువుతో సంయోగము చేయును. ఆవిధముగ ద్వ్యణుకము త్ర్యణుకము

సంయునక్తి. తతో ద్వ్యణుకాదిక్రమేణ వాయురుత్పద్యతే, ఏవ మగ్నిరేవ మాపః ఏవం పృథివ్యేవమేవ శరీరం సేంద్రియమిత్యేవం సర్వమిదం జగదణుభ్యస్సంభవతి, అణుగతేభ్యశ్చ రూపాదిభ్యో ద్వ్యణుకాదిగతాని రూపాదీని సంభవంతి తంతుపటన్యాయేనేతి కాణాదా మన్యంతే.

సిద్ధాంతీ : తత్రేదమభిధీయతే—విభాగావస్థానాం తావదణూనాం సంయోగః కర్మాపేక్షోఽభ్యుపగంతవ్యః కర్మవతాం తంత్వాదీనాం సంయోగదర్శనాత్, కర్మణశ్చ కార్యత్వాన్నిమిత్తం కిమప్య

---

యిటుల క్రమముగ వాయువుత్పన్నమగును. ఈవిధముగనే అగ్ని, జలము, పృథివి యేర్పడుచున్నవి. ఇంద్రియ సహితమగు శరీరముగూడ నిటులనే యేర్పడుచున్నది. ఈవిధముగ నీజగత్తంతయు పరమాణువులవలననే యేర్పడుచున్నది. తంతురూపాదులు పటారూపాదులయినటులనే పరమాణురూపాదులు ద్వ్యణుకాదిరూపాదులగుచున్నవి. ఇది కాణాదమతము.

సిద్ధాంతీ : ఇచట మేమిటుల వాదించుచున్నాము. (1) విభాగావస్థను జెందిన పరమాణువులు తిరిగి సంయోగమును జెందుటకొక కర్మ యవసరమని అంగీకరింపవలయును.

సృష్టికిఅవసరమగు కర్మ శరీరప్రలయమునలేదు.

తంతువులకు చలనమున్నపుడే సంయోగము సంభవించుచున్నది. కర్మ అనునది యొక కార్యము. దానిని చేయువానిని యొకని అంగీకరింపవలయును. అట్టివానిని అంగీకరింపనిచో పరమాణువులయందు ప్రథమచలన మారంభము కాదు. (2) అట్టి నిమిత్తకారణము నంగీకరించినను ఒక

భ్యుపగంతవ్యమ్, అనభ్యుపగమే నిమిత్తాభావాన్నాణుష్వాద్యం కర్మస్యాత్, అభ్యుపగమేఽపియది ప్రయత్నోఽభిఘాతాదిర్వాయథా దృష్టం కిమపి కర్మణో నిమిత్తమభ్యుపగమ్యేత తస్యాసంభవాత్. నైవాణుష్వాద్యం కర్మ స్యాత్, న హి తస్యామవస్థాయామాత్మ గుణః ప్రయత్నస్సంభవతి శరీరాభావాత్. శరీరప్రతిష్ఠే హి మన స్యాత్మన స్సంయోగే సత్యాత్మగుణః ప్రయత్నో జాయేత. ఏతేనాభి ఘాతాద్యపి దృష్టం నిమిత్తం ప్రత్యాఖ్యాతవ్యం సర్గోత్తరకాలం హి

---

ప్రయత్నమో లేక తాకిడివత్తిడి మొదలగునవియో యేదో యొక కర్మనిమిత్తము నంగీకరింపవలయును. ప్రలయస్థితియం దట్టికర్మ యసంభవముగనుక పరమాణువులయందు మొదటి చలనకర్మ యసంభవమగును. అపుడు శరీరములేదుగనుక ఆత్మగుణమగుప్రయత్నము సంభవముకాదు. శరీరమున్నపుడే మనసునం దాత్మసంయోగము, దానివలన ఆత్మ గుణమగు ప్రయత్నము బుట్టును. [ఆత్మతోఁగూడిన మనస్సు సంకల్పిం చును. సంకల్పముచే కార్యమునందు ప్రయత్నించును. శరీరములేనిది మనస్సులేదు. కనుక ప్రథమాణువుల ప్రథమ సంయోగమునకు శరీరము, ఆత్మతోఁగూడిన మనస్సు, ప్రయ త్నము అవసరమగుచున్నవి] ఈకారణములచేతనే పరమాణు సంయోగమున కవసరమగు ఆఘాతము మొదలగు వానిని గూర్చి సమాధానము చెప్పుచున్నాము. శరీరసముపేతములగు ప్రయత్నాదులన్నియు సృష్ట్యనంతరము సంభవించునవి గనుక సృష్టికిపూర్వమగు పరమాణువుల సంయోగమగు నాద్యచలన కర్మకు కారణములుగానేరవు. (౩) ఇక నాద్యమగు చలనకర్మ

తత్సర్వం నాద్యస్య కర్మణో నిమి త్తం సంభవతి, అథాదృష్ట మాద్యస్య కర్మణో నిమిత్తమిత్యుచ్యేత, తత్పునరాత్మ సమవాయి స్యాదణుసమవాయి వా. ఉభయథాపి నాదృష్ట నిమి త్తమణుషు కర్మావకల్పేత, అదృష్టస్యాచేతనత్వాత్. న హ్యచేతనం చేతనా నధిష్ఠితం స్వతంత్రం ప్రవ ర్తతే ప్రవ ర్తయతి వేతి సాంఖ్య పరీక్షాయామభిహితమ్. ఆత్మనశ్చానుత్పన్నచై తన్యస్య తస్యా మవస్థాయామచేతనత్వాదా త్మసమవాయిత్వాభ్యుపగమాచ్చ నాదృష్ట మణుషుకర్మణో నిమి త్తం స్యాదసంబంధాత్. అదృష్టవతా

---

కదృష్టము కారణమని వీరందురు. ఈయదృష్టము ఆత్మలో నిమిడియున్నదయినను కావలెను, లేక పరమాణువులలో నిమిడి యున్నది అయినను కావలెను. ఏపక్షమునయినను అదృష్ట మచేతన మగుటవలన అణువులయందు చలనకర్మను కల్పింప లేదు. అచేతన మేదోయొక చేతనముతో సంబంధము లేక స్వతంత్రముగ తాను ప్రవ ర్తింపలేదు. ఇతరులను ప్రవ ర్తింప చేయలేదు. ఈవిషయము సాంఖ్యమత

అచేతనమగుఅదృష్టము చలనకర్మ నుత్ప త్తి చేయలేదు.

సమ్మతము. (4) సృష్టికి పూర్వమాత్మకు జ్ఞానముత్పన్నము కాదు గనుక నపుడు చేతనముద్దానికిలేదు. [ఆత్మకుజ్ఞానము ముఖ్యముకాదనియు, అది మనః సంయోగమును పొందినపుడు జ్ఞానమను గుణమొకటి యాదృచ్ఛికముగ బుట్టుననియు వై శే షికమతము] అదృష్టమాత్మలో నిమిడియున్నదని అంగీకరించి నచో పరమాణువుల చలనకర్మకు కారణముకాదు. అకాల ములమున పరమాణువులకును ఆత్మకును సంబంధమేమియు లేదు.

పురుషేణా స్త్యణూనాం సంబంధ ఇతి చేత్సంబంధసాతత్యాత్ ప్రవృత్తిసాతత్యప్రసంగో నియామకాంతరాభావాత్. తదేవం నియతస్య కస్యచిత్కర్మనిమిత్తస్యాభావాన్నాణుష్వాద్యం కర్మ స్యాత్కర్మాభావాత్తన్నిబంధనస్సంయోగో న స్యాత్, సంయోగాభావాచ్చ తన్నిబంధనం ద్వ్యణుకాది కార్యజాతం న స్యాత్.

సంయోగశ్చాణ్వోరణ్వంతరేణ సర్వాత్మనా వా స్యాదేకదేశేన వా, సర్వాత్మనా చేదుపచయానుపపత్తేరణుమాత్రత్వప్రసంగో దృష్టవిపర్యయప్రసంగశ్చ. ప్రదేశవతో ద్రవ్యస్య

---

(5) అదృష్ట మిమిడియున్న ఆత్మతో పరమాణువులకు సంబంధము కలుగుచున్నదంటి రేని, యీసంబంధము సతతముండును గనుక ప్రవృత్తిగూడ సతతముండును. అట్టి ప్రవృత్తిని నియమనము చేయుమఱియొక కారణమేమియు లేదు. ఈవిధమున పరమాణువుల ఆద్యచలనకర్మకు నియతమగు కారణము లేకుండుటవలన వానియం దాద్యమగు చలనకర్మ సంభవింపదు. చలనకర్మ లేకుండుటచే దానినాధారము చేసుకొనిన పరమాణుసంయోగము సంభవముకాదు. సంయోగము కలుగనందున దాని నాధారము చేసుకొని ద్వ్యణుకాది కార్యజాత, ముత్పన్నముకాదు.

(6) మఱియు నొక పరమాణువునకు మఱియొకదానితో సంయోగము ఒకటి మఱియొకదానిలో సంపూర్ణముగ దూరుటచేతనయినను కలుగవచ్చును. ఒకదాని యేదోయొక భాగము రెండవదాని యేదోయొకభాగముతో కలియుటచేతనైనను సంభవించవచ్చును. సంయోగము సంపూర్ణమై

పరమాణుసంయోగము సాధ్యముకాదు.

ప్రదేశవతా ద్రవ్యాంతరేణ సంయోగస్య దృష్టత్వాత్. ఏకదేశేన చేత్సావయవత్వప్రసంగః పరమాణూనాం కల్పితాః ప్రదేశాస్స్యురితి చేత్కల్పితానామవస్తుత్వాదవస్త్వేవ సంయోగ ఇతి వస్తునః కార్యస్యా సమవాయికారణం న స్యాత్, అసతి చాసమవాయి కారణే ద్వ్యణుకాదికార్యద్రవ్యం నోత్పద్యేత యథాచాదిసర్గే నిమిత్తాభావాత్సంయోగోత్పత్త్యర్థం కర్మ నాణూనాం సంభవత్యేవం మహాప్రళయేఽపి విభాగోత్పత్త్యర్థకం కర్మ నైవాణూనాం సంభ

---

నచో పరిమాణము వృద్ధియగుట సంభవముకాదు. అణుపరిమాణమే యుండును. వరలోకత్తినిదూర్చినపుడు వరయొక్క పరిమాణ మెక్కువకాదు.] అట్టి సంయోగము లోకానుభవమునకు విరుద్ధముగ నుండును-అవయవములుగల రెండు పదార్థములకుమాత్రము సంయోగము సాధ్యము, పరమాణు సంయోగ మేదో యొకభాగమున సంభవించునందు రేని పరమాణువుల కవయవములుండవలసియుండును. వానికి అవయవములున్నట్లు కల్పింతుమందు రేని కల్పితములగునవి యథార్థములుగావు గనుక వాని సంయోగముగూడ నయథార్థమే యగును. అపుడాసంబంధ మసమవాయికారణము కాకుండును. [సమవాయాదిసంబంధములన్నియు (13) వ సూత్రము ప్రతిపదార్థము తరువాత వివరింపబడినవి.] అసమవాయికారణము లేనపుడు ద్వ్యణుకాదికార్య ముత్పన్నముకాదు. ప్రథమసృష్టియందు సంయోగమును కలిగించు కారణము లేకుండుటవలన అణువులకు చలనకర్మ సంభవము కానట్లే ప్రలయకాలమునందు గూడ ద్వ్యణుకాదులను విభాగముచేయు కర్మకూడ పర

వేత్. నహి తత్రాపి కించిన్నియతం తన్నిమిత్తం దృష్టమస్తి. అదృష్టమపి భోగప్రసిద్ధ్యర్థం న ప్రళయప్రసిద్ధ్యర్థమిత్యతోనిమిత్తాభావాన్న స్యాదణూనాం సంయోగోత్పత్త్యర్థం విభాగోత్పత్త్యర్థం వా కర్మ, అతశ్చ సంయోగవిభాగాభావాత్తదాయత్తయోస్సర్గప్రళయయోరభావః ప్రసజ్యేత, తస్మాదనుపపన్నోఽయం పరమాణు కారణవాదః.

## సమవాయాభ్యుపగమాచ్చ సామ్యాదనవస్థితేః
(సూ. 13)

---

మాణువులకు సంభవముకాదు. విభాగమునందుగూడ నిమిత్తకారణ మెద్దియు నియమితముగ కాన్పించుటలేదు. కర్మఫలానుభవ మదృష్టముయొక్క ప్రయోజనముకాని ప్రళయము కాదు. అందువలన అణువుల సంయోగమునుగాని వియోగమునుగాని కలుగచేయు కర్మలేదు. అందువలన అణువులకు సంయోగ విభాగములులేవు. వానినాధారము చేసుకొను సృష్టిప్రళయములు లేవనియు ఫలితము సంభవించుచున్నది. అందువలన నీపరమాణుకారణవాదము సమంజసముకాదు. 12

సమవాయ అభ్యుపగమాత్=ద్వ్యణుకమునకును పరమాణువులకును సమవాయ సంబంధము నంగీకరించుట వలనను చ=మరియు సామ్యాత్=భేదము తుల్యమగుట వలనను సమవాయ సంబంధ మేర్పడుటకు మఱియొక సంబంధము నంగీకరింప వలయును. ఈవిధముగ అనవస్థితేః=అనవస్థా దోషము ప్రసక్తమగును.

సమవాయాభ్యుపగమాచ్చ తదభావ ఇతి ప్రకృతేనాణు కారణవాదనిరాకరణేన సంబధ్యతే, ద్వాభ్యాం చాణుభ్యాం ద్వ్యణుకముత్పద్యమానమత్యంతభిన్నమణుభ్యామణ్వో స్సమవై తీత్యభ్యుపగమ్యతే భవతా, న చైవమభ్యుపగచ్ఛతా శక్యతేఽణు కారణవాదస్సమర్థయితుమ్, కుతః, సామ్యాదనవస్థితేః. యథైవ హ్యణుభ్యామత్యంతభిన్నం సద్ద్వ్యణుకం సమవాయలక్షణేన సంబంధేన తాభ్యాం సంబధ్యతే, ఏవం సమవాయోఽపి సమవా

---

(1) సమవాయ సంబంధమును వైశేషికు లంగీకరించు చున్నారు. అట్టి సంబంధము కలుగదనియు అందువలన నణు వాద మీసూత్రమునందు నిరాకరించుట చేతను పూర్వసూత్రముతో నీ సూత్రము సంబద్ధ మగుచున్నది. విభిన్నములగు

సమవాయి సంబంధ మసంభవము

రెండణువులు సమవాయ సంబంధముచే నత్యంతము భిన్నమగు ద్వ్యణుకమును బుట్టించుచున్నవి యని అణువులతో నణువులకు సమవాయ సంబంధమును వైశేషికు లంగీకరించుచున్నారు. ఇట్లంగీకరించువారు అణువు జగత్కారణమని సమర్థించ లేరు. ఏలనన్న (1) తుల్యమగుటచే ననవస్థితి దోషము సంభవించుట వలన! రెండణువులు కలిసి ద్వ్యణుకముత్పన్న మగుచున్నది. [పటము తంతువులతో సమవాయి సంబంధముచే సంబంధము కలిగియున్నటుల] ద్వ్యణుకము అణువులతో సమవాయి సంబంధముచే సంబంధించి యున్నది. సమవాయి సంబంధము ద్వ్యణుకము కంటెను అణువులకంటెను భిన్నము సమవాయము సమవాయము గల ద్వ్యణుక అణువులతో సంబంధించుటకు

యిభ్యోఽత్యంతభిన్నస్య సమవాయలక్షణేనాన్యేనైవ సంబంధేన సమవాయిభిస్సంబంధ్యేతాత్యంతభేద సామ్యాత్, తతశ్చ తస్య తస్యాన్యోఽన్యసంబంధకః కల్పయితవ్యః ఇత్యనవస్థా ప్రసజ్యేత.

పూ. పక్షీ : నన్విహ ప్రత్యయగ్రాహ్యః సమవాయో నిత్య సంబద్ధ ఏవ సమవాయిభిర్గృహ్యతే నాసంబద్ధః సంబంధాంతరాపేక్షో వా, తతశ్చ న తస్యాన్యస్సంబంధకః కల్పయతవ్యః యేనానవస్థా ప్రసజ్యేతేతి.

సిద్ధాంతీ : నేత్యుచ్యతే, సంయోగోఽప్యేవంసతి సంయోగి

---

మఱియేదోయొక సంబంధము అవసరము. అత్యంతము భేదముండుటచే నీ సంబంధము సమవాయి సంబంధము కావలెను. ఈరెండవ సమవాయి సంబంధము మొదటి సమవాయి సంబద్ధములగు వానితో సంబద్ధమగుటకు మఱియొక సమవాయిసంబంధము ఇటుల సంబంధకల్పనకు నిలుకడ లేకుండును.

పూ. పక్షి : తంతుపటములవంటి స్థలములయందలి సమవాయ సంబంధము స్వభావముచేతనే అనపాయముగ నుండుట సుప్రసిద్ధము. సమవాయము తంతుపటములతో సంబద్ధము కాదనిగాని మఱియొక సంబంధము అవసరమగునట్లుగాని కాన్పించుటలేదు. అందువలన తంతుపటములయందలి సమవాయసంబంధము కుదురుటకు సంబంధాంతరావసరము కాన్పింపదు. ఆతీరుగ నే ద్వ్యాణుకఅణుకములకుగూడ సమవాయి సంబంధ మేర్పడును.] కనుక అనవస్థాదోషము పట్టదు.

సిద్ధాంతి : మీరనునది సరికాదు. మీరు చెప్పుప్రకారము సంయోగము సంయోగిద్రవ్యములతో ననపాయముగ

భిర్నిత్యసంబంధ ఏవేతి సమవాయవన్నాన్యం సంబంధమపేక్షతే, అథార్థాంతరత్వాత్సంయోగస్సంబంధాంతరమపేక్షేత, సమవాయోఽపి తర్హ్యర్థాంతరత్వాత్ సంబంధాంతరమపేక్షేత న చ గుణత్వాత్సంయోగస్సంబంధాంతరమపేక్షతే, న సమవాయోఽగుణత్వాదితి యుజ్యతేవక్తుమ్, అపేక్షాకారణస్య తుల్యత్వాత్ గుణపరిభాషా

---

సంబద్ధమగుటవలన సమవాయమువలె మఱియొకసంబంధమును కోరకుండవలయును. [కాని సంయోగము గుణమగుటవలన సమవాయకారణముచే సంయోగద్రవ్యముతో నది సంబద్ధమగు చున్నదియని మీరనుచున్నారు, అనగా తంతువుల కన్యోన్యము సమవాయ కారణముచే సంయోగసంబంధ మేర్పడు చున్నదియని వైశేషికవాదము] సంయోగము [గుణము, సంయుక్తములు ద్రవ్యములు కనుక] భిన్నము, అందువలన మఱియొక సంబంధమును కోరుచున్న దంటిరేని సమవాయముగూడ [సమవాయి ద్రవ్యములగు తంతువులకంటె] భిన్నమగుటచే మఱియొకసంబంధమును గోరవలయును. గుణమగుటచే సంయోగము సంబంధాంతరమును గోరుననియు, గుణముకాకుండుటచే సమవాయము కోరదనియు ననుట యుక్తముకాదు. సంయోగము సమవాయము—ఈరెండును వానిచే సంబద్ధములగు ద్రవ్యములకంటె భిన్నములగుటచే భిన్నపదార్థములకు సంబంధము కలుగుటకు సంబంధాంతర మవసరమగునను లక్షణ ముభయత్రసమానమే. సంయోగము గుణమని యొక పరిభాష నేర్పరుచుట వలన నిట్టి సంబంధాంతరాపేక్ష యవసరము కలుగుటలేదు. [సమవా

యాశ్చాతంత్రత్వాత్, తస్మాదర్థాంతరం సమవాయమభ్యుపగచ్ఛతః ప్రసజ్యేతైవానవస్థా. ప్రసజ్యమానాయాం చానవస్థాయామేకాసిద్ధౌ సర్వాసిద్ధేర్ద్వాభ్యామణుభ్యాం ద్వ్యణుకం నైవోత్పద్యేత, తస్మాదప్యనుపపన్నః పరమాణు కారణవాదః.

## నిత్యమేవ చ భావాత్ (సూ. 14)

సిద్ధాంతీ : అపిచాణవః ప్రవృత్తిస్వభావా వా నివృత్తిస్వభావా వా ఉభయస్వభావా వా అనుభయస్వభావా వాఽభ్యుప

---

యము కర్మవిషయమైనకూడ నవసరమనుచున్నారు. కనుక గుణమగుటచే సమవాయ మవసర మగుచున్న దన వీలులేదు.]
అందువలన సమవాయమును ప్రత్యేకముగ నంగీకరించువారికి యనవస్థాదోషము సంభవింపక తప్పదు. అనవస్థ సంప్రాప్తమైనపుడు సమవాయము సిద్ధింపదేని మరి యేదియును సిద్ధింపదు. రెండు అణువులవలన ద్వ్యణుకము సిద్ధముకాదు, కనుక పరమాణు కారణవాదము సంభవముకాదు. 13

నిత్యం ఏవ=పరమాణువులకు ప్రవృత్తి స్వభావముచే యున్నచో భావాత్=ప్రవృత్తి నిత్యముండ వలయును. ప్రలయ ముండకుండును. నివృత్తి స్వభావమైనచో నిత్యం ఏవ=నివృత్తి నిత్యముగ భావాత్ =ఉండుటవలన సృష్టి లేకుండును.

సిద్ధాంతి : మఱియు నణువులు ప్రవృత్తి స్వభావమో, నివృత్తి స్వభావమో, ఉభయస్వభావమో, కలవియో లేక నేస్వభావము లేనివియో కావలెను. మఱియొక మార్గము

గమ్యేరన్, గత్యంతరాభావాత్ చతుర్ధాపి నోపపద్యతే. ప్రవృత్తి స్వభావత్వే నిత్యమేవ ప్రవృత్తేర్భావాత్ ప్రళయాభావప్రసంగః. నివృత్తిస్వభావత్వేఽపి నిత్యమేవ నివృత్తేర్భావాత్ సర్గాభావ ప్రసంగః. ఉభయస్వభావత్వం చ విరోధాదసంభావ్యమ్. అనుభయ స్వభావత్వే తు నిమిత్తవశాత్ ప్రవృత్తినివృత్త్యోరభ్యుపగమ్య మానయోరదృష్టాదేర్నిమిత్తస్య నిత్యసన్నిధానాన్నిత్యప్రవృత్తి ప్రసంగః, అతంత్రత్వేఽప్యదృష్టాదేర్నిత్యాప్రవృత్తిప్రసంగః, తస్మా దప్యనుపపన్నః పరమాణుకారణవాదః.

---

లేదనుచున్నారు. ఈనాలుగు విధములుగూడ సంభవము కావు. (1) ప్రవృత్తియె వాని స్వభావమైనచో అది నిత్యముండుట వలన ప్రలయము లేకపోవును. (2) నివృత్తియే వాని స్వభావమైనను ఆ నివృత్తి నిత్య ముండుటవలన సృష్టి లేకపోవలెను. (3) విరుద్ధములగుట వలన నుభయ స్వభావము లేక కాలమున నుండుట సమంజసముకాదు. (4) అణువులు స్వయముగా నేస్వభావము లేనివి యయినచో, ప్రవృత్తి నివృత్తులు అదృష్టమగు నిమిత్తకారణాధీనము లగుటచేతను అట్టి నిమిత్తకారణ మణువులకు తెంపులేని సాన్నిధ్యమునం దుండుటవలన ప్రవృత్తియు తెంపులేకుండును. నిమిత్తకారణము సన్నిధానమున లేనిచో నివృత్తియే యెల్లపుడు నుండవలెను. అందువలనకూడ పరమాణు కారణవాద ముపపన్నము కాదు.

## రూపాదిమత్త్వాచ్చ విపర్యయోదర్శనాత్ (సూ. 15)

పూ. పక్షీ : సావయవానాం ద్రవ్యాణామవయవశో విభజ్యమానానాం యతః పరో విభాగో న సంభవతి తే చతుర్విధా రూపాదిమంతః పరమాణవః చతుర్విధస్య రూపాదిమతో భూత భౌతికస్యారంభకా నిత్యాశ్చేతి.

సిద్ధాంతీ : యద్వైశేషికా అభ్యుపగచ్ఛంతి స తేషామభ్యుపగమో నిరాలంబనఏవ, యతో రూపాదిమత్వాత్ పరమాణూనామణుత్వనిత్యత్వవిపర్యయః ప్రసజ్యేత, పరమకారణా

---

రూపాదిమత్వాత్=పృథివ్యాది పరమాణువులకు రూపరసగంధస్పర్శ లున్నటుల అంగీకరించుట వలన, విపర్యయః=అనిత్యత్వము సావయవత్వము మొదలగు దోషములు సంభవించును. దర్శనాత్=రూపాదులు గల ఘటాదులకు అనిత్యత్వ సావయత్వ దోషములు లోకమున కనుపించుచున్నవి.

పూ. పక్షి : ద్రవ్యములన్నియు నవయవ సహితములు. వానిని విభాగము చేసినపుడు యెపుడంతకంటె విభాగము చేయ చేతకాని స్థితిసంభవించునో అట్టి పృథివ్యాది చతుర్విధములగు పరమాణువులు స్వయముగ రూపాది గుణములు గలవై రూపాది గుణములు గల చతుర్విధమైన భూతభౌతిక ప్రపంచసృష్టిని యారంభించును. ఇదివైశేషిక సమ్మతము.

సిద్ధాంతి : ఇట్టి వీరిమతమున కాధారము లేదు. రూపాదులు గలిగియుండుటవలన పరమాణువుల కణుత్వనిత్యత్వములు విపర్యాసము నొందును. పరమకారణమును బట్టి విచారిం

పేక్షయా స్థూలత్వమనిత్యత్వం చ తేషామభిప్రేతవిపరీతమాపద్యే తేత్యర్థః. కుతః, ఏవం లోకే దృష్టత్వాత్. యద్ధి లోకే రూపాదిమద్వస్తు తత్ స్వకారణాపేక్షయా స్థూలమనిత్యం చ దృష్టమ్, తద్యథా పట స్తంతూనపేక్ష్య స్థూలోఽనిత్యశ్చ భవతి, తంతవశ్చాంశూనపేక్ష్య స్థూలా అనిత్యాశ్చ భవంతి, తథా చామీ పరమాణవో రూపాదిమంత స్తైరభ్యుపగమ్యంతే, తస్మాత్తేఽపి కారణవంత స్తదపేక్షయా స్థూలా అనిత్యాశ్చ ప్రాప్నువంతి.

---

చగా అంగీకరింపబడిన అణుత్వనిత్యత్వములకు బదులు స్థూలత్వము అనిత్యత్వము సంభవించునని యర్థము. ఏలనన్న లోకమునం దటులకాన్పించుచున్నది. ఏ యే ద్రవ్యములకు రూపాదులు గలవో అవియన్నియు తమ తమ కారణమును బట్టి స్థూలములు, అనిత్యములగుట లోకమున కాన్పించుచున్నది. అదియెట్లన, కారణమగు తంతువులరీత్యా పటము స్థూలము అనిత్యము నగుచున్నది. తంతువులు గూడ తమ కారణములగు తంతుఅంశలను బట్టి స్థూలములు అనిత్యములు నగుచున్నవి. ఆవిధముగనే నీ పరమాణువులకు గూడ రూపాదు లున్నవని యంగీకరించుట చేతను వానికిగూడ [త్రిగుణముల వ్యత్యయ రూపమగు] కారణముండుట వలన అవి కారణరీత్యా స్థూలములు అనిత్యములు నగుచున్నవి. పరమాణువులు స్థూలములు అనిత్యములు-రూపాదులుండుట చేత-పటాదులవలే యని యిచట అనుమానరచనము చేయబడు చున్నది.]

సిద్ధాంతీ : యచ్చ నిత్యత్వే కారణం తైరుక్తం 'సదకారణవన్నిత్య' మితి (వై. అ ౪. ఆ ౧. సూ ౧.) తదప్యేవం సత్యణుషు న సంభవతి, ఉక్తేన ప్రకారేణాణూనామపి కారణవత్త్వోపపత్తేః, యదపి నిత్యత్వే ద్వితీయం కారణముక్తం. 'అనిత్యమితి చ విశేషతః ప్రతిషేధాభావః' ఇతి (వై. అ ౪. ఆ ౧. సూ ౪) తదపి నావశ్యం పరమాణూనాం నిత్యత్వం సాధయతి, అసతి హి యస్మిన్ కస్మింశ్చిన్నిత్యే వస్తుని నిత్యశబ్దేన నఞ్సమాసో నోప

---

ఉనికి యుండగా కారణము లేకుండుట నిత్యత్వమని వైశేషికుల నిరూపణమొకటిగలదు. ఈ లక్షణ మణువుల యందు పట్టదు. అణువులకు కారణమున్నటుల నిరూపించితిమి. ప్రత్యేకముగా కార్యమనిత్యమని నిషేధము లేకుండుట నిత్యత్వమని రెండవపక్షము చెప్పుచున్నారు. [ఇది అనిత్యము అని నిషేధింపబడని కార్యము నిత్యమని తాత్పర్యము. పరమాణువులు కార్యమైనను అనిత్యములని నిషేధింప బడకుండుటచే నిత్యములగుచున్నవి, పరమాణువుల నంతకంటె సూక్ష్మతరముగ విభాగించుటకు శక్యముకాదు గనుక నవి యనిత్యములుకావు. అనగా నిత్యములని వైశేషికుల వాదము] (2) అణువులకు రూపముండగా నీ నిత్యత్వ లక్షణము అణువులకు వర్తింపదు. ఈ లక్షణములచే పరమాణువులు నిత్యములని అవశ్యముగ సిద్ధమగుటలేదు. నిత్యమగు నేదోయొక వస్తువు లేనిచో నిత్యశబ్దమును (నఞ్ కానిది యను అర్థమునిచ్చు ప్రత్యయమును చేర్చి) అనిత్యమను నొక వ్యతిరేకసమాసమును కల్పింప శక్యముకాదు. అనిత్య శబ్దమునందలి నిత్యశబ్దముచే పరమాణువు మాత్రముబోధింప

పద్యతే. న పునః పరమాణునిత్యత్వమేవాపేక్ష్యతే. తచ్చాత్ర్యేవ నిత్యం పరమకారణం బ్రహ్మ. న చ శబ్దార్థవ్యవహారమాత్రేణ కస్యచిదర్థస్య ప్రసిద్ధిర్భవతి, ప్రమాణాంతరసిద్ధయోశ్శబ్దార్థయోర్వ్యవహారావతారాత్. యదపి నిత్యత్వే తృతీయం కారణముక్తం 'అవిద్యాచే' తి (వై. అ ౪. ఆ ౧. సూ ౫) తద్యద్యేవం వివ్రియేత సతాం పరిదృశ్యమానకార్యాణాం కారణానాం ప్రత్యక్షేణాగ్రహణమవిద్యేతి, తతో ద్వ్యణుకనిత్యతాప్యాపద్యేత. అథాద్రవ్యత్వే సతీతి విశేష్యేత. తథాప్యకారణవత్త్వమేవ నిత్యతానిమిత్తమాప

---

బడుచున్నది యన వీలులేదు. నిత్యము పరమకారణమునగునది బ్రహ్మము కలదు. ఒకశబ్దమొకయర్థమునందు వ్యవహరింపబడుచున్నంత మాత్రముచేత, నావస్తువు ప్రసిద్ధముగానేరదు. ప్రమాణాంతరముచేత నాశబ్దమున కట్టియర్థము సిద్ధమైనపుడే యాశబ్దార్థములు వ్యవహారప్రసిద్ధములగును. (3) పరమాణువుల నిత్యత్వమునకవిద్య మూడవకారణముగ వైశేషికులు చెప్పుచున్నారు. స్థూలముగ కాన్పించుచున్న కార్యములకు కారణములను ప్రత్యక్షముగ గ్రహింపలేకపోవుటయే అవిద్యయని వారి అవిద్యాసూత్రమునకు వివరణమును వ్రాసినచో [అనగా కారణము ప్రత్యక్షము కాకుండుటయే నిత్యత్వమునకు కారణమనినచో ద్వ్యణుకములుగూడ ప్రత్యక్షములు కాకుండుటవలన నిత్యములే కావలసివచ్చును. కాని వారి మతమునందు ద్వ్యణుకములు నిత్యములుకావు.] ఇట్టి యాపత్తును తప్పించుకొనుటకై (4) ఆరంభకద్రవ్యములేక ప్రత్యక్షమగు కారణము లేనిది నిత్యమని లక్షణము చెప్పి

ద్యేత, తస్య చ ప్రాగేవోక్తత్వాత్ 'అవిద్యాచే'తి పునరుక్తం స్యాత్, అథాపి కారణవిభాగాత్కారణవినాశాచ్చాన్యస్య తృతీయస్య వినాశహేతోరసంభవోఽవిద్యా సా పరమాణూనాం నిత్యత్వం ఖ్యాపయతీతి వ్యాఖ్యాయేత, నావశ్యం వినశ్యద్వస్తు ద్వాభ్యామేవ హేతుభ్యాం వినష్టుమర్హతీతి నియమోఽస్తి, సంయోగసచివే హ్యనేకస్మింశ్చ ద్రవ్యే ద్రవ్యాంతరస్యారంభకేఽభ్యుపగమ్యమానే

---

నను, కారణద్రివ్యము లేమియే నిత్యత్వకారణమని ఫలితము తేలుచున్నది. ఈ లక్షణము సదకారణ వన్నిత్యమ్' అను వైశేషిక సూత్రమునం దుదాహరింపబడుటవలన తిరిగి 'అవిద్యాచ' యను సూత్రిమునకు పునరుక్తి దోషము సంభవించును. (5) పోనీ! కారణద్రవ్యమును విభాగముచేయుట, కారణద్రివ్యనాశము, కార్యనాశమునుగూర్చి తృతీయ కారణము అసంభవముగుట- ఈ మూడు నవిద్యాలక్షణముల నియు అట్టి యవిద్యచే పరమాణువుల నిత్యత్వము సిద్ధమగు చున్నదనియు వైశేషికులు చెప్పుదురని యనుకొందుము. [తంతువుల విభాగముచేతగాని నాశనముచేతగాని పటనాశము కలుగుచున్నది. నిరవయవములగు నణువుల కవయవ నాశముగాని విభాగముగాని సంభవముకాదు గనుక నణువులు నిత్యమని తాత్పర్యము.] వస్తువు నాశమగునపుడీరెండు కారణములచేతనే నాశము కావలయునను నియమములేదు. అనేక ద్రవ్యములు సంయోగ సంబంధముచే మఱియొక ద్రవ్యము నుత్పన్నము చేయునని యంగీకరించినచో నిట్టినియమముండవచ్చును. కారణము స్వయముగా సామాన్యస్థితి

ఏతదేవం స్యాత్, యదా త్వపాస్తవిశేషం సామాన్యాత్మకం కారణం విశేషవదవస్థాంతరమాపద్యమానమారంభకమభ్యుపగమ్యతే తదా ఘృతకాఠిన్యవిలయనవన్మూర్త్యవస్థావిలయనేనాపి వినాశ ఉపపద్యతే, తస్మాద్రూపాదిమత్త్వాత్ స్యాదభిప్రేతవిపర్యయః పరమాణూనామ్, తస్మాదప్యనుపపన్నః పరమాణుకారణవాదః.

## ఉభయథా చ దోషాత్ (సూ. 16)

---

యందు నిర్విశేషముగానుండి విశేషాకారముగ పరిణామమును జెందినపుడు నూతన ద్రవ్యము నుత్పన్నము చేయునని అంగీకరించినచో గడ్డకట్టిన ఘృతము కఱగిపోయినటుల నూతనముగ నేర్పడిన వస్తువు స్థూలరూపము విలయముపొంది వస్తునాశము సంభవింపవచ్చును. [అవిద్యచే సంప్రాప్తమైన పరిణామరూపము లణువులు, ప్రలయ కారణములగు కాలాదులచే వాని పిండస్వరూపము తిరోభావమును బొందినపుడు కారణభావమును పొందును. ఇదియే వినాశశబ్దమునకర్థము.] రూపాదులు కలిగియుండుటచేత పరమాణువులకు వైశేషికులు తలంచిన దానికి భిన్నముగ వినాశము సంభవింపవచ్చును. కనుక పరమాణు కారణవాద ముపపన్నముకాదు. 15

ఉభయథా చ=పరమాణువులు సావయవములైనను, నిరవయవములైనను–ఉభయపక్షములయందు, కూడ దోషాత్ సావయవములైన, అనిత్యత్వాది దోషములు, నిరవయవములైన పరస్పరము సంయోగ మసంభవము– ఈదోషముల

గంధరసరూపస్పర్శగుణా స్థూలా పృథివీ, రూపరసస్పర్శ గుణా స్సూక్ష్మా ఆపః, రూపస్పర్శగుణం సూక్ష్మతరం తేజః, స్పర్శ గుణస్సూక్ష్మతమో వాయురిత్యేవమేతాని చత్వారి భూతాన్యుపచితా పచితగుణాని స్థూలసూక్ష్మసూక్ష్మతరసూక్ష్మతమతారతమ్యోపేతాని చ లోకే లక్ష్యంతే, తద్వత్పరమాణవోఽప్యుపచితాపచితగుణాః, కల్ప్యేరన్న వా. ఉభయథాపి చ దోషానుషంగోఽపరిహార్య ఏవ

---

ద్వ్యణుకాది ప్రపంచోత్పత్తి సంభవము కాకుండుట చేతను వీరి మత మసంగతము.

పృథివి గంధ రస రూప స్పర్శగుణములు కలది; జల ములు పృథివికంటె సూక్ష్మములు, రూపరస స్పర్శగుణములు కలవి. అంతకంటె సూక్ష్మతరము తేజస్సు: రూపస్పర్శగుణ ములు కలది; వాయువు సూక్ష్మతమము. స్పర్శగుణము మాత్రము కలది. ఈవిధముగ నీ నాలుగు భూతము లొకదాని కంటె మరియొకటి తక్కువ తక్కువ గుణములు పరిమాణ ములు కలిగియున్నటుల లోకమునందు కాన్పించుచున్నది. ఆవిధముగనే నీ వివిధభూత పరమాణువులకుకూడ గుణముల హెచ్చుతగ్గులు కల్పింప వలయునా? లేదా? ఏ పక్షము నయినను దోషప్రసక్తి అనివార్య మగుచున్నది. భూతపర మాణువునందు పూర్వభూత పరమాణువుకంటె క్రమముగ గుణములు తక్కువగ నుండుటవలన నెక్కుడు గుణము లున్నదానికి యెక్కుడు స్థౌల్యము, తక్కువ గుణములు గల భూతమునకు తక్కువ స్థౌల్యము- ఈవిధముగ మూర్తికి

స్యాత్. కల్ప్యమానే తావదుపచితాపచితగుణత్వే ఉపచితగుణానాం మూర్త్యుపచయాదపరమాణుత్వప్రసంగః. నచాంతరేణాపి మూర్త్యుపచయం గుణోపచయోభవతీత్యుచ్యేత. కార్యేషు భూతేషు గుణోపచయే మూర్త్యుపచయదర్శనాత్. అకల్ప్యమానే తూపచితాపచితగుణత్వే పరమాణుత్వసామ్యసిద్ధయే యది తావత్సర్వే ఏకైకగుణా ఏవ కల్ప్యేరన్ తత స్తైజసిస్పర్శస్యోపలబ్ధిర్నస్యాత్, అప్సు రూపస్పర్శయోః, పృథివ్యాం చ రసరూపస్పర్శానాం, కారణగుణపూర్వకత్వాత్కార్యగుణానామ్, అథసర్వే చతుర్గుణా ఏవ కల్ప్యేరన్ తతోఽప్స్వపి గంధస్యోపలబ్ధిస్స్యాత్తైజసి గంధరసయోర్వాయౌ

---

ఉపచయము అపచయము సంభవించుచున్నది. అందువలన నవి పరమాణువులు కాకపోవుచున్నవి (2) స్థౌల్యమెక్కువ కాకుండ గుణము లెక్కువ కావచ్చునన వీలులేదు. గుణము లెక్కువ అయినపుడు స్థౌల్యముగూడ నెక్కువయగుట భూతకార్యములయందు కాన్పించుచున్నది. (3) పరమాణువులన్నియు సమానములగుటకు వానియందు గుణముల హెచ్చుతగ్గులను కల్పింపకుందుమా? అపుడు వివిధ భూతపరమాణువుల కొక్క గుణము నే కల్పింపవలయునా? లేక చతుర్గుణముల కల్పింపవలయునా? ఒక గుణము నే కల్పించిన తేజస్సునందు స్పర్శగుణ ముండదు. జలములయందు రూపస్పర్శ లుండవు: పృథివియందు రసరూపస్పర్శ లుండవు. కారణగుణములు కార్యమునందు సంక్రమించును (4) ప్రతి భూత పరమాణువునందును చతుర్గుణముల కల్పించెదమనిన, జలమునందు గూడ గంధముండ వలయును, తేజస్సునందు

చ గంధరూపరసానామ్, న చైవం దృశ్యతే, తస్మాదప్యనుప పన్నః పరమాణు కారణవాదః.

## అపరిగ్రహాచ్చాత్యంతమనపేక్షా (సూ. 17)

ప్రధానకారణవాదో వేదవిద్భిరపి కైశ్చిన్మన్వాదిభిస్సత్కార్య త్వాద్యంశోపజీవనాభిప్రాయేణోపనిబద్ధః, అయం తు పరమాణు కారణవాదో న కైశ్చిదపి శిష్టైః కేనచిదప్యంశేన పరిగృహీత ఇత్యత్యంతమేవానాదరణీయో వేదవాదిభిః.

---

గంధరసము లుండవలయును; వాయువునందు గంధరూప రసము లుండవలయును. కాని లోకమునం దిటుల కాన్పించుట లేదు. అందువలన గూడ పరమాణు కారణత్వ మను పపన్నమగును. 16

అపరిగ్రహాత్ చ=పరమాణు వాదము శిష్టులగువారిచే పరిగ్రహింపబడ కుండుటవలన గూడ దానియందు అత్యంతం= సంపూర్ణముగ అనపేక్షా = అపేక్షితగదు.

సత్కార్యవాదమున కుపజీవిగా నున్నదను అభిప్రాయము చేత ప్రధానకారణ వాదము మనువు మొదలగు కొంత మంది వేదవిదులచే ఆలోచింప బడినది. ఈ పరమాణు కారణ వాదమన్ననో యేవిషయమందును శిష్టులచే పరిగ్రహింప బడలేదు. ఈ కారణముచేత వేదప్రామాణికుల కత్యంత మనాదరణీయ మగుచున్నది.

అపిచ వైశేషికాస్తంత్రార్థభూతాన్ షట్పదార్థాన్ ద్రవ్య గుణకర్మసామాన్యవిశేషసమవాయాఖ్యానత్యంతభిన్నాన్ భిన్న లక్షణానభ్యుపగచ్ఛంతి, యథా మనుష్యోఽశ్వశ్శశ ఇతి. తథాత్వం చాభ్యుపగమ్య తద్విరుద్ధం ద్రవ్యాధీనత్వం శేషాణామభ్యుప గచ్ఛంతి ధర్మాంతరమ్, తన్నోపపద్యతే, కథమ్, యథాహి లోకేశశ కుశపలాశ ప్రభృతీనామత్యంతభిన్నానాం సతాం నేతరేతరాధీ నత్వం భవతి, ఏవం ద్రవ్యాదీనామప్యత్యంతభిన్నత్వాన్నైవ

---

మఱియు వారి దర్శనమునకు ప్రయోజన కారణము లుగ ద్రవ్య, గుణ, కర్మ, సామాన్యవిశేష సమవాయములను నారు పదార్థములు గలవనియు అవి మనుష్యుడు అశ్వము కుందేలువలెనే భిన్నభిన్న లక్షణములు గలవనియు కల్పించు చున్నారు. గుణాది కడపటి అయిదుపదార్థములు ద్రవ్యాధీన మనియు గూడ మొదటి కల్పనకు విరుద్ధముగ మరియొక కల్ప నము చేయుచున్నారు. (1)ఇట్టి కల్పనములుపపన్నములుగావు. [మనుష్యునికంటె నశ్వమత్యంతము భిన్నము. కనుక నది మను ష్యాధీనమనుట విరుద్ధము. అటులనే గుణాదులు ద్రవ్యముకంటె నత్యంతము భిన్నములు. అవి ద్రవ్యాధీనము లనుట విరుద్ధము] లోకమునందు శశకుశ పలాశాదు లత్యంతము భిన్నములు. వానిలో నొకటి మరియొకదాని యధీనమును బొందదు. ఆవిధ ముగ ద్రవ్యముకంటె నత్యంతము విరుద్ధములగు గుణాదులు ద్రవ్యాధీనము లనతగదు. (2) గుణాదులు ద్రవ్యాధీన ములని అనుకొందుము గాక! అందువలన ద్రవ్యమున్నపు డవియుండుట ద్రవ్యము లేనపుడవి లేకుండుటయు

ద్రవ్యాధీనత్వం గుణాదీనాం భవితుమర్హతి, అథ చ భవతి ద్రవ్యాధీనత్వం గుణాదీనామ్, తతో ద్రవ్యభావే భావాత్ ద్రవ్యాభావే చాభావాత్ ద్రవ్యమేవ సంస్థానాదిభేదాదనేకశబ్దప్రత్యయభాగ్భవతి. యథా దేవదత్త ఏకఏవ సన్నవస్థాంతరయోగాదనేకశబ్దప్రత్యయభాగ్భవతి తద్వత్. తథా సతి సాంఖ్యసిద్ధాంతప్రసంగస్స్వసిద్ధాంతవిరోధశ్చాపద్యేయాతామ్.

పూ. పక్షీ : నన్వగ్నేరన్యస్యాపి సతో ధూమస్యాగ్న్యధీనత్వం దృశ్యతే.

సిద్ధాంతీ : సత్యం దృశ్యతే, భేదప్రతీతేస్తు తత్రాగ్నిధూ

---

సంభవించును. [కనుక గుణాదులు ద్రవ్యముకంటె భిన్నములు కావు. భిన్నములయినచో ద్రవ్యాధీనములు కానేరవు.] (3) ద్రవ్యమొక్కటియే గలదు. ఆకారభేదము వలన అనేకభావములచేతను శబ్దములచేతను వ్యవహరింప బడుచున్నది. దేవదత్తుడొకడైనను అవస్థాభేదమును బట్టి అనేక భావములచేతను శబ్దములచేతను వాడబడుచున్నాడు. అటులనే యిచట గూడ తెలియనగును. [ఇట్లనుటచే ప్రధానమే వివిధాకారముల గాన్పించుచున్నది యను] సాంఖ్యసిద్ధాంతమును పరిగ్రహించుటయు వైశేషిక సిద్ధాంతమును పరిత్యజించుటయు సంభవించును.

పూ. క్షి. ధూమ మగ్నికంటె నన్యము. కాని అగ్నిఅధీనమగుట కాన్పించుచున్నది.

సిద్ధాంతి. నిజమే! ధూమ మగ్న్యధీనముగ కాన్పించుచున్నది. కాని ధూమ మగ్నికంటె భిన్నముగ కాన్పించుట

మయోరన్యత్వం నిశ్చీయతే, ఇహ తు శుక్లః కంబళో రోహిణీ ధేనుర్నీలముత్పలమితి ద్రవ్యస్యైవ తస్యతస్య తేన తేన విశేషేణ ప్రతీయమానత్వాన్నైవ ద్రవ్యగుణయోరగ్ని ధూమయోరివ భేద ప్రతీతిరస్తి, తస్మాద్ద్రవ్యాత్మకతా గుణస్య. ఏతేన కర్మసామాన్య విశేషసమవాయానాం ద్రవ్యాత్మకతా వ్యాఖ్యాతా.

పూ. పక్షీ: గుణాదీనాం ద్రవ్యాధీనత్వం ద్రవ్యగుణయోర యుతసిద్ధత్వాదితియద్యుచ్యేత.

---

వలన నారెండు భిన్నములని నిశ్చయించుచున్నాము. ద్రవ్యగు ణాదుల విషయమన్ననో శుక్ల కంబళము, ఎఱ్ఱనియావు, నల్లటి కలువ అని ఆయావిశేషణములచేత నే ద్రవ్యగుణములు కాన్పిం చుటచే నగ్నిధూమములకువలే భేదజ్ఞానము కలుగుటలేదు. కనుక గుణము ద్రవ్యస్వరూప మగుచున్నది. [4] ఇందుచేత నే కర్మ సామాన్య విశేషసమవాయములుగూడ ద్రవ్యస్వరూప ములే యగుచున్నవి యని వివరింపబడుచున్నవి.

పూ. క్షి. ద్రవ్యగుణములకు అయుతసిద్ధత్వ ముండుట వలన గుణములకు ద్రవ్యాధీనత్వము సంభవమగుచున్నది. [యయోర్ద్వయోర్మధ్యేఏకం అవినశ్యత్ అపరాశ్రితం ఏవా వతిష్ఠతే తౌ అయుతసిద్ధౌ యథావయవావయవినౌ-అని అయుత సిద్ధిలక్షణము. అవయవ మవయవిని ఆశ్రయించుకొని యెల్ల పుడు నచట నే యుండును. గుణము ద్రవ్యముకంటె భిన్నము. అయినను ద్రవ్యము నాధారము చేసికొనియే యుండును. ద్రవ్యములేక గుణముండ నేరదు.] ఈరెండు నయుత సిద్ధము లందురు.

సిద్ధాంతీ : తత్పునరయుతసిద్ధత్వమపృథగ్దేశత్వం వా స్యాద పృథక్కాలత్వం వా అపృథక్స్వభావత్వం వా. సర్వథాపి నోప పద్యతే. అపృథగ్దేశత్వే తావత్ స్వాభ్యుపగమో విరుధ్యేత, కథమ్, తంత్వారబ్ధో హి పటః తంతుదేశోఽభ్యుపగమ్యతే న తు పటదేశః, పటస్య తు గుణాః శుక్లత్వాదయః పటదేశా అభ్యుపగమ్యంతే న తంతుదేశాః తథా చాహుః 'ద్రవ్యాణి ద్రవ్యాంతరమారభంతే గుణాశ్చ గుణాంతర' మితి (వై. అ ౧. ఆ ౧. సూ ౧౦) తంతవో హి కారణద్రవ్యాణి కార్యద్రవ్యం పటమారభంతే, తంతుగతాశ్చ గుణాశ్శుక్లత్వాదయః కార్యద్రవ్యే పటే శుక్లత్వాదిగుణాంతరమార భంత ఇతి హి తేఽభ్యుపగచ్ఛంతి. సోఽభ్యుపగమో ద్రవ్యగుణ

---

సిద్ధాంతి : (5) మీరుపపాదించు అయుతసిద్ధి అభిన్న దేశమున అనగా నొకచోటనుండుటయా ? లేక నొకకాలమున నుండుటయా ? లేక నొకస్వభావమున నుండుటయా? వైశే షిక వాదమునం దీమూడును సంభవము కావు. ఏకదేశత్వ మందుమా ? వారిసిద్ధాంతమునకు విరుద్ధమగును ! అది యెట్ల నిన, తంతువులచే నారంభింపబడిన పటము తంతువులయం దుండునుగాని పటమునం దుండదు. పటముయొక్క శ్వేత త్వాదిగుణములు పటమునం దుండునుగాని తంతువులయం దుండవు. ద్రవ్యములు మఱియొక ద్రవ్యమును గుణములు మఱియొక గుణముల నారంభించునని వైశేషిక సూత్రము, కారణద్రవ్యములగు తంతువులు కార్యద్రవ్యమగు పటము నారంభించును. తంతువునందలి శ్వేతత్వాదిగుణములు కార్య ద్రవ్యపటమునందు శ్వేతత్వాదిగుణాంతరము నారంభించునని వైశేషికు లంగీకరించుచున్నారు. ద్రవ్యగుణముల కేకదేశ

యోరపృథగ్దేశత్వేఽభ్యుపగమ్యమానే బాధ్యేత. అథాపృథక్కాలత్వమయుతసిద్ధత్వముచ్యేత, సవ్యదక్షిణయోరపి గోవిషాణయోరయుతసిద్ధత్వం ప్రసజ్యేత. అపృథక్స్వభావత్వేత్వయుతసిద్ధత్వే న ద్రవ్యగుణయోరాత్మభేదస్సంభవతి, తస్యతాదాత్మ్యేనైవ ప్రతీయమానత్వాత్.

పూ. పక్షీ: యుతసిద్ధయోస్సంబధస్సంయోగోఽయుతసిద్ధయోస్తు సమవాయ ఇత్యయమభ్యుపగమో మృషైవతేషాం, ప్రాక్సిద్ధస్య కార్యాత్కారణస్యాయుతసిద్ధత్వానుపపత్తేః. అథాన్యతరాపేక్ష ఏవాయమభ్యుపగమస్స్యాదయుతసిద్ధస్య కార్యస్య కారణేన

---

త్వము నంగీకరించినపు డీయంగీకారము భాధితమగును, ఏకకాలత్వ మయుతసిద్ధి యందు రేని విభిన్నముగానున్న గోశృంగముల రెండింటికినిఅయుతసిద్ధి కలుగవలెను. స్వభావైక్యము అయుతసిద్ధి యయినచో ద్రవ్యగుణములకు భేదమే లేకపోవలయును. శుక్లాదిగుణము పటస్వరూపమును బొందియే కాన్పించుచున్నది.

(6) విభిన్నముగ నుండువాని సంబంధము సంయోగమనియు, విభిన్నముగలేక ప్రత్యేకించుటకు వీలు లేకుండునటుల కలిసియున్న సంబంధము సమవాయమనియు వైశేషికులుచేయు విచక్షణ నిష్ప్రయోజన మగుచున్నది. కారణము కార్యమునకు పూర్వమే సిద్ధమైయున్నది. కనుక వానికి ప్రత్యేకము ఉనికి సాధ్యముకాదన వీలులేదు. పైనిర్వచనము కార్యకారణములలో నేదోయొక దానిని గూర్చి మాత్రమే చెప్పబడినదనియు, ప్రత్యేక మునికిలేనికార్యముతో

స్సంబంధస్సమవాయ ఇతి. ఏవమపి ప్రాగసిద్ధస్యాలబ్ధాత్మకస్య కార్యస్యకారణేన సంబంధో నోపపద్యేత ద్వయాయత్తత్వాత్సంబంధస్య. సిద్ధం భూత్వా సంబధ్యత ఇతి చేత్, ప్రాక్కారణసంబంధాత్కార్యస్య సిద్ధావభ్యుపగమ్యమానాయామయుతసిద్ధ్యభావాత్కార్యకారణయోస్సంయోగవిభాగౌ న విద్యేతే ఇతీదముక్తం దురుక్తం స్యాత్. యథా చోత్పన్నమాత్రస్యాక్రియస్య కార్యద్రవ్యస్య విభుభిరాకాశాదిభిర్ద్రవ్యాంతరైస్సంబంధస్సంయోగ ఏవాభ్యుపగమ్యతే

---

కారణమునకుగల సంబంధము సమవాయసంబంధమని వైశేషికుడనినచో, అపుడుగూడ, సంబంధమునకవసరమగు కార్యకారణములలో కార్యము స్వరూపముదాల్చకపూర్వము కారణముతో సంబంధించియుండుట శక్యముకాదు. కార్యముత్పన్నమై కారణముతో సంబంధించునంటిరేని అదియు నుపయోగింపదు. కారణముతో సంబంధింపకపూర్వమే కార్యముత్పన్నమైనచో దానికి అయుతసిద్ధి సంభవముకాదు కనుక కార్యకారణములకు సంయోగవిభాగములు కలుగనేరవు అను వాదము దుర్వాదమగును. [కారణముతో సంబంధింపకపూర్వము కార్యముండి, కొంతకాలముతరువాత నారెండును సంబద్ధములైనచో నాసంబంధము సంయోగసంబంధముగాని సమవాయ సంబంధముకాదు.] కార్యముత్పన్నమైనక్షణమున నిర్గుణమై చలనమేమియులేకనే ఆకాశాదిద్రవ్యాంతరములతో పొందు సంబంధము సంయోగసంబంధముగాని సమవాయ సం

న సమవాయః, ఏవం కారణద్రవ్యేణాపి సంబంధస్సంయోగ ఏవ స్యాత్ న సమవాయః.

సిద్ధాంతీ : నాపి సంయోగస్య సమవాయస్య వా సంబంధస్య సంబంధివ్యతిరేకేణా_స్తిత్వే కించిత్ప్రమాణమ_స్తి. సంబంధి శబ్దప్రత్యయవ్యతిరేకేణ సంయోగ సమవాయశబ్దప్రత్యయదర్శనా_త్తయోర_స్తిత్వమితి చేన్న, ఏకత్వేఽపి స్వరూపబాహ్యరూపాపేక్షయాఽనేకశబ్దప్రత్యయదర్శనాత్. యథైకోఽపి సన్ దేవదత్తో లోకే స్వరూపం సంబంధిరూపం చాపేక్ష్యానేకశబ్దప్రత్యయభాగ్భవతి మనుష్యో బ్రాహ్మణః శ్రోత్రియో వదాన్యో బాలో యువా స్థవిరః

---

బంధముగాదని తలంచినట్లే కారణద్రవ్యముతో కార్యద్రవ్యమునకు కలుగు సంబంధము సంయోగసంబంధముగాని సమవాయ సంబంధముకాదు

(7) మఱియు సంయోగ సంబంధముగాని సమవాయ సంబంధము గాని సంబద్ధములగు వానికంటె వ్యతిరిక్తముగ నుండు ననుటకు ప్రమాణములేదు. సంబద్ధములగు ద్రవ్యముల శబ్దములకంటెను వానిభావముల కంటెను భిన్నముగ సంయోగ సమవాయశబ్దములు ప్రత్యయములు కాన్పించుచున్నవి గనుక నవి ప్రత్యేకముగ నుండగలవని యంటివేని అదియును సరికాదు. ఒకేవస్తువ తనస్వరూపమునకు బాహ్యములగు రూపములనుబట్టి అనేక శబ్దములకు ప్రత్యయములకును గుఱియగుట కాన్పించుచున్నది. దేవదత్తుడొకడైనను తనకు సంబంధించిన రూపమునుబట్టి అనేక శబ్దప్రత్యయములకు గురియగుచున్నాడు. అతడొక్కడే బ్రాహ్మణుడు, క్షత్రియుడు,

పితా పుత్రః పౌత్రో భ్రాతా జామాతేతి. యథా చైకాపి సతీ రేఖా స్థానాన్యత్వేన నివిశమానా ఏకదశశతసహస్రాదిశబ్దప్రత్యయభేద మనుభవతి, తథా సంబంధినోరేవ సంబంధిశబ్దప్రత్యయవ్యతిరేకేణ సంయోగ సమవాయశబ్దప్రత్యయార్హత్వం న వ్యతిరిక్తవస్త్వస్తిత్వేన, ఇత్యుపలబ్ధిలక్షణ ప్రాప్తస్యానుపలబ్ధేరభావో వస్త్వంతరస్య. నాపి సంబంధివిషయత్వే సంబంధశబ్దప్రత్యయయోః సంతతభావప్రసంగః, స్వరూపబాహ్య రూపాపేక్షయేత్యుక్తోత్తరత్వాత్.

---

వదాన్యుడు, బాలుడు, యువకుడు, ముదుసలి, తండ్రి, కొమారుడు, పౌత్రుడు, సోదరుడు, అల్లుడు మొదలగు ననేకశబ్దములకును జ్ఞానములకును విషయమగుచున్నాడు. ఒకటియే అంకె వివిధస్థానముల పొంది, ఏక, దశ, సహస్రాది విభిన్నశబ్దములకును జ్ఞానమునకును కారణమగుచున్నది. ఆవిధముగనే సంబద్ధములగు రెండువస్తువులు సంబద్ధములగు శబ్దజ్ఞానములకు విషయమగుటయె గాక సంయోగసమవాయ శబ్ద ప్రత్యయములకు వ్యవహారార్హములగుచున్నవి. వానికంటెభిన్నమగు మఱియొక వస్తువులేదు. విషయమిటులుండ సంయోగాదులు విలక్షణములగు శబ్ద ప్రత్యయములచేత తెలియబడుటవలన ఉపలబ్ధియే వానియునికిని తెలియచేయుచున్నది. అట్టి సంయోగాది వస్త్వంతరములు వానిచే సంబంధములైనవానికంటె వ్యతిరేకముగ దొరుకుటలేదుగనుక నవి లేవని నిశ్చయింపబడుచున్నది. మఱియు సంబంధమును తెలియచేయుశబ్దము ప్రత్యయముగూడ సంబంధినిగూర్చినవగుటచేత సంబంధమెల్లప్పుడునున్నదియనవీలులేదు. [అనగా సంబద్ధములు సతతముండుటచే

తథాఽణ్వాత్మమనసామప్రదేశత్వాన్న సంయోగస్సంభవతి, ప్రదేశవతో ద్రవ్యస్య ప్రదేశవతా ద్రవ్యాంతరేణ సంయోగదర్శనాత్. కల్పితాః ప్రదేశా అణ్వాత్మమనసాం భవిష్యంతీతి చేన్న, అవిద్యమానార్థకల్పనాయాం సర్వార్థసిద్ధి ప్రసంగాత్, ఇయానేవా విద్యమానో విరుద్ధోఽవిరుద్ధో వాఽర్థః కల్పనీయో నాతోఽధిక

---

సంబంధముగూడ సతతముండునని చెప్పవీలులేదు.] తనకు బాహ్యాములగు రూపములబట్టి యొకవస్తువే అనేక శబ్దముల చేతను జ్ఞానములచేతను తెలియనగునని యిదివరకే తెలియ చేయబడినది.

అ॥ పై శాస్త్రార్థముచే నణువుల కన్యోన్యము సంయోగ సంబంధము సాధ్యముకాదని సిద్ధముచేయ బడినది. ఆత్మాణు సంయోగముచే నణువులయందు చలనకార్యము బుట్టదనియు, ఆత్మమనః సంయోగము జ్ఞానహేతువుకాదనియు తరువాతగ్రంథమున చూపబడుచున్నది.

(8) ప్రదేశమనగా నవయవములు లేకుండుటవలన ఆత్మ, మనస్సు, అణువులకు సంయోగము సంభవముకాదు. అవయవములు గల ద్రవ్యముతో నవయవములుగల మఱియొక ద్రవ్యమునకు సంయోగము కాన్పించుచున్నది. వానికి అవయవములున్నట్లూహింతుమంటి రేని లేనివస్తువున్నట్లూహించిన సర్వార్థములు నూహచే సిద్ధింపగలవు. సహేతుకములైనను కాకపోయినను లేనట్టి కొన్నివస్తువులను మాత్రమే యూహింపవలెను అంతకంటె నెక్కువ నూహింప

ఇతి నియమే హేత్వభావాత్, కల్పనాయాశ్చ స్వాయత్తత్వాత్, ప్రభూతతత్వసంభవాచ్చ. న చ వైశేషికైః కల్పితేభ్యః షడ్భ్యః పదార్థేభ్యోఽన్యేఽధికాః శతం సహస్రం వార్థా న కల్పయితవ్యా ఇతి నివారకో హేతురస్తి, తస్మాద్యస్మై యస్మై యద్యద్రోచతే తత్తత్సిద్ధ్యేత్, కశ్చిత్ కృపాళుః ప్రాణినాం దుఃఖబహుళస్సంసార ఏవ మాభూదితి కల్పయేత్, అన్యో వా వ్యసనీ ముక్తానామపి పునరుత్పత్తిం కల్పయేత్, కస్తయోర్నివారకస్స్యాత్.

కించాన్యద్ద్వాభ్యాం పరమాణుభ్యాం నిరవయవాభ్యాం సావయవస్య ద్వ్యణుకస్యాకాశేనేవ సంశ్లేషానుపపత్తిః, న హ్యాకాశస్య పృథివ్యాదీనాం చ జతుకాష్ఠవత్ సంశ్లేషోఽస్తి, కార్యకారణద్రవ్య

---

రాదను నియమమేమియు కానరాదు. కల్పనము స్వాధీనము నందున్నది. ఎంతదూరమైనను ఊహచేయతగును. వైశేషికు లచేకల్పింపబడిన షట్పదార్థములుతోపాటు మఱికొన్ని వందలు వేలు అర్థముల కల్పించుటకడ్డమువచ్చుకారణ మేమియు లేదు. ఎవరికి దేనియం దభిరుచియో దానినాతడు కల్పించును. దయాళువగు నొకడు దుఃఖము మెండుగా గల నీసంసారము ప్రాణికోటికి ఉండకూడదని కల్పించును. ఈర్ష్యావంతుడగు మఱియొకడు ముక్తులగువారికి తిరిగి జన్మనుకల్పించును. వీనినడ్డగించువా డెవడుగలడు?

మఱియొక విషయము! (9) అవయవ సహితమగు ద్వ్యణుకమునకు అవయవవిహీనములగు రెండు పరమాణువులతో సంగ్రహము సంభవముకాదు. కాష్టమునకు దానిపై

యోరాశ్రితాశ్రయభావోఽన్యథా నోపపద్యత ఇత్యవశ్యం కల్ప్యః సమవాయ ఇతి చేన్న, ఇతరేతరాశ్రయత్వాత్.

పూ. పక్షీ: కార్యకారణయోర్హి భేదసిద్ధావాశ్రితాశ్రయభావసిద్ధిరాశ్రితాశ్రయభావసిద్ధౌ చ తయోర్భేదసిద్ధిః కుండబదరవదితీతరేతరాశ్రయతా స్యాత్.

సిద్ధాంతీ: న హి కార్యకారణయోర్భేద ఆశ్రితాశ్రయభావో వా వేదాంతవాదిభిరభ్యుపగమ్యతే, కారణస్యైవ సంస్థానమాత్రం కార్యమిత్యభ్యుపగమాత్.

---

పూసిన మెరుగుద్రవ్యమునకు నున్నట్లు ఆకాశమునకును పృథివ్యాదులకును గాఢమగు సంయోగ ముండ నేరదు.

పూ. పక్షి: [కార్యద్రవ్యము కారణము నాశ్రయించి యున్నది] కార్యకారణ ద్రవ్యములు కిట్టి ఆశ్రిత ఆశ్రయ భావము మరియొక విధముగ సంభవింపదు గనుక సమవాయ సంబంధమును కల్పించుట అవసరమగుచున్నది అని అంటిరేని!

సిద్ధాంతి: ఇది సరికాదు. (10) ఆ పక్షమున ఇతరేతరాశ్రయదోషము సంభవించును. కార్యకారణములకు భేదము సిద్ధమైనపుడే వానికి ఆశ్రితాశ్రయ భావము సిద్ధమగును: ఆశ్రితాశ్రయభావము సిద్ధమైనపుడే భేదభావముసిద్ధమగును. ఇట్లన్యోన్యాశ్రయదోషము సంభవించును. కార్యకారణములకు భేదముగాని ఆశ్రితాశ్రయ భావమునుగాని వేదాంతవాదులంగీకరింపరు. కారణముయొక్క స్థితివిశేషము కార్యమని వారి మతము.

కించాన్యత్. పరమాణూనాం పరిచ్ఛిన్నత్వాత్ యావత్యో దిశః షడష్టౌ దశ వా తావద్భిరవయవైస్సావయవా స్తే స్యుః. సావయవత్వాదనిత్యాశ్చేతి నిత్యత్వనిరవయవత్వాభ్యుపగమో బాధ్యేత. యాంస్త్వం దిగ్భేదభేదినోఽవయవాన్ కల్పయసి త ఏవ మమ పరమాణవ ఇతి చేన్న, స్థూలసూక్ష్మతారతమ్యక్రమేణా పరమకారణాద్వినాశోపపత్తేః. యథా పృథివీ ద్వ్యణుకాద్యపేక్షయా స్థూలతమా వస్తుభూతాపి వినశ్యతి తతస్సూక్ష్మం సూక్ష్మతరం చ పృథివ్యేక జాతీయకం వినశ్యతి, తతో ద్వ్యణుకం, తథా

---

ఇంకొక విషయము ! (11) పరమాణువుల పరిమాణము పరిమితము. దిక్కులెన్నివున్నవో అన్ని ముఖములు వానికి యుండవలెను. ఆ దిక్కులు ఆరు, యెనిమిది, లేక పది కావచ్చును. కనుక నవి సావయవము లగుచున్నవి. సావయవములు గనుక అనిత్యములుకావలెను. ఈపక్షమున అవి నిత్యములు నిరవయవములు అనువాదమునకును భంగముకలుగును. ఏ పరమాణు అవయవములు దిశలభేదమునకు వ్యవస్థను కల్పించుచున్నవో అవియె మా పరమాణువు అని అంటిరేని మేమంగీకరింపము. స్థూలసూక్ష్మ తారతమ్య భేదమువలన పరమకారణమువరకు వస్తువిభాగము అనగా వస్తునాశము సంభవమగును. పృథివి ద్వ్యణుకాదులనుబట్టి స్థూలమగు వస్తువయినను నశించుచున్నది. అంతకంటె సూక్ష్మము సూక్ష్మతరమునగు పృథివీజాతికి చెందినవి అన్నియు నశించును. ద్వ్యణుకమునశించును. అటులనే పరమాణువుగూడ నశించును. ఇవియన్నియు పృథివీజాతికిచెందియుండుటయె వానినాశ కార

పరమాణవోఽపి పృథివ్యేకజాతీయకత్వాద్వినశ్యేయుః. వినశ్యంతోఽప్యవయవవిభాగేనైవ వినశ్యంతీతి చేత్, నాయం దోషః, యతో ఘృతకాఠిన్యవిలయనవదపి వినాశోపపత్తిమవోచామ. యథా హి ఘృతసువర్ణాదీనామవిభజ్యమానావయవానామప్యగ్నిసంయోగాద్ద్రవభావాపత్త్యా కాఠిన్యవినాశో భవతి, ఏవం పరమాణూనామపి పరమకారణభావాపత్త్యా మూర్త్యాదివినాశో భవిష్యతి, తథా కార్యారంభోఽపి నావయవసంయోగేనైవ కేవలేన భవతి, క్షీరజలాదీనామంతరేణాప్యవయవసంయోగాంతరం దధి హిమాది కార్యారంభదర్శనాత్.

తదేవమసారతరతర్కసందృబ్ధత్వాదీశ్వరకారణ శ్రుతివిరు

---

ణము. వినాశమును చెందునపుడుగూడ నవయవ విభాగము చేతనే నశించునంటిరేని యిదియొక దోషముకాదు. ఘృతము కఱగినపుడు దాని కాఠిన్యమునశించినట్లే వినాశము సంభవింపవచ్చునని చెప్పియుంటిమి. ఘృతసువర్ణాదులు అవయవ విభాగములేకనే అగ్నిసంయోగముచే ద్రవభావమునుబొంది కాఠిన్యము నశించుచున్నది. ఆవిధముగనే పరమాణువులకు గూడ పరమకారణభావమునుపొంది వానిమూర్తి నాశము సంభవము కాగలదు. ఆవిధముగనే కార్యారంభముగూడ కేవల అవయవసంయోగముచే కలుగదు. క్షీరము జలము మఱియొక అవయవసంయోగము లేకనే దధిహిమకార్యముల నారంభించుట కాన్పించుచున్నది.

ఈ విధముగ నెంతమాత్రము సారములేక కేవల యుక్తివాదముతో సంకులమగుటవలనను ఈశ్వరుడు జగ

ద్ధత్వాచ్ఛ్రుతిప్రవణైశ్చ శిష్టైర్మన్వాదిభిరపరిగృహీతత్వాదత్యంతమే వానపేక్షోఽస్మిన్ పరమాణుకారణవాదే కార్యా శ్రేయోఽర్థిభిరితి వాక్యశేషః.

---

త్కారణమని బోధించు శ్రుతులకు విరుద్ధమగుటచేతను, శ్రుతులయందు సమర్థులు శిష్టులునగు మన్వాదులు పరిగ్రహింపకుండుటచేతను, శ్రేయస్సును కోరువారీపరమాణు కారణవాదము నత్యంతము నుపేక్ష చేయవలయునని సూత్ర వాక్యశేషము.

<u>అధికరణ సంక్షేప్తార్థము</u> : ద్రవ్యము నెంతమాత్రము విభజించుటకు చేతగాని ద్రవ్యస్థితి పరమాణువు. వాయువు తేజస్సు జలము పృథివి-వీని పరమాణువులు వానివాని స్వీయగుణములతోనున్న స్థితి ప్రథమావస్థ. ద్రవ్యము పరమాణువులుగ విభాగమగుటయే లయము. పరమాణువులు సృష్టికాలము నం దదృష్టమై పరమాణువుల నాశ్రయించియున్న యొకచలన కర్మచే సంయోగమును చెంది ద్వ్యణుకాదు లేర్పడుచున్నవి. పరమాణువుల రూపాదులు కార్యములగు ద్వ్యణుకాదులయందు గూడ సంక్రమించును. ఇది కణాదవాదము. పరమాణుసంయోగమున కొకకర్మ ఆకర్మచేయువాడు అవసరము. లేక ప్రయత్నమో తాకిడియో యవసరము. ఇది శరీరసాధ్యము. ప్రలయమునందు శరీరము లేదు. అదృష్టము కార్యోత్పాదనము చేయలేదు. అది అచేతనము. అదృష్టముతో నిమిడియున్న ఆత్మ సంయోగము చేయలేదు. అట్లయినచో సృష్టి యెల్లప్పుడు నుండవలెను. పరమాణువునకు అవయవములు లేవు

గనుక సంయోగము కుదరదు. కనుక ద్వ్యణుకాదు లుత్పన్న ములు కానేరవు, కనుక పరమాణువు జగత్కారణము కానేరదు.

అణువులకును ద్వ్యణుకమునకు గల సమవాయి సంబంధము వానికంటె భిన్నముగనుక వానితో సంబంధించు టకు మరియొక సమవాయి సంబంధ మవసరమగును. ఇట్లన వస్థ యేర్పడును. అణువులు ప్రవృత్తి స్వభావములైన ప్రల యము లేకపోవుటయు, ఉదాసీన స్వభావములైన నిమిత్త కారణముయొక్క సాన్నిధ్యా సాన్నిధ్యములచే ప్రవృత్తి నివృత్తుల ఉనికిలేములుకలుగును. పరమాణువులు రూపాదులు గలిగియుండుటవలన అణుత్వ నిత్యత్వ విపర్యాసాది దోష ములు సంభవించును, పరమాణువులు రూపవంతములగుటచే నిత్యములుకావు. నిత్యత్వలక్షణము వానికి పట్టదు. కార్యకార ణముల ప్రత్యక్షము గ్రహింపలేకుండుట అవిద్య. పరమాణు నిత్యత్వమునకు కారణమనినచో ద్వ్యణుకములు ప్రత్యక్ష ములుకావు కనుక నవిగూడ నిత్యములు కావలయును. వస్తు నాశము లేక రూపనాశము సంభవించును, నాశమనేక విధ ముల యేర్పడవచ్చును. పరమాణువులు సావయవములయి నను నిరవయవములయినను నిత్యములుకావు. ఉపచయాప చయదోషము సంభవించును. పరమాణవాదమును శిష్టులు గ్రహించలేదు. ద్రవ్యాదియారు పదార్థముల కల్పనముప పన్నముకాదు. అవి ద్రవ్యముకంటె భిన్నములై ద్రవ్యాధీన ములు కానేరవు. వానికి ద్రవ్యాధీనత్వముగూడ సమంజసము

## (4) సముదాయాధికరణమ్ (సూ. 18–27)

# సముదాయ ఉభయహేతుకేఽపి తదప్రాప్తిః
(సూ. 18)

కాదు. ద్రవ్య మొకటియే వివిధాకారముల బొందుచున్నదను టచే స్వసిద్ధాంతపరిత్యాగము సంభవించును. అయుతసిద్ధి వైశేషిక సిద్ధాంతమున సంభవముకాదు. కార్యకారణముల కయుతసిద్ధిగాని యుతసిద్ధిగాని, సంభవముకాదు. సంయోగ సమవాయి సంబంధములు సంబద్ధములగు వానికంటె వ్యతిరిక్త ము కావు. ఆత్మ అణువుమనస్సులకు సంయోగము సంభవము కాదు. పరమాణువు లనిత్యములు. 17

## (4) సముదాయాధికరణము

---

అ॥ పూర్వాధికరణమున అర్ధవైనాశిక వైశేషికమత ములు నిరసింపపడినవి. నాల్గవ అధికరణమున పూర్ణవైనా శిక మతనిరాకరణ చేయబడుచున్నవి.

విషయము : పూర్ణవైనాశిక మతము.

విశయము : ఈమతము ప్రమాణసిద్ధమా లేక భ్రాంతి మాత్రమా

పూర్వపక్షము : ప్రమాణసిద్ధము.

సిద్ధాంతి : భ్రాంతి మూలకము.

ఉభయ హేతుకే = భూతభౌతిక రూపమగు సము దాయే అపి = పరమాణుసముదాయము నంగీకరించినను తత్ అప్రాప్తిః = ఆసముదాయము అనుపపన్నమగుచున్నది.

వైశేషికరాద్ధాంతో దుర్యుక్తియోగాద్వేదవిరోధాచ్ఛిష్టాపరిగ్రహాచ్చ నాపేక్షితవ్య ఇత్యుక్తమ్, సోఽర్ధవైనాశిక ఇతి వైనాశికత్వసామ్యాత్ సర్వవైనాశికరాద్ధాంతో నతరామపేక్షితవ్య ఇతీదమిదానీముపపాదయామః.

స చ బహుప్రకారః ప్రతిపత్తిభేదాద్వినేయభేదాద్వా.

---

అ॥ యుక్తిసహము కాకపోవుటచేతను. వేదమునకు విరుద్ధ మగుటచేతను శిష్టులకు పరిగ్రాహ్యము కాకపోవుట చేతను వైశేషిక రాద్ధాంతము కోరతగినది కాదని వక్కాణింప బడినది. కార్యకారణములలో కార్యనాశనము నంగీకరించుటవలన వీరు అర్ధవైనాశికు లగుచున్నారు. వినాశసామ్యముచే సర్వవైనాశికమతము గూడ నెంతమాత్ర మపేక్షితము గాదను విషయము నిపుడుపపాదించుచున్నారు.

అధికరణ విషయము.

దర్శనకారుడగు బుద్ధుని అభిప్రాయ భేదమును బట్టిగాని ఆ తత్త్వమును గ్రహించు [మందమధ్యమోత్తమాది] శిష్యులయొక్క అర్ధగ్రహణ శక్తి భేదమును బట్టిగాని బుద్ధదర్శనము బహుప్రకారము లగుచున్నది. ఇచట ముఖ్యముగ మూడు విధములగు వాదులుగలరు. కొంతమంది సర్వాస్తిత్వవాదులు. [సర్వము సత్యమని వీరి వాదము] కొంతమంది విజ్ఞానముమాత్రము నిజమందురు. వీరు విజ్ఞానవాదులు. మఱికొందరు సర్వము శూన్యమనుచున్నారు. వీరు శూన్యవాదులు [సర్వాస్తిత్వవాదులు

బౌద్ధమతము త్రివిధము.

తత్రైతేత్రయో వాదినో భవంతి, కేచిత్సర్వాస్తిత్వవాదినః, కేచిద్వి జ్ఞానాస్తిత్వమాత్రవాదినః, అన్యే పునస్సర్వశూన్యత్వవాదిన ఇతి.

తత్ర యే సర్వాస్తిత్వవాదినో బాహ్యమాభ్యంతరం చ వస్త్వభ్యుపగచ్ఛంతి భూతం భౌతికం చిత్తం చైత్తంచ, తాంస్తావత్ ప్రతిబ్రూమః. తత్ర భూతం పృథివీత్వాదయః భౌతికం రూపాదయశ్చక్షురాదయశ్చ. చతుష్టయే చ పృథివ్యాది పరమాణవః స్వరస్నేహోష్ణేరణ స్వభావాస్తే పృథివ్యాదిభావేన సంహ

---

సూత్రాంతికులు వైభాషికులు అని రెండు తెఱంగులు. విజ్ఞానవాదులను యోగకారు లనియు, శూన్యవాదులను మాధ్యమికులనియు గూడ చెప్పుదురు.] మున్ముందు సర్వాస్తిత్వవాదమునకు ప్రతివచనము చెప్పుదుముగాక.

సర్వాస్తిత్వవాదు లిట్లనుచున్నారు. బాహ్యము ఆంతరము నగునది అంతయుసత్యము. భూతము, భూతసంబంధమగునది భౌతికము—ఇవి బాహ్యములు. చిత్తము చిత్తసంబంధమగునది చైత్తము—ఇవి అంతరంగికములు. పృథివి, జలము, తేజస్సు అగ్ని—ఇవి భూతములు-రూపరస గంధ స్పర్శశబ్దములు—వీనిని గ్రహించు చక్షుస్సు,జిహ్వా,ఘ్రాణము, త్వక్, శ్రోత్రిములు—ఇవి అన్నియు భౌతికములు.

సర్వాస్తిత్వవాద స్వరూపము.

పృథివ్యాది ప్రతిభూత పరమాణువులు పృథివ్యాదిభావముచేత సంహతము లగుచున్నవి. పృథివీపరమాణువులు కఠినముగను, జలపరమాణువులు పలచగును, తేజః పరమాణువులు ఉష్ణముగను, వాయుపరమాణు

న్యంత ఇతి మన్యంతే. తథా రూపవిజ్ఞానవేదనాసంజ్ఞాసంస్కార సంజ్ఞకాః పంచస్కంధాః, తేఽప్యధ్యాత్మం సర్వవ్యవహారాస్పద భావేన సంహన్యంత ఇతి మన్యంతే.

తత్రేదమభిధీయతే, యోఽయముభయహేతుక ఉభయ ప్రకారః సముదాయః పరేషామభిప్రేతోఽణుహేతుకశ్చ భూత భౌతికసంహతిరూపః స్కంధహేతుకశ్చ పంచస్కంధీరూపః, తస్మిన్నుభయహేతుకేఽపి సముదాయేఽభిప్రేయమాణే తదప్రాప్తి

---

వులు చలనముకలవిగను నుండును. విషయములు యింద్రియ ములు కలిసి రూపస్కంధములు, ఆహం ఆహం అను ఆలయ విజ్ఞానప్రవాహము విజ్ఞానస్కంధము, సుఖాద్యనుభవము వేదనాస్కంధము, గోవు అశ్వము మొదలగు నామములచే విషయములను గుర్తించుట సంజ్ఞాస్కంధము. రాగద్వేష మోహధర్మాధర్మములు సంస్కారస్కంధము. విజ్ఞానస్కం ధము చిత్తము లేక ఆత్మఅనియు మిగిలిన నాలుగుస్కంధ ములు చైత్తములనియు, వీని సంఘాతమే ఆధిభౌతికమనియు, వారి మతము—దీనిచే సకలలోకయాత్ర నిర్వహింపబడు చున్నది. అవయవములకంటె భిన్నముగ నవయవి దొఱకుట లేదు. కనుక నవయవములు మిగులుచున్నవి. విద్యమాన మగునది అంతయు క్షణికము—ఇది వీరిసిద్ధాంతము-

ఈసందర్భమున యిట్లు చెప్పుదుము. పరమాణువులు కారణముగాగల చిత్తచైత్తసంఘాతము, స్కంధపంచకము కారణముగాగల స్కంధసముదాయము – ఇట్లు విభిన్నకార ణములు 'గలిగి విభిన్న సముదాయములను చెందినటుల

స్స్యాత్, సముదాయాప్రాప్తిః సముదాయ భావానుపపత్తిరిత్యర్థః. కుతః, సముదాయినామచేతనత్వాత్ చిత్తాభిజ్వలనస్య చ సముదాయసిద్ధ్యధీనత్వాదన్యస్య చ కస్యచిచ్చేతనస్య భోక్తుః ప్రశాసితుర్వా స్థిరస్య సంహంతురనభ్యుపగమాత్, నిరపేక్షప్రవృత్త్యభ్యుపగమే చ ప్రవృత్త్యనుపరమప్రసంగాత్, ఆశయస్యాప్యన్యత్వానన్యత్వాభ్యామనిరూప్యత్వాత్ క్షణికత్వాభ్యుపగమాచ్చ నిర్వ్యాపా

---

స్కంధ పంచక మేర్పడుటకు కారణము లేదు.

బౌద్ధులచే కల్పింపబడిన నీ రెండును బౌద్ధవాదము చేతనే నిర్వహింప శక్యముకాదు. ఈ స్కంధము లేవిధమున సంభవించినవో వివరింప శక్యముకాదు. ఏలన ! ఈ సముదాయములలో చేరినవన్నియు నచేతనములు. సముదాయము సిద్ధించిన తరువాత ఆలయ విజ్ఞాన ముద్దీపించును. ఇట్టి సముదాయమును సమకూర్చగల భోక్తనుగాని శాసించునట్టి మఱియొక నిత్యచేతనమును గాని వీరంగీకరింపరు. పరమాణువులకు సముదాయ ప్రవృత్తి యితర కారణము లేకనే సంభవించు ననవీలులేదు. ఆపక్షమున వాని ప్రవృత్తికి ఉపరమము లేకపోవును. (అనగా నెప్పుడును ప్రవృత్తియే యుండును కనుక మోక్షమసంభవమగును. రాగాదుల కాటపట్టగుఆలయ విజ్ఞాన ప్రవాహము సముదాయ కారణము కానేరదు. అట్టి ప్రవాహము ప్రవాహమునందిమిడియున్న ప్రతివిజ్ఞానముకంటే భిన్నమయినను కావలెను. అభిన్నమయినను కావలెను భిన్నమైనచో నిత్యమైనను కావలెను. లేక అనిత్యమైనను కావలెను. నిత్యమైనచో వేదాంతులఆత్మయగును. క్షణికమని

రత్వాత్తత్ప్రవృత్త్యనుపపత్తేః. తస్మాత్ సముదాయానుపపత్తిః, సముదాయానుపపత్తౌ చ తదాశ్రయా లోకయాత్రా లుప్యేత.

## ఇతరేతర ప్రత్యయత్వాదితి చే న్నోత్పత్తిమాత్ర నిమిత్తత్వాత్ (సూ. 19)

బౌద్ధః: యద్యపి భోక్తా ప్రశాసితా వా కశ్చిచ్చేతనః సంహంతా స్థిరో నాభ్యుపగమ్యతే, తథాప్యవిద్యాదీనామితరేతరకార

---

యంగీకరింప బడుటచే నిర్వ్యాపారమగుట వలన పరమాణువుల ప్రవృత్తిహేతువుకాదు. [పరమాణువు లచేతనములు గనుక స్వయముగ స్కంధములుగ నేర్పడలేవు. సముదాయము నేర్పాటుచేయగల స్థిరమగు చేతనమును బౌద్ధులంగీకరింపరు. కనుక వారి మతము భ్రాంతిమూలకమని భావము.) 18

అ॥ సముదాయ మేలన కర్తయగు చేతనము లేకనే సంఘాత ముపన్నము కాగలదను ఆశంకను తరువాత సూత్రమున పరిహరించుచున్నారు.

మేలనకర్త లేకనే క్షణిక పరమాణువులు స్వయముగా ఇతర ఇతర ప్రత్యయత్వాత్ ఇతి = పరస్పరము సంమేలనము నొందుటకు మేలనకర్త అవసరము లేదంటిరేని న=అది సరి కాదు. ఏలనన! ఉత్పత్తిమాత్ర నిమిత్తత్వాత్=పూర్వపూర్వ పరమాణులు ఉత్తరోత్తర పరమాణువుల ఉత్పత్తికి మాత్రము కారణమగుట వలన!

భౌద్ధుడు, భోక్తగాని శాసనకర్తగాని యగునొక స్థిరమైన సంహననకర్త యున్నటుల అంగీకరింపక పోయినను,

ణత్వాదుపపద్యతే లోకయాత్రా, తస్యాం చోపపద్యమానాయాం న కించిదపరమపేక్షితవ్యమస్తి. తే చావిద్యాదయ అవిద్యాసంస్కారో విజ్ఞానం నామరూపం షడాయతనం స్పర్శో వేదనా తృష్ణోపాదానం భవో జాతిర్జరామరణం శోకః పరిదేవనా దుఃఖం దుర్మనస్తే

---

ఆవిద్య, సంస్కారము, విజ్ఞానము మొదలగునవి యొకదాని కొకటి కారణమగుటవలన లోకయాత్ర సంభవమగును. లోక యాత్ర యిట్లు సంభవ మగుచుండ మఱియొక చేతనము నపే క్షింప నవసరము లేదు. క్షణికములు స్థిరమనితలంచు బుద్ధిరూప మగు అవిద్య, దానివలన సంభవించు రాగద్వేష మోహాది సంస్కారములు, వానినుండి గర్భస్థమగు ప్రథమ విజ్ఞానము, ఆలయవిజ్ఞానమువలన పృథివ్యాదిచతుష్టయమునకాశ్రయమగు నామము, అందువలన రూపము, ఇంద్రియజాతమునకు స్థాన ములగు విజ్ఞానము, పృథివ్యాది చతుష్టయము, రూపము అను షడాయతనము, నామరూపేంద్రియముల కన్యోన్యము సంయోగరూపమగు స్పర్శ, అందువలన సుఖాదిక వేదనా, అందువలన తిరిగి విషయతృష్ణ, దానిచేత ప్రవృత్తి, దాని వలన జన్మకలుగుచున్నది యను భవధర్మము, అందువలన దేహము పుట్టుట, పుట్టినట్టి పంచస్కంధముల యొక్క పరి పాకమగు జరాస్కంధము, మరణము, మరణించువానికి పుత్రాదుల యందలి ప్రేమవలన గల్గు అంతర్దాహమగు శోకము, దానివలన ప్రలాపమగు పరివేదనము, అనిష్టానుభవ మగు దుఃఖము, అందువలన మానసిక వ్యథయగు దుర్మ నస్తము– ఇటుల నన్యోన్యము కారణపరంపర బుద్ధసిద్ధాంతమున

త్త్యేవంజాతీయకా ఇతరేతరహేతుకాః సౌగతే సమయే క్వచిత్సం క్షిప్తా వినిర్దిష్టాః, క్వచిత్ ప్రపంచితాః, సర్వేషామప్యయమవిద్యాది కలాపో న ప్రత్యాఖ్యేయః. తదేవమవిద్యాదికలాపే పరస్పర నిమిత్తనైమిత్తికభావేన ఘటీయంత్రవదనిశమావర్తమానేఽర్థా క్షిప్త ఉపపన్నః సంఘాత ఇతి చేత్.

సిద్ధాంతీ : తన్న, కస్మాత్, ఉత్పత్తిమాత్రనిమిత్తత్వాత్. భవేదుపపన్నస్సంఘాతో యది సంఘాతస్య కించిన్నిమిత్తమవ గమ్యేత, న త్వవగమ్యతే. యత ఇతరేతరప్రత్యయత్వేప్య

---

కొన్ని సంక్షేపముగను మరికొన్ని విస్తృతముగను నుదాహ రింపబడినవి. ఇట్టి అవిద్యాకలాపమునకు భాధ్దులేగాక మరి యెవరును గూడ నెదురు చెప్పుటలేదు, కాని, ఈ అవిద్యా ప్రణాళిక అన్యోన్యము కార్యకారణ భావము నొంది యెల్ల ప్పుడును ఘటీయంత్రమువలె దిరుగుచుండగా [సంఘాతము లేనిది అవిద్యాదులు సంభవము గావుగనుక] నర్థబలముచే పరమాణు సంఘాత ముపపన్నమగుచున్న దంటిరేని.

సిద్ధాంతి : మీకల్పనము సరికాదు. ఏలన ! అవి ద్యాదు లన్యోన్య ముత్పత్తికి మాత్రము నిమిత్తకారణము లగుటవలన ! [పై నుదహరించిన పరంపరలో పూర్వపూర్వ ముత్తరోత్తరమునకు నిమిత్తకారణమగు చున్నది కాని వాని సంఘాతమునకు నిమిత్తకారణమును చెప్పుటలేదు.] సంఘాతమన కెద్దియో యొక నిమిత్త మున్నటుల అంగీక రించినపుడే యది యుపపన్నమగును కాని మీరు దాని నంగీ

విద్యాదీనాం పూర్వపూర్వముత్తరోత్తరస్యోత్పత్తిమాత్రం నిమిత్తం భవద్భవేత్, న తు సంఘాతాపత్తేః కించిన్నిమిత్తం సంభవతి.

బౌద్ధః : నన్వవిద్యాదిభిరర్థాదాక్షిప్యతే సంఘాత ఇత్యుక్తం.

సిద్ధాంతీ : అత్రోచ్యతే-యదితావదయమభిప్రాయః, అవిద్యాదయస్సంఘాతమంతరేణాత్మానమలభమానా అపేక్షంతే సంఘాతమితి, తతస్తస్య సంఘాతస్య కించిన్నిమిత్తం వక్తవ్యమ్, తచ్చ నిత్యేష్వణుష్వభ్యుపగమ్యమానేష్వాశ్రయాశ్రయిభూతేషు చ

---

కరించుటలేదు. అవిద్యాదుల కన్యోన్యము పూర్వపూర్వముత్తరోత్తరముత్పన్నమగుటకు నిమిత్తకారణమైన కావచ్చును గాని సంఘాతముత్పన్నమగుటకు నిమిత్తకారణము సంభవింపదు. [సంఘాతమునకు చేతన సహాయము మవసరము.]

బౌద్ధుడు : అవిద్యాదు లన్యోన్యము కారణమగుటచే నర్థబలము చేత సంఘాతము సిద్ధించునని యింతకుముందు చెప్పియుంటిమి గదా !

సిద్ధాంతి : ఇందుల కిట్లు చెప్పుచున్నాము. అవిద్యాదులు సంఘాతము లేక సిద్ధింపవనియు అందువలన సంఘాతమునపేక్షించుచున్నవనియు మీా అభిప్రాయమైన యెడల నట్టి సంఘాతము సిద్ధించుట కొరకు నిమిత్తకారణమును చెప్పవలయును. సంఘాతసిద్ధికొరకు సంఘాత యోగ్యమగు పరమాణువులును, భోగసాధనమగు నదృష్ట సహాయములు సంఘాత కర్తలగు జీవులు ఉన్నటుల అంగీకరించినను [జ్ఞానము లేక

భోక్తృషు సత్సు న సంభవతీత్యుక్తం వైశేషికపరీక్షాయాం కిమంగ పునః క్షణికేష్వణుషు భోక్తృరహితేష్వాశ్రయాశ్రయిశూన్యేషు చాభ్యుపగమ్యమానేషు సంభవేత్. అథాయమభిప్రాయః, అవిద్యాదయ ఏవ సంఘాతస్య నిమిత్తమితి. కథం తమేవాశ్రిత్యాత్మానం లభమానాస్తస్యైవ నిమిత్తం స్యుః, అథ మన్యసే సంఘాతా ఏవానాదౌ సంసారే సంతత్యాఽనువర్తంతే తదాశ్రయాశ్చావిద్యాదయ ఇతి, తదాపి సంఘాతాత్సంఘాతాంతరముత్పద్యమానం నియమేన వా సదృశమేవోత్పద్యేత, అనియమేన వా

---

పోవుటవలన సంఘాత కర్తృత్వము సంభవింపమిచే] సంఘాతము సమకూరదని వైశేషికమత పరీక్షాసందర్భమున చెప్పియుంటిమి. సంఘాతకర్తయగు జీవుడులేని క్షణికములగు నణువుల నంగీకరించిన మాత్రముచేత సంఘాతము సంభవింపదని మరివేఱుగా చెప్పవలయునా పిచ్చితండ్రీ! అవిద్యాదులే సంఘాతమునకు నిమిత్తకారణములని మీ యభిప్రాయమందురేమో? ఆపక్షమున సంఘాతము నాశ్రయించి యవిద్యాదులకు ఉనికి సంభవించుచున్నది. (సంఘాతములేక విద్యాదులుండనేరవు) అట్టి యవిద్యాదులు సంఘాతమునకు నిమిత్తకారణ మేవిధమున కాగలవు? అనాదియగు నీ సంసారమున సంఘాతములు ప్రవాహరూపమున నున్నవనియు, దాని నాశ్రయించి అవిద్యాదు లుండుననియు మీరు తలంచునెడ, అపుడుకూడ, నొక సంఘాతము నియమముగ తనకు సదృశమగు మఱియొక సంఘాతమును బుట్టించునా లేక అట్టి నియమము లేక సదృశము విసదృశమునగు సంఘాతాంతర

సదృశం విసదృశం చోత్పద్యేత, నియమాభ్యుపగమే మనుష్య పుద్గలస్య దేవతిర్యగ్యోనినారకప్రాప్త్యభావః ప్రాప్నుయాత్, అనియమాభ్యుపగమేఽపి మనుష్యపుద్గలః కదాచిత్ క్షణేన హస్తీ భూత్వా దేవో వా పునర్మనుష్యో వా భవేదితి ప్రాప్నుయాత్, ఉభయమప్యభ్యుపగమవిరుద్ధమ్. అపిచ యద్భోగార్థస్సంఘాతస్స్యాత్ స జీవో నాస్తి స్థిరో భోక్తేతి తవాభ్యుపగమః, తతశ్చ భోగో భోగార్థ ఏవ స నాన్యేన ప్రార్థనీయః, తథా మోక్షో మోక్షార్థ ఏవేతి ముముక్షుణా నాన్యేన భవితవ్యమ్. అన్యేన చేత్ ప్రార్థ్యేత్తోభయం భోగమోక్షకాలావస్థాయినా తేన భవితవ్యమ్, అవస్థాయిత్వే క్షణికత్వాభ్యుపగమవిరోధః, తస్మాదితరేతరోత్పత్తిమాత్రనిమి

---

మును బుట్టించునా? నియమము నంగీకరించినచో, మనుష్యశరీరము దేవపశునరకముల పొందలేదు. నియమము లేనపుడుగూడ నాశరీరము క్షణములో గజముగాను, దేవతగాను మారి తిరిగి మనుష్యుడు కావచ్చును. ఈ రెండుపక్షములుగూడ మీ సిద్ధాంతమునకు విరుద్ధమేయగును. మఱియు నెవ్వనిభోగము కొఱకీసంఘాత మేర్పడుచున్నదో అట్టి భోక్తయగు జీవుడు స్థిరముగ లేడని మీ సిద్ధాంతము కనుక భోగము భోగము కొఱకేగాని దాని నపేక్షించువా డన్యుడులేడు. ఆవిధముగనే మోక్షము మోక్షార్థముగాని దాని నపేక్షించువాడన్యుడు లేడు. భోగమోక్షముల నపేక్షించు వాడెవ్వడైనయుండుచో, భోగమోక్షములు సంభవించు కాలమువరకాతడుండవలయును, అంతకాలమాత డుండుచో నట్టి యవస్థానము మీ క్షణికవాదమునకు విరుద్ధమగును, అందువలన నవిద్యాదులన్యో

త్తత్వమవిద్యాదీనాం యది భవేద్భవతు నామ న తు సంఘాతః సిద్ధ్యేత్ భోక్త్రభావాదిత్యభిప్రాయః.

## ఉత్తరోత్పాదే చ పూర్వనిరోధాత్ (సూ. 20)

ఉక్తమేతదవిద్యాదీనాముత్పత్తిమాత్రనిమిత్తత్వాన్న

---

న్యము నిమిత్తకారణము లయిన కావచ్చుగాక, కాని వానిని అనుభవించు స్థిరమగు భోక్త లేనంతవరకు, సంఘాతసిద్ధికి అది కారణము కాదని తాత్పర్యము. 19

అ॥ కార్యము హేతువ నాధారము చేసికొని గాని కారణసముదాయము నాధారము చేసికొనిగాని బుట్టునని బౌద్ధవాదము. అవిద్యవలన సంస్కారము, అందువలన విజ్ఞానము– ఈవిధముగ పూర్వ పూర్వమువలన నుత్తరోత్తరము బుట్టుట ప్రథమవాదము, పృథివ్యాది సముదాయముచే దేహము బుట్టుచున్నది యని రెండవ వాదము. పూర్వ సూత్రమున ప్రథమవాదము నంగీకరించి ద్వితీయవాదము సంభవము కాదని చూపబడినది. రాబోవు సూత్రమున ప్రథమవాదము ఖండించుచున్నారు.

ఉత్తర ఉత్పాదే=తరువాత పరమాణువు లుత్పన్నమగు కాలమునకు పూర్వ నిరోధాత్ చ=పూర్వ పరమాణువులు భ్రష్టమగుటచే నుత్తర పరమాణూత్పత్తి సంభవము కాదు.

అవిద్యాదు లన్యోన్య ముత్పత్తి మాత్రమునకు నిమిత్తము లగుటవలన సంఘాతము సంభవము కాదని బూర్వ

సంఘాతసిద్ధిరస్తీతి, తదపి తూత్పత్తిమాత్రనిమిత్తత్వం న సంభవతీతీదమిదానీముపపాద్యతే. క్షణభంగవాదినో౽యమభ్యుపగమః ఉత్తరస్మిన్ క్షణే ఉత్పద్యమానే పూర్వక్షణో నిరుధ్యత ఇతి. నచైవమభ్యుపగచ్ఛతా పూర్వోత్తరయోః క్షణయోర్హేతుఫలభావశ్శక్యతే సంపాదయితుమ్, నిరుధ్యమానస్య నిరుద్ధస్య వా పూర్వక్షణస్యాభావగ్రస్తత్వాదుత్తరక్షణహేతుత్వానుపపత్తేః.

బౌద్ధః : అథ భావభూతః పరినిష్పన్నావస్థః పూర్వక్షణ ఉత్తరక్షణస్య హేతురిత్యభిప్రాయః.

---

సూత్రమున చెప్పబడినది. ఉత్పత్తిమాత్ర నిమిత్తత్వము గూడ సంభవింపదని యిపుడు పపాదింపబడుచున్నది. [అర్థము క్షణికము. కనుక క్షణమని బిలువబడుచున్నది] ఉత్తరక్షణముత్పన్నమగు నప్పటికి పూర్వక్షణమునందున్నది వినాశము నొందును. అని క్షణభంగవాదు లంగీకరించుచున్నారు. వీరి యంగీకార మిటులనుండ పూర్వోత్తరక్షణములకు కారణకార్యభావము సమకూర్ప శక్యముకాదు. పూర్వక్షణము వినాశక సంనిధానమునం దైననుండును. లేక పూర్వమే నశించి యుండవచ్చును. కనుక నది యభావమును బొందియున్నది. అది యుత్తరక్షణమునకు హేతువు కానేరదు.

బౌద్ధుడు : క్షణికమగు ద్రవ్యము పూర్వక్షణమునందు సంపూర్ణమగు యునికినిబొంది కార్య కాలమున వినాశమునకు సంసిద్ధముగా నున్నను పూర్వక్షణమునందు పూర్ణముగ నుండుటవలన దానికార్యహేతుత్వమునకు భంగముకలుగదు.

సిద్ధాంతీ : తథాపి నోపపద్యతే, భావభూతస్య పునర్వ్యాపారకల్పనాయాం క్షణాంతరసంబంధప్రసంగాత్. అథ భావ ఏవాస్య వ్యాపార ఇత్యభిప్రాయః, తథాపి నైవోపపద్యతే హేతుస్వభావానుపరక్తస్య ఫలస్యోత్పత్త్యసంభవాత్. స్వభావోపరాగాభ్యుపగమే చ హేతుస్వభావస్య ఫలకాలావస్థాయిత్వే సతి క్షణభంగాభ్యుపగమత్యాగప్రసంగః. వినైవ వా స్వభావోపరాగేణ హేతుఫలభావమభ్యుపగచ్ఛతః సర్వత్ర తత్ప్రాప్తేరతిప్రసంగః అపిచోత్పాదనిరోధౌ నామ వస్తునస్స్వరూపమేవ వా స్యాతామవ

---

సిద్ధాంతి : అదిగూడ సంభవముకాదు, పూర్వక్షణమున సంపూర్ణమగు నునికిని బొందిన పరమాణు వుత్తర క్షణమున ఉత్పాదన వ్యాపారసమర్థమగుట కుత్తర క్షణముతో సంబంధ ముండవలెను. [ఇది క్షణికసూత్రమునకు విరుద్ధము.] పోనీ ! పూర్వక్షణ ఉనికి మాత్ర ముత్తర క్షణ కారణమని తలంచితి రేని అదిగూడ సంభవముకాదు. కారణస్వభావము సంక్రమింపక కార్యోత్పత్తి సంభవము కాదు, కారణ స్వభావము కార్యమునందు సంక్రమించినది యందుమా, అపుడు కారణస్వభావము కార్యముత్పన్న మగు వరకు నుండవలసివచ్చును. అటులయినచో క్షణభంగవాదము పరిత్యజింపవలయును. కారణస్వభావము కార్యమునందు సంక్రమింపకనే కార్యకారణభావము సంభవించునందు రేని యంతట నిదియే సంభవించును [అపుడు కులాలునివంటి నిమిత్తకారణమునకు మృత్తువంటి యుపాదాన కారణమునకును భేదములేక పోవును.] మఱియు నుత్పాదము నిరోధము అనగా వస్తువు

స్థాంతరం వా వస్త్వంతరమేవ వా, సర్వథాపి నోపపద్యతే. యది తావద్వస్తునస్స్వరూపమేవోత్పాదనిరోధౌ స్యాతాం తతో వస్తుశబ్దః ఉత్పాదనిరోధశబ్దౌ చ పర్యాయాః ప్రాప్నుయుః. అథాస్తి కశ్చిద్విశేష ఇతి మన్యేత ఉత్పాదనిరోధశబ్దాభ్యాం మధ్యవర్తినో వస్తున ఆద్యంతాఖ్యే అవస్థే అభిలప్యేతే ఇతి, ఏవమప్యాద్యంత మధ్యక్షణత్రయసంబంధిత్వాద్వస్తునః క్షణికత్వాభ్యుపగమహానిః. అథాత్యంతవ్యతిరిక్తావేవోత్పాదనిరోధౌ వస్తునస్స్యాతాం అశ్వమహిషవత్, తతో వస్తూత్పాదనిరోధాభ్యామసంస్పృష్టమితి వస్తున

---

యొక్క స్వస్వరూపమైనను కావలెను; లేక మఱియొక వస్తువు అయినను కావలెను, బౌద్ధసిద్ధాంతమునుబట్టి యీ రెండింటిలో నేదియు సంభవముకాదు. వస్తుస్వరూపమే ఉత్పాదనిరోధము లయ్యేనేని వస్తుశబ్దము ఉత్పాదనిరోధ శబ్దములకు పర్యాయపరము కావలెను. అటులకాదు. వస్తువునకు ఉత్పాద నిరోధములకంటె కొంత విశేషము గలదు. ఉత్పాదము ఉత్పత్త్యవస్థ. ఇది ప్రథమావస్థ. నిరోధము నాశోన్ముఖావస్థ. ఇది కడపటి యవస్థ ఈ రెండింటికిని మధ్య వస్తువుండునని అందురేమో ? ఈపక్షమునగూడ, ఉత్పాదక్షణము, మధ్యక్షణము, నిరోధక్షణము– ఇట్లు వస్తువునకు క్షణత్రియ సంబంధము సంప్రాప్తమగుట వలన, క్షణికత్వ సిద్ధాంతమునకు భంగము కలుగుచున్నది. వస్త్వంతర పక్షమున, అశ్వమహిషములవలె ఉత్పాద నిరోధములు వస్తువుకంటె నత్యంతము వ్యతిరిక్తమని తలంచిననాడుగూడ, వస్తువునకు ఉత్పాద నిరోధములతో నెంతమాత్రము సంబంధము లేకుండుటవలన వస్తువు శాశ్వ

శ్చాశ్వతత్వప్రసంగః. యది చ దర్శనాదర్శనే వస్తునా ఉత్పాద నిరోధౌ స్యాతామ్, ఏవమపి ద్రష్టృధర్మౌ తౌ న వస్తుధర్మావితి వస్తునశ్శాశ్వతత్వప్రసంగ ఏవ, తస్మాదప్యసంగతం సౌగతం మతమ్.

## అసతిప్రతిజ్ఞోపరోధో యౌగపద్యమన్యథా

(సూ. 21)

సిద్ధాంతీ : క్షణభంగవాదే పూర్వక్షణో నిరోధగ్రస్తత్వా

---

తము కావలెను. [ఇవి యేవియు కావు] వస్తువు కాన్పించుట ఉత్పాదనము కాన్పింపకుండుట నిరోధము అనినను దర్శనాదర్శనములు చూచువాని ధర్మములు కాని వస్తుధర్మములు కావు. కనుక వస్తువు శాశ్వతమను వాద మటులనేయుండును. అందువలన గూడ సౌగతమత మసంగతమగును. 20

అ॥ కారణము లేక కార్యము బుట్టవచ్చునను వాదము రాబోవు సూత్రమున నిరాకరింప బడుచున్నది.

అసతి= కార్య ముత్పన్నమగుటకు అనగా కారణము లేకనే కార్యోత్పత్తి యగుననినచో, ప్రతిజ్ఞా ఉపరోధః = సమస్త కార్యజాతము కారణసహితమను బౌద్ధ ప్రతిజ్ఞ అప్రమాణ మగును. అన్యథా = కార్యము సకారణమైనచో యౌగపద్యం = కార్యకారణములు రెండింటికిని యొక కాల మగును. అపుడు క్షణికప్రతిజ్ఞకు అప్రామాణ్యము తటస్థించును.

సిద్ధాంతి : పదార్థములన్నియు క్షణకాలమున నశించునను క్షణభంగ వాదమునుబట్టి పూర్వక్షణము వినాశ

న్నోత్తరస్య హేతుర్భవతీత్యుక్తమ్. అథాసత్యేవ హేతౌ ఫలో త్పత్తిం బ్రూయాత్. తతః ప్రతిజ్ఞోపరోధస్స్యాత్, చతుర్విధాన్ హేతూన్ ప్రతీత్య చిత్తచైత్తా ఉత్పద్యంత ఇతీయం ప్రతిజ్ఞా హీయేత, నిర్హేతుకాయాం చోత్పత్తావప్రతిబంధాత్ సర్వం సర్వ త్రోత్పద్యేత. అథో త్తరక్షణోత్పత్తిర్యావత్తావదవతిష్ఠతే పూర్వ క్షణ ఇతి బ్రూయాత్, తతో యౌగపద్యం హేతుఫలయోస్స్యాత్. తథాపి ప్రతిజ్ఞోపరోధ ఏవస్యాత్, క్షణికాస్సర్వే సంస్కారా ఇతీయం ప్రతిజ్ఞోపరుధ్యేత.

---

మొందుటవలన నుత్తరక్షణమునకు కారణము కాదని చెప్ప బడెను. కారణము లేకనే కార్యము బుట్టునని బౌద్ధులు చెప్ప వచ్చు. అపుడు వారిప్రతిజ్ఞ భంగమగును. [విషయము, కర ణము సహకారి, సంస్కారమను] చతుర్విధ కారణములను పొంది చిత్తము [స్వరూపాది విజ్ఞానము] చైత్తము [సుఖా దులు] బుట్టుచున్నవను నీ ప్రతిజ్ఞకు భంగము కలుగును. [నీలమను జ్ఞానమునకు నీలవస్తువు విషయము; చక్షుస్సు కర ణము : తేజస్సు సహకారి; పూర్వప్రత్యయము సంస్కారము] హేతువు లేకనే ఉత్పత్తి సంభవించునేని యేవస్తువైనను యెప్పుడైనను బుట్టవచ్చును. ఉత్తరక్షణ ముత్పన్న మగువరకు పూర్వక్షణ ముండునందురేని అపుడు కార్యకారణములకు ఏక కాలీనత్వము సంభవించును. అపుడుగూడ మీా ప్రతిజ్ఞా భంగమగును. సంస్కారము లన్నియు క్షణికములని మీా ప్రతిజ్ఞ. 21

అ॥ 18-19 సూత్రములయందు సముదాయము 20-21

## ప్రతిసంఖ్యాఽప్రతిసంఖ్యానిరోధాప్రాప్తిరవిచ్ఛేదాత్
(సూ. 22)

సిద్ధాంతీ : అపి చ వైనాశికాః కల్పయంతి 'బుద్ధిబోధ్యం త్రయాదన్యత్ సంస్కృతం క్షణికం చే'తి. తదపి చ త్రయం ప్రతిసంఖ్యాఽప్రతిసంఖ్యానిరోధావకాశం చేత్యాచక్షతే. త్రయమపి చైతదవస్తుభావమాత్రం నిరుపాఖ్యమితి మన్యంతే బుద్ధిపూర్వకః కిల వినాశో భావానాం ప్రతిసంఖ్యానిరోధో నామ భాష్యతే తద్విప

---

సూత్రములయందు కార్యకారణ భావమగు క్షణికము నిరసింపబడినవి. రాబోవు సూత్రమున బౌద్ధుల కభిమతమగు ద్వివిధ వినాశమును త్రోసిపుచ్చు చున్నారు.

ప్రతిసంఖ్యా అప్రతిసంఖ్యా నిరోధ అప్రాప్తిః = బుద్ధిపూర్వకమగు కార్యనాశము, బుద్ధికృతముగాక స్వయముగ సంభవించు కార్యనాశము—ఈ రెండింటికిని నిరోధము సంభవింపదు. ఏలనన్న ! అవిచ్ఛేదాత్ = పరమాణుసంతానమునకు విచ్ఛేదము లేకుండుట వలన.

సిద్ధాంతి : మఱియు ఉత్పాద్యము బుద్ధిచే దెలిసికొన తగినది, మూడింటికంటె భిన్నమైనదియు క్షణకాలముండునదియు అని వైనాశికులు కల్పించుచున్నారు. ప్రతిసంఖ్యా నిరోధము- అనగా బుద్ధిపూర్వకమగు కార్యనాశము, అప్రతిసంఖ్యా నిరోధము- అనగా స్వయముగా సంభవించు నాశము, అవకాశము అనునవి నీమూడు. ఈమూడుగూడ నభావమాత్రమగు అవస్తు స్వరూపములనియు స్వరూపరహితములనియు చెప్పుచున్నారు. భావవస్తువుల వినాశము ప్రతిసంఖ్యా

రీతో౽ప్రతిసంఖ్యానిరోధః, ఆవరణాభావమాత్రమాకాశమితి. తేషామాకాశం పరస్తాత్ ప్రత్యాఖ్యాస్యతి, నిరోధద్వయమిదానీం ప్రత్యాచష్టే.

ప్రతిసంఖ్యా౽ప్రతిసంఖ్యానిరోధయోరప్రాప్తిరసంభవ ఇత్యర్థః. కస్మాత్? అవిచ్ఛేదాత్. ఏతౌ హి ప్రతిసంఖ్యా౽ప్రతిసంఖ్యానిరోధౌ సంతానగోచరౌ వా స్యాతాం భావగోచరౌ వా, న తావ

---

నిరోధమని బిలువబడుచున్నది. అప్రతిసంఖ్యా నిరోధము దానికి వ్యతిరేకము. [అనగా ఉన్నయొకవస్తువును లేకుండ చేయుదునను బుద్ధిప్రతిసంఖ్య. దానిచే వస్తునిరోధముచేయుట ప్రతిసంఖ్యా నిరోధము. నాశనముచేయుదునని బుద్ధిపూర్వకముగ ఘటాదికమును దండముతో నాశముచేయుట ప్రతిసంఖ్యానిరోధము. బుద్ధిపూర్వకముగ గాక, వస్తువు తనంతట తాను నశించుట అప్రతిసంఖ్యానిరోధము.] ఆవరణము లేకపోవుటయె ఆకాశము. [ఇచట వినవచ్చుపదములన్నియు బౌద్ధప్రక్రియ యందలి పారిభాషికపదములు. ప్రత్యేక ప్రత్యేక అర్థమున వాడబడుచున్నవి. ఆ అర్థముననే గ్రహించవలెను గాని అన్యథా అర్థకల్పనము చేయతగుదు.] ఈ మూడింటిలో ఆకాశమునుగూర్చి ముందు [యిరువదినాల్గవ సూత్రమున ప్రత్యాఖ్యానముచేయుదుము. మొదటిరెండు నీ సూత్రమున ప్రత్యాఖ్యానము చేయుదుము:]

బుద్ధిపూర్వకనాశము అందుకు విపరీత నాశముగూడ నసంభవములు. ఏలనన ! విచ్ఛేదము లేకుండుటవలన, ఈరెండు విధములగు నాశములుగూడ సంతాన గోచరములయినను

త్సంతానగోచరౌ సంభవతః, సర్వేష్వపి సంతానేషు సంతానినా మవిచ్ఛిన్నేన హేతుఫలభావేన సంతానవిచ్ఛేదస్యాసంభవాత్. నాపి భావగోచరౌ సంభవతః, న హి భావానాం నిరన్వయో నిరుపాఖ్యో వినాశస్సంభవతి, సర్వాస్వప్యవస్థాసు ప్రత్యభిజ్ఞానబలేనాన్వయ్యావి

---

గావలెను. భావగోచరములైనను కావలయును. [భావములన విద్యమానములగు వస్తువులు. ప్రకృతమున హేతుఫలములు. వానిపరంపర లేక ప్రవాహమునకు సంతానమనిపేరు. హేతుఫలములు క్షణికములై నొకటి తరువాత పరంపరగా బుట్టుచు నశించుచుండును. బుద్ధిపూర్వకము స్వతః సిద్ధమునగు రెండు నాశములు హేతుఫలసంతానమునకైనను సంబంధించియుండవలెను. లేక హేతుఫలములలో దేనికో యొకదానికైనను సంబంధించియుండవలయును.] అవి సంతానమునకు సంబంధించవు. సంతానగతములగు హేతుఫలము లెడ తెగక బుట్టుచుండుటచేత సంతానవిచ్ఛేదముకాదు. [సంతాననాశము కావలయునన్న క్షణికములగు హేతుఫలము లుత్తరహేతుఫలముల నుత్పాదను చేయకుండవలయును. ఉత్తర ఉత్పాదము లేక కారణముండ నేరదనియు కార్యముత్పాదము కానిచో కారణము లేదనియు బౌద్ధమతసమ్మతము. కానుక కార్యోత్పాదము లేనిచో కారణము లేదనియె చెప్పవలసివచ్చును] ద్వివిధ వినాశములు హేతుఫలమునకు సంబవించినవిగూడ కానేరవు. భావములకు నిరూపించుటకు శక్యముకానట్టియు సంపూర్ణ స్వరూపరహితమైనట్టియు వినాశముసంభవింపదు. అన్ని అవస్థలయందు నవిచ్ఛిన్నముగ కారణము గుర్తింపబడుచున్నది.

చ్ఛేదదర్శనాత్. అస్పష్టప్రత్యభిజ్ఞానాస్వప్యవస్థాసు క్వచిద్దృష్టేనా న్వయ్య విచ్ఛేదేనాన్యత్రాపి తదనుమానాత్. తస్మాత్ పరపరి కల్పితస్య నిరోధద్వయస్యానుపపత్తిః.

## ఉభయథా చ దోషాత్ (సూ. 23)

యోఽయమవిద్యాదినిరోధః ప్రతిసంఖ్యాఽప్రతిసంఖ్యానిరో ధాంతఃపాతీ పరపరికల్పితః స సమ్యగ్జ్ఞానాద్వా సపరికరాత్స్యాత్

---

[మృత్తు ఘటము, కపాలము చూర్ణము మొదలగు నన్ని యవ స్థలయందును గుర్తింపబడుచున్నది. కనుక కారణమగు మృత్తుఅత్యంత వినాశమునొందలేదు. స్పష్టముగగుర్తింపశక్య ముగాని స్థలములయందుగూడ, కారణము విచ్ఛిన్నముగాక కాన్పించుచున్న యితర దృష్టాంతములనుబట్టి, కారణమత్యం తము నాశనముకాదని యూహించుచున్నాము. [బీజము స్పష్ట ముగ కాన్పించకున్నను, అనుస్యూతముగ నది యంకుర కార్యమునందుకాన్పించుచున్నది.] కనుక బౌద్ధులు కల్పించిన నిరోధద్వయము సంభవముకాదు. 22

అ॥ ప్రతిసంఖ్యా నిరోధములో నంతర్భాగమగు నవిద్యానిరోధమునందు దోషమును చూపుచున్నారు.

ఉభయథా = ఘటపటాది పరమాణుసంతానములు స్థిరములైనను క్షణికములైనను, ఉభయ పక్షములుగూడ దోషాత్ = దోషముండుటవలన ద్వైతమత మసంగతము

అవిద్యానిరోధము యనునది బౌద్ధసిద్ధాంతము ప్రకా రము వారుకల్పించిన ప్రతిసంఖ్యానిరోధములో నంతర్భాగ

స్వయమేవ వా, పూర్వస్మిన్ వికల్పే నిర్హేతుకవినాశాభ్యుపగమహానిప్రసంగః. ఉత్తరస్మింస్తు మార్గోపదేశానర్థక్యప్రసంగః. ఏవముభయథాపి దోషప్రసంగాదసమంజసమిదం దర్శనమ్.

## ఆకాశే చావిశేషాత్ (సూ. 24)

యచ్చ తేషామేవాభిప్రేతం నిరోధద్వయమాకాశం చ నిరుపాఖ్యమితి. తత్ర నిరోధద్వయస్య నిరుపాఖ్యత్వం పురస్తాన్నిరాకృతం, ఆకాశస్యేదానీం నిరాక్రియతే.

---

నగుచున్నది. యమనియమాది పరికరములతో జేరిన సమ్యక్ జ్ఞానమువలనగాని స్వయముగా గాని అవిద్యానాశము కావలెను. సమ్యగ్జ్ఞానమువలన నది నశించుచో, కారణము లేకనే నాశముసంభవించునను అభ్యుపగమమునకు విరుద్ధము. రెండవ పక్షమున సర్వదుఃఖము క్షణికము మొదలగు మార్గోపదేశ మనర్థకము. ఏవిధముగా నయినను దోషము కాన్పించుచుండుటవలన బౌద్ధదర్శన మసమంజసము. 23

అ॥ ఇక నాకాశము నిరూపాఖ్యము కానేరదని చూపుచున్నారు.

ఆకాశేచ = ఆకాశమునందుగూడ శబ్దగుణముండుటవలన పృథివ్యాదులవలె వస్తుత్వము సంభవించుటయందు అవిశేషాత్ = పృథివ్యాదులతో సమానమే యగుటవలన నచట నిరుపాఖ్యత్వము అనగా నాశము లేదు.

ప్రతిసంఖ్యా (2) ప్రతిసంఖ్యలుఆకాశము నిరూపాఖ్యములని బౌద్ధులభిప్రాయపడుచున్నారు. వానిలో మొదటి

ఆకాశే చాయుక్తో నిరుపాఖ్యత్వాభ్యుపగమః. ప్రతిసంఖ్యాఽప్రతిసంఖ్యానిరోధయోరివ వస్తుత్వప్రతిపత్తేరవిశేషాత్, ఆగమప్రామాణ్యాత్తావత్ 'ఆత్మన ఆకాశస్సంభూతః' (తై. 2. 1.) ఇత్యాది శ్రుతిభ్య ఆకాశస్య చ వస్తుత్వసిద్ధిః. విప్రతిపన్నాన్ప్రతి తు శబ్దగుణానుమేయత్వం వక్తవ్యం, గంధాదీనాం గుణానాం పృథివ్యాదివస్త్వాశ్రయదర్శనాత్. అపి చావరణాభావమాత్రమాకాశమిచ్ఛత స్తవైకస్మిన్ సుపర్ణే పతత్యావరణస్యవిద్యమానత్వాత్

---

రెండు నిరుపాఖ్యములు గావని పూర్వసూత్రముల ద్రోసివేయబడినది. ఇపుడాకాశము నిరుపాఖ్యముకాదని నిరాకరింపబడుచున్నది.

ఆకాశమునందు నాశమునంగీకరించుట అయుక్తము. ప్రతిసంఖ్యాఽప్రతిసంఖ్యానిరోధములవలెనే ఆకాశమునందుగూడ వస్తుత్వము సంభవించుచున్నది. ఈవిషయమున ఆకాశము పృథివ్యాదులతో తుల్యమె యగుచున్నది. ఆత్మవలన ఆకాశము సంభవించుచున్నదియని ఆకాశముయొక్క వస్తుత్వము ప్రమాణప్రసిద్ధము. శ్రుతిప్రమాణము నంగీకరింపని వారలనుగూర్చి ఇటుల చెప్పెదము. గంధాదిగుణములు పృథివ్యాదివస్తువుల నాశ్రయించియున్నవి. ఆవిధముగనే శబ్దగుణ మాకాశమునందు కాన్పించుచుండుటవలన నదిగూడ వస్తువని యనుమాన ప్రమాణముచే నూహించెదము. [శబ్దము గంధాదులవలె నొకగుణము గనుక వస్తువు నాశ్రయించి యుండవలెను.] ఆవరణము లేకుండుటయె ఆకాశలక్షణమని తలంచినయెడల ఆవరణముండుటచే నొక పక్షియెగురు

సుపర్ణాంతరస్యోత్పిత్సతోఽనవకాశత్వప్రసంగః. యత్రావరణాభావ స్తత్ర పతిష్యతీతి చేత్, యేనావరణాభావో విశేష్యతే తత్తర్హి వస్తుభూతమేవాకాశం స్యాన్నావరణాభావమాత్రమ్. అపి చావ రణాభావమాత్రమాకాశం మన్యమానస్య సౌగతస్య స్వాభ్యుపగమ విరోధః ప్రసజ్యేత. సౌగతే హి సమయే 'పృథివీ భగవన్ కిం సన్నిశ్రయా' ఇత్యస్మిన్ ప్రశ్న ప్రతివచనప్రవాహే పృథివ్యాదీనా

చుండ ఆసమయమున మఱియొక పక్షి సంచరించుటకవకాశము లేదని చెప్పవలెను. [పక్షియొక మూర్తద్రవ్యవిశేషము. అది యెగురుచున్న కాలమునగూడ మూర్తద్రవ్య సామాన్యమచట యున్నది. కనుక ఆవరణములయొక్క లేమియె ఆకాశమనులక్షణము సరికాదు.] [ఒకప్రదేశమునందావరణ ముండవచ్చును. మఱియొక ప్రదేశమున నుండనవసరము లేదుగనుక] ఆవర ణము లేకుండుటమాత్రి. మాకాశముకాదు. ఎచట ఆవర ణము లేదో అచట మఱియొక పక్షి యెగరవచ్చునంటిరేని దేనిచే నావరణము లేదని విశేషించి చెప్పబడుచున్నదో అదియే వస్తుభూతమగు ఆకాశముకావలెను గాని కేవల ఆవర ణముయొక్క లేమిమాత్ర మాకాశముగాదని సంభవించు చున్నది. ఒకస్థలమున ఆవరణముకలదు, మఱియొక చోట లేదు అని వ్యవస్థ దేనిచేత చేయగలమో అదియే భావవస్తువు— అదియె యథార్థము. ఆకాశమభావమాత్రిముకాదు. ఆవర ణముయొక్క లేమిమాత్రిము ఆకాశము [అనగా ఆకాశ మభావమాత్రము] అని చెప్పినచో, బౌద్ధుని స్వసిద్ధాంతవిరుద్ధ మగును. "హేభగవన్! పృథివి దేనిని దృఢముగ నాశ్ర

మంతే 'వాయుః కిం సన్నిశ్శ్రయః' ఇత్యస్య ప్రశ్నస్య ప్రతి వచనం భవతి 'వాయురాకాశసన్నిశ్శ్రయః' ఇతి, తదాకాశస్యా వస్తుత్వే న సమంజసం స్యాత్ తస్మాదప్యయుక్తమాకాశస్యా వస్తుత్వమ్. అపి చ నిరోధద్వయమాకాశం చ త్రయమప్యే తన్నిరుపాఖ్యమవస్తు నిత్యం చేతి విప్రతిషిద్ధమ్. న హ్యవస్తునో నిత్యత్వమనిత్యత్వం వా సంభవతి, వస్త్వాశ్రయత్వాద్ధర్మధర్మి వ్యవహారస్య ధర్మధర్మిభావే హి ఘటాదిసద్వస్తుత్వమేవ స్యాన్న నిరుపాఖ్యత్వమ్.

---

యించియున్నది" యని యారంభించి పృథివ్యాదులు ఆశ్రయ మునుగూర్చి ప్రశ్న ప్రతివచన పరంపర బౌద్ధదర్శనమున కాన్పించుచున్నది. ఆపరంపరయందు "వాయువున కేది దృఢ మైన ఆశ్రయము"అని ప్రశ్నయు "వాయువున కాకాశము దృఢ మగు నాశ్రయము" అని ప్రతివచనము కాన్పించుచున్నది. ఆకాశమభావమే యయినచో వాయువున కాశ్రయము కానేరదు. అందువలనగూడ నాకాశమభావమాత్రము కానే రదు. మరియు నుభయవిధనిరోధములు అకాశము—ఈమూ డును నాశములు. అభావములు నిత్యములుగూడ నగుచున్నవి యనుట స్వవచనవ్యాఘాతమగును. అభావమునకు నిత్యత్వము అనిత్యత్వము సంభవముకాదు. ఇదిధర్మము ఇదిధర్మి అనగా ధర్మముకలదియను వ్యవహారము భావపదార్థమున్నపుడే సంభవించును. ఘటాదులవలె ధర్మధర్మిభావము సిద్ధించు టయే వస్తుత్వమగునుగాని అభావము కానేరదు

## అనుస్మృతేశ్చ (సూ. 25)

అపి చ వైనాశికస్సర్వస్య వస్తునః క్షణికతామభ్యుపయన్నుపలబ్ధురపి క్షణికతామభ్యుపేయాత్. న చ సా సంభవతి, అనుస్మృతేః. అనుభవముపలబ్ధిమనూత్పద్యమానం స్మరణమేవానుస్మృతిః. సా చోపలబ్ధ్యేకకర్తృకా సతీ సంభవతి, పురుషాంతరోపలబ్ధే విషయే పురుషాంతరస్య స్మృత్యదర్శనాత్. కథం హ్యాహమదోఽద్రాక్షమిదమిదానీం పశ్యామీతి చ పూర్వోత్తరదర్శిన్యేకస్మిన్నసతి ప్రత్యయస్స్యాత్. అపి చ దర్శనస్మరణయోః కర్త

---

అ॥ రాబోవుసూత్రమున ఆత్మ క్షణికమనువాదమును త్రోసిబుచ్చుచున్నారు.

అనుస్మృతేః చ = పూర్వకాలికానుభవము నుత్తర కాలమున స్మరింపబడుటవలన ఆత్మక్షణికముకాదు.

మరియు తన కుపలబ్ధమగు వస్తుజాతముయొక్క జ్ఞానమంతయు క్షణికమని బౌద్ధులలో నొక తెగకుచెందిన వైనాశికుడు వాదించుచున్నాడు. ఆ పక్షమున జ్ఞానోపలబ్ధయగు తానుగూడ క్షణికమని అంగీకరింపకతప్పదు. కాని అది సంభవముగాదు. అనుస్మృతి కారణమువలన. పూర్వకాలికమగు అనుభవము ననుసరించి ఆ అనుభవమే ఉత్తరకాలమున స్మృతికి వచ్చుచున్నది. ఇట్టి స్మృతి అనుస్మృతి యందురు. [కొంతకాలముక్రింద రాముని కాశీనగరమున జూచితిమి. అతని దర్శనసంస్కారము బుద్ధియందు వాసితమైయున్నది. ఆసంస్కారమున కనురూపముగ నేడతడు జ్ఞాపకమునకు వచ్చు

ర్యేకస్మిన్ ప్రత్యక్షః ప్రత్యభిజ్ఞాప్రత్యయసర్వస్య లోకస్య ప్రసిద్ధో ఽహమదోఽద్రాక్షమిదం పశ్యామీతి. యది హి తయోర్భిన్నః కర్తా స్యాత్ తతోఽహం స్మరామ్యద్రాక్షీదన్యః ఇతి ప్రతీయాత్. నత్వేవం ప్రత్యేతి కశ్చిత్, యత్రైవం ప్రత్యయ స్తత్ర దర్శనస్మరణ యోర్భిన్నమేవ కర్తారం సర్వోలోకోఽవగచ్ఛతి, స్మరామ్యహమ సావదోఽద్రాక్షీదితి. ఇహ త్వహమదోఽద్రాక్షమితి దర్శనస్మర

---

చున్నాడు. ఇట్టి జ్ఞానమనుస్మృతియనబడును. ఇచట చూచుట స్మృతికి తెచ్చుకొనుట అను విభిన్నకాలికములగు క్రియలు రెండుగలవు. "పూర్వము రాముని కాశీనగరమున జూచితి నని" అను వాక్యమునందలి దర్శనము, భూతక్రియ. అక్రియ ప్రకృతమున స్మృతికివచ్చిచూచితిని అని చెప్పుచున్నాడు. దాని స్మృతిప్రకృతము. కనుక ఏకవిషయ సంబంధములగు నీరెండు క్రియలు విభిన్నకాలికము లగుచున్నవి. పూర్వము చూచినవాడును, నేడు దానిని స్మరించువాడు నొకడైనపుడే అనుస్మృతి సంభవమగును.] ఒకని అనుభవము మరియొకని జ్ఞాపకమునకు కానేరదు. పూర్వానుభవితయు ప్రకృతపు స్మర్తయు ఏకవ్యక్తి కానిచో "ఆ వస్తువును చూచితిని ఇపుడీవస్తువును చూచుచున్నాను" అను విభిన్నకాలికమగు జ్ఞానమెటుల సంభవమగును? ఆవస్తువును జూచితిని" అను వాక్యమునందలి పూర్వానుభవమును జ్ఞాపకముచేసుకొను వాడును "ఇపుడు దీనిని జూచుచున్నాను" అనువాక్యము నందలి ప్రకృతమున చూచువాడును ఒకడేయని గుర్తింపబడు టచే విభిన్నకాలికములగు దర్శనస్మరణాత్మకములగు క్రియల

ణయోర్వైనాశికోఽప్యాత్మానమేవైకం కర్తారమవగచ్ఛతి, న నాహమిత్యాత్మనో దర్శనం నిర్వృత్తం నిహ్నుతే యథాఽగ్నిర నుష్ణోఽప్రకాశ ఇతి వా.

తత్రైవం సత్యేకస్య దర్శనస్మరణలక్షణ ద్వ్యయసం ంబధే క్షణికత్వాభ్యుపగమహానిరపరిహార్యా వైనాశికస్య స్యాత్,

---

కొకడే కర్తయును జ్ఞానము లోకమునందు సుప్రసిద్ధముగ గలుగుచున్నది. వీరిద్దరు భిన్నులయినచో "నేను స్మరించుచున్నాను; మరియొకడుచూచెను" అని ప్రతీతి కలుగవలెను. [అనగా నొకనియనుభవమును మఱియొకడు స్మరింపవలెను] కాని అట్టిజ్ఞానము కలుగుటలేదు. అట్టిజ్ఞానమే కలుగు నెడల చూచినవాడును, స్మరించువాడును విభిన్నపురుషులగుటయే గాక "ఆతడుచూచినాడు, అతని దర్శనానుభవమును నేను స్మరించుచున్నాను" అని లోకమున ప్రతీతి కలుగవలెను. ప్రకృతమున "నేను చూచితిని" అను స్థలమున భాసించుచున్న దర్శనస్మృతిక్రియల రెండింటికిని కర్తయొకడే అగుచున్నాడని వైనాశికుడుగూడ అంగీకరింపకతప్పదు. అగ్నికి ఉష్ణప్రకాశములు లేవనిచెప్పుటకు చేతకానట్లే దర్శనస్మృతిక్రియలకు కర్తయొకడు కాడనుటకుగూడ నాతనికి చేతకాదు.

విషయమిటులుండ దర్శనస్మరణాత్మకములగు నీరెండు క్రియలు విభిన్నక్షణములయం దొక కర్తకే సంభవించుచున్నవి. [అనగా నీ రెండుక్రియలను సేయువాడొకడే యగుచున్నాడు] ఆపక్షమున క్షణికత్వవాదము నంగీకరించు వైనా

తథానంతరామనంతరామాత్మన ఏవ ప్రతిపత్తిం ప్రత్యభిజానన్నేకకర్తృకామో త్తమాదుచ్ఛ్వాసాదతీతాశ్చ ప్రతిపత్తీరాజన్మన ఆత్మైకకర్తృకాః ప్రతిసందధానః కథం క్షణభంగవాదీ వైనాశికో నాపత్రపేత. స యది బ్రూయాత్ సాదృశ్యాదేతత్సంపత్స్యత ఇతి, తం ప్రతిబ్రూయాత్. తేనేదం సదృశమితి ద్వయాయత్తత్వాత్సాదృశ్యస్య క్షణభంగవాదినః సదృశయోర్ద్వయోర్వస్తునోర్గ్రహీతురేకస్యాభావాత్, సాదృశ్యనిమిత్తం ప్రతిసంధాన

---

శిక మతమునకు హాని అనివార్యమగుచున్నది. ఈవిధమున అతనికి యూపిరియుండునంతవరకు జరుగబోవు ప్రత్యభిజ్ఞలకన్నిటికిని, జన్మము నెత్తినతరువాత నీక్షణమువరకు గలిగిన ప్రత్యభిజ్ఞలకన్నిటికిని ఉపలబ్ధ ఆత్మయొకడేయని గుర్తించియాతనిని తనయం దనుసంధానము జేసికొను వైనాశికుడు తన క్షణికత్వవాదమునుజూచి యెట్లు లజ్జపడకుండును! విభిన్నకాలములందు కలుగుజ్ఞానముల సామాన్యమునుబట్టి వానిగుర్తించువాడుగూడ నొకడేయని యాతడు పలికిన సమాధానము చెప్పెదుము. "ఈ వస్తువు ఆవస్తువుతో సదృశముగానున్నది" అనువాక్యమునందలి సాదృశ్యము రెండువస్తువులనాధారము జేసికొనియున్నది. కాని సాదృశ్యములను గ్రహించుసమయమున సదృశములగు రెండువస్తువులలో నొకటిలేదు. క్షణభంగవాదము ప్రకారము ఏజ్ఞానము క్షణముకంటెయెక్కువకాలముండదు. ప్రతివాదముప్రకారము సదృశములగు రెండువస్తువు లేక కాలమునం దుండనేరవు. సాదృశ్యము చెప్పతగిన రెండవవస్తువును గ్రహించునప్పటికి మొదటి వస్తువు

మితి మిథ్యాప్రలాప ఏవస్యాత్, స్యాచ్చేత్పూర్వో త్తరయోః క్షణ యోస్సాదృశ్యస్య గ్రహీతైక స్తథాసత్యేకస్య క్షణద్వయావస్థానాత్ క్షణికత్వప్రతిజ్ఞా పీడ్యేత, తేనేదం సదృశమితి ప్రత్యయాంతరమే వేదం న పూర్వో త్తరక్షణద్వయగ్రహణనిమి త్తమితి చేన్న, తేనేదం సదృశమితి భిన్నపదార్థోపాదానాత్. ప్రత్యయాంతరమేవ చేత్ సాదృశ్యవిషయం స్యాత్, తేనేదం సదృశమితి వాక్య ప్రయోగోఽనర్థకస్స్యాత్, సాదృశ్యమిత్యేవ ప్రయోగః ప్రాప్ను

---

నశించుచున్నది.] కనుక ప్రత్యభిజ్ఞకొరకు సాదృశ్యమును గ్రహించుచున్నానను ప్రతివాది వాదము కేవల మిథ్యాప్రలాప మగుచున్నది. పూర్వో త్తరక్షణముల సాదృశ్యమునొక్కడే గ్రహించుచున్నాడందురేని అపుడుగూడ ఒకేవస్తువు రెండు క్షణములుండవలసి వచ్చుటచేత క్షణికత్వప్రతిజ్ఞకు బాధకలు గును, "దానితోనిది సదృశముగానున్నది" యనుసాదృశ్య జ్ఞానము పూర్వో త్తర క్షణములకుసంబంధించక స్వతంత్రమగు మఱియొక జ్ఞానమని వైనాశికులందదురుగాక ! అదియును సరి గాదు. తేన = దానితో, అని పరోక్షముగనున్న రెయొక పదార్థము, ఇదం = ఇది సన్నిహితము ప్రత్యక్షముగనున్న మరియొకపదార్థము—ఇటుల రెండు విభిన్నపదార్థములు అవా క్యమునందు ప్రతీతములగుచున్నవి. అది దానితో సదృశముగా నున్నది యను వాక్యముచే ప్రత్యక్షపరోక్షములగు రెండు వస్తువులకంటెభిన్నమై వానికిగల సాదృశ్యమును, చెప్పునట్టి మఱియొక జ్ఞానము ప్రతీతమైనచో "ఇది దానితో సదృశ ముగ నున్నది యను వాక్యమునకు అర్థమే లేకపోవును. [ఇది

యాత్. యదా హి లోకప్రసిద్ధః పదార్థః పరీక్షకై ర్న పరిగృహ్యతే తదా స్వపక్షసిద్ధిః పరపక్షదోషో వా ఉభయమప్యుచ్యమానం పరీక్షకాణామాత్మనశ్చ యథార్థత్వేన న బుద్ధిసంతానమారోహతి, ఏవమేవై షోఽర్థ ఇతి నిశ్చితం య_త్తదేవ వ_క్తవ్యమ్, తతోఽ

---

దానితో సదృశముగనున్నది యనువాక్యము పరోక్ష ప్రత్యక్షములుగనున్న వస్తుద్వయముయొక్క సాదృశ్యమును తెలియచేయుచున్నది. అట్టిసాదృశ్యజ్ఞానము సాదృశ్యముగల వస్తుద్వయజ్ఞానము కంటెభిన్నము. ఆపక్షమున వస్తుద్వయమును గూర్చిన ప్రస్తావము లేకనే 'సాదృశ్యము గలదు' అని మాత్రముప్రయోగముండవలయును. విమర్శకులు లోకమునందు సుప్రసిద్ధముగనున్న పదార్థముల నొప్పుకొనక వాదబలముచే స్వపక్షస్థాపనయు పరపక్షనాశమును చేసిన చేయవచ్చును. గాని అట్టివాదముయొక్క యాదార్థ్యము విమర్శకులయొక్కగాని అట్టివాదముచేయువారి యొక్కగాని బుద్ధికెక్కజాలదు. 'ఆవస్తువు దీనికి సదృశముగానున్నది.' అనువాక్యమునందు సాదృశ్యమును చూపురెండువస్తువుల జ్ఞానము ప్రత్యేకముగ నున్నపుడు మాత్రమే ఆవాక్యమర్థవంతమగును కాని వైనాశికుని క్షణికత్వవాదమునుబట్టి రెండవవస్తువుచూచునప్పటికి మొదటిది లేకపోవుచున్నది. పైవాక్యమున కర్థము లేకపోవును. కాని పైవాక్యమునకు అర్థము స్పష్టముగ మనకు గోచరమగుచున్నది. ఏ వస్తువు ప్రమాణములచే యేరూపమున నిశ్చితమైనదో ఆరూపమున ప్రదర్శింపబడవలయును. నిశ్చితరూపమునగాక రూపాంతరమున ప్రద

న్యదుచ్యమానం బహుప్రలాపిత్వమాత్మనః కేవలం ప్రఖ్యాపయేత్. న చాయం సాదృశ్యాత్ సంవ్యవహారో యుక్తః, తద్భావావగమాత్తత్సదృశభావానవగమాచ్చ. భవేదపి కదాచిద్బాహ్యవస్తుని విప్రలంభసంభవాత్ తదేవేదం స్యాత్తత్సదృశం వేతి సందేహః, ఉపలబ్ధరి తు సందేహోఽపి న కదాచిద్భవతి స ఏవాహం స్యాం తత్సదృశో వేతి, య ఏవాహం పూర్వేద్యురద్రాక్షం స ఏవాహమద్య స్మరామీతి నిశ్చితాత్తద్భావోపలంభాత్. తస్మాదప్యనుపపన్నో వైనాశికసమయః.

---

ర్శించినచో నట్టివారు వదరుబోతులని మాత్రము ప్రఖ్యాతి గాంచుదురు. కేవల సాదృశ్యమును మాత్రమాధారము చేసుకొని ఇట్టి పరిస్థితులయందు వ్యవహరించుట యుక్తము కాదు. ఏవస్తువు నయినను గుర్తించునపుడు పూర్వము వ్యవహరించిన వాడు తానేయని దెలిసికొనుచున్నాడు గాని ఆతనికి తాను సదృశుడని తెలిసికొనుట లేదు. మనకు బాహ్యములగు పదార్థములను గ్రహించు వేళల మోసముచేతగాని భ్రమవలన గాని పూర్వము చూచినది ఇదియేనా లేక దానికి సదృశము గానున్నది యా యని యొక వేళ సందేహము కలిగిన కలుగవచ్చునుగాక. అనుభవితవయమై మాత్రమిట్టి సందేహ మెప్పుడును కలుగదు. ఏ నేను పూర్వదినమున చూచితినో ఆనేనే యిపుడు స్మరించుచున్నాను అని నిశ్చితమగు జ్ఞానముపలబ్ధమగుచున్నది. అందువలన వైనాశికమతముపపన్నము కాదు.

## నాసతోఽదృష్టత్వాత్ (సూ. 26)

ఇతశ్చానుపపన్నో వైనాశికసమయః.

బౌద్ధః: యతః స్థిరమనుయాయికారణమనభ్యుపగచ్ఛతా మభావాద్భావోత్పత్తిమ్ 'నానుపమృద్య ప్రాదుర్భావా' దితి. వినష్టాద్ధి కిల బీజాదంకుర ఉత్పద్యతే, తథా వినష్టాత్ క్షీరాద్దధి, మృత్పిండాచ్చ ఘటః, కూటస్థాచ్చేత్కారణాత్కార్యముత్పద్యేత,

---

అ॥ మృదాది కారణ మెంతమాత్రము లేకనే ఘటాది కార్య ముత్పన్నమగు చున్నదను విషయము మిగిలియున్నది. అద్దాని నిరాకరణకొఱకు తరువాత సూత్రమారంభ మగు చున్నది.

అసతః=అభావమునుండి న=భావముత్పన్నము కాదు. ఏలనన ! అదృష్టత్వాత్ కాన్పింపకుండుట వలన: కావున సౌగతమత ముపపన్నము కాదు.

వైనాశిక మత మీ కారణముచేతను గూడ నుపపన్నము గాదు.

బౌద్ధుడు: స్థిరమై కార్యము వెంటనంటి కారణముండు నని యంగీకరింపని వారు అభావముచే భావకార్య ముత్పన్న మగునని యంగీకరించ వలసివచ్చును. 'మృదాదుల నశింప జేసియె ఘటాదికార్య ముత్పన్న మగుటవలన' యని యభావ మునుండి భావోత్పత్తిని వీరు చూపుచున్నారు. నశించిన బీజమువలన అంకుర ముత్పన్న మగుచున్నది. అటులనే నష్టమైన క్షీరమునుండి దధియు, మృత్పిండమునుండి ఘటము

అవిశేషాత్సర్వం సర్వత ఉత్పద్యేత. తస్మాదభావగ్రస్తేభ్యో బీజాదిభ్యోఽఙ్కురాదీనాముత్పద్యమానత్వాదభావాద్భావోత్పత్తిరితి మన్యంతే.

సిద్ధాంతీ : తత్రేదముచ్యతే, నాసతోఽదృష్టత్వా'దితి నాభావాద్భావః ఉత్పద్యతే, యద్యభావాద్భావ ఉత్పద్యేత, అభావత్వావిశేషాత్కారణవిశేషాభ్యుపగమోఽనర్థకస్స్యాత్. న హి బీజాదీనాముపమృదితానాం యోఽభావస్తస్య చ శశవిషాణాదీనాం చ నిస్స్వభావత్వావిశేషాదభావత్వే కశ్చిద్విశేషోఽస్తి, యేన బీజాదేవాం

---

నుత్పన్నమగుచున్నది. [పిండాకారము నశించుట కారణనాశమని తాత్పర్యము.] వినాశశూన్యమగు కారణము నుండి కార్యము బుట్టునేని, [కార్యము బుట్టుటకు కార్యమునం దెట్టిమార్పు నవసరము లేదు గనుక] సర్వకారణములనుండి సర్వకార్యము లొక్కమారుగ బుట్టును. అందువలన బీజములభావస్థితిని బొందినపుడే అంకురము లుత్పన్నములగుటం బట్టి అభావమునుండి భావ ముత్పన్నమగుచున్నది యని వీరు తలంచుచున్నారు.

సిద్ధాంతీ : ఇందుల కిట్లుల చెప్పుదుము. అటుల కాన్పించుట లేదుగావున అభావమునుండి భావము బుట్టనేరదు. అభావమునుండి భావ ముత్పన్నమగు నేని ప్రత్యేక కారణముల నంగీకరించుట నిరర్థకము. అభావ మన్ని కారణములకు సమానమే యగుచున్నది. బీజములు నశించినపుడు సంభవించు అభావమునకును, శశవిషాణము యొక్క అభావమునకు భేదమేమియు లేదు. అనగా భావస్వభావ మిసు

కురో జాయతే క్షీరాదేవ దధీత్యేవంజాతీయకః కారణవిశేషాభ్యుపగమోఽర్థవాన్ స్యాత్. నిర్విశేషస్య త్వభావస్య కారణత్వాభ్యుపగమే శశవిషాణాదిభ్యోఽప్యంకురాదయో జాయేరన్, న చైవం దృశ్యతే. యది పునరభావస్యాపి విశేషోఽభ్యుపగమ్యేతోత్పలాదీనామివ నీలత్వాదిః తతో విశేషవత్త్వాదేవాభావస్య భావత్వముత్పలాదివత్ ప్రసజ్యేత, నాప్యభావః కస్యచిదుత్పత్తిహేతుస్స్యాత్, అభావత్వాదేవ శశవిషాణాదివత్. అభావాచ్చ భావోత్పత్తావభావాన్వితమేవ సర్వం కార్యంస్యాత్, నైవం దృశ్యతే సర్వస్య చ వస్తునః స్వేన రూపేణ భావాత్మనైవోపలభ్యమానత్వాత్. న చ

---

మంతయు లేకుండుటయే అభావము. కనుక బీజమునుండియే యంకుర ముత్పన్నమగు చున్నదనియు క్షీరమునుండి దధి గల్గుచున్నదనియు కారణ విశేషము నంగీకరించుట యం దర్థము కాన్పించుట లేదు. కారణము లేకపోవుట యందు విశేషమేమియు లేదని యంగీకరించినపుడు, శశవిషాణాదుల నుండి అంకురాదు లుత్పన్నములు గావలెను. కాని శశవిషాణాదులనుండి కార్యోత్పత్తి కాన్పించుటలేదు. ఉత్పలాదులకు నీలము మొదలగు విశేషము లున్నటుల అభావము గూడ ననేకవిధములుగ నుండునని యంగీకరించినచో, నట్టి విశేషముల వలననే యభావము ఉత్పలాదువలెనే భావమగును. అభావము శశవిషాణమువలె లేనిది యగుటవలననే కార్యోత్పాదనమునకును గారణము కాలేదు. అభావమునుండి గలుగు భావకార్యములన్నియు నభావముతో గూడుకొన్నవియే కావలెను. కాని యట్లగుపడుటలేదు. వస్తుజాతమంతయు

మృదన్వితాశ్శరావాదయో భావా _స్తంత్వాదివికారాః కేనచిదభ్యుప గమ్యంతే. మృద్వికారానేవ తు మృదన్వితాన్ భావాన్ లోకః ప్రత్యేతి.

యత్తూక్తం స్వరూపోపమర్దమంతరేణ కస్యచిత్కూటస్థస్య వస్తునః కారణత్వానుపపత్తేరభావాద్భావోత్పత్తిర్భవితుమర్హతీతి, తదుక్తమ్, స్థిరస్వభావానామేవ సువర్ణాదీనాం ప్రత్యభిజ్ఞాయమానానాం రుచకాదికారణభావదర్శనాత్, యేష్వపి బీజాదిషు స్వరూపోపమర్దో లక్ష్యతే తేష్వపి నాసావుపమృద్యమానా పూర్వావస్థా ఉత్తరావస్థాయాః కారణమభ్యుపగమ్యతే, అనుపమృద్యమానానా

---

భావస్వరూపము తనతన యాకారముతో కాన్పించుచున్నది. మృత్తికతో గూడుకొని భావరూపమున కాన్పించుచున్న శరావములు తంతువులు మొదలగు వానినుండి బుట్టుచున్నవి యని యెవరు నంగీకరింపరు. మృత్తుకతో గూడుకొని భావ రూపములుగనున్న ఘటాదులుమృద్వికారములని యే లోకము గ్రహించుచున్నది.

స్వరూపనాశము లేక నిర్వికారమగు వస్తువు కారణముగ నుండలేదు గనుక నభావముచే భావోత్పత్తి కలుగు నను బౌద్ధవాదము దుష్టవాదమగు చున్నది. స్థిరస్వభావము గలిగి యారూపమున నెల్లపుడు గుర్తింపబడుచున్న సువర్ణాదులే రుచకాది కార్యములకు కారణభావము నొందుట లోకమున కాన్పించుచున్నది. స్వరూప నాశము కాన్పించుచున్న బీజాది కారణముల విషయమున గూడ, నాశమొందుచున్న పూర్వ బీజావస్థ ఉత్తరావస్థయగు అంకురమునకు

మేవానుయాయినాం బీజాద్యవయవానామంకురాదికారణభావా భ్యుపగమాత్, తస్మాదసద్భ్యశ్శశవిషాణాదిభ్యః సదుత్పత్త్యదర్శ నాత్ సద్భ్యశ్చ సువర్ణాదిభ్యస్సదుత్పత్తిదర్శనాత్ అనుపపన్నో౽ యమభావాద్భావోత్పత్త్యభ్యుపగమః. అపిచ చతుర్భ్యశ్చిత్తచైత్తా ఉత్పద్యంతే పరమాణుభ్యశ్చ భూతభౌతికలక్షణస్సముదాయ ఉత్ప ద్యత ఇత్యభ్యుపగమ్య పునరభావాద్భావోత్పత్తిం కల్పయద్భిర భ్యుపగతమపహ్నువానైర్వైనాశికైస్సర్వో లోక ఆకులీక్రియతే.

---

కారణము కాదు. [అనగా బీజనాశము అంకురోత్పత్తికి కార ణము కాదు.] బీజముయొక్క అంకురములు నాశము జెందక అంకురము ననుసరించి వచ్చుచున్నవి. అట్టి బీజావయవము లంకురకారణములు. అందువలన అత్యంతాభావములగు శశ విషాణాదుల వలన భావకార్య ముత్పన్నమగుట కాన్పించ కుండుటచేతను, భావపదార్థములగు సువర్ణాదులవలన భావ పదార్థము లుత్పన్నమగుటచేతను, అభావమునుండి భావో త్పత్తియగునను వాదము అనుపపన్న మగుచున్నది. మఱియు జ్ఞానము సుఖాదులు, విషయాదిస్కంధముల వలన బుట్టుచున్న వనియు, పృథివ్యాది నాలుగు భూతముల యొక్కయు భౌతిక ముల యొక్కయు సముదాయము పరమాణువుల వలన బుట్టు చున్నదనియు వైనాశికు లంగీకరించిరి. అట్టి వాదమును మఱుగు పఱచి యభావముచే భావోత్పత్తి గల్గునను వాద మును కల్పించుటచే లోకము నాకుల పెట్టుచున్నారు. 26

## ఉదాసీనానామపి చైవం సిద్ధిః (సూ. 27)

యది చాభావాద్భావోత్పత్తిరభ్యుపగమ్యేత, ఏవం సత్యుదాసీనానామనీహమానానామపి జనానామభిమతసిద్ధిస్స్యాత్, అభావస్య సులభత్వాత్. కృషీవలస్య క్షేత్రకర్మణ్యప్రయతమానస్యాపి సస్యనిష్పత్తిస్స్యాత్, కులాలస్య చ మృత్సంస్క్రియాయామప్రయతమానస్యాప్యమత్రోత్పత్తిః. తంతువాయస్యాపి తంతూనతన్వానస్యాపి తన్వానస్యేవ వస్త్రలాభః స్వర్గాపవర్గయోశ్చ న

---

అ॥ అభావమునుండి భావోత్పత్తియగునను సిద్ధాంతము వలన సర్వప్రవృత్తి నాశము సంభవించునని చూపుచున్నారు.

అభావము వలన భావోత్పత్తి సంభవించెనేని, ఉదాసీనానాం అపి = కార్యమునందు ప్రవర్తింపక నుదాసీనముగ నుండువారలకు గూడ ఏవం సిద్ధిః = ఈ విధముగ కార్యసిద్ధి కావలెను.

అభావమునుండి భావకార్యోత్పత్తి నంగీకరించితి రేని అట్టి స్థితిలో కార్యసిద్ధి కెట్టి ప్రయత్నము జేయక నుదాసీన భావముతోనున్న జనమునకుగూడ కోరిన కార్యసిద్ధి కావలెను, అభావము ప్రయాసలేకనే పొందతగి యున్నది. సేద్యము చేయువానికి వ్యవసాయ కర్మయందు ప్రయత్నము చేయకనే పంటపండవలయును. కులాలుడు మృత్తునకును పాకము మొదలగు సంస్కారములు ప్రయత్నింపకనే ఘటముత్పన్నము కావలెను. వస్త్రముల నేయువాడు దారము నేయకనే వస్త్రము లభించవలయును. మఱియు స్వర్గాప

కశ్చిత్కథంచిత్ సమీహేత. న చైతదుజ్యతేఽభ్యుపగమ్యతే వా కేనచిత్, తస్మాదనుపపన్నోఽయమభావాద్భావోత్పత్త్యభ్యుపగమః.

## (5) అభావాధికరణమ్ (సూ. 28–32)

## నాభావ ఉపలబ్ధేః (సూ. 28)

---

వర్గముల కేవడు నెట్టి ప్రయత్నము చేయనక్కరలేదు. ఇది యుక్తము గాదు. దీని నెవరు నంగీకరింపరు. అందువలన నభావముచే భావోత్పత్తి యగునను సిద్ధాంత మనుపపన్న మగుచున్నది. 27

### (5) అభావాధికరణము

---

అ॥ పూర్వాధికరణమున క్షణికబాహ్యార్థ వాదమును త్రోసిబుచ్చిరి. రాబోవు అధికరణమున క్షణిక విజ్ఞానవాదమును త్రోసిబుచ్చుచున్నారు.

విషయము : విజ్ఞానముకంటె నతిరిక్తమగు బాహ్యార్థము లేదను విజ్ఞానవాది సిద్ధాంతము.

సందేహము : ఈవాదము ప్రమాణమూలకమా? లేక భ్రాంతిమూలకమా? యని సంశయము.

పూర్వపక్షము : ప్రమాణమూలకము.

సిద్ధాంతి : భ్రాంతి మూలకము.

అభావః=పంచమహాభూతాత్మకమగు సర్వప్రపంచము యొక్క శూన్యత్వము న=సంభవింపదు. ఏలనన్న! ఉపలబ్ధేః=ప్రత్యక్ష ప్రమాణముచే నది లభ్యమగుచుండుట వలన.

ఏవం బాహ్యార్థవాదమాశ్రిత్య సముదాయాప్రాప్త్యాదిషు దూషణేషూద్భావితేషు విజ్ఞానవాదీ బౌద్ధ ఇదానీం ప్రత్యవతిష్ఠతే. కేషాంచిత్కిల వినేయానాం బాహ్యవస్తున్యభినివేశమాలక్ష్య తదనురోధేన బాహ్యార్థవాదప్రక్రియేయం విరచితా, నాసౌ సుగతాభిప్రాయః. తస్య తు విజ్ఞానైకస్కంధవాద ఏవాభిప్రేతః.

తస్మింశ్చ విజ్ఞానవాదే బుద్ధ్యారూఢేన రూపేణాంతస్థ ఏవ ప్రమాణప్రమేయఫలవ్యవహారస్సర్వ ఉపపద్యతే సత్యపి

---

బౌద్ధులచే నుపపాదింపబడిన బాహ్యార్థ వాదమునకు సముదాయములను సహేతుకము నిర్వహించ లేకపోవుటము మొదలగు నాక్షేపణములు ప్రదర్శింపబడినవి. వారలలో నొక తెగ వారగు విజ్ఞానవాదు లిపుడిటుల నడ్డుపడుచున్నారు. తన శిష్యులలో గొందఱికి బాహ్యార్థముల యందుగల పట్టుదలను గమనించి బుద్ధుడు బాహ్యార్థ ప్రక్రియను విరచించెను. బాహ్యార్థవాద మాతని అభిప్రాయము కాదు. విజ్ఞానవాద మొక్కటియే యతనికి సమ్మతము.

ఆవాద ప్రకారము ప్రమాణము [తెలిసికొనుట] ప్రమేయము [తెలిసికొనబడు విషయము] ఫలము [తెలిసికొనుటచే గలుగు ఫలము]- యీ వ్యవహారమంతయు నాంతరంగికమై బుద్ధిగత మగుచున్నది. [నీలవర్ణమని కల్పితమగు నాకారజ్ఞానము ప్రమేయము. ఇది నీలవర్ణమని తెలిసికొనుట జ్ఞానఫలము. తెలిసికొను శక్తి ప్రమాణము, తెలిసికొను శక్తికి ఆశ్రయమగుట వలన జ్ఞానమే ప్రమాత అనగా తెలిసికొనువాడు. ఇటుల నొకజ్ఞానమే వివిధాకారముల వివిధనామముల

బాహ్యేఽర్థే బుద్ధ్యారోహమంతరేణ ప్రమాణాదివ్యవహారానవతారాత్. న కథం పునరవగమ్యతే అంతస్థ ఏవాయం సర్వవ్యవహారో విజ్ఞానవ్యతిరిక్తో బాహ్యోఽర్థోఽస్తీతి. తదసంభవాదిత్యాహ. స హి బాహ్యోఽర్థోఽభ్యుపగమ్యమానః పరమాణవో వా స్యుస్తత్సమూహో వా స్తంభాదయః, తత్ర న తావత్పరమాణవః స్తంభాదిప్రత్యయపరిచ్ఛేద్యా భవితుమర్హంతి పరమాణ్వాభాసజ్ఞానాను

---

వ్యవహరింప బడుచున్నది] బాహ్యములగు నర్థము లున్నను బుద్ధిచే వానిని గ్రహింపనిచో ప్రమాణాది వ్యవహారము సంభవింపదు. ఈవ్యవహార మంతయు నాంతరంగికమనియు, విజ్ఞానమునకు భిన్నమగు బాహ్యార్థము లేదనియు నెటుల తెలియుచున్నది యనిన, బాహ్యార్థము లసంభవములు గనుక మేమిటుల చెప్పుచున్నాము. బాహ్యార్థ మనునది యొకటి యున్నటుల అంగీకరించిన, అది పరమాణువులైనను కావలయును, లేక స్తంబాదులు మొదలగు పరమాణు సమూహములైనను కావలయును. పరమాణువులు [అనేకములు, అతిసూక్ష్మములు కనుక] స్థూలము నీలము, ఏకమునగు నొక స్తంబమను జ్ఞానమున భాసించుటకు సమర్థములు గావు. [స్తంబమును జూచినపుడు పరమాణు జ్ఞానము కలుగుట లేదు.] స్తంబాదులు పరమాణు సమూహములు గూడగావు. అవి పరమాణువులకంటె భిన్నములని గాని అభిన్నములని గాని నిరూపింప శక్యమగుటలేదు. [స్తంబములు మొదలగు నవయవి పదార్థములు పరమాణువులకంటె భిన్నమైనచో గోవు అశ్వమువలె నత్యంతము విలక్షణములు కావలెను

త్పత్తేః, నాపి తత్సమూహా స్తమ్భాదయస్తేషాం పరమాణుభ్యో ఽన్యత్వానన్యత్వాభ్యాం నిరూపయితుమశక్యత్వాత్. ఏవం జాత్యాదీనపి ప్రత్యాచక్షీత.

అపిచానుభవమాత్రేణ సాధారణాత్మనో జ్ఞానస్య జాయమానస్య యోఽయం ప్రతివిషయం పక్షపాతః స్తంభజ్ఞానం కుడ్యజ్ఞానం ఘటజ్ఞానం పటజ్ఞానమితి, నాసౌ జ్ఞానగతం విశేషమంతరేణోపపద్యత ఇత్యవశ్యం విషయసారూప్యజ్ఞానస్యాంగికర్తవ్యమ్.

---

భిన్నము కానిచో, పరమాణు మాత్రము లగుటచే స్థూలరూపమున భాసింప సంభవము కాదు. అనగా స్తంబాది స్థూలరూప జ్ఞానమునకు పరిమాణువులు కారణము కానేరవు] ఆవిధముగనే జాతిమొదలగు వానిని గూర్చిగూడ నిరాకరింపతగును. [జాతి గుణ కర్మలు గల వ్యక్తుల కంటె నవి భిన్నములయినచో, జాత్యాది ధర్మములకును వ్యక్తులకును సంబంధము లేక స్వతంత్రములగును. భిన్నములు కానిచో ధర్మిభావము ధర్మ్మలకు సంభవించును. విరుద్ధమగుటచే భిన్నాభిన్నములు కానేరవు. కనుక నవయవ అవయవిభేదము లేనట్లే జాతివ్యక్తి భేదము గూడ నుండవీలు లేదు.]

మఱియు నుత్పన్నావస్థయందు జ్ఞానమంతయు నేకస్వరూపము. కాని ఇది స్తంబము, ఇది కుడ్యము, ఇది ఘటము ఇది పటమను వివిధ విషయికమగు ప్రత్యేకజ్ఞానము, జ్ఞానమందలి యేదో యొక విశేషము లేక సంభవింపదు. కనుక జ్ఞానస్వరూపము విషయస్వరూ మునొకటి యని యంగీకరింప వలయును. ఈవిషయము నంగీకరించితి మేని జ్ఞాన

అంగీకృతే చ తస్మిన్విషయాకారస్య జ్ఞానేనైవావరుద్ధత్వాదపార్థికా బాహ్యార్థసద్భావకల్పనా. అపి చ సహోపలంభనియమాదభేదో విషయవిజ్ఞానయోరాపతతి, న హ్యనయో రేకస్యానుపలంభేఽన్యస్యోపలంభోఽస్తి, న చైతత్ స్వభావవివేకే యుక్తం, ప్రతిబంధకారణాభావాత్, తస్మాదప్యర్థాభావః.

స్వప్నాదివచ్చేదం ద్రష్టవ్యమ్, యథా హి స్వప్నమాయామరీచ్యుదకగంధర్వనగరాదిప్రత్యయా వినైవ బాహ్యేనార్థేన

---

ము చేతనే జ్ఞేయమగు విషయాకారము నిరూపింపబడుచున్నది గనుక బాహ్యార్థ మొకటి యున్నది యని కల్పించుట నిరర్థకము. మఱియు జ్ఞేయమగు విషయము దాని జ్ఞానము- యీ రెండు నొక్క కాలముననే భాసించుచున్నవి. కనుక విషయ విషయజ్ఞానముల కభేదము తటస్థించుచున్నది. ఈ రెండింటిలో నొకటి భాసింపనప్పుడు రెండవది భాసించుట లేదు. జ్ఞాన మాంతరంగికము, జ్ఞానవిషయమగు స్తంబాదులు బాహ్యములు గనుక వాని స్వభావ భేదమునుబట్టి జ్ఞానజ్ఞేయములు భిన్నములని ప్రత్యేకింప వీలులేదు. అటులయినచో జ్ఞానజ్ఞేయములలో నొకటి లేకున్నను మఱియొకదానిని దెలిసికొనుటకు ప్రతిబంధ కారణ మేమియు లేదు. అందువలన గూడ బాహ్యార్థమనునది లేదు.

ఈవిషయమును స్వప్నాదులవలె గ్రహించ తగును. స్వప్నమునందు కాన్పించు యెండమావుల యందలి ఉదకము, గంధర్వనగరము మొదలగు జ్ఞానములు బాహ్యవిషయములు

గ్రాహ్యగ్రాహకాకారా భవంతి, ఏవం జాగరితగోచరా అపి స్తంభాదిప్రత్యయా భవితుమర్హంతీత్యవగమ్యతే, ప్రత్యయత్వావిశేషాత్. కథం పునరసతి బాహ్యేఽర్థే ప్రత్యయవైచిత్ర్యముపపద్యేత, వాసనావైచిత్ర్యాదిత్యాహ. అనాదౌ హి సంసారే బీజాంకురవద్విజ్ఞానానాం వాసనానాం చాన్యోన్యనిమిత్తనైమిత్తికభావేన వైచిత్ర్యం న విప్రతిషిధ్యతే. అపి చాన్వయవ్యతిరేకాభ్యాం వాసనానిమిత్తమేవ జ్ఞానవైచిత్ర్యమిత్యవగమ్యతే, స్వప్నాదిష్వంతరేణాప్యర్థం వాసనానిమిత్తస్య జ్ఞానవైచిత్ర్యస్యోభాభ్యామప్యావా

---

లేకనే జ్ఞేయ జ్ఞానాకారముల నొందుచున్నది. ఆవిధముగనే జాగరితమునందు దెలియవచ్చు స్తంబాది జ్ఞానములు గూడ కేవల జ్ఞానస్వరూపము లగుటవలన బాహ్యవిషయములు లేకనే సంభవించుచున్నని యని నిశ్చయింప వచ్చును. బాహ్యవిషయములు లేనిచో జ్ఞానవైచిత్ర్య మెటుల సంభవింప గలదని యడిగిన పూర్వజ్ఞాన వాసనలయొక్క వైచిత్ర్యముచే పరిష్కృత జ్ఞానవైచిత్ర్యము సంభవించుచున్న దందుము. [అనాదియగు ప్రవాహరూపముననున్న పూర్వజ్ఞానము వాసన యనబడును.] అనాదియగు సంసారమునందు, బీజ మంకురమునకు కారణము, అంకురము బీజమునకు కారణమైనటుల విజ్ఞానవాసనలు అన్యోన్యము కార్యకారణ భావము నొందుటచే ననుభూతమగు జ్ఞానవైచిత్ర్యమునకు నిషేధము లేదు. జ్ఞానవైచిత్ర్యమునకు పూర్వవాసనలే కారణమని అన్వయవ్యతిరేకములచే దెలియుచున్నది. స్వప్నమునందు బాహ్యవిషయములు లేకనే జ్ఞానవైచిత్ర్యము సంభవించుచున్నట్లు మన

భ్యామభ్యుపగమ్యమానత్వాత్. అంతరేణ తు వాసనానామర్థనిమిత్తస్య జ్ఞానవైచిత్రస్య మయాఽనభ్యుపగమ్యమానత్వాత్, తస్మాదప్యభావో బాహ్యస్యార్థస్యేతి.

సిద్ధాంతీ : ఏవం ప్రాప్తే బ్రూమః— 'నాభావ ఉపలబ్ధే' రితి. నఖల్వభావో బాహ్యస్యార్థస్యాధ్యవసాతుం శక్యతే, కస్మాత్? ఉపలబ్ధేః. ఉపలభ్యతే హి ప్రతిప్రత్యయం బాహ్యోఽర్థ స్తంభః కుడ్యం ఘటః పటఇతి, నచోపలభ్యమానస్యైవాభావో భవితుమర్హతి. యథాహి కశ్చిద్భుంజానో భుజి సాధ్యాయాం తృప్తౌ స్వయమనుభూయమానాయామేవం బ్రూయాత్ నాహం భుంజే న

---

ముభయులము విజ్ఞానవాదులు వేదాంతులు] గూడ నంగీకరించుచున్నారు. పూర్వవాసనలు లేక బాహ్యార్థమును గురించిన జ్ఞానవైచిత్ర్యము సంభవించుచున్నది యని మేమంగీకరించుట లేదు. కనుక బాహ్యార్థము లేదని మేము వక్కాణించుచున్నాము.

సిద్ధాంతి : పూర్వపక్ష మిట్లు సంప్రాప్తము కాగా మేము చెప్పుచున్నాము. బాహ్యార్థములు లేవని చెప్పవీలు లేదు. అవి ప్రత్యక్షముగ నుపలబ్ధము లగుచున్నవి. బాహ్యార్థము లేదని నిశ్చయింప శక్యము గాదు. ఏలనన! ప్రత్యక్షముగ ను ప ల బ్ధ మగుటవలన. జ్ఞాన విషయములగు, స్తంబము, కుడ్యము, ఘటము, పటము మొదలగు బాహ్యవిషయములుపలబ్ధము లగుచున్నవి. బాహ్యామున ఉపలబ్ధమగునది లేదనదగదు. భోజనముచేసి భోజనకర్మ సాధ్యమగు తృప్తిని యనుభవించుచు నేను భోజనము చేయలేదు, నాకు

వా తృప్యామీతి తద్వదింద్రియసన్నికర్షేణ స్వయముపలభమాన ఏవ బాహ్యమర్థం నాహముపలభే న చ సోఽస్తీతి బ్రువన్కథ ముపాదేయవచనస్స్యాత్.

విజ్ఞానవాదీ : నను నాహమేవం బ్రవీమి న కంచిదర్థ ముపలభ ఇతి. కింతూపలబ్ధివ్యతిరిక్తం నోపలభ ఇతి బ్రవీమి.

సిద్ధాంతీ : బాఢమేవం బ్రవీషి నిరంకుశత్వాత్తే తుండస్య. న తు యుక్త్యుపేతం బ్రవీషి, యత ఉపలబ్ధివ్యతిరేకోఽపి బలా దర్థస్యాభ్యుపగంతవ్యః ఉపలబ్ధేరేవ. న హి కశ్చిదుపలబ్ధిమేవ స్తంభః కుడ్యం చేత్యుపలభతే, ఉపలబ్ధివిషయత్వేనైవ తు స్తంభ కుడ్యాదీన్ సర్వే లౌకికా ఉపలభంతే. ఇతశ్చైవ మేవ సర్వే

---

తృప్తి కలుగలేదు" అని చెప్పువానివలె బాహ్యవిషయములతో నింద్రియ సంనికర్షచే స్వయముగ తెలియ వచ్చుచున్న బాహ్యవిషయము నాకు తెలియుటలేదు ఆవస్తువు లేదు అని పలుకువాని మాట లంగీకారము లెట్లగును?

విజ్ఞానవాది : బాహ్యమగునర్థము ముపలబ్ధమగుట లేదని మేమనుటలేదు. ఉపలబ్ధరూపమగు జ్ఞానముకంటె భిన్న ముగ నుపలబ్ధమగు వస్తువులేదని చెప్పుచున్నాము.

సిద్ధాంతి : మంచిది. నీనోటికి అడ్డములేకుండుటచే నిట్లు పలుకుచున్నావు! గాని యుక్తిసహాముగ పలుకుటలేదు. ఉప లబ్ధజ్ఞానమువలననే బాహ్యార్థ ముపలబ్దముకంటె భిన్నముగ నున్నటుల అవశ్య మంగీకరింపవలసియున్నది. ఎవడును ఉప లబ్ధ జ్ఞానముమాత్రము స్తంభము కుడ్యము అని గ్రహించుట లేదు. లోకములో నందరును స్తంభకుడ్యాదులను ఉపలబ్ధ

లౌకికా ఉపలభంతే యత్ప్రత్యాచక్షాణా అపి బాహ్యార్థమేవమా చక్షతే యదంతర్జ్ఞేయరూపం తద్బహిర్వదవభాసత ఇతి, తేఽపి హి సర్వలోకప్రసిద్ధాం బహిరవభాసాం సంవిదం ప్రతిలభమానాః ప్రత్యాఖ్యాతుకామాశ్చ బాహ్యమర్థం బహిర్వదితికత్కారణం కుర్వంతి ఇతరథా హి కస్మాద్బహిర్వదితి బ్రూయుః. న హి వసు మిత్రో వంధ్యాపుత్రవదవభాసత ఇతి కశ్చిదాచక్షీత. తస్మాద్యథాను

---

జ్ఞాన విషయములుగ దెలిసికొనుచున్నారు. బాహ్యార్థముల నంగీకరింపనివారుగూడ ఆంతరంగికముగ దెలియవచ్చుచున్న రూపమేదిగలదో అది బాహ్యమునగూడ భాసించుచున్న టుల పలుకుచున్నారు. ఇట్లు వారుగూడ బాహ్యార్థమునే చెప్పుచున్నారు. ఇటుల లోకమంతయు బాహ్యార్థ జ్ఞానమును గలిగియున్నది. బాహ్యమున అవభాసించుచున్న విషయ జ్ఞానముకలిగియున్నను దానిని నిరాకరించు కోర్కెచే బాహ్యార్థము బాహ్యమున నున్న దానివలె కాన్పించుచున్నదియని వలె శబ్దమును ప్రయోగించుచున్నారు. బాహ్యవస్తువు న్నటుల వారంగీకరింపనిచో 'బాహ్యవస్తువువలె' యని బాహ్యవస్తువు పోలిక నెటులచెప్పగలరు? [ఒకవస్తువున్నటుల అంగీకరించినపుడే దానితో మరియొక వస్తువును పోల్చగలము. వలెయను శబ్దమునకు పోలిక యర్థము] విష్ణుగుప్తుడు వంధ్యాపుత్రునివలె కాన్పించుచున్నాడని యెవరును చెప్పరు. అందు వలన యథార్థమేవిధమున అనుభూతమగు చున్నదో ఆవిధ

భవం తత్త్వమభ్యుపగచ్ఛద్భిర్బహిరేవావభాసత ఇతి యుక్తమభ్యుపగంతుం న తు బహిర్వదవభాసత ఇతి.

విజ్ఞానవాదీ : నను బాహ్యస్యార్థస్యాసంభవాద్బహిర్వదవభాసత ఇత్యధ్యవసితమ్.

సిద్ధాంతీ : నాయం సాధురధ్యవసాయో యతః ప్రమాణప్రవృత్త్యప్రవృత్తిపూర్వకౌ సంభవాసంభవావవధార్యేతే న పునస్సంభవాసంభవపూర్వికే ప్రమాణప్రవృత్త్యప్రవృత్తీ. యద్ధిప్రత్యక్షాదీనామన్యతమేనాపి ప్రమాణేనోపలభ్యతే తత్సంభవతి, యత్తు న

---

మున నే అంగీకరించిన, బాహ్యవస్తువే భాసించుచున్నది యని యొప్పుకొనుట యుక్తముగాని 'బాహ్యవస్తువువలె' నున్నదనుట యుక్తముగాదు.

విజ్ఞానవాది : బాహ్యార్థ మసంభవము గనుక బాహ్యవస్తువువలె భాసించుచున్నది యని నిశ్చయించితిమి.

సిద్ధాంతి : మీ నిశ్చయము సాధుకాదు. ఏలనన! వస్తువుయొక్క ఉనికి లేముల ప్రమాణముయొక్క ఉనికి లేములను బట్టి నిశ్చయించవలెను గాని వస్తువుయొక్క ఉనికిలేములను బట్టి ప్రమాణముల యునికిలేముల నిశ్చయింప వీలులేదు. ప్రత్యక్షాది ప్రమాణములలో నే ప్రమాణమునకు చేతనయినను నా వస్తువుయొక్క యునికి నిశ్చయింపవచ్చును. ఏ ప్రమాణమునకయినను ఉపలభ్యము గాని వస్తువు లేదని నిశ్చయింప వచ్చును. ప్రకృతమున బాహ్యార్థములన్నియు వానివాని స్వభావానుసారముగ ప్రత్యక్షాది ప్రమాణములలో నేదో యొకదానిచే నుపలభ్యమగు

కేనచిదపి ప్రమాణేనోపలభ్యతే తన్న సంభవతి. ఇహ తు యథా స్వం సర్వైరేవ ప్రమాణై ర్బాహ్యోఽర్థ ఉపలభ్యమానః కథం వ్యతిరేకావ్యతిరేకాది వికల్పైర్న సంభవతీత్యుచ్యేత, ఉపలబ్ధేరేవ. న చ జ్ఞానస్య విషయసారూప్యాద్విషయనాశో భవతి, అసతి విషయే విషయసారూప్యానుపపత్తేః, బహిరుపలబ్ధేశ్చ విషయస్య. అత ఏవ సహోపలంభనియమోఽపి ప్రత్యయవిషయయోరుపాయోపేయభావహేతుకో నాభేదహేతుక ఇత్యవగంతవ్యమ్. అపిచ ఘటజ్ఞానం పటజ్ఞానమితి విశేషణయోరేవ ఘటపటయోర్భేదో న

---

చున్నవి. అట్టిస్థితిలో బాహ్యార్థములు పరమాణువుల కంటె భిన్నములా అభిన్నములాయను మొదలగు తర్కవికల్పముచే నుపలబ్ధి కారణముచేత సంభవములు కావని చెప్ప నెట్లు శక్యము ? మఱియు విషయజ్ఞాన స్వరూపము బాహ్యవికారముతో తుల్యమగుటచే ఉన్న విషయము ఉండకపోదు. బాహ్యవిషయమే లేకపోయిన, బాహ్యవిషయముతో తుల్యరూపము సాధ్యముకాదు. విషయము బాహ్యముగ నుపలబ్ధమగుచున్నది. ఆంతరంగిక జ్ఞానము బాహ్యవిషయము యొక్క యునికి నొక్కమారుగ సంభవించుచున్నవను నియమమేర్పడుచున్న దానిచేజ్ఞానము గలుగుచున్నది. [బాహ్యవస్తువు ఉపాయము. తద్విషయిక జ్ఞానము పేయము-గనుక అనగా నుపాయముచే పొందతగినది.] సహోపలబ్ధిచే అర్థజ్ఞానములకు అభేదము కలుగుటలేదు. మఱియు, ఘటజ్ఞానము పటజ్ఞానము అనువ్యవహారమున, జ్ఞానమొక్కటియే, అట్టి జ్ఞానమునకు విశేషణములగు ఘటపటములు

విశేష్యస్యజ్ఞానస్య, యథా శుక్లో గౌః కృష్ణో గౌరితి శౌక్ల్యకార్ష్ణ్యయోరేవ భేదో న గోత్వస్య, ద్వాభ్యాం చ భేదఏకస్య సిద్ధో భవతి, ఏకస్మాచ్చ ద్వయోః తస్మాదర్థజ్ఞానయోర్భేదః. తథా ఘటదర్శనం ఘటస్మరణమిత్యత్రాపి ప్రతిపత్తవ్యమ్. అత్రాపి హి విశేష్యయోరేవ దర్శనస్మరణయోర్భేదో న విశేషణస్య ఘటస్య, యథా క్షీరగంధః క్షీరరస ఇతి విశేష్యయోరేవ గంధరసయోర్భేదో న విశేషణస్య క్షీరస్య తద్వత్.

అపిచ ద్వయోర్విజ్ఞానయోః పూర్వోత్తరకాలయోః

---

భిన్నము. తెల్లటియావు, నల్లటియావు అను స్థలమున గోజాతి యొకటియే. తెలుపు నలుపు అను వర్ణములు భిన్నములు, అభిన్నమగు జ్ఞానము భిన్నములగు బాహ్యార్థములకంటె భిన్నమని బాహ్యార్థములవలన తెలియుచున్నది. బాహ్యార్థములు జ్ఞానముకంటె భిన్నములని అభిన్నమగు జ్ఞానము వలన దెలియుచున్నది, [గోత్వ మొక్కటియని .భిన్నములగు శుక్ల కృష్ణ వర్ణములవలన తెలియుచున్నది. అందువలన అర్థజ్ఞానములకు భేదము సిద్ధమగుచున్నది. ఆవిధముగనే ఘటవిషయిక జ్ఞానము, ఘటవిషయిక స్మృతియు. ఇచటను గూడ ఘట మొక్కటియే కాని విశేష్యములగు దర్శన స్మరణములకు భేదము గలదు. ఆవిధముగనే క్షీర మొక్కటియే కాని క్షీరగంధము క్షీరరుచి భిన్నములని తెలిసికొనుచున్నాము.

మఱియు జ్ఞానము క్షణికమగుటవలన, బుట్టినవెంటనే నశించును. ఉత్తరకాలికజ్ఞానము పూర్వకాలిక జ్ఞాన

స్వసంవేదనేనైవోపక్షీణయోరితరేతరగ్రాహ్యగ్రాహకత్వానుపపత్తేః, తతశ్చ విజ్ఞానభేదప్రతిజ్ఞా క్షణికత్వాదిధర్మప్రతిజ్ఞా స్వలక్షణసామాన్యలక్షణవాస్యవాసకత్వావిద్యోపప్లవసదసద్ధర్మబంధమోక్షాది ప్రతిజ్ఞాశ్చ స్వశాస్త్రగతాస్తే హీయేరన్.

కించాన్యద్విజ్ఞానం విజ్ఞానమిత్యభ్యుపగచ్ఛతా బాహ్యోఽర్థస్తంభః కుడ్యమిత్యేవం జాతీయకః కస్మాన్నాభ్యుపగమ్యత ఇతి వక్తవ్యమ్. విజ్ఞానమనుభూయత ఇతి చేత్ బాహ్యోఽప్య

---

మును గ్రహించలేవు. కనుక వానిలో నొకటి మఱియొక దానిని తెలిసికొనగలదనుట యుక్తముకాదు. అందువలన విజ్ఞానములు భేదములనుట, వస్తువు క్షణకాలముండునదియు, అసత్తనియు ననుట (క్షణికత్వాదిధర్మప్రతిజ్ఞ,) ప్రత్యేకములు సామాన్యముల కంటెను విలక్షణమనుటయు (స్వలక్షణము.) జ్ఞానములన్నిటియందు జ్ఞానధర్మము సమానముగ నుండు ననుట [సామాన్యము.] పూర్వజ్ఞానముచే నుత్తరజ్ఞానము గలుగుచున్నదనుట, అవిద్యాసంసర్గచే ఉనికి లేముల భేదము సంభవించుచున్నదనుట; బంధము అజ్ఞానముచేతను, మోక్షము జ్ఞానము చేతను కలుగుచున్నదనుట—ఇట్టిబౌద్ధసిద్ధాంత ప్రతిజ్ఞ లెవ్వియును, [వీని జ్ఞానముతోపాటు వీనిని తెలిసికొనువాడు మఱియొక డుండవలెనుగనుక] అంగీకార్యములుకావు.

మఱియొక విషయము. విజ్ఞానము విజ్ఞానము అని కలవరించుమీరు స్తంభముకుడ్యము మొదలగు బాహ్యవిషయముల నేల అంగీకరించరో చెప్పవలసియున్నది. విజ్ఞాన మనుభవసిద్ధమగు చున్నదంటిరేని బాహ్యార్థముగూడ ననుభవసిద్ధమగు

ర్థోఽనుభూయత ఏవేతి యుక్తమభ్యుపగంతుమ్. అథ విజ్ఞానం ప్రకాశాత్మకత్వాత్ ప్రదీపవత్స్వయమేవానుభూయతే న తథా బాహ్యోఽర్థ ఇతి చేత్, అత్యంతవిరుద్ధాం స్వాత్మని క్రియామభ్యుపగచ్ఛసి అగ్నిరాత్మానం దహతీతివత్. అవిరుద్ధం తు లోకప్రసిద్ధం స్వాత్మవ్యతిరిక్తేన విజ్ఞానేన బాహ్యోఽర్థోనుభూయత ఇతి నేచ్ఛస్యహో పాండిత్యం మహద్దర్శితమ్.న చార్థవ్యతిరిక్తమపి విజ్ఞానం స్వయమేవానుభూయతే, స్వాత్మని క్రియావిరోధాదేవ.

విజ్ఞానవాదీ : నను విజ్ఞానస్య స్వరూపవ్యతిరిక్తగ్రాహ్యత్వే తదప్యన్యేన గ్రాహ్యం తదప్యన్యేనేత్యనవస్థా ప్రాప్నోతి.

---

చున్నదియని యంగీకరించుట యుక్తము. విజ్ఞానము ప్రకాశ స్వరూపమగుటవలన పెద్దదీపమువలె స్వయముగ ననుభూతమగుచున్నది. కాని బాహ్యార్థములు ననుభూతమగుట లేదంటివేని విజ్ఞానము తనను తాను ప్రకాశింప చేసికొనుచున్నదను అత్యంత విరుద్ధమగు క్రియను మీరంగీకరించుచున్నారు. అగ్ని తనను తాను దహించుకొనలేదు. బాహ్యార్థము తనకంటె భిన్నమగు విజ్ఞానముచే ననుభవింపబడుట విరుద్ధముకానిది లోకప్రసిద్ధమైనది. కాని యీ విషయమును మీరంకగీరింపకున్నారు. ఏమి! మీపాండిత్యప్రదర్శనము! మఱియు బాహ్యార్థము లేనిచో దాని విజ్ఞానము స్వయముగా ననుభూతము కానేరదు. తనక్రియకు తాను విషయమగుట సాధ్యము కాదు. [అనగా విజ్ఞానము తనను తాననుభవించలేదు.]

విజ్ఞానవాది : విజ్ఞానమును తనకంటె భిన్నమగు మఱియొకటి గ్రహించునంటివేని, దానిని గ్రహించునది మఱి

అపిచ ప్రదీపవదవభాసాత్మకత్వాత్ జ్ఞానస్య జ్ఞానాంతరం కల్ప్యతఃసమత్వాదవభాస్యావభాసకభావానుపపత్తేఃకల్పనానర్థక్యమితి.

సిద్ధాంతీ : తదుభయమప్యసత్, విజ్ఞానగ్రహణమాత్ర ఏవ విజ్ఞానసాక్షిణో గ్రహణాకాంక్షానుత్పాదానవస్థాశంకానుపపత్తేః

---

యొకటి, దానిని గ్రహించునది యింకొకటి యిట్లనవస్థ సంప్రాప్తమగును, జ్ఞానము ప్రదీపమువలె ప్రకాశింపచేయునది గనుక విజ్ఞానము మఱియొక విజ్ఞానమును బుట్టించునని మీరు (సిద్ధాంతి) చేయుకల్పనము నిరర్థకము. ఈరెండు విజ్ఞానములు ప్రకాశస్వరూపములే గనుక నొకవిజ్ఞానము మఱియొక విజ్ఞానమును దెలిసికొనలేదు.

సిద్ధాంతి : ఈరెండును అసద్వాదములే యగుచున్నవి. [విజ్ఞానములన్నియు బుద్ధివృత్తిరూపములు. విషయ యింద్రియ సంనికర్షచే బాహ్యావిషయములు బుద్ధిగతము లైనపుడు బుద్ధి బాహ్యావిషయాకారమును బొందుచున్నది. బాహ్యావిషయాకారమును బొందినపుడుండు బుద్ధియొక్క అవస్థ బుద్ధివృత్తి యనబడును. బుద్ధివృత్తులన్నియు విషయయింద్రియ సంనికర్షచే బుట్టుటవలన అనిత్యములు. ఇట్టి బుద్ధివృత్తులే బౌద్ధులచే విజ్ఞానమని బిలువబడుచున్నవి. బుద్ధివృత్తులన్నియు సాక్షిప్రకాశముచే నుద్దీపితములై యనుభూతము లగుచున్నవి]బుద్ధివృత్తిరూపములగు విజ్ఞానములు జన్మకలవగుటంజేసి అనిత్యములు, ఘటాదులవలె జడములు. వానిని దెలిసికొను సాక్షియొక డవసరమగుచున్నాడు. సాక్షి స్వయం ప్రకాశస్వరూపమగుటంజేసి ఆతని యునికికిగాని స్ఫురణమునకు

సాక్షిప్రత్యయయోశ్చ స్వభావవైషమ్యాదుపలబ్ధ్రుపలభ్యభావోప పత్తేః, స్వయం సిద్ధస్య సాక్షిణోఽప్రత్యాఖ్యేయత్వాత్.

కించాన్యత్ప్రదీపవద్విజ్ఞానమవభాసకాంతరనిరపేక్షం స్వయమేవ ప్రథత ఇతి బ్రువతా ప్రమాణాగమ్యం విజ్ఞానమనవగంతృకమిత్యుక్తం స్యాత్. శిలాఘనమధ్యస్థప్రదీపసహస్రప్రథనవత్.

విజ్ఞానవాదీ : బాఢమేవమనుభవరూపత్వాత్తు విజ్ఞానస్యేష్టో నః పక్షస్త్వయాఽనుజ్ఞాయత.

---

గాని మఱియొకదాని యపేక్ష లేదు. కనుక నిచట అనవస్థకవకాశము లేదు. సాక్షి విజ్ఞానములు భిన్నస్వభావములు గనుక సాక్షియుపలబ్ధ యగుటకును విజ్ఞాన ముపలబ్ధమగుటకును ఆక్షేపణయుండ నేరదు. సాక్షిస్వయంసిద్ధ వస్తువు దానిని త్రోసివేయ నేరికిని శక్యముకాదు.

మఱియొక విషయము. విజ్ఞానము ప్రదీపమువలె మఱియొకదానిచే ప్రకాశింపబడకనే స్వయముగ నభివ్యక్తమగునని మీరు చెప్పుచున్నారు. అందుచేత విజ్ఞానము ప్రత్యక్షాది ప్రమాణములచే దెలియరాదనియు, అభేద్యమగుశిలమధ్యనున్న దీపసహస్రమువలె వెలుగుచున్న నద్దాని దెలియగలవాడెవడును లేడనియు చెప్పినట్లగుచున్నది [అనగా సాక్షి నంగీకరించినటుల యర్థము.]

విజ్ఞానవాది: ఇది సత్యము. విజ్ఞాన మనుభవ రూపమగుటవలన తనకంటె నన్యుడగు జ్ఞాత మఱియొకడు లేడనుట మాకును యిష్టమగు పక్షమె గనుక దానినే మీరంగీకరించుచున్నారు.

సిద్ధాంతీ : ఇతి చేత్ న అన్యస్యావగంతుశ్చక్షురాదిసాధనస్య ప్రదీపాదిప్రథనదర్శనాత్, అతో విజ్ఞానస్యాప్యవధాన్యత్వావిశేషాత్ సత్యేవాన్యస్మిన్నవగంతరి ప్రథనం ప్రదీపవదిత్యవగమ్యతే.

విజ్ఞానవాదీ : సాక్షిణోఽవగంతుస్స్వయం సిద్ధతాముపక్షిపతా స్వయం ప్రథతే విజ్ఞానమిత్యేష ఏవ మమ పక్షస్త్వయా వాచోయుక్త్యంతరేణాశ్రితః

సిద్ధాంతీ : ఇతి చేత్ న విజ్ఞానస్యోత్పత్తిప్రధ్వంసానేకత్వాదివిశేషవత్త్వాభ్యుపగమాత్. అతః ప్రదీపవద్విజ్ఞానస్యాపి వ్యతిరిక్తావగమ్యత్వమస్మాభిః ప్రసాధితమ్.

---

సిద్ధాంతి : మీ రిట్లంటి రేని అదిసరికాదు. దీపమును దెలిసికొనుటకు చక్షుఃసాధనముతో జూచువాడొక డవసరమగుచున్నాడు. విజ్ఞానముగూడ దీపాదులవలెనే తెలియబడతగిన వస్తువగుటవలన దానిని దెలిసికొను వాడు మఱియొక డున్నపుడే, దీపమువలె అది తెలియవచ్చును.

విజ్ఞానవాది : విజ్ఞానమే స్వయముగా ప్రకాశించుచున్నదియను మావాదమునే, సాక్షి దెలిసికొనువాడు, అతడు స్వయం ప్రకాశరూపుడుఅనిభంగ్యంతరము చేమీరనువదించుచున్నారు.

సిద్ధాంతి : మీరిట్లంటి రేని అది సరికాదు. మీవిజ్ఞానము పుట్టునది, నశించునది, అనేక స్వరూపములు కలదియను మొదలగు ననేక విశేషణముల నంగీకరించుచున్నారు. [మేముపపాదించు సాక్షి ఏకము, నిత్యము, జన్మజరామృత్యురహితము కనుక మీ విజ్ఞానము మాసాక్షి రెండు నొక్కటి

## వైధర్మ్యాచ్చ న స్వప్నాదివత్ (సూ. 29)

సిద్ధాంతీ : యదుక్తం బాహ్యార్థాపలాపినా స్వప్నాదిప్రత్యయవజ్జాగరితగోచరా అపి స్తంభాదిప్రత్యయా వినైవ బాహ్యానార్థేన భవేయుః ప్రత్యయత్వావిశేషాదితి తత్ప్రతివక్తవ్యమ్. అత్రోచ్యతే—న స్వప్నాదిప్రత్యయవజ్జాగ్రత్ప్రత్యయా భవితు

కావు.] కనుక ప్రదీపమునకువలె విజ్ఞానమునకు గూడ దెలిసికొనువాడన్యు డొకడవసరమగు చున్నాడని సాధించినాము. 28

అ॥ బాహ్యార్థ ముపలబ్ధములగుటచే లేదని చెప్పవీలు లేదని పూర్వసూత్రమున నిర్ధారణ చేయబడినది. స్వాప్నిక జ్ఞానమువలెనే జాగరితమునందలి స్తంభకుడ్యాది జ్ఞానముల కాశ్రయము లేకుండనుండ గూడదాయను శంకకు రాబోవు సూత్రమున సమాధానము చెప్పుచున్నారు.

వైధర్మ్యాత్ =స్వప్న జాగరిత జ్ఞానములు విరుద్ధ స్వభావములు గలవగుటవలన, స్వప్నాదివత్ =స్వప్నజ్ఞానము వలె జాగరితమగు బాహ్యార్థజ్ఞానము న=నిరాలంబనము కాదు.

సిద్ధాంతి : స్వప్నాది జ్ఞానమువలే జాగరితమునందు కాన్పించు స్తంభాది బాహ్యార్థ జ్ఞానములు గూడ బాహ్యములగు నర్థములు లేకనే కలుగునని బాహ్యార్థముల త్రోసిపుచ్చు విజ్ఞానవాది పలుకుచున్నాడు. దీనికి సమాధానము చెప్పవలసియున్నది. అందులకిట్లు చెప్పుదుము. జాగరిత జ్ఞానములు స్వాప్నిక జ్ఞానములవలె నిరాలంబనములు కాతగవు.

మర్హంతి. కస్మాత్, వైధర్మ్యాత్. వైధర్మ్యం హి భవతి స్వప్న జాగరితయోః, కింపునర్వైధర్మ్యం, బాధాబాధావితి బ్రూమః. బాధ్యతే హి స్వప్నోపలబ్ధం వస్తు ప్రతిబుద్ధస్య మిథ్యా మయోప లబ్ధో మహాజనసమాగమ ఇతి, నహ్యస్తి మమ మహాజనసమా గమో నిద్రాగ్లానం తు మే మనో బభూవ తేనైషా భ్రాంతిరుద్బ భూవేతి. ఏవం మాయాదిష్వపి భవతి యథాయథం బాధః. న చైవం జాగరితోపలబ్ధం వస్తు స్తంభాదికం కస్యాంచిదప్యవ స్థాయాం బాధ్యతే, అపిచ స్మృతిరేషా యత్స్వప్నదర్శనమ్.

---

ఎందువలనన, రెండింటికి స్వభావభేద ముండుటవలన, స్వప్న జాగరితములకు భేదము కలదు. ఆ స్వభావభేద మెద్దియన, స్వాప్నిక జ్ఞానము బాధితమగుట, జాగరితజ్ఞానము బాధితము గాకుండుట-ఇదియే రెండింటికినిగల భేదమందుము. స్వప్నము నం దుపలబ్ధమైన వస్తువు మేల్కాంచిన తరువాత బాధితమగు చున్నది.'మహాజన సమాగమము నాకు లభించిన దనుకొంటిని. అది మిథ్య. అట్టి సమాగమము నాకు లభింపలేదు. నామనము నిద్రమత్తున నుండుటచే నిట్టి భ్రాంతి కలిగినది యని నిద్రనుండి మేల్కాంచినవాడనును. ఈ విధముగనే యింద్రజాలము మొద లగు పరిస్థితులలోని జ్ఞానమునకు గూడ నాయాస్థితికి తగినటుల బాధకలుగుచున్నది. జాగరితమునం దుపలబ్ధమగుస్తంభాదిజ్ఞాన మున కెట్టి యవస్థయందుగూడ బాధకలుగుటలేదు. స్వప్నము నందుగలిగిన జ్ఞానము జాగరితమునందు స్మరింపబడుటచే స్మృతి యగుచున్నది. జాగరిత జ్ఞానము సాక్షాదనుభవము. స్మృతి

స్మృత్యుపలబ్ధ్యోశ్చ ప్రత్యక్షమంతరం స్వయమనుభూయతే, అర్థ విప్రయోగసంప్రయోగాత్మకమిష్టం పుత్రం స్మరామి నోపలభే ఉపలబ్ధుమిచ్ఛామీతి. తత్రైవం సతి న శక్యతే వక్తుం మిథ్యా జాగరితోపలబ్ధిరుపలబ్ధిత్వాత్ స్వప్నోపలబ్ధివదిత్యుభయోరంతరం స్వయమనుభవతా. న చ స్వానుభవాపలాపః ప్రాజ్ఞమానిభిర్యుక్తః కర్తుమ్. అపి చానుభవవిరోధప్రసంగా జ్జాగరితప్రత్యయానాం స్వతో నిరాలంబనతాం వక్తుమశక్నువతా స్వప్నప్రత్యయసాధర్మ్యా ద్వక్తుమిష్యతే. న చ యో యస్య స్వతో ధర్మో న సంభవతి సోఽన్యసాధర్మ్యాత్తస్య సంభవిష్యతి. న హ్యగ్నిరుష్ణోఽను

---

జ్ఞానమునకును ప్రత్యక్షజ్ఞానమునకును గలభేదము ప్రత్యక్షముగ దెలియుచున్నది, జ్ఞానము విషయము దగ్గర లేనపుడు స్మృతి,దగ్గరనున్నపుడు ప్రత్యక్షజ్ఞానము నగుచున్నది. ప్రియమగుపుత్రుడు దూరమున నున్నపుడాతనిని తండ్రిస్మరించును. కాన్పించనందున ఆతనిని జూడగోరుచున్నాడు. వైధర్మ్యమిటులనుండ, జాగ్రత్స్వప్నజ్ఞానములకు గలభేదమును స్వయముగా ననుభవించుచు, జాగరిత జ్ఞానము స్వాప్నిక జ్ఞానము వలె మిథ్యయని చెప్పనేరికిని శక్యము కాదు. ప్రాజ్ఞుల మనుకొను వారు తమ తమ యనుభవముల త్రోసిబుచ్చతగదు. అనుభవమునకు విరుద్ధ మగుటవలన, జాగరిత జ్ఞానము స్వయముగ నిరాధారమని చెప్పచేతగాక స్వాప్నికజ్ఞానము యొక్క పోలికచే నటుల సిద్ధాంతము చేయ కోరుచున్నారు. స్వయముగ లేని ధర్మము పోలికచే సంభవింపదు. అగ్ని అను

ధూయమాన ఉదకసాధర్మ్యాచ్ఛీతో భవిష్యతి. దర్శితం తు వైధర్మ్యం స్వప్నజాగరితయోః.

## న భావోఽనుపలబ్ధేః (సూ. 30)

యదప్యుక్తం వినాప్యర్థేన జ్ఞానవైచిత్ర్యం వాసనావైచిత్ర్యాదేవావకల్ప్యత ఇతి తత్ప్రతివక్తవ్యమ్. అత్రోచ్యతే—న భావో వాసనానాముపపద్యతే త్వత్పక్షేఽనుపలబ్ధేర్బాహ్యానామర్థానామ్.

---

భవముచే వేడిగానున్నటుల దెలియుచున్నది. దానికి ఉదక సామ్యముచే శైత్యమును కల్పింపలేము. స్వప్నజాగరితములకు గల వైధర్మ్యము ప్రదర్శింపబడినది. 29

అ॥ స్వాప్నిక వైషమ్యబలముచే నిరాలంబనత్వము సిద్ధింపకపోవుగాక, బాహ్యవస్తువులేకపోయినను పూర్వాపూర్వ వాసనాబలముచే నుత్తరోత్తర విజ్ఞాన వైచిత్ర్యము సంభవించునను పూర్వపక్షమునకు తరువాత సూత్రమున సమాధానము చెప్పుచున్నారు.

అనుపలబ్ధేః=భౌద్ధ సిద్ధాంతమున బాహ్యార్థ ముపలబ్ధము కాదు కావున, భావః న = వాసనలకు సద్భావ ముపపన్నము గాదు:

బాహ్యార్థముతో సంబంధము లేకనే వాసనా వైచిత్ర్యముచే జ్ఞానవైచిత్ర్యము సంభవింప వచ్చునను వాదమునకు ప్రతివచనము చెప్పవలసియున్నది. అందులకిటుల పలుకుదుము. మీ సిద్ధాంతమునందు బాహ్యములగు నర్థము లుపలబ్ధములు గావు గనుక మానసిక వాసనలు సంభవముకావు. వస్తువు

అర్థోపలబ్ధినిమిత్తా హి ప్రత్యర్థం నానారూపా వాసనా భవంతి, అనుపలభ్యమానేషు త్వర్థేషు కింనిమిత్తా విచిత్రా వాసనా భవేయుః, అనాదిత్వేఽప్యంధపరంపరాన్యాయేనాప్రతిష్ఠైవానవస్థా వ్యవహారవిలోపినీ స్యాన్నాభిప్రాయసిద్ధిః. యావప్యన్వయ వ్యతిరేకావర్థాపలాపినోపన్యస్తౌ వాసనానిమిత్తమేవేదం జ్ఞానజాతం నార్థనిమిత్తమితి తావప్యేవం సతి ప్రత్యుక్తౌ ద్రష్టవ్యౌ, వినార్థోప లబ్ధ్యా వాసనానుత్పత్తేః. అపిచ వినాపి వాసనాభిరర్థోపలబ్ధ్యుప గమాద్వినా త్వర్థోపలబ్ధ్యా వాసనోత్పత్త్యనభ్యుపగమాదర్థసద్భావ

---

లెల్లను ప్రత్యక్షాది ప్రమాణములచే ననుభూతములై నానా విధములగు వాసనలు కలుగుటకు కారణము లగుచున్నవి. బాహ్యావస్తువు లనుభూతములు కానపుడు వాని వాసనలే కారణమున కలుగగలవు? వాసనలు [బీజాంకుర న్యాయమున] అనాది యందురు గాక ! అపుడుగూడ సర్వవ్యవహార లోపము నకు ఆధారము లేనట్టి యనవస్థ కారణము అగునుగానిమీా వాదమును నిలువ నేరదు. జ్ఞానజాత మంతయు వాసనవలన నే కలుగుచున్నదిగాని బాహ్యార్థమువలన కలుగుట లేదనివాదించు బాహ్యార్థవాది విరోధిచే నుపపాదింపబడుచున్న అన్వయ వ్యతిరేకములుగూడ మా వాదముచే ననగా బాహ్యార్థములు లేక వాసనలు కలుగ నేరవను వాదముచేతనే సమాధానము చెప్పబడుచున్నటుల గ్రహించవలయును. అర్థోపలబ్ధిలేక వాసన లసంభవము. మఱియు వాసనలులేక అర్థోపలబ్ధి సంభ వించునని యంగీకరించుటచేతను, అర్థోపలబ్ధిలేక వాసన లుత్పన్నమగునని అంగీకరింపక బోవుటచేతను ఈ విధమగు

మేవాన్వయవ్యతిరేకావపి ప్రతిష్ఠాపయతః అపిచ వాసనానామ సంస్కారవిశేషాః, సంస్కారాశ్చనాశ్రయమంతరేణావకల్పంతే, ఏవం లోకే దృష్టత్వాత్, న చ తవ వాసనాశ్రయః కశ్చిదస్తి ప్రమాణతోఽనుపలబ్ధేః.

## క్షణికత్వాచ్చ (సూ. 31)

యదప్యాలయవిజ్ఞానం నామ వాసనాశ్రయత్వేన పరికల్పితం తదపి క్షణికత్వాభ్యుపగమాదనవస్థితస్వరూపం సత్ప్రవృత్తివిజ్ఞానవన్న వాసనానామధికరణం భవితుమర్హతి. న హి కాలత్రయ

---

నన్వయ వ్యతిరేకములు రెండును మా బాహ్యార్థ వాదమునే స్థాపించుచున్నవి. మఱియు వాసన యనునది యొక సంస్కార విశేషము. ఆశ్రయము లేక సంస్కారములు కలుగనేరవు. లోకమున యీ విధముగ కనుపించుచున్నది. ప్రమాణముచే దెలియ కుండుటవలన వాసనల కాశ్రయము లేకపోవుచున్నది. కనుక వాసనలు సంభవముకావు: 30

అ॥ వాసనలు నిరాశ్రయములుకావు. ఆలయవిజ్ఞానము వానికి ఆశ్రయమగుచున్నది యను పూర్వపక్షి వాదమునకు సమాధానము తరువాత సూత్రమున చెప్పుచున్నారు.

ఆలయవిజ్ఞానము క్షణికత్వాత్ చ = క్షణికమని యంగీకరింపబడుటవలన వాసనల కాశ్రయము కానేరదు.

మీరు పరికల్పించిన ఆలయ విజ్ఞానము వాసనల కాశ్రయమని మీరందురేని అదియును క్షణికమని మీ రంగీకరించుటవలన, అనవస్థితమై ప్రవృత్త విజ్ఞానమువలె వాసనల

సంబంధిన్యేకస్మిన్నన్వయిన్యసతి కూటస్థే వా సర్వార్థదర్శిని దేశ కాలనిమిత్తాపేక్షవాసనాధీనస్మృతి ప్రతిసంధానాదివ్యవహారస్సంభవతి. స్థిరస్వరూపత్వేత్వాలయవిజ్ఞానస్య సిద్ధాంతహానిః.

అపిచ విజ్ఞానవాదేఽపి క్షణికత్వాభ్యుపగమస్య సమానత్వాద్యాని బాహ్యార్థవాదే క్షణికత్వనిబంధనాని దూషణాన్యుద్భావితాని 'ఉత్త

---

కాశ్రయము కానేరదు. [విజ్ఞాన మాలయవిజ్ఞానము ప్రవృత్త విజ్ఞానమని ద్వివిధము. ఆత్మకు సంబంధించిన విజ్ఞానము ఆలయ విజ్ఞానము. రూపాది బాహ్యా విషయములకు సంబంధించిన విజ్ఞానము ప్రవృత్త విజ్ఞానము. ప్రవృత్త విజ్ఞానము ఆలయ విజ్ఞానముయొక్క పూర్వవాసనలచే గల్గును. ఆలయవిజ్ఞానము వాసనలు—ఈ రెండు గోశృంగములవలె నొక్కమారుగ నుత్పన్నమైనచో, వానికి ఆశ్రయ ఆశ్రయిభావము సంభవముగాదు. ముందు వెనుకగా నుత్పన్నమైనచో ముందు బుట్టినది క్షణిక మగుటచే రెండవది బుట్టునప్పటికి ఉండదు. అపుడుగూడ వానికి ఆశ్రయ ఆశ్రయిభావము సంభవముకాదు.] కాలత్రయము నందును స్థిరస్థాయిగనుండు సవికారమగు నాత్మనో సర్వార్థములగు సాక్షిభూతుడగు కూటస్థునినో అంగీరింపక పోయిన దేశకాల నిమిత్తముల నాధారముచేసికొని సంభవించు జ్ఞానరూపములగు స్మృతి, అభిజ్ఞ మొదలగు వ్యవహారము సంభవముకాదు. ఆలయవిజ్ఞానము స్థిరమందురేని క్షణికత్వ సిద్ధాంతమునకు భంగము.

[ఈ సూత్రమునకు మఱియొక విధముగ వ్యాఖ్యానము చేయవచ్చును] విజ్ఞానవాదులు గూడ క్షణికత్వవాదము నం

రోత్పాదే చ పూర్వనిరోధా' దిత్యేవమాదీని తానీహాప్యనుసంధాతవ్యాని. ఏవమేతౌ ద్వావపి వైనాశికపక్షౌ నిరాకృతౌ బాహ్యార్థవాదిపక్షో విజ్ఞానవాదిపక్షశ్చ. శూన్యవాదిపక్షస్తు సర్వప్రమాణవిప్రతిషిద్ధ ఇతి తన్నిరాకరణాయానాదరః క్రియతే. నహ్యయం సర్వప్రమాణసిద్ధో లోకవ్యవహారోఽన్యత్తత్త్వమనధిగమ్య శక్యతేఽపహ్నోతుం అపవాదాభావే ఉత్సర్గప్రసిద్ధేః.

## సర్వథానుపపత్తేశ్చ (సూ. 32)

కిం బహునా యథాయథాయం వైనాశికసమయ ఉపపత్తి

---

కరించుటచే బాహ్యార్థవాదుల క్షణికత్వవాదమును నిరాకరించుటకు ప్రదర్శింపబడిన కారణము లన్నియు నిచటగూడ పొందుపరుపతగును. ఈవిధముగ వైనాశికులగు బాహ్యార్థవాది విజ్ఞానవాది- వీరిరువురి వాదము లీవిధముగ త్రోసిబుచ్చపడినవి. శూన్యవాదిపక్షము సర్వప్రమాణములచే నిరాకరింపబడుచున్నది, కనుక దాని నిరాకరించుటకు ప్రత్యేక ప్రయత్నము చేయలేదు. సర్వప్రమాణసిద్ధమగు నీ లోకవ్యవహారమును, మఱియొకతత్త్వము నంగీకరింపక పరిమార్చుటకు శక్యముకాదు. విశేషశాస్త్రము లేనంతవరకు సామాన్యశాస్త్రము ప్రమాణమే యగును. 31

సర్వథా=ఏవిధముగ పరిశీలించినను, అనుపపత్తేః చ= బౌద్ధమతము నిర్వహించక పోవుటవలన ఆలంబనీయము కాదు

ఇన్ని మాటలేల! ఈవైనాశిక సిద్ధాంతమునకు సహేతుకత్వము కల్పించుట కెన్నెన్ని ప్రకారముల విమ

మత్త్వాయ పరీక్ష్యతే తథా తథా సికతాకూపవద్విదీర్యత ఏవ. న కాంచిదప్యత్రోపపత్తిం పశ్యామః, అతశ్చానుపపన్నో వైనాశిక తంత్రవ్యవహారః. అపిచ బాహ్యార్థవిజ్ఞానశూన్యవాదత్రయమపీత రేతరవిరుద్ధముపదిశతా సుగతేన స్పష్టీకృతమాత్మనోఽసంబంధ ప్రలాపిత్వం, ప్రద్వేషో వా ప్రజాసు విరుద్ధార్థప్రతిప్రత్త్యా విము హ్యేయురిమాః ప్రజా ఇతి. సర్వథాప్యనాదరణీయోఽయం సుగత సమయః శ్రేయస్కామైరిత్యభిప్రాయః.

## (6) ఏకస్మిన్నసంభవాధికరణమ్ (సూ. 33-37)

ర్శింప బడుచున్నదో అన్నివిధముల నిసుకదిన్నెయందు త్రవ్విన బావియొడ్డువలె కూలిపోవుచున్నది. ఈసిద్ధాంతమున కుపపత్తియేమియు మాకు కానవచ్చుటలేదు. కనుక వైనా శికతంత్రము వ్యవహారమునం దుపపన్నముకాదు. మఱియు బాహ్యార్థము, విజ్ఞానము, శూన్యములను అన్యోన్యము విరు ద్ధమగు సిద్ధాంతత్రయము నుపదేశించిన సుగతుడు అసంబద్ధ ప్రలాపములు చేయువాడయినను కావలెను. ప్రజలయందు తనకుగల ద్వేషభావముచే విరుద్ధ విషయములను బోధించి వారలను మూఢులుగానైనను చేయతలంచియుండ వలెను. అన్నివిధములను నీసుగత సిద్ధాంతము శ్రేయస్కాములచే నాదరణీయము కాదు. 32

### (6) *ఏకస్మిన్నసంభవాధికరణము*

అ॥ పూర్వాధికరణమున ముక్తకచ్ఛులగు బౌద్ధుల సిద్ధాంతము నిరసింపబడినది. ప్రకృతాధికరణమున ముక్తాం బరులగు జైనుల సిద్ధాంతమును త్రోసిబుచ్చుచున్నారు.

## నైకస్మిన్నసంభవాత్ (సూ. 33)

నిరస్తస్సుగతసమయః, వివసనసమయ ఇదానీం నిరస్యతే.

సప్తచైషాం పదార్థాస్సమ్మతా జీవాజీవాస్రవసంవరనిర్జర బంధమోక్షా నామ. సంక్షేపతస్తు ద్వావేవ పదార్థౌ జీవాజీవాఖ్యౌ. యథాయోగం తయోరేవేతరాంతర్భావాదితి మన్యంతే, తయోరి

---

ఏకకాలమున నొకవస్తువునందు విరుద్ధధర్మములు, అసంభవాత్ = సంభవము కావు కనుక న = జైనమత మసంగతము.

బౌద్ధ సిద్ధాంతము త్రోసివేయబడినది. ఇపుడు వస్త్ర ధారణమును పరిత్యజించిన దిగంబరుల సిద్ధాంతము త్రోసి వేయబడుచున్నది.

వీరలు సప్తతత్త్వముల నంగీకరించుదురు. జీవుడు, అజీవము అస్రవము, సంవరము, నిర్జరము, బంధము, మోక్షము, అను నవివారిసప్త పదార్థములు.[జీవుడుభోక్త, అజీవము భోగ్యము, విషయాభి ముఖముగ ఇంద్రియములు ప్రవృత్తి ఆస్రవము. అట్టి ప్రవృత్తిని అరికట్టు యమనియమాదులు సంవరము, కల్మషమును నశింపజేయు తప్తశిలారోహణాదులు నిర్జరము, కర్మ బంధము;కర్మపాశనాశ మగుచుండ,సత్యలోకాకాశమును ప్రవేశించి సతత మూర్ధ్వగమనము మోక్షము. ఆస్రవాదులు భోగ్యాంతర్భావములగుట వలన] జీవాజీవులనునవి మాత్రమే రెండుతత్త్వములని చెప్పవచ్చును. యథాసంభవముగ మిగిలిన వన్నియు నీరెండింటిలో నంతర్భాగము లగుచున్నవి యని

మపరం ప్రపంచమాచక్షతే పంచాస్తికాయా నామ, జీవాస్తికాయః పుద్గలాస్తికాయః ధర్మాస్తికాయః అధర్మాస్తికాయః ఆకాశాస్తికాయశ్చేతి. సర్వేషామప్యేషామవాంతరప్రభేదాన్ బహువిధాన్ స్వసమయపరికల్పితాన్ వర్ణయంతి, సర్వత్ర చేమం సప్తభంగీనయం నామ న్యాయమవతారయంతి. స్యాదస్తి. స్యాన్నాస్తి, స్యాదస్తి చ నాస్తి చ, స్యాదవక్తవ్యః, స్యాదస్తి

---

వారు తలంచుచున్నారు. [మధ్యమార్గమును ద్రొక్కి] అయిదు అస్తికాయములుగ వారిసిద్ధాంతమును విస్తరించుచున్నారు. జీవాస్తికాయము, పుద్గలాస్తికాయము, ధర్మాస్తికాయము, అధర్మాస్తికాయము, ఆకాశాస్తికాయము అని అస్తికాయములయిదు. [అస్తికాయము వీరి మతపారిభాషికపదము. అస్తి= ఉన్నదియని, కాయ్యతే = చెప్పబడుచున్నది గనుక అస్తికాయము. పదార్థము లన్నియు నయిదు భాగములుగ నున్నవియని యర్థము. జీవుడగు నస్తికాయ మొకటి. పరమాణుసమూహములగు శరీరము పుద్గలాస్తికాయము. లెస్సయగు ప్రవృత్తిచే నూహింపతగినది ధర్మాస్తికాయము. స్వభావముచే నూర్ధ్వలోకమునకు బోవుజీవు డీశరీరమున నుండుటకు కారణము అధర్మము. ఆవరణము లేకుండుట ఆకాశము.] వీనియన్నిటికిని వివిధములగు నవాంతరభేదములను వారి సిద్ధాంతమున కల్పించి వర్ణించుచున్నారు. అంతటను అస్తిత్వాది సప్తరీతులను నయమును సమన్వయము చేయుచున్నారు. స్యాత్, అస్తి, స్యాన్నాస్తి స్యాదస్తి చనాస్తిచ, స్యాదవక్తవ్యః స్యాదస్తి చావక్తవ్యశ్చ స్యాన్నాస్తి చావక్త

చావక్తవ్యశ్చ, స్యాన్నాస్తి చావక్తవ్యశ్చ, స్యాదస్తి చ నాస్తిచా వక్తవ్యశ్చేతి ఏవమేవైకత్వనిత్యత్వాదిష్వపీమం సప్తభంగీనయం యోజయంతి.

సిద్ధాంతీ : అత్రాచక్ష్మహే, నాయమభ్యుపగమో యుక్త ఇతి. కుతః, ఏకస్మిన్నసంభవాత్. నహ్యేకస్మిన్ ధర్మిణి యుగ

---

వ్యశ్చ, స్యాదస్తిచనాస్తి చావక్తవ్యశ్చయని వారిసప్తభంగి నయము. [నయమన న్యాయము. స్యాత్=ఏదో విధముగ నున్నది. వస్తువు కావలయునను కోర్కెకలుగు చుండగ నేదో విధముగనున్నది. నఅస్తి=అక్కరలేదని కోర్కెకలిగినపుడు లేదు. స్యాత్ నాస్తిచఅస్తిచ = ఉభయవాంఛలు కలిగినపుడు ఉన్నది, లేదు. స్యాత్ అవక్తవ్యః=ఒక్కమారుగ నుభయ వాంఛలు గలిగినపుడు ఆస్తిఅను రెండు శబ్దముల నొక్క మారుగ నుచ్చరింప శక్యము కాదుగనుక స్యాదవక్తవ్యము స్యాదస్తి చావక్తవ్యశ్చ = మొదటినాలుగు భంగుల కోర్కె కలిగినపుడు అయిదవభంగి యగును. స్యాన్నాస్తి చావక్తవ్యః చ=ద్వితీయ చతుర్థభంగుల యందు కోర్కె కలిగినపుడారవ భంగి. స్యాదస్తి చావక్తవ్యశ్చేతి = తృతీయ చతుర్థభంగుల యందు కోర్కెగలిగెనేని సప్తమభంగి] ఈవిధమగు సప్త భంగీనయమును ఏకత్వము నిత్యత్వము మొదలగు వానివిష యముఃగూడ ఘటింపచేయుచున్నారు.

సిద్ధాంతి : ఈ సప్తభంగీన్యాయము ఆమోదింప తగి నది కాదనుచున్నాము. ఏలనన, ఒక్కదానియందేకసమయ మున అస్తిత్వము నాస్తిత్వము మొదలగు విరుద్ధధర్మము

పత్సదసత్త్వాదివిరుద్ధధర్మసమావేశస్సంభవతి శీతోష్ణవత్. య ఏతే సప్తపదార్థా నిర్ధారితా ఏతావంత ఏవంరూపాశ్చేతి తే తథైవ వా స్యుః నైవ వా తథా స్యుః ఇతరథా హి తథా వా స్యుః అతథా వేత్యనిర్ధారితరూపం జ్ఞానం సంశయజ్ఞానవదప్రమాణమేవ స్యాత్.

దిగమ్బరః : నన్వనేకాత్మకం వస్త్వితి నిర్ధారితరూపమేవ జ్ఞానముత్పద్యమానం సంశయజ్ఞానవన్నాప్రమాణం భవితుమర్హతి,

సిద్ధాంతీ : నేతిబ్రూమః. నిరంకుశం హ్యనేకాంతత్వం సర్వవస్తుషు ప్రతిజానానస్య నిర్ధారణస్యాపి వస్తుత్వావిశేషాత్,

---

లసంభవము గనుక. శీతోష్ణములు రెండునొక్కచోట నేక కాలమున నుండవు. ఈ సప్తపదార్థములు వీని సంఖ్య యిన్ని వీని స్వరూపమిది యనిమీరు నిశ్చయించిన,ఆప్రకారముండ నైనను యుండవలెను. లేక ఉండకుండ నైనను యుండవలెను. అటు గాక ఈ ప్రకారముగా నైనను ఉండవచ్చును. లేక మరియొక ప్రకారమైనను ఉండవచ్చును. అని నిశ్చితముగాని స్వరూపము సంశయజ్ఞానమువలె అప్రమాణమగును.

దిగమ్బరుడు : వస్తువు అనేకాత్మకమని దాని స్వరూపము నిశ్చితమైనది. అందువలన కలుగు జ్ఞానము సంశయ జ్ఞానమువలె అప్రమాణము కానేరదు. [అట్టిజ్ఞానము నిశ్చిత జ్ఞానమే అగుచున్నది.]

సిద్ధాంతి : అటుల కాదందుము. వస్తువు లన్నియు హద్దులేక ననేకరూపములు గలవని చేయు స్వరూపనిర్ధారణ ముగూడ నొకవస్తువేయగుచున్నది. కనుక 'స్యాదస్తి

స్యాదస్తి స్యాన్నాస్తీత్యాదివికల్పోపనిపాతాదనిర్ధారణాత్మకతైవ స్యాత్, ఏవం నిర్ధారయితుర్నిర్ధారణఫలస్య చ స్యాత్పక్షేఽస్తితా స్యాచ్చ పక్షే నాస్తితేతి, ఏవంసతి కథం ప్రమాణభూతస్సం స్తీర్థకరః ప్రమాణప్రమేయప్రమాతృప్రమితిష్వనిర్ధారితాసూపదేష్టుం శక్నుయాత్, కథం వా తదభిప్రాయానుసారిణస్తదుపదిష్టేఽర్థేఽనిర్ధారితరూపే ప్రవర్తేరన్. ఐకాంతికఫలత్వనిర్ధారణే హి సతి తత్సాధనానుష్ఠానాయ సర్వో లోకోఽనాకులః ప్రవర్తతే నాన్యథా,

---

స్యాన్నాస్తి' యను సప్తభంగీ న్యాయము మీనిర్ధారణమునకుగూడ వర్తించుటచే నది నిర్ధారిత స్వరూపముకాక పోవలయును, [మానసిక భావములుగూడ వస్తువులన బడును. నిర్ధారణలు మానసిక భావములగుటవలన వస్తువులే యగుచున్నవి, సప్తభంగీనయము అన్నివస్తువులకు నన్వయించును కనుక చేయబడిన రూపనిర్ధారణమునకుగూడ నన్వయించును. కనుక దిగంబరులచే చేయబడిన స్వరూపనిర్ణయము స్యాదస్తి స్యాన్నాస్తియను న్యాయముచే కావచ్చును కాకపోవచ్చును] ఈ విధమున నిర్ధారణ చేయువానికిని అతని నిర్ధారణ ఫలమునకుగూడ స్యాదస్తి న్యాయము వర్తించును స్యాన్నాస్తి అను వర్తించదు విషయ మిటులనుండ, ప్రమాణము ప్రమేయము, ప్రమాత, ప్రమితి [తెలిసికొనబడిన జ్ఞానము] యివి అన్నియు ననిర్ధారితము లగుచుండ తీర్థకరుడగు జినుడు ప్రమాణభూతుడై ఉపదేశికు డెట్లు కాగలడు. ఆతని అనుయాయులు అనిర్ధారితములగు నుపదేశముల నెట్లు అనుసరింపగలరు? ఫలము నియతముగ నిశ్చితమైనపుడే దానిని సాధించుట కున్ముఖులై

అతశ్చానిర్ధారితార్థం శాస్త్రం ప్రణయన్ మత్తోన్మత్తాదివదనుపాదేయవచనస్స్యాత్. తథా పంచానామస్తికాయానాం పంచత్వసంఖ్యాఽస్తి వా నాస్తి వేతి వికల్ప్యమానా స్యాత్తావదేకస్మిన్ పక్షే పక్షాంతరే తు న స్యాదిత్యతో న్యూనసంఖ్యాత్వమధికసంఖ్యాత్వం వా ప్రాప్నుయాత్. నచైషాం పదార్థానామవక్తవ్యత్వం సంభవతి. అవక్తవ్యాశ్చేన్నోచ్యేరన్. ఉచ్యంతే చావక్తవ్యాశ్చేతి విప్రతిషిద్ధం, ఉచ్యమానాశ్చ తథైవావధార్యంతే నావధార్యంత ఇతి చ, తథా తదవధారణఫలం సమ్యగ్దర్శనమస్తి నాస్తి వా, ఏవం తద్విపరీతమసమ్యగ్దర్శనమప్యస్తి నాస్తి వేతి ప్రలపన్మత్తోన్మత్తపక్షస్యైవ స్యాత్

---

లోకులు వ్యాకులము చెందక ప్రవర్తించెదరు. నిశ్చితార్థము గాని శాస్త్రమును ప్రవర్తింప చేయువాని పలుకులు త్రాగుబోతు పిచ్చివాని పలుకులవలె గ్రాహ్యములుకావు. ఆ విధముగనే పంచాస్తికాయము లున్నవా లేవాయను వికల్పము గలుగుచుండ, స్యాదస్తియను పక్షమున స్యాన్నాస్తియను పక్షమున నుండవు. కనుక పంచసంఖ్య తగ్గవచ్చు; పెరుగనువచ్చు. ఈ పదార్థము లవక్తవ్యములన వీలులేదు. అవక్తవ్యములైచో వాని నుచ్చరింపక పోవలెను. ఉచ్చరింపడుచున్నవి కాని అవక్తవ్యములనుట విరుద్ధము. ఉచ్చరింపబడుచుండగ నిర్ధారణ చేయబడుచున్నవి చేయబడుటలేదు, ఆవిధముగనే నిర్ధాణచేసిన సమ్యగ్దర్శన ఫలము కలదా లేదా? అందుకు విపరీతముగు అసమ్యగ్దర్శనము కలదా లేదా? ఇట్లు వదరుట మత్తోన్మత్త లక్షణముగాని విశ్వసనీయుని లక్షణము

న ప్రత్యయితవ్యపక్షస్య. స్వర్గాపవర్గయోశ్చ పక్షే భావః పక్షే చాభావ స్తథా పక్షే నిత్యతా పక్షే చానిత్యతేత్యనవధారణాయాం ప్రవృత్త్యనుపపత్తిః. అనాదిసిద్ధజీవప్రభృతీనాం చ స్వశాస్త్రావధృతస్వభావానామయథావధృతస్వభావత్వప్రసంగః. ఏవం జీవాదిషు పదార్థేష్వేకస్మిన్ ధర్మిణి సత్త్వాసత్త్వయోర్విరుద్ధయోర్ధర్మయోరసంభవాత్ సత్త్వే చైకస్మిన్ ధర్మేఽసత్త్వస్య ధర్మాంతరస్యాసంభవాత్ అసత్త్వేచైవం సత్త్వస్యాసంభవాదసంగతమిదమార్హతం మతమ్. ఏతేనైకానేకనిత్యానిత్యవ్యతిరిక్తాద్యనేకాంతాభ్యుపగమా నిరాకృతా మంతవ్యాః. యత్తు పుద్గలసంజ్ఞకేభ్యోఽ

---

కానేరదు. స్వర్గాపవర్గములు గూడ నొకపక్షమున నున్నవి మఱియొక పక్షమున లేనివి, ఒక పక్షమున నిత్యములు మఱియొకపక్షమున, అనిత్యములు–ఈవిధముగ అనిర్ధారితము లగుచుండగ వానియెడ యెవరికిని ప్రవృత్తి సంభవింపదు. మీ శాస్త్రమునుబట్టి నిర్ధారితములు అనాదిసిద్ధములు అని మీరు జెప్పుకొను జీవులు మొదలగువారి స్వభావములు నిర్ధారితములు కానివేయగును. ఉనికియుండ లేమి గాని లేమియుండ యునికిగాని యసంభవ మగుటచే, జీవాది పదార్థముల యందేకకాలమున విరుద్ధధర్మములగు ఉనికి లేములు సంభవముకావు గావున, నీ ఆర్హత మతము అసంగత మగుచున్నది. దీనిచే ఏకానేకములు, నిత్యానిత్యములు, వ్యతిరిక్తావ్యతిరిక్తములు మొదలగునవి నొకేవిషయమై చెప్పశక్యము కాదను విషయము నిరాకరింపబడినట్లు తలంచవలయును. పుద్గలములని

ఋభ్యస్సంఘాతాస్సంభవంతీతి కల్పయంతి తత్ పూర్వేణైవాణు వాదనిరాకరణేన నిరాకృతం భవతీత్యతో న పృథక్తన్నిరాకరణాయ ప్రయత్యతే.

## ఏవం చాత్మాఽకార్త్స్న్యమ్ (సూ. 34)

సిద్ధాంతీ : యథైకస్మిన్ ధర్మిణి విరుద్ధధర్మాసంభవో దోషస్స్యాద్వాదే ప్రసక్తః ఏవమాత్మనోఽపి జీవస్యాకార్త్స్న్యమపరో దోషః ప్రసజ్యేత. కథం, శరీరపరిమాణో హి జీవ ఇత్యార్హతా మన్యంతే శరీరపరిమాణతాయాం చ సత్యామకృత్స్నోఽ

---

బిలువబడు పరమాణువులచే పృథివ్యాదులు బుట్టుచున్న వను కల్పనము పరమాణు వాద నిరాకరణచే నిరాకరింపబడుటచే తిరిగి యత్నించుటలేదు. 33

అ॥ ఆత్మకు దేహ పరిమాణము గలదను దిగంబర వాదమును రాబోవు సూత్రమున త్రోసి బుచ్చుచున్నారు.

ఏవంచ = ఏకవస్తువునం దేకకాలమున విరుద్ధ ధర్మములు సంభవించునను దోషముతోపాటు ఆత్మా = జీవుడు, అకార్త్స్న్యం = పరిచ్ఛిన్నత్వ దోషము గలవాడగును.

సిద్ధాంతి : దిగంబరుల స్యాద్వాదమునం దొకే ధర్మియం దేకకాలమున విరుద్ధధర్మములు సంభవము కావను దోషము ప్రసక్త మైనటులనే జీవునికి అకార్త్స్న్య దోషముగూడ సంభవించును. ఎట్లన, జీవుడు శరీరపరిమాణము గలవాడని అర్హతులు తలంచుచున్నారు. జీవునికి శరీరపరిమాణత్వము సంభవించుచుండగ అతడు సర్వగతుడు కాకపోవుటయు, పరిచ్ఛిన్న

సర్వగతిః పరిచ్ఛిన్న ఆత్మేత్యతో ఘటాదివదనిత్యత్వమాత్మనః ప్రసజ్యతే. శరీరాణాం చానవస్థితపరిమాణత్వాన్మనుష్యజీవో మనుష్యశరీరపరిమాణో భూత్వా పునః కేనచిత్కర్మవిపాకేన హస్తిజన్మ ప్రాప్నువన్న కృత్స్నం హస్తిశరీరం వ్యాప్నుయాత్, పుత్తికాజన్మ చ ప్రాప్నువన్న కృత్స్నః పుత్తికాశరీరే సమ్మీయేత. సమాన ఏష ఏకస్మిన్నపి జన్మని కౌమారయౌవనస్థావిరేషు దోషః.

దిగమ్బరః : స్యాదేతత్, అనంతావయవో జీవస్తస్య త ఏవావయవా అల్పే శరీరే సంకుచేయుర్మహతి చ వికసేయురితి.

---

డగుటయు ఘటాదులవలె అనిత్యమగుటయు-ఆత్మకు ఈ మొదలగు దోషములు సంభవించుచున్నవి. శరీరముల పరిమాణములనవస్థితములు. కనుక మనుష్యునియందలి జీవుడు మానుష శరీర పరిమాణము గలవాడై యేదోయొక కర్మవిపాకమున గజజన్మమును బొంది గజశరీరమునంతయు వ్యాపించలేడు. పిపీలికాజన్మమును బొంది పుత్తికాశరీరములో తనకు కావలసినంత స్థలమును బొందలేడు. ఒక జన్మమునందే కౌమారము, యౌవనము, వార్ధక్యము మొదలగు నవస్థలయందుగూడ నీ దోషము సంభవించును. [బాల్యాద్యవస్థలంబట్టి మానుష శరీరము పెరుగుటయు తగ్గుటయు సంభవించును].

దిగంబరుడు. మీరు చెప్పినట్లు కావచ్చును. జీవుడు అనంతములగు నవయవములు కలవాడు. [దీపావయవములు ఘటమునందు సంకుచితములగును. గృహామునందు విస్తరిం

సిద్ధాంతీ : తేషాం పునరనంతానాం జీవావయవానాం సమానదేశత్వం ప్రతిహన్యేత వా నవేతి వక్తవ్యమ్. ప్రతిఘాతే తావన్నానంతావయవాః పరిచ్ఛిన్నే దేశే సమ్మీయేరన్, అప్రతిఘాతేఽప్యేకావయవదేశత్వోపపత్తేః సర్వేషామవయవానాం ప్రతిమానుపపత్తేర్జీవస్యాణుమాత్రత్వప్రసంగస్స్యాత్. అపిచ శరీరమాత్రపరిచ్ఛిన్నానాం జీవావయవానామానంత్యం నోత్ప్రేక్షితుమపి శక్యమ్.

దిగమ్బరః : అథ పర్యాయేణ బృహచ్ఛరీరప్రతిపత్తౌ కేచిజ్జీవావయవా ఉపగచ్ఛంతీత్యుచ్యేత.

---

చును. అటులనే] ఆతని అవయవములు అల్ప శరీరమునందు సంకోచమును బొందును. పెద్ద శరీరమునందు విస్తరించును.

సిద్ధాంతి : అనంతములగు నీ జీవావయవములన్నియు నొకప్రదేశమున నుండునా ? విభిన్న ప్రదేశముల నుండునా ? ఇందుకు మీరు ప్రత్యుత్తరము చెప్పవలయును. ఒక ప్రదేశమున నుండవని యందురేని, అనంతములగు నవయవములు పరిమితమగు దేశమున ఇముడలేవు [కొన్ని అవయవములు దేహమునకు బాహ్యమున నుండవలసివచ్చును]. ఒక ప్రదేశమున నుండుచో, నవి యన్నియు నుండు ప్రదేశ మొక అవయవప్రదేశము మాత్రమగుటచే నతడు విరివిగానుండలేడు. జీవునికి అల్పత్వదోషము ప్రసక్తమగును. ఇంతియకాదు. జీవావయవములు శరీరముచే పరిమితము లగుటవలన వానికి యనంతత్వము నాపాదింప వీలులేదు. 34

దిగంబరుడు : పోనీ ! [జీవావయవములు కొన్నిమాత్రము నిత్యములు] శరీరము పెద్దది అయినపుడు యితర అవయవము

సిద్ధాంతీ : తత్రాప్యుచ్యతే.

## న చ పర్యాయాదప్యవిరోధో వికారాదిభ్యః
(సూ. 35)

న చ పర్యాయేణాప్యవయవోపగమాపగమాభ్యా మేతద్దేహపరిమాణత్వం జీవస్యావిరోధేనోపపాదయితుం శక్యతే. కుతః, వికారాదిదోషప్రసంగాత్. అవయవోపగమాపగమాభ్యాం హ్యానిశమాపూర్యమాణస్యాపక్షీయమాణస్య చ జీవస్య విక్రియావత్త్వం

---

లందు ప్రవేశించును. శరీర మల్పమయినపుడవి బహిర్గతములగునందును.

సిద్ధాంతి : అందుకుగూడ సమాధానము చెప్పుదుము.

వికారాదిభ్యః = వికారాదులు సంభవించుటచేత, పర్యాయాత్ అపి = జీవ పరమాణువులు శరీరముయొక్క మహత్త్వ అల్పత్వమునుబట్టి ప్రవేశ నిర్గమములు చేసినను, అవిరోధః = జీవుడు దేహపరిమాణము గలవాడను సిద్ధాంతమునకు అవిరోధము, న = సంభవింపదు. అనగా విరోధమే సంభవించును.

శరీర పరిమాణమునుబట్టి జీవునియొక్క అనంతములగు నవయవములు వరుసన ప్రవేశ నిర్గమములు చేయుచున్నవను కల్పనచే జీవునికి దేహ పరిమాణత్వము విరుద్ధము కాదనుటకు శక్యముకాదు. ఏలనన! వికారాది దోషములు ప్రసక్తములగుటవలన! జీవుడనిశము అవయవముల ప్రవేశముచే పూరింపబడుటయు, నిర్గమనముచేత క్షయము నొందుటయు–ఈ విధ

తావదపరిహార్యమ్, విక్రియావత్త్వే చ చర్మాదివదనిత్యత్వం ప్రసజ్యేత, తతశ్చ బంధమోక్షాభ్యుపగమో బాధ్యేత కర్మాష్టకపరివేష్టితస్య జీవస్యాలాబువత్ సంసారసాగరే నిమగ్నస్య బంధనోచ్ఛేదాదూర్ధ్వగామిత్వం భవతీతి. కించాన్యదాగచ్ఛతామపగచ్ఛతాం చావయవానామాగమాపాయధర్మవత్త్వాదేవానాత్మత్వం శరీరాదివత్ తతశ్చావస్థితః కశ్చిదవయవ ఆత్మేతి స్యాత్. న చ స నిరూపయితుం శక్యతే అయమసావితి. కించాన్యదాగచ్ఛంతశ్చైతే జీవావయవాః కుతః ప్రాదుర్భవంత్యపగచ్ఛంతశ్చ క్వ సా విలీయంత

---

ముగ నతడు అపరిహార్యములగు వికారముల బొందుచున్నాడు. వికారములుండ చర్మాదులకువలెనే అతనికిగూడ అనిత్యత్వము సంభవించును. అందువలన బంధమోక్ష సిద్ధాంతములకు బాధ కలుగును. కర్మాష్టకముచే నావేశింపబడిన జీవుడు సొరకాయ బుర్రవలె సంసారసాగరమున మునిగితేలుచుండ బంధమువీడి యాతడూర్ధ్వమువకు బోవశక్యముగాదు. మఱియొక విషయము. ఆగమ నిర్గమములజేయు జీవావయవములు ఆగమ నిర్గమ ధర్మములుగల వగుటవలన శరీరమువలె నవియు ననాత్మలేయగును. నిత్యముగనుండు కొన్ని అవయవములే ఆత్మ [గాని రాకపోకలుగల అవయవము లాత్మగాదని] యంటిరేని ఈ అవయవములు నిత్యములు, ఈఅవయవములు ఆగమాపాయములు గలవి యని నిశ్చయింప శక్యముకాదు.

మఱియొక విషయము. ఈ జీవావయవములు మహాచ్ఛరీరమును ప్రవేశించునపు డెచటనుండి బుట్టుచున్నవి? అల్పశరీరమునుండి నిర్గమించునపు డెచట లయమగుచున్నవి?

ఇతి వక్తవ్యమ్. న హి భూతేభ్యః ప్రాదుర్భవేయుర్భూతేషు చ విలీయేరన్ అభౌతికత్వాజ్జీవస్య, నాపి కశ్చిదన్యస్సాధారణోఽసాధారణో వా జీవానామవయవాధారో నిరూప్యేత ప్రమాణాభావాత్. కించాన్యదనవధృతస్వరూపశ్చైవం సత్యాత్మా స్యాత్ ఆగచ్ఛతామపగచ్ఛతాం చావయవానామనియతపరిమాణత్వాత్, అత ఏవమాదిదోషప్రసంగాన్న పర్యాయేణాప్యవయవోపగమాపగమావాత్మన ఆశ్రయితుం శక్యతే.

అథవా పూర్వేణ సూత్రేణ శరీరపరిమాణస్యాత్మన ఉపచి

---

ఈ విషయము మీరు చెప్పవలసియున్నది. ఆవి భూతముల నుంచి బుట్టుటలేదు; భూతములయందు లయమగుటలేదు. [ఈ అవయవములు జీవావయవములు] జీవుడు భూతవికార స్వరూపుడు కాడు. జీవులందరికిని సామాన్యమైనదిగాని యొక్కొక్క జీవునికి ప్రత్యేకమైనదిగాని ఆధారముమరియొక అవయవము గలదని నిరూపించుటకు శక్యముకాదు. అందుకు తగు ప్రమాణము కాన్పింపదు. ఇంకొక విషయము. మీాప్రకృతవాదమును బట్టి ఆత్మయొక్క స్వరూపము అవధారితము కాకపోవలెను. రాకపోకలు చేయు అవయవములకు పరిమాణము నియతముగ లేదు, ఈ విధములగు దోషములు ప్రసక్తములగుటంజేసికొన్ని అవయవములు పర్యాయముగ ఆత్మను జేరుననిగాని మఱికొన్ని ఆతనినుండి నిర్గమించునని గాని నిరూపింప శక్యముకాదు.

ఈ సూత్రమును మఱియొక విధముగ గ్రహించవచ్చును. జీవుడు శరీరపరిమాణము గలవాడైనచో మహత్త

తాపచితశరీరాంతరప్రతిపత్తావకార్త్స్న్య ప్రసంజనద్వారేణానిత్యతా యాం చోదితాయాం పునః పర్యాయేణ పరిమాణానవస్థానేఽపి స్రోతస్సంతాననిత్యతాన్యాయేనాత్మనో నిత్యతా స్యాత్, యథా రక్త పటాదీనాం విజ్ఞానానవస్థానేఽపి తత్సంతాననిత్యతా తద్వద్విసిచా మపీత్యాశంక్యానేన సూత్రేణోత్తర ముచ్యతే. సంతానస్య తావద వస్తుత్వే నైరాత్మ్యవాదప్రసంగః, వస్తుత్వేఽప్యాత్మనో వికారాది దోషప్రసంగాదస్య పక్షస్యానుపపత్తి రితి.

## అన్త్యావస్థితేశ్చోభయనిత్యత్వాదవిశేషః
(సూ. 36)

---

రములు అల్పతరములునగు శరీరముల ప్రవేశించుచున్నం దున నిత్యత్వ మాతనికి సంభవముకాదని పూర్వసూత్రమున నిశ్చయింపబడినది. జీవుని పరిమాణము శరీరపరిమాణమును బట్టి పర్యాయముగ మారుచున్నను నదీప్రవాహమువలె నిత్యము కావచ్చును. విజ్ఞానములు మారుచున్నను, విజ్ఞాన ప్రవాహము నిత్యమగును. అటులనే దిగంబరుల జీవావయవ ములు నిత్యములు కావచ్చునంటిరేని, ప్రవాహము యథార్థము కానిచో ఆత్మ లేదనవలయును. యథార్థమైనచో, ఆత్మకు వికారాది ప్రసంగములు సంభవించును. కనుక జైనవాదము సహేతుకము కాదని ప్రకృతసూత్రమున సమాధానము చెప్ప బడుచున్నది. 35

అన్త్య అవస్థితేః చ = మోక్షావస్థయందు జీవపరి మాణమునకు నిత్యత్వమంగీకరించుట వలన, ఉభయ నిత్య త్వాత్ = దానికివలెనే మొదటను మధ్య నున్న జీవపరి

అపి చాంత్యస్య మోక్షావస్థాభావినో జీవపరిమాణస్య నిత్యత్వమిష్యతే జైనైస్తద్వత్ పూర్వయోరప్యాద్యమధ్యమయోర్జీవపరిమాణయోర్నిత్యత్వప్రసంగాదవిశేషప్రసంగస్స్యాత్. ఏకశరీరపరిమాణతైవ స్యాత్ నోపచితాపచితశరీరాంతరప్రాప్తిః. అథవా అంత్యస్య జీవపరిమాణస్యావస్థితత్వాత్ పూర్వయోరప్యవస్థయోరవస్థితపరిమాణ ఏవ జీవస్స్యాత్. తతశ్చావిశేషేణ సర్వదై వాణ

---

మాణములకున్ను నిత్యత్వము సంభవించుట వలన, అవిశేషః= ఆదిమధ్యమాంతిమ పరిమాణములకు విశేషమేమియు లేదు.

మఱియు మోక్షావస్థయందుండు జీవునియొక్క అంతిమ పరిమాణము నిత్యమని జైనులు పల్కుచున్నారు. ఆవిధముగనే జీవుని ఆదిమ మధ్యమ పరిమాణములు గూడ నిత్యములని యూహింపబడుచున్నవి, [ఆత్మయొక్క పరిమాణములగుటచే ఆదిమ మధ్యమ పరిమాణములు గూడ అంతిమ పరిమాణమువలెనిత్యములని అనుమానప్రమాణముచేనూహింపబడుచున్నవి.] కనుక ఆదిమ మధ్యమ అంతిమ పరిమాణములకు భేదమేమియులేదు. దీనినిబట్టి జీవునియొక్క విభిన్న శరీరములన్నియునొకపరిమాణమునే గలిగియున్నట్లుకాన్పించు జీవుడు మహత్తర అల్పతర శరీరముల ప్రవేశింప సాధ్యము కాదనియు పర్యవసానము తేలుచున్నది. లేక సూత్రమును మరియొక విధముగ వ్యాఖ్యానింపవచ్చును. జీవుని అంతిమ పరిమాణము నిత్యముగనుక పూర్వావస్థలయందలిపరిమాణము గూడ నిత్యము కావలయును. కనుక జీవుని పరిమాణమెల్లపుడును, అణువైనను, మహాంతమైనను, విశేషము లేక నొక

ర్మహాన్ వా జీవోఽభ్యుపగంతవ్యో న శరీరపరిమాణః, అతశ్చ సౌగతార్హతమపి మతమసంగతమిత్యుపేక్షితవ్యమ్. ఇతి షష్ఠాధికరణమ్.

## (7) పత్యధికరణమ్ (సూ. 37–41)

టిగా నుండవలెను. కాని శరీర పరిమాణమును బట్టి మార నేరదు. ఈకారణముచేతను గూడ సౌగతమతమువలె నార్హత మతముగూడ నసంగత మగుటచే నుపేక్షణీయమగుచున్నది. 36

### (7) పత్యధికరణము

అ॥ సత్త్వాసత్త్వములు రెండును పరస్పర విరుద్ధము లగుట వలన నేకకాలమున నేకదేశమున నుండవీలులేదని పూర్వాధికరణమున సిద్ధము చేయబడినది. ఆతీరుగనే ఉపాదానత్వ కర్తృత్వములు విరుద్ధము లగుటచే నొకచోట యసంభవమని తరువాత అధికరణమున చూపబడుచున్నది.

విషయము : కేవల మధిష్ఠాతయగు నీశ్వరుడు జగదుపాదానము కానేరడను మహేశ్వర రాద్ధాంతము విషయము-

సందేహము : ఇట్టి రాద్ధాంతము ప్రమాణ మూలకమా లేక భ్రాంతిమూలకమా యని సందేహము

పూర్వపక్షము : ప్రమాణమూలకమని.

సిద్ధాంతము : భ్రాంతి మూలకమని.

## పత్యురసామంజస్యాత్ (సూ. 37)

ఇదానీం కేవలాధిష్ఠాత్రీశ్వరకారణవాదః ప్రతిషిధ్యతే. తత్ కథమవగమ్యతే 'ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాంతానుపరోధాత్ అభిధ్యోపదేశాచ్చ' త్యత్ర ప్రకృతిభావేనాధిష్ఠాతృభావేన చోభయస్వభావస్యేశ్వరస్య స్వయమేవాచార్యేణ ప్రతిష్ఠాపితత్వాత్. యది పునర విశేషేణేశ్వరకారణవాదమాత్రమిహ ప్రతిషేధేత్ పూర్వోత్తర విరోధాద్వ్యాహృతాభివ్యాహారః సూత్రకార ఇత్యేతదాపద్యేత. తస్మా

---

పత్యుః = జగత్పతియగు నీశ్వరునకు, అసామంజస్యాత్ = సమంజసము కాదు గనుక, కేవల నిమిత్తకారణత్వముపపన్నము కాదు.

[కేశములు కత్తెర వేసికొను] దిగంబరుల మతమును నిరాకరించి, జడలను పెంచుకొను శైవమతస్థుల వాదము అనగా] నీశ్వరుడు జగత్తునకు నిమిత్త కారణము గాని ఉపాదాన కారణము గాదను వాదమిపుడు నిరాకరింపబడుచున్నది. ఈసూత్రమున నిమిత్తకారణమే నిరసింప బడుచున్నది యని యెట్లు తెలియుచున్నదనిన. "ప్రకృతిశ్చ దృష్టాంతానుపరోధాత్" "అభిధ్యోపదేశాచ్చ" [బ. సూ, 1-4-23, 24] అను సూత్రములయం దీశ్వరు డుపాదాన నిమిత్తోభయ కారణమని సూత్రకారులే సిద్ధాంతము చేసినారు. ఈసూత్రమున విశేషణ మేమియు లేక సామాన్యముగ నీశ్వరకారణత్వమును మాత్రము నాక్షేపించినచో పూర్వోత్తరములు విరుద్ధములగును. సూత్రకారులు విరుద్ధమును పలికిన వార

దప్రకృతిరధిష్ఠాతా కేవలం నిమిత్తకారణమీశ్వర ఇత్యేష పక్షో వేదాంతవిహితబ్రహ్మైక్యప్రతిపక్షిత్వాద్యత్నేనాత్ర ప్రతిషిధ్యతే.

సా చేయం వేదబాహ్యేశ్వరకల్పనాఽనేకప్రకారా. కేచిత్తావత్ సాంఖ్యయోగవ్యపాశ్రయాః కల్పయంతి ప్రధానపురుషయోరధిష్ఠాతా కేవలం నిమిత్తకారణమీశ్వరః ఇతరేతరవిలక్షణాః ప్రధానపురుషేశ్వరా ఇతి. మాహేశ్వరాస్తు మన్యంతే కార్యకారణయోగవిధిదుఃఖాంతాః పంచ పదార్థాః పశుపతినేశ్వరేణ పశుపాశవిమోక్షాయోపదిష్టాః, పశుపతిరీశ్వరో నిమిత్తకారణమితి. వర్ణ

---

గుదురు. కనుక నీశ్వరు డుపాదాన కారణముకాదు, కేవల నిమిత్తకారణమగును అనువాదము వేదాంతములచే నుపదేశింపబడు బ్రహ్మైకత్వవాదమునకు విరుద్ధమగుటచే యత్న పూర్వకముగ త్రోసిపుచ్చుట కీసూత్రము ప్రవృత్తమగుచున్నట్లు గ్రహించవలెను.

వేదబాహ్యమగు నీశ్వరకల్పన మనేక ప్రకారములుగ నున్నది. కొంతమంది సాంఖ్యయోగమతముల నాశ్రయించి యీశ్వరుడు ప్రధానపురుషుల కధిష్ఠాతయనియు జగత్తునకాతడు కేవల నిమిత్తకారణమనియు, ప్రధానము, పురుషుడు, ఈశ్వరుడు వీరు పరస్పరము విలక్షణమనియు నొక కల్పనము చేయుచున్నారు. మాహేశ్వరులన్ననో, కార్యము, కారణము. యోగము, విధి, దుఃఖాంతము, అను నయిదును పంచపదార్థములనియు, అవి జీవుల బంధమోక్షముకొరకుపదేశింపబడినవనియు పశుపతియగు నీశ్వరుడు జగత్తునకు నిమిత్తకారణమనియు వర్ణించుచున్నారు. [శైవులు, పాశు

యంతి తథా వైశేషికాదయోఽపి కేచిత్ కథంచిత్ స్వప్రక్రియానుసారేణ నిమిత్తకారణమీశ్వరం వర్ణయంతి.

అత ఉత్తరముచ్యతే. 'పత్యురసామంజస్యా'దితి. పత్యురీశ్వరస్య ప్రధానపురుషయోరధిష్ఠాతృత్వేన జగత్కారణత్వం నోపపద్యతే. కస్మాత్, అసామంజస్యాత్. కింపునరసామంజస్యం, హీన మధ్యమోత్తమభావేన హి ప్రాణిభేదాన్ విదధత ఈశ్వరస్య

---

పతులు, కారుణిక సిద్ధాంతులు, కాపాలికులు అని మాహేశ్వరులు నాలుగు తెఱంగులు. వీరందరు మహేశ్వర ప్రోక్తమగు ఆగమము ననుసరించుటచే మాహేశ్వరులని బిలువంబడుచున్నారు. మహదాదికము కార్యము; ప్రధానము, ఈశ్వరుడు కారణము; సమాధి యోగము; మూడుపర్యాయములు స్నానాదులు విధి; దుఃఖాంతము మోక్షము. జీవులు పశువులు. వారలబంధము నాశమగుట మోక్షము. పశుపతాగమము వీరలకు ప్రమాణమగుటవలన పశుపతి నిమిత్తమాత్రుడని వీరి మతము.] వైశేషికులు గౌతమాదులు మరికొందఱు తమతమ మతానుసార మీశ్వరుడు నిమిత్తకారణమని వర్ణించుచున్నారు.

అందువలన వీనికి ప్రకృతసూత్రమునందు సూత్రకారులు సమాధానము చెప్పుచున్నారు. ఈశ్వరుడు ప్రధానపురుషులకు అధిష్ఠాత యగుటవలన జగత్కారణత్వ మాతనికి పొసగదు. ఏలనన! సమంజసము కానందువలన! ఈ యసామంజస్య మెద్దియనన, ఈశ్వరుడుగూడ తనకిచ్చవచ్చినట్లు హీనమధ్యమ ఉత్తమ భావములచే ప్రాణులయందు భేద

రాగద్వేషాదిదోషప్రసక్తేరస్మదాదివదనీశ్వరత్వం ప్రసజ్యేత. ప్రాణికర్మాపేక్షత్వాదదోష ఇతి చేన్న. కర్మేశ్వరయోః ప్రవర్త్య ప్రవర్తయితృత్వే ఇతరేతరాశ్రయదోషప్రసంగాత్. న, అనాదిత్వాదితి చేన్న. వర్తమానకాలవదతీతేష్వపి కాలేష్వితరేతరాశ్రయదోషా విశేషాదంధపరంపరాన్యాయాపత్తేః. అపిచ 'ప్రవర్తనా

---

మును కల్పించినవాడగుచుండ, నాతనికిగూడ రాగము ద్వేషము మొదలగుదోషములు ప్రసక్తములగుచున్నవి. అప్పుడాతని యీశ్వరత్వమునకు భంగముకలుగుచున్నది. ప్రాణుల పూర్వకర్మచే ప్రేరితుడై యీశ్వరుడు విషమసృష్టిని చేయుటచే దోషములేదంటిరేని అది సరికాదు. జడమగు కర్మమీశ్వరుని ప్రేరేపించలేదు. కర్మ యీశ్వరునిచే ప్రేరితమై ఆతనిని ప్రేరేపించుచున్నదనినచో, కర్మ యీశ్వరులకు అన్యోన్యము ప్రేరేపించువాడు, ప్రేరేపింపబడునది యని అన్యోన్యాశ్రియ దోషము సంభవించును. ఈశ్వరుడు గతించిన కర్మచే ప్రేరితుడగుచున్నాడు. ఫలానుభవముకొఱకు వర్తమానకర్మను ప్రేరేపించుచున్నాడు. ఇటుల వీరిద్దరికిని పవర్త్యప్రవర్తకత్వము అనాది యనుటగూడ సరికాదు. వర్తమాన కాలమునందువలెనే అతీత కాలములయందుకూడ అన్యోన్యాశ్రియ దోషముండుటచేత, అనాదిత్వము అంధపరంపరా న్యాయమును బోలియున్నది. దోషములకు కార్యప్రవర్తకత్వము ముఖ్యలక్షణము అని నైయ్యాయిక సూత్రము స్వప్రయోజనము గోరిగాని పరప్రయోజనమును గోరిగాని ప్రవర్తించువార లేదొయొక దోషముచేతనే చోదితులై

లక్షణా దోషాః' ఇతి న్యాయవిత్సమయః. న హి కశ్చిదపోష ప్రయుక్తః స్వార్థే పరార్థే వా ప్రవర్తమానో దృశ్యతే. స్వార్థ ప్రయుక్త ఏవ చ సర్వో జనః పరార్థేఽపి ప్రవర్తత ఇత్యేవ మప్యసామంజస్యం. స్వార్థవత్త్వాదీశ్వరస్యానీశ్వరత్వప్రసంగాత్. పురుషవిశేషత్వాభ్యుపగమాచ్చేశ్వరస్య పురుషస్య చౌదాసీన్యాభ్యు పగమాదసామంజస్యమ్.

## సంబంధానుపపత్తేశ్చ (సూ. 38)

ప్రవర్తించుచున్నటుల కాన్పించుచున్నది. లోకమంతయు స్వార్థమునుగోరియే ప్రవర్తించుచున్నదిగాని పరార్థమును గోరి ప్రవర్తించుట లేదనుటగూడ నసమంజసమొయగును. అపు డీశ్వరప్రవృత్తిగూడ స్వార్థమునుగోరియే ప్రసక్తమగును. ఆత నికి యీశ్వరత్వభంగము సంప్రాప్తమగును. [ఈశ్వరుడు స్వార్థ మునుగోరి ప్రవర్తించినచో మనవలెనే రాగాదులుగల వాడ గును. పరదుఃఖముచే దుఃఖితుడై ప్రవర్తించునన్ననూ, పర దుఃఖప్రయుక్తమగు స్వీయదుఃఖమును బోగొట్టుకొనగోరి ప్రవర్తించినవాడగును.] ఈశ్వరుడొక పురుషవిశేషము, అతడు దాసీనుడు అని చెప్పిన ఉదాసీనుడు, కార్యప్రవర్తకుడుగూడ కాలేడు. ఈరెండును విరుద్ధములు. కనుక నదియును అసమం జసమే యగుచున్నది. 37

అ॥ ఈశ్వరుడు జగదుపాదనమగుట యసమంజ సమను టకు మఱియొక కారణమును చూపుచున్నారు.

సంబంధ అనుపపత్తేః చ = ప్రేరకుడగు నీశ్వరునికి

పునరప్యసామంజస్యమేవ, న హి ప్రధానపురుషవ్యతిరిక్త ఈశ్వరోఽన్తరేణ సంబంధం ప్రధానపురుషయోరీశితా. న తావత్సంయోగలక్షణస్సంభవతి, ప్రధానపురుషేశ్వరాణాం సర్వగతత్వాన్నిరవయవత్వాచ్చ, నాపి సమవాయలక్షణః, ఆశ్రయాశ్రయిభావానిరూపణాత్. నాప్యన్యః కశ్చిత్కార్యగమ్యస్సంబంధశ్శక్యతే కల్పయితుమ్, కార్యకారణభావస్యైవాద్యాప్యసిద్ధత్వాత్. బ్రహ్మ

---

ప్రేర్యములగు పురుష ప్రధానులకును సంబంధము శక్యము గాదు గనుక నీశ్వరునికి యుపాదానత్వ మసమంజసము.

ప్రకృత విషయమున మఱియొక అసామంజస్యము గలదు. ఈశ్వరుడు పురుష ప్రధానులకంటె నన్యుడు. వారల కొక సంబంధము లేక నతడు ప్రధానపురుషులను శాసింపలేడు. ప్రధాన పురుష ఈశ్వరులు ముగ్గురుగూడ సర్వగతులు నిరవయవులు గనుక వారలమధ్య సంయోగ సంబంధము సాధ్యము కాదు. వీరలలో నెవరు దేనికి ఆశ్రయము కావలయునో నిరూపింప శక్యము కాదుగనుక సమవాయి సంబంధము సాధ్యముకాదు వీరలలో కార్యకారణ సంబంధ మింకను నిశ్చయము కాలేదు. [ఈశ్వరునిచే ప్రేరితమై జగత్తు పరమాణువుల వలన సంభవించుచున్నది యని వేదాంతు లంగీకరించుటలేదు] కనుక కార్యము వలన నూహింపతగు మఱియొక కారణమును కల్పింప శక్యముకాదు. జగదీశ్వరులకు కార్యకారణ సంబంధమును వేదాంతు లేవిధమున కల్పించెదరని ప్రశ్నించిన, వారల లీవిషయమున కష్టము

వాదినః కథమితి చేన్న— తాదాత్మ్యలక్షణసంబంధోపపత్తేః. అపిచాగమబలేన బ్రహ్మవాదీ కారణాదిస్వరూపం నిరూపయతీతి నావశ్యం తస్య యథాదృష్టమేవ సర్వమభ్యుపగంతవ్యమితి నియమోఽస్తి. పరస్య తు దృష్టాంతబలేన కారణాదిస్వరూపం నిరూపయతో యథాదృష్టమేవ సర్వమభ్యుపగంతవ్యమిత్యయమస్త్యతిశయః. పరస్యాపి సర్వజ్ఞప్రణీతాగమసద్భావాత్సమానమాగమబలమితి చేన్న, ఇతరేతరాశ్రయప్రసంగాదాగమప్రత్యయాత్సర్వజ్ఞత్వసిద్ధిః సర్వజ్ఞత్వప్రత్యయాచ్చాగమసిద్ధిరితి.తస్మాదనుపపన్నా సాంఖ్యయోగవాదినామీశ్వరకల్పనా ఏవమన్యాస్వపి వేదబాహ్యా

---

లేదు. వార లిరువురికి తాదాత్మ్యసంబంధము గలదని వారు పల్కుచున్నారు. వేదాంతులు ఆగమబలముచే కారణాది స్వరూపమును నిశ్చయించుచున్నారు గనుక సర్వమును యథాదృష్టముగ నంగీకరింప వలసిన ఆవశ్యకత వారికి లేదు. ప్రతివాదులు కారణాది స్వరూపమును దృష్టాంత బలముచే ననుభవమును బట్టి నిరూపించుచున్నారు. కనుక వారలు సమస్తమును యథాదృష్టముగనే అంగీకరింప వలసియున్నది. వారి వాదమునందిది విశేషము. ప్రతివాదికిగూడ సర్వజ్ఞుడు రచియించిన ఆగమములు ప్రమాణములగుట వలన ఆగమ బల మిద్దరికిని సమానమే యంటిరేని, అదిసరికాదు. ఆగమ జ్ఞానముచే సర్వజ్ఞుని సర్వజ్ఞత్వము, సర్వజ్ఞుని సర్వజ్ఞత్వముచే నాగమములకు ప్రామాణ్యము—ఇటుల నన్యోన్యాశ్రయము సంభవించుచున్నది. అందువలన సాంఖ్య యోగవాదులు కల్పించు ఈశ్వరకల్పన మనుపపన్నముగాదు. ఈవిధముగనే

స్వీశ్వరకల్పనాసు యథాసంభవమసామంజస్యం యోజయితవ్యమ్.

## అధిష్ఠానానుపపత్తేశ్చ (సూ. 39)

ఇతశ్చానుపపత్తిస్తార్కికపరికల్పితస్యేశ్వరస్య. స హి పరికల్ప్యమానః కుంభకారఇవ మృదాదీని ప్రధానాదీన్యధిష్ఠాయ ప్రవర్తయేత్. నచైవముపపద్యతే. న హ్యప్రత్యక్షం రూపాది హీనం చ ప్రధానమీశ్వరస్యాధిష్ఠేయం సంభవతి, మృదాది వైలక్షణ్యాత్.

---

వేద బాహ్యములగు నితర యీశ్వరకల్పనల యందుగూడ నసామంజస్యమును సంభవాను సారముగ యోచనచేయ తగును. 38

తార్కికులు కల్పించిన ఈశ్వరుడు ప్రధానమును ప్రేరణ చేయుట, అనుపపత్తేః చ = ఉపపన్నము కాకుండుటచేతను గూడ నీవాదమసమంజస మగును.

చెప్పబోవు కారణము వలనగూడ తార్కికులు ఈశ్వరుని గూర్చి చేసిన ప్రతిజ్ఞ నిర్వహింపజాలదు. వారి కల్పనము ప్రకారము, కుంభకారుడు మృదాదుల యందువలె నీశ్వరుడు ప్రధానమును ప్రవర్తింపచేయువలెను. కాని యిది సంభవము కాదు. ప్రధానము అప్రత్యక్షము. దానికి రూపాదులులేవు, మృదాదులకంటె విలక్షణము. కనుక నీశ్వరునిచే ప్రేరేపింప బడలేదు. 39

అ॥ ప్రధాన మప్రత్యక్షమైనను ఈశ్వరునిచే ప్రేరే పింపబడ వచ్చునని సోదాహరణముగ ప్రతివాది చెప్పిన ప్రతి

## కరణవచ్చేన్న భోగాదిభ్యః (సూ. 40)

పూ. పక్షీ : స్యాదేతత్, యథా కరణగ్రామం చక్షురాదిక మప్రత్యక్షం రూపాదిహీనం చ పురుషోఽధితిష్ఠతి, ఏవం ప్రధాన మపీశ్వరోఽధిష్ఠాస్యతీతి.

సిద్ధాంతీ : తథాపి నోపపద్యతే, భోగాదిదర్శనాద్ధి కరణ గ్రామస్యాధిష్ఠితత్వం గమ్యతే, న చాత్ర భోగాదయో దృశ్యంతే. కరణగ్రామసామ్యే చాభ్యుపగమ్యమానే సంసారిణామివేశ్వరస్యాపి భోగాదయః ప్రసజ్యేరన్.

---

వచనమునకు రాబోవు సూత్రమున సమాధానము చెప్పు చున్నారు.

కరణవత్ చేత్ = జీవుడు అప్రత్యక్షములగు నింద్రియములను ప్రేరేపించినట్లు ఈశ్వరుడు ప్రధానమును ప్రేరే పించవచ్చునంటిరేని, భోగాదిభ్యః=భోగాది దోషములవలన నటుల చెప్పరాదు.

పూ. పక్షి : అది అటులగుగాక ! జీవుడు అప్రత్యక్షము రూపాదివిహీనమునగు చక్షురాది యింద్రియములను ప్రేరే పించుచున్నాడు. ఆవిధముగనే ఈశ్వరుడు ప్రధానమును ప్రేరే పించుచున్నాడందుము.

సిద్ధాంతి : ఆ పక్షమునగూడ మీవాద ముపపన్నము కాదు. జీవుడు భోగాదుల ననుభవించుట వలన చక్షురాది యింద్రియముల నతడు ప్రేరేపించుచున్నాడని యూహించు చున్నాము. ఈశ్వరుడు ప్రధానకల్పితములగు భోగాదులనను భవించుచున్నట్లు కాన్పించుటలేదు. ఈశ్వరునికి ప్రధానమున

అన్యథా వా సూత్రద్వయం వ్యాఖ్యాయతే. 'అధిష్ఠానానుపపత్తేశ్చ' ఇతశ్చానుపపత్తిస్తార్కికపరికల్పితస్యేశ్వరస్య. సాధిష్ఠానో హి లోకే సశరీరో రాజా రాష్ట్రస్యేశ్వరో దృశ్యతే న నిరధిష్ఠానః, అతశ్చ తద్దృష్టాంతవశేనాదృష్టమీశ్వరం కల్పయితుమిచ్ఛత ఈశ్వరస్యాపి కించిచ్ఛరీరం కరణాయతనం వర్ణయితవ్యంస్యాత్, న చ తద్వర్ణయితుం శక్యతే, సృష్ట్యుత్తరకాలభావిత్వాచ్ఛరీరస్య ప్రాక్ సృష్టేస్తదనుపపత్తేః, నిరధిష్ఠానత్వే చేశ్వరస్య ప్రవర్తకత్వానుపపత్తిః, ఏవం లోకే దృష్టత్వాత్. 'కరణవచ్చేన్న భోగా

---

కును జీవచక్షురాదుల సామ్యము నంగీకరించితిమేని సంసారులకువలెనే ఈశ్వరునికిగూడ భోగాదులు ప్రసక్తములగును.

ఈ సూత్రముల రెండింటిని మఱియొక విధముగ వ్యాఖ్యానింప వచ్చును. "అధిష్ఠానాను పత్తేశ్చ" - అను సూత్రవ్యాఖ్యానము. లోకమునందు తన రాష్ట్రమున కధిపతి యగు రాజు శరీరము నొకదానిని కలిగి యుండియే పరిపాలనమును ప్రవర్తింపచేయుచున్నాడు. కాని శరీరము లేక చేయుట లేదు. ఈ దృష్టాంతబలముచే నదృష్టుడగు నీశ్వరు డొకడున్నాడని యూహింప గోరితిమేని ఆతని చక్షురాదీంద్రియముల కాటపట్టగు శరీరము గూడ నొకటియున్నటుల నూహింపవలయును. కాని యట్టి యూహా శక్యము కాదు. శరీరము [సృష్టింపబడునది గనుక] సృష్టికి తరువాత సంభవించవలెను గాని సృష్టికి పూర్వమది సంభవము కాదు. ఈశ్వరునికి అధిష్ఠానము లేనిచో నాతనికి ప్రవర్తకత్వము సాధ్యము కాదు. లోకమునం దిట్లు కాన్పించుచున్నది. కరణవచ్చేన్న భోగా

దిభ్యః". అథ లోకదర్శనానుసారేణేశ్వరస్యాపి కించిత్కరణానా మాయతనం శరీరం కామేన కల్ప్యేత, ఏవమపి నోపపద్యతే. సశరీరత్వే హి సతి సంసారివద్భోగాదిప్రసంగాదీశ్వరస్యాప్యనీశ్వ రత్వం ప్రసజ్యేత.

## అంతవత్త్వమసర్వజ్ఞతా వా (సూ. 41)

ఇతశ్చానుపపత్తిస్తార్కికపరికల్పితస్యేశ్వరస్య. స హి సర్వజ్ఞైరభ్యుపగమ్యతే అనంతశ్చ, అనంతం చ ప్రధానం అనం

---

దిభ్యః అను సూత్రమునకు- వ్యాఖ్యానము. ఒక వేళ లోకానుభవము ననుసరించి ఈశ్వరునికి గూడ చక్షురాది యింద్రియముల కాటపట్టగు నొక శరీరము గలదని యిష్టానుసారముగ కల్పింతుము గాక. అప్పుడాతనికి శరీరముండుట వలన సంసారికివలెనే ఆతనికిగూడ భోగాదులు ప్రసక్తములగును. అప్పుడీశ్వరు డీశ్వరుడు కాక పోవలయును. 40

అ॥ ఈశ్వరునికి అనంతత్వాదులుగూడ సంభవింపవని తరువాత సూత్రమున చెప్పుచున్నారు.

ప్రతివాది మతమునందు ఈశ్వరునికి అవయవములున్నచో అంతవత్త్వం = నాశము సంభవించుటయు వా = లేక అవయవములులేనిచో, ప్రపంచమునకును ఈశ్వరునికిని సంబంధ మసంభవమగుటవలన అసర్వజ్ఞతా = సర్వజ్ఞత్వము లేకపోవుటయో సంభవించును.

ప్రతివాదులు చేసిన ఈశ్వరకల్పనము మఱియొక విధముగగూడ ననుపపన్నమగును. అతడు సర్వజ్ఞుడు అనంతుడు

రాశ్చ పురుషాః మిథో భిన్నా అభ్యుపగమ్యంతే. తత్ర సర్వ
జ్ఞేనేశ్వరేణ ప్రధానస్య పురుషాణామాత్మనశ్చేయత్తా పరిచ్ఛిద్యేత
వా న వా పరిచ్ఛిద్యేత, ఉభయథాపి దోషోఽనుషక్త ఏవ. కథం,
పూర్వస్మింస్తావద్వికల్పే ఇయత్తాపరిచ్ఛిన్నత్వాత్ప్రధానపురుషే
శ్వరాణామంతవత్త్వమవశ్యంభావి, ఏవం లోకే దృష్టత్వాత్.
యద్ధి లోకే ఇయత్తాపరిచ్ఛిన్నం వస్తు ఘటాది తదంతవద్దృష్టం,
తథా ప్రధానపురుషేశ్వరత్రయమపీయత్తాపరిచ్ఛిన్నత్వాదంతవ
త్స్యాత్, సంఖ్యాపరిమాణం తావత్ప్రధానపురుషేశ్వరత్రయ
రూపేణ పరిచ్ఛిన్నమ్, స్వరూపపరిమాణమపి తద్గతమీశ్వరేణ

---

అని వారంగీకరించుచున్నారు. ప్రధాన మనంతమనియు జీవుల
నంతములనియుగూడ వారంగీకరించుచున్నారు. ఈశ్వరుడు
ప్రధానముయొక్కయు, జీవులయొక్కయు, తనయొక్కయు
పరిమాణమును నియమనముచేయునా? చేయడా? ఉభయ
పక్షములగూడ దోషమాపాదించును. ఎట్లన! పరిమాణము
నకు మేరకల్పించుపక్షమున, నదిపరిమితమగుచున్నది. అందు
వలన ఈశ్వరుపురుషలకు అంతవత్త్వమవశ్యము సంభవించును.
లోకమున ఇట్లు కాన్పించుచున్నది. పరిమితపరిమాణము
గల పటాది వస్తువులన్నియు నంతవంతములుగ
కాన్పించుచున్నవి. ఆవిధముగ ప్రధానపురుష ఈశ్వరులు
ముగ్గురుగూడ పరిమితపరిమాణములు గలవారగుటంజేసి
అంతముగల వారగుదురు. ప్రధానము, పురుషుడు ఈశ్వరుడని
మువ్వురు మాత్రమగుటచే వారిసంఖ్య పరిమిత మగుచున్నది.
ప్రధానపురుషులు ఘటాదులవలె స్వరూపములు గనుక వాని
స్వరూప పరిమాణము నీశ్వరుడు నియమించును. పురుషుల

పరిచ్ఛిద్యేతేతి. పురుషగతా చ మహాసంఖ్యా, ఏతేష్వి ఇయత్తాపరిచ్ఛిన్నానాం మధ్యే యే సంసారాన్ముచ్యంతే తేషాం సంసారోఽన్తవాన్ సంసారిత్వం చ తేషామంతవత్, ఏవమితరేష్వపి క్రమేణ ముచ్యమానేషు సంసారస్య సంసారిణాం చాంతవత్త్వం స్యాత్. ప్రధానం చ సవికారం పురుషార్థమీశ్వరస్యాధిష్ఠేయం సంసారిత్వేనాభిమతం తస్మిన్నస్యతాయామీశ్వరః కిమధితిష్ఠేత్, కింవిషయే వా సర్వజ్ఞతేశ్వరతే స్యాతామ్ ప్రధానపురుషేశ్వరాణాం చైవమంతవత్త్వే సత్యాదిమత్త్వప్రసంగః, ఆద్యంతవత్త్వే చ శూన్యవాదప్రసంగః, అథ మాభూదేషదోష ఇత్యుత్తరో

---

సంఖ్య మహాంతము. [అయినను అనంతముగాదు] ఈశ్వరుడు సర్వజ్ఞుడగనుక వాని స్వరూపసంఖ్యలను దెలిసికొనగలడు. పరిమిత సంఖ్యాకులగు జీవులలో కొంతమంది సంసారమునుండి ముక్తులై వారిసంసారమంతమగుచున్నది. ఈవిధముగ సంసారులందరు క్రమముగ ముక్తులగుచుండ, సంసారము, సంసారులు గూడ నంతమొందగలరు. ప్రధానము పురుషప్రయోజనముకొరకీశ్వరునిచే ప్రేరేపింపబడి అనేక వికారముల చెందుచున్నది. అట్టి ప్రధానమె సంసారమని యొప్పుకొనుచున్నారు. సంసారమంతమగుచుండ, ఈశ్వరుడు దేనిని ప్రేరేపించును? ఈశ్వరుని సర్వజ్ఞత్వ ఈశ్వరత్వములకు విషయమేది యగును? ప్రధానపురుషు లంతవంతములగుటచే నీశ్వరుని యీశిత్వము గూడ నంతమగును. ప్రధానపురుషేశ్వరుల ముగ్గురికి నంతవత్త్వ ముండుటవలన ఆదిమత్త్వముగూడ నున్నదియని చెప్పవలెను. ఆద్యంతములున్నచో శూన్యత్వముగూడ సంభవిం

వికల్పేఽభ్యుపగమ్యేత తదా స ప్రధానస్య పురుషాణామాత్మన శ్చేయత్తేశ్వరేణ పరిచ్ఛిద్యేత ఇతి. తత ఈశ్వరస్య సర్వజ్ఞత్వా భ్యుపగమహానిరపరో దోషః ప్రసజ్యేత. తస్మాదప్యసంగతస్తా ర్కికపరిగృహీత ఈశ్వరకారణవాదః ఇతి సప్తమాధికరణమ్.

## (8) ఉత్పత్త్యసంభవాధికరణమ్ (సూ. 42–45)

---

చును. ఈదోషమును తొలగించుటకై, ఈశ్వరుడు ప్రధాన పురుషుల యొక్కయు తనయొక్కయు పరిమాణమును నియ మనము చేయకుండినచో మీరంగీకరించిన ఈశ్వరుని సర్వజ్ఞత్వ మునకు భంగముసంభవించును. అందువలన తార్కికులచే కల్పింపబడిన ఈశ్వరకారణవాద మసంగతమగును. 41

### (8) ఉత్పత్త్యసంభవాధికరణము

అ॥ ఈశ్వరుడు కేవలనిమిత్తకారణమనియు కార్య కారణాది పంచపదార్థములను కల్పించుమహేశ్వరమతము పూర్వాధికరణమున నిరసింపబడినది. వాసుదేవుడు జగదు పాదానమనియు, సంకర్షణాదులు జీవాదులనియు చతుర్వ్యూ హముల కల్పించుభాగవతమతమును రాబోవు అధి కరణమున త్రోసివేయుచున్నారు.

విషయము : వాసుదేవుడు జగదుపాదాన, మనియు, చతుర్వ్యూహములు గలవనియు వాదించు భాగవతరాద్ధాంత విషయము.

## ఉత్పత్త్యసంభవాత్ (సూ. 42)

యేషాం ప్రకృతిరధిష్ఠాతా కేవలనిమిత్తకారణమీశ్వరో౽భిమత స్తేషాం పక్షః ప్రత్యాఖ్యాతః. యేషాం పునః ప్రకృతిశ్చాధిష్ఠాతా చోభయాత్మకం కారణమీశ్వరో౽భిమత స్తేషాం ప్రత్యాఖ్యాయతే.

పూ. పక్షీ: నను శ్రుతిసమాశ్రయణేనాప్యుభయాత్మక ఏవేశ్వరః ప్రతిపాదితః ప్రకృతిశ్చాధిష్ఠాతా చేతి, శ్రుత్యనుసారిణీ చ స్మృతిః ప్రమాణమితి స్థితిః. కథమేతన్మతేన పక్షః ప్రత్యాఖ్యేయ ఇతి.

---

సంశయము : ఈమతము ప్రమాణ మూలకమా భ్రమ మూలకమా యని సందేహము. ప్రమాణ మూలకమని భాగవతులు భ్రమమూలక మని సిద్ధాంతులు అనుచున్నారు.

ఉత్పత్తి అసంభవాత్ =జీవుడు పరమాత్మవలన బుట్టుట యసంభవము గనుక భాగవత మత మసంగతము.

ఈశ్వరుడు జగత్తున కుపాదాన కారణముకాక కేవల నిమిత్త కారణమను వారల వాదము త్రోసివేయబడినది. ఈశ్వరుడు నిమిత్తోపాదనోభయకారణమని తలంచువారి వాద మిచట ప్రతి వ్యాఖ్యానింపబడుచున్నది.

పూ. పక్షి: ఈశ్వరుడు జగత్తునకు నిమిత్తకారణము ఉపాదానకారణము గూడ నగుచున్నాడని శ్రుతిప్రమాణము ననుసరించియె ఇంతకు పూర్వము నిర్ధారణము చేయబడెను.

సిద్ధాంతీ : ఉచ్యతే — యద్యప్యేవంజాతీయకోఽంశః స్వమానత్వాన్న విసంవాదగోచరో భవతి అస్తి త్వంశాంతరం విసంవాదస్థానమిత్యత స్తత్ప్రత్యాఖ్యానాయారంభః.

తత్ర భాగవతా మన్యంతే. భగవానేవైకో వాసుదేవో నిరంజనజ్ఞానస్వరూపః పరమార్థతత్త్వం, స చతుర్ధాత్మానం ప్రవిభజ్య ప్రతిష్ఠితో వాసుదేవవ్యూహరూపేణ సంకర్షణవ్యూహరూపేణ ప్రద్యుమ్నవ్యూహరూపేణానిరుద్ధవ్యూహరూపేణ చ. వాసుదేవో నామ పరమాత్మోచ్యతే, సంకర్షణో నామ జీవః. ప్రద్యు

స్మృతి శ్రుతి సమ్మతమగు సంతవరకు ప్రమాణమని అంగీకరించుచున్నారు. పై వాదమును ప్రతిఘటించుటకు కారణ మేమి?

సిద్ధాంతి : సమాధానము చెప్పుచున్నాము. ఈశ్వరు డుభయకారణమనుట శ్రుతి సమ్మతమగుటచే దానిని మేము వివదించుటలేదు. వివాదవిషయము వేరొకటిగలదు. దానిని ప్రత్యాఖ్యానము చేయ నారంభించుచున్నాము.

భాగవతమత కర్తలిట్లుల తలంచుచున్నారు. భగవంతుడగు వాసుదేవు డొక్కడే పరమార్థతత్త్వము. అతడు దోషరహితమగు జ్ఞానస్వరూపుడు. తనను నాలుగువిధములుగ విభజించుకొని నాలుగు వ్యూహముల అనగా ఆకారముల ప్రతిష్ఠిత మగుచున్నాడు. వాసుదేవ వ్యూహము, సంకర్షణ వ్యూహము, ప్రద్యుమ్న వ్యూహము అనిరుద్ధవ్యూహము అని వ్యూహములు నాలుగు. వాసుదేవుడనగా పరమాత్మ, సంకర్షణు

మ్నో నామ మనః, అనిరుద్ధో నామాహంకారః, తేషాం వాసుదేవః పరా ప్రకృతిః, ఇతరే సంకర్షణాదయః కార్యం, తమిత్థంభూతం భగవంతమభిగమనోపాదానేజ్యాస్వాధ్యాయయోగైర్వర్షశతమిష్ట్వా క్షీణక్లేశో భగవంతమేవ ప్రతిపద్యత ఇతి.

తత్ర యత్తావదుచ్యతే యోఽసౌ నారాయణః పరోఽవ్యక్తాత్ప్రసిద్ధః పరమాత్మా సర్వాత్మా స ఆత్మనాత్మానమనేకధా వ్యూహ్య వ్యవతిష్ఠత ఇతి, తన్న నిరాక్రియతే, 'స ఏకధా భవతి'

---

డనగా జీవుడు, ప్రద్యుమ్నుడనగా మనస్సు; అనిరుద్ధుడనగా నహంకారము, వాసుదేవుడు వీరలకు పరమకారణము. సంకర్షణాదితరులు కార్యము. మనోవాక్కాయముల నేకాగ్ర్యతతో దేవతాగృహమునకు బోవుట [అభిగమనము,] పూజా ద్రవ్యముల సమకూర్చుట [ఉపాదానము] పూజించుట [ఇజ్య] అష్టాక్షరాదుల జపించుట [స్వాధ్యాయము] ధ్యానించుట [యోగము]—ఈప్రకారము సర్వకారణుడు, దోషరహితుడు, విజ్ఞానరూపుడునగు పరమాత్మను శతసంవత్సరములుపూజించిన వాడు సర్వదుఃఖనాశముచే నాతనిని బొందును. ఇది వీరిమత స్వరూపము.

అవ్యక్తముకంటెను పరుడు, ప్రసిద్ధుడు, సర్వాత్మ, పరమాత్మయని చెప్పబడు నారాయణుడే తనను తాను అనేక విధముల రచించుకొనుచున్నాడను విషయమును మేము నిరాకరించుటలేదు. 'ఆతడొక్కడే ఏకరూపమునను, అనేక రూపములనుండునను (ఛాం 7-26-2) మొదలగు

త్యాదిశ్రుతిభ్యః పరమాత్మనోఽనేకధాభావస్యాధిగతత్వాత్. యదపి
తస్య భగవతోఽభిగమనాదిలక్షణమారాధనమజస్రమనన్యచిత్త
తయాఽభిప్రేయతే తదపి న ప్రతిషిధ్యతే. శ్రుతిస్మృత్యోరీశ్వర
ప్రణిధానస్యప్రతిసిద్ధత్వాత్. యత్పునరిదముచ్యతే—వాసుదేవాత్సం
కర్షణ ఉత్పద్యతే సంకర్షణాచ్చ ప్రద్యుమ్నః ప్రద్యుమ్నాచ్చా
నిరుద్ధ ఇతి. అత్రబ్రూమః—న వాసుదేవసంజ్ఞకాత్ పరమాత్మన
స్సంకర్షణసంజ్ఞస్య జీవస్యోత్పత్తిస్సంభవతి, అనిత్యత్వాదిదోష
ప్రసంగాత్. ఉత్పత్తిమత్త్వే హి జీవస్యానిత్యత్వాదయో దోషాః
ప్రసజ్యేరన్, తతశ్చ నైవాస్యభగవత్ప్రాప్తిర్మోక్షస్స్యాత్, కారణా

---

శ్రుతులు పరమాత్మయొక్క అనేకభావముల నొప్పుకొను
చున్నవి. అట్టి భగవంతుని అనవరతము మఱియొకచింతనము
లేక అభిగమనాదులచే నారాధించుటను గూడ మేము ప్రతి
ఘటింపము. ఈశ్వరధ్యానము శ్రుతిస్మృతులయందు సుప్ర
సిద్ధము. వాసుదేవునివలన సంకర్షణుడు సంకర్షునివలన ప్రద్యు
మ్నుడు, ప్రద్యుమ్నునివలన అనిరుద్ధుడు బుట్టుచున్నారను
విషయమునుగూర్చి యిట్లు చెప్పుచున్నాము. వాసుదేవుడను
సంజ్ఞగలపరమాత్మనుండి సంకర్షణుడను సంజ్ఞగలజీవుడుత్పన్ను
డగుటలేదు. ఆ పక్షమున అనిత్యత్వాదిదోషములు సంభ
వించును. జీవునికి పుట్టుక నంగీకరించినచో పుట్టుకవలన సంప్రాప్త
మగు అనిత్యత్వాదిదోషములన్నియు సంక్రమించును. అందు
వలన భగవత్ప్రాప్తిరూపమగు మోక్షమీజీవునకు సంభవము
కాదు. [ఎల్లపుడును బుట్టువానికి జన్మరాహిత్యముకలుగదు.]

ప్రాప్తౌ కార్యస్య ప్రవిలయప్రసంగాత్. ప్రతిషేధిష్యతి చాచార్యో జీవస్యోత్పత్తిం 'నాత్మా ప్రుతేర్నిత్యత్వాచ్చ తాభ్యః' ఇతి (అ. 2 పా. 3 సూ. 17) తస్మాదసంగతైషా కల్పనా.

## న చ కర్తుః కరణమ్ (సూ. 43)

ఇతశ్చాసంగతైషా కల్పనా, యస్మాన్న హి లోకే కర్తుర్దేవదత్తాదేః కరణం పరశ్వాద్యుత్పద్యమానం దృశ్యతే. వర్ణయంతి చ భాగవతాః 'కర్తుర్జీవాత్ సంకర్షణసంజ్ఞాకాత్ కరణం మనః ప్రద్యుమ్నసంజ్ఞకముత్పద్యతే కర్తృజాచ్చ తస్మాదనిరుద్ధసంజ్ఞకో

---

కార్యము కారణమునుపొందినపుడే లయముసంభవించును. బరి సూ 2-3-17 సూత్రమున జీవునియొక్కఉత్పత్తి నిరాకరింపబడుచున్నది. కనుక నీకల్పన మసంగతము 42

అ॥ తరువాత సూత్రమున మనస్సునకుగూడ జన్మ లేదని చూపుచున్నారు.

కర్తుః=దేవదత్తునివలె నిమిత్తకారణమగు జీవునివలన కరణం=ఘటమువలె కార్యమగు మనస్సుత్పన్నము కాదు.

ఈ కల్పన మీకారణము వలనగూడ నసంగత మగుచున్నది. దేవదత్తుడు మొదలగు నిమిత్తకారణము వలన పరశు మొదలగు కార్యముత్పన్న మగుట లోకమున కాన్పింపదు. సంకర్షణ సంజ్ఞగల జీవుని కర్తృత్వముచే ప్రద్యుమ్న సంజ్ఞగల మనస్సుత్పాద్య మగుచున్నది యని భాగవతమత

ఽహంకార ఉత్పద్యత ఇతి నచైతద్దృష్టాంత మంతరేణాధ్యవ
సాతుం శక్నుమః, న చైవంభూతాం శ్రుతిముపలభామహే.

## విజ్ఞానాదిభావే వా తదప్రతిషేధః (సూ. 44)

పూ. పక్షీ: అథాపి స్యాన్నచైతే సంకర్షణాదయో జీవాది
భావేనాభిప్రేయంతే కింతర్హీశ్వరా ఏవైతే సర్వే జ్ఞానైశ్వర్యశక్తి
బలవీర్యతేజోభిరైశ్వరైర్ధర్మైరన్వితా అభ్యుపగమ్యంతే వాసు
దేవా ఏవైతే సర్వే నిర్దోషా నిరధిష్ఠానా నిరవద్యాశ్చేతి, తస్మా
న్నాయం యథావర్ణితః ఉత్పత్త్యసంభవో దోషః ప్రాప్నోతీతి.

---

కర్తలు వర్ణించుచున్నారు. ఈవిషయమును దృష్టాంతము
లేక నిశ్చయింప శక్యముకాదు. ఇందుకు ప్రమాణ భూతమగు
శ్రుతియు దొఱకుట లేదు. 43

సంకర్షణాదు లందఱకు నీశ్వరభావమున్నను తత్
అప్రతిషేధః=గడచిన సూత్రమునందలి నిషేధము నిలిచియే
యున్నది.

పూ. పక్షి: సంకర్షణాదులందరు జీవాదిభావము గల
వారని భావింప బడుటలేదు. మఱియేమన! వీరందరు జ్ఞానము,
ఐశ్వర్యము, శక్తి, బలము వీర్యము, తేజస్సు మొదలగు
నైశ్వర్యసూచకములగు ధర్మములతో గూడుకొని, రాగాది
శూన్యులు, ప్రధానము వలన బుట్టనివారు, నాశాదిరహితులు
నగు వాసుదేవులే యగుచున్నారందుము, అపుడు పూర్వ
సూత్రమునం దుదాహరింపబడిన ఉత్పత్తి లేకపోవుట మొద
లగు దోషములు సంభవము కావు.

సిద్ధాంతీ : అత్రోచ్యతే—ఏవమపి తదప్రతిషేధః ఉత్పత్త్యసంభవస్యాప్రతిషేధః, ప్రాప్నోత్యేవాయముత్పత్త్యసంభవో దోషః ప్రకారాంతరేణేత్యభిప్రాయః, కథం? యది తావదయమభిప్రాయః పరస్పరభిన్నా ఏవైతే వాసుదేవాదయశ్చత్వార ఈశ్వరాస్తుల్యధర్మాణో నైషామేకాత్మకత్వమస్తీతి, తతోఽనేకేశ్వరకల్పనానర్థక్యం, ఏకేనైవేశ్వరేణేశ్వరకార్యసిద్ధేః. సిద్ధాంతహానిశ్చ. భగవానేవైకో వాసుదేవః పరమార్థతత్త్వమిత్యభ్యుపగమాత్. అథాయమభిప్రాయః—ఏకస్యైవ భగవత ఏతే చత్వారో వ్యూహాస్తుల్యధర్మాణ ఇతి, తథాపి తదవస్థ ఏవోత్పత్త్యసంభవో దోషః

---

సిద్ధాంతి : ఉత్పత్త్యసంభవ దోషము మఱియొక విధమున సంభవించుచున్నది. ఎట్లన ! ఇట్లనుటలో మీ అభిప్రాయమేమి ? వాసుదేవాదులు నలుగురును ఈశ్వర సమానములగు ధర్మముల కలిగియున్నారు గాని యొక్కరు మాత్రము కారందురా ? ఆపక్షమున ఈశ్వరుడొక్కనిచేతనే యీశ్వర కార్యమంతయు సిద్ధించుచుండ అనేకులను కల్పించుట నిష్ప్రయోజనము. మీ సిద్ధాంత భంగము. భగవంతుడగు వాసుదేవు డొక్కడే పరమార్థతత్త్వమని మీరంగీకరించుచున్నారు. లేక, భగవంతుడగు వాసుదేవుని యొకని వలననే వాసుదేవ ధర్మములు గల నాలుగు వ్యూహాము లుత్పన్నము లగుచున్నవి యని మీ అభిప్రాయమా ? అప్పుడు కూడ నుత్పత్త్య సంభవదోషము తప్పదు. వాసుదేవునివలన

న హి వాసుదేవాత్సంకర్షణస్యోత్పత్తిస్సంభవతి సంకర్షణాచ్చ ప్రద్యుమ్నస్య, ప్రద్యుమ్నాచ్చానిరుద్ధస్య, అతిశయాభావాత్. భవితవ్యం హి కార్యకారణయోరతిశయేన యథా మృద్ఘటయోః. నహ్యసత్యతిశయే కార్యం కారణమిత్యవకల్పతే. న చ పంచరాత్రసిద్ధాంతిభిర్వాసుదేవాదిష్వేకస్మిన్ సర్వేషు వా జ్ఞానైశ్వర్యాది తారతమ్యకృతః కశ్చిద్భేదోఽభ్యుపగమ్యతే, వాసుదేవా ఏవ హి సర్వే వ్యూహా నిర్విశేషా ఇష్యంతే. న చైతే భగవద్వ్యూహాశ్చ

---

సంకర్షణుడు, సంకర్షణుని వలన ప్రద్యుమ్నుడు ప్రద్యుమ్నుని వలన అనిరుద్ధుడు బుట్ట వీలులేదు.[వీరలందరు తుల్యగుణములు గలవారగుటచే ఒకరికంటె నొకరికి అతిశయము లేదు. మృద్ఘటములకువలె కార్యకారణములలో నొకదానికంటె మఱియొక దాని కతిశయముండవలెను. ఏదియో యొక అతిశయము లేక కార్యము కారణము అనువ్యవస్థ కల్పింప శక్యముకాదు. [మృత్తుఘటములన్నిటి యందున్నది. దానియందు ఘటశరావాది రూపము లనేకములు గలవు.కనుక కారణమగు మృత్తు కార్యమగు ఘటముకంటె నతిశయము] పాంచరాత్ర సిద్ధాంతమునందు వాసుదేవుడొక్కడై నను, సంకర్షణాద్యనేక రూపములయినను, జ్ఞానైశ్వర్యతారతమ్యముచే గలుగు భేదము నంగీకరించుటలేదు. వ్యూహములన్నియును విశేషమేమియు లేక వాసుదేవులేయగుచున్నారని వారివాదము. వాసుదేవుని రూపములీనాల్గింటితో నాగుటలేదు. బ్రహ్మాది స్తంభ పర్యంత

తు సంఖ్యాయామేవావతిష్ఠేరన్, బ్రహ్మాది స్తంబపర్యంతస్య సమ స్తస్యైవ జగతో భగవద్వ్యూహత్వావగమాత్.

## విప్రతిషేధాచ్చ (సూ. 45)

విప్రతిషేధశ్చాస్మిన్ శాస్త్రే బహువిధ ఉపలభ్యతే గుణ గుణిత్వకల్పనాదిలక్షణః. జ్ఞానైశ్వర్యశక్తిబలవీర్యతేజాంసి గుణాః, ఆత్మాన ఏవైతే భగవంతో వాసుదేవా ఇత్యాదిదర్శనాత్. వేద విప్రతిషేధశ్చ భవతి, చతుర్షు వేదేషు ఏవం శ్రేయోఽలబ్ధ్వా

---

మగు సమస్తజగత్తు భగద్వ్యూహములనియె తెలిసికొను చున్నాము. 44

విప్రతిషేధాత్ చ=పరస్పరవిరోధము లుండుటచేగూడ నీ మత ముపేక్ష్యమగుచున్నది.

మఱియు గుణగుణిత్వాది కల్పనలయందీ భాగవతమత మున పరస్పర విరోధములనేకములు కాన్పించుచున్నవి. జ్ఞానము. ఐశ్వర్యము, శక్తి, బలము, వీర్యము, తేజస్సు—ఇవి అన్నియును గుణములు అని యొకచోటను ఇవి అన్నియు ఆత్మలు భగవంతులగు వాసుదేవులని మఱియొకచోటను వర్ణించుచున్నారు. వీరివాదము వేదమునకు వ్యతిరిక్తముగూడ నగుచున్నది. శాండిల్యుడు నాలుగు వేదములయందు నుత్కృష్ట మగు నిశ్శ్రేయస్సును కానక నీశాస్త్రమును జదివెను అని

శాండిల్య ఇదం శాస్త్రమధీతవానిత్యాదివేదనిందాదర్శనాత్, తస్మా
దసంగతైషా కల్పనేతి సిద్ధమ్. ఇత్యష్టమాధికరణమ్.
ఇతి శ్రీమచ్ఛారీరకమీమాంసాభాష్యే శ్రీశంకరభగవత్పాదకృతౌ
ద్వితీయాధ్యాయస్య ద్వితీయః పాదః సమాప్తః.

---

వేదనింద కాన్పించుచున్నది. అందువలన వీరికల్పన మసంగత
మని సిద్ధమగుచున్నది. 45

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్యేత్యాది బిరుదాంచిత
శ్రీ భారతీ సంప్రదాయ సార్వభౌమ జగద్గురు
శ్రీ కల్యాణానంద భారతీమహాచార్య మహాస్వామి
పాదాత్యంతాన్తేవాసియు నత్రిగోత్ర సముద్భూతుడు
నగు లింగనసోమయాజిచే విరచితమగు
కల్యాణకౌముది యను శ్రీమచ్ఛాంకర
శారీరకసూత్ర భాష్యాంధ్రానువాదమున

ద్వితీయాధ్యాయము – ద్వితీయపాదము
సంపూర్ణము.

బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్।
బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మసమాధినా ॥